

# గుళ్ళో వెలిసిన దేవతలు

సి. ఆనందారామం

## 1

కెవ్వున కేకపెట్టి లేచి భర్తను గట్టిగా కౌగలించుకుంది పావని వణికిపోతూ...

విఠల్ పావనిని పొదివిపట్టుకుని "ఏం జరిగింది పావనీ?" అన్నాడు.

పావని సమాధానం చెప్పలేకపోతోంది. శరీరమంతా చెమటలు పడుతున్నాయి. విఠల్‌ను చుట్టిన చేతులు వణికిపోతున్నాయి

అతని హృదయానికి మరింత హత్తుకుపోతూ కాతర స్వరంతో "నన్నిలా మీకు దగ్గిరగా మరి కాసేపు ఉండనీయండి!" అంది.

విఠల్ నవ్వి "కాసేపేం ఖర్మ! ఎంతసేపైనా ఉండు! ఎప్పుడూ ఉండు. కానీ, ఏం కల వచ్చింది? ఈ మధ్య తరచుగా నువ్విలా ఉలికిపడి లేస్తూనే ఉన్నావు. కలలకే ఇలా అయిపోతే ఎలా?'' అన్నాడు.

"కలా! కలేనా అది! అబ్బా! కలలోనయినా ఆ క్షోభ భరించలేనండీ!"

"ఏం కలో చెప్పు..."

"సరళ ఎక్కడినుండో దీనంగా 'అక్కయ్యా! రా!' అని పిలుస్తోంది. ఆ పిలుపు కాదనలేక వెళ్ళిపోతున్నాను. మీరు దూరంగా నిలబడిపోయారు. మీరు నన్ను పిలుస్తే మీ దగ్గిరకు వచ్చేదాన్నేమో! కానీ, మీరు నన్ను పిలవటంలేదు. నా దగ్గిరకు రావాలని ప్రయత్నించటంలేదు. కోపంగా చూస్తూ బాధగా కన్నీళ్లు కారుస్తూ నాకు అందరాని దూరాన నిలిచిపోయారు. నేను ఒక్కదాన్నే పిచ్చిదానిలాగ ముందుకు పోతున్నాను. నా గుండెలు పగిలిపోతున్నా, ఏడుపు ముంచుకొస్తున్నా, అలాగే ముందుకు పోతున్నాను...అబ్బా! ఏం నరకం అది! నావల్ల కాదండీ! మిమ్మల్ని వదిలి పోలేను!"

"పిచ్చి పావనీ! ఏం మాటలివి! నన్ను వదిలి ఎక్కడికి పోతావ్! ఎందుకు పోనిస్తాను?"

"మరి, అలా దూరంగా నిలిచిపోరుగా! నాతో పాటు వస్తారుగా!"

"భలేదానివి నువ్వు పిచ్చిదానివై ఎక్కడికో పరుగెడుతూ నన్నూ నీతో రమ్మంటావా? నీ పిచ్చికుదిర్చి నిన్నే నా దగ్గిరకు రప్పించుకుంటాను."

కాలింగ్ బెల్ మ్రోగింది పావని భయంతో విఠల్ చెయ్యి గట్టిగా పట్టుకుంది.

"ఛ! ఎం. ఏ. పాసయి లెక్చరర్‌గా పనిచేస్తూ, ఇలా అయినదానికీ, కానిదానికీ, ఉలికి ఉలికి పడుతున్నావంటే ఎవరైనా నవ్వుతారు. చెయ్యి వదులు. ఏమిటో, ఎవరో చూడనీ!"

వీధిలోనుండి 'టెలిగ్రాం' అని కేక వినిపించింది. పావని విఠల్ చెయ్యి వదిలేసి భయంగా చూసింది విఠల్ నవ్వి లేచివెళ్ళి సంతకంచేసి టెలిగ్రాం తీసుకున్నాడు.

టెలిగ్రాం చదువుతూ అదోకరకంగా మారిపోయిన విఠల్ ముఖంచూసి, "ఏం జరిగిందండీ! ఎవరిచ్చారు టెలిగ్రాం?" అని అడిగింది పావని ఆందోళనగా—

విఠల్ మాట్లాడకుండా టెలిగ్రాం పావని చేతిలో పెట్టాడు. ఆ టెలిగ్రాం పావనికే!

"అక్కయ్యా! చివరిసారి ఒక్కసారి నన్ను చూడటానికి రావూ?—సరళ..."

టెలిగ్రాం చదివి పాలిపోయిన ముఖంతో విఠల్‌ను చూసింది పావని...

అప్పటికి విఠల్ కూడదీసుకున్నాడు. నవ్వు తెచ్చిపెట్టుకుంటూ "చూసావా?

ఎంత మంచి వార్త విన్నామో! ఒక్కసారి వెళ్ళిరా! ఇంకమీదట ఇలాంటి పిచ్చి కలలు రావు," అన్నాడు.

పావని బెంగగా "వెళ్ళిరా! అంటున్నారా? మీరు నాతో రారా?" అంది.

"పల్లెటూరి బడుద్ధాయిలా మాట్లాడకు. నాకు అర్జంట్ కేసులున్నాయి. ఎలా రాగలను? ఆ మాత్రం ఒక్కదానివీ వెళ్ళలేవూ?"

"వెళ్ళను. ఒక్కదాన్నీ ఎక్కడకూ వెళ్ళను."

"అయితే మానెయ్యి."

"మానను. సరళ ఇలా పిలుస్తోంటే వెళ్ళకుండా ఉండలేను."

"ఏం చేస్తావు అయితే?"

"వెళ్తాను—మీతో కలిసి..."

"నాకు తీరుబడి లేదంటోంటే..."

"మీరు రాకపోతే, ఇక్కడే ఉండి—సరళకోసం బెంగపెట్టుకుని, చచ్చి పోయి, ఒక్కదాన్నే శాశ్వతంగా మళ్ళీ తిరిగిరాని దూరానికి వెళ్ళిపోతాను..."

"పావనీ!"

విఠల్ పావని నోరు గట్టిగా మూసాడు.

"ఛ! నోటికెంతొస్తే అంత మాట్లాడతావు. ఇలాంటి పాడు మాటలంటే ఏమొస్తుంది నీకు?"

"నన్ను ఇలా చిత్రవధ చేస్తే మీకు మాత్రం ఏమొస్తుంది?"

"మహా తల్లీ! చంపకు! నేను వస్తాలే! కానీ ఒకటి రెండు రోజులకంటె నేను ఎక్కువ ఉండటానికి వీల్లేదు. అవసరమైతే అన్ని ఏర్పాట్లూ చూసి నిన్ను అక్కడ ఉంచి వచ్చేస్తాను."

"అలాగే! ముందు బయలుదేరండి. మిమ్మల్ని పంపించి నేను అక్కడ ఉంటానేమిటి!"

"వీలయితే సరళను మనతో తీసుకొచ్చేద్దాం!"

"నిజంగా మీరెంత మంచివారండీ!"

"మంచివాణ్ని కాను. స్వార్థపరుణ్ని—సరళ నిక్కడికి తీసుకురాకపోతే, నిజంగా నీ కలలోలాగ నువ్వు సరళను వెతుక్కుంటూ నన్ను వదిలి వెళ్ళిపోతా వేమో! తలుచుకుంటేనే భయం వేస్తోంది."

కిలకిల నవ్వింది పావని.

''ఆ స్వార్థం అలాగే పదికాలాలపాటు ఉండనివ్వండి. ఆ మాత్రం స్వార్థం లేకపోతే జీవితంలో మాధుర్యంలేదు.''

టెలిగ్రాం కేక విని నిద్రలో కంగారుగా లేచి కూచున్న పద్మావతి, కొడుకు ఎంతకూ సంగతి చెప్పకపోవటంతో ఉండబట్టలేక "విఠల్! టెలిగ్రాం ఎక్కడ్నుంచిరా!'' అని కేకపెట్టింది.

పావని, విఠల్ ఒకరి ముఖం ఒకరు చూసుకున్నారు. విఠల్ పావనికి కళ్ళతోనే ధైర్యంచెప్పి తల్లిదగ్గిరకు వెళ్ళాడు.

''సరళ ఒక్కసారి రమ్మని టెలిగ్రాం ఇచ్చిందమ్మా!"

భ్రమాన్పడిపోయింది పద్మావతి. తనవంక నిర్ఘాంతపోయి చూస్తోన్న పద్మావతి చూపులు తప్పించుకుంటూ

"పావనిని తీసికెళ్తున్నాను.'' అన్నాడు విఠల్.

పద్మావతి సమాధానం చెప్పలేదు. వరండాలో మంచంమీద కూచుని అంతా వింటోన్న వెంకట్రావు మాత్రం

''కుటుంబానికి మచ్చలా పుట్టింది ముదనష్టపుది!'' అన్నాడు కసిగా.

ఈ మాటలు పావని విందేమోనని లోపలికి చూసాడు విఠల్. పావని వింది. పళ్లమధ్య నలుగుతోన్న పెదవి రక్తం చిమ్ముతోంది అప్పుడే.

పావనిని చూస్తే ఎంత జాలి కలిగినా పెదవి విప్పి తండ్రినేమీ అనలేకపోయాడు విఠల్...

మనసులో ఎంత మంటగా ఉన్నా ''బయలుదేరటానికి వీల్లేద"ని కొడుకుతో అనగలిగేశక్తి ముసలాయనకి లేకపోయింది...

పావని వెళ్తోందంటే సంతోషించినవాడు రవి ఒక్కడే! ఇంటర్ సీనియర్ చదువుతున్నాడు రవి. వచ్చీ రాని వయసులో అతడు చేసే అల్లరుల కన్నిటికీ అంకుశంలా అడ్డు తగులుతుంది పావని...కాలేజీకి వెళ్తున్నాడో లేదో, కనుక్కుంటుంది. కాలేజీ ఎగ్గొట్టి ఫ్రెండ్స్‌తో తిరిగితే ఎలాగో కనిపెట్టి చీవాట్లు పెడుతుంది. ఇష్టం వచ్చినట్లు డబ్బు ఖర్చుపెట్టనియ్యదు. అన్నింటికీ లెక్కలడుగుతుంది

లోలోపల మురిసిపోతూ "ఎప్పుడు వెళ్తున్నావు వదినా!" అన్నాడు రవి.

"ఏం నాయనా! హాయిగా బలాదూరు తిరుగుదామనా! జాగ్రత్త! నాలుగు రోజుల్లో తిరిగి వస్తాను. ఈ లోపుగా ఏమైనా ఘనకార్యాలు చేసావంటే చక్రవడ్డీతో సహా బదులుతీరుస్తాను."



పోలికలు

నవ్వుతోనే బెదిరించింది పావని...

పోనీ, నాలుగురోజులైనా పరవాలేదు. వదిన చండశాసనం లేకుండా... హుషారుగా వెళ్ళిపోయాడు రవి.

అనుపమ మాత్రం దిగులుగా "నువ్వు లేకపోతే నాకు తోచదు వదినా!" అంది.

ఆ మాట నిజమని పావనికి తెలుసు...అందుకే అనుపమ మూడ్స్ మార్చాలని పరిహాసంగా

"రేపు పొద్దున్న పెళ్ళయితే పారిపోవూ! ఇక్కడ్నుంచి?" అంది.

అనుపమ నవ్వి "పో, వదినా! పెళ్ళయినా, నీ దగ్గిరకే వచ్చేస్తాను" అంది.

"వద్దు తల్లీ! హాస్యంగా నయినా అంత మాట అనకు!"

"భలేదానివి వదినా! నా సంగతి నీకు తెలియదూ! అలాంటి సాహసాలు నేను చెయ్యగలనా?"

వదిన సర్దుకొంటూంటే కూడా ఉండి సాయంచెయ్యసాగింది అనుపమ.

"ఏమిటో, ఎక్కడాలేని విడ్డూరాలు! ఇలాంటి అప్రాచ్యపు గోలలన్నీ మా ఇంటిమీదకే రావాలీ? ఏదో సంప్రదాయంగల కుటుంబమని చేసుకుంటే..."

ఏదో సణుగుతూనే ఉంది పద్మావతి లోపలినుంచి...పావని దేనికీ సమాధానం చెప్పలేదు.

పద్మావతి నాలుగు ఊరగాయసీసాలు తెచ్చి పావని ముందు పెట్టింది

"ఇవి నాలుగు రకాల ఊరగాయలు. సరళకు ఊరగాయలంటే ప్రాణం. పాపం, ఏ స్థితిలో ఉందో, తీసికెళ్ళు."

అనుపమ తలవంచుకుని తల్లికి కనపడకుండా పావనిని చూసి నవ్వింది... పావని మాత్రం బుద్ధిగా "అలాగే అత్తయ్యా!" అని ఆ సీసాలు బేగ్‌లో సర్దుకుంది.

"ఇలా చూడు! నువ్వక్కడ ఎక్కువరోజులు ఉండిపోకు. వెంటనే వచ్చెయ్యి. నువ్వు లేకపోతే, ఈ ఇల్లు ఒక్క క్షణం గడవదు. నా వల్ల కాదు."

"అలాగే!"

"పోనీ, నన్నూ రమ్మంటావా?"

కంగారుపడింది పావని.

"ఎందుకత్తయ్యా! పరవాలేదు. నేను త్వరలో వస్తాను."

"అది కాదే! అక్కడ సరళ ఏ స్థితిలో ఉందో? దాన్ని చూసి నువ్వేమయిపోతావో, అదీ నా బెంగ..."

అత్తగారి అభిమానానికి మనసు కరిగిపోయింది పావనికి... ఆవిడకు ఎంత చాదస్తమో అంత మంచి మనసు. అందుకే ఆవిణ్ని గౌరవిస్తూ ఆ చాదస్తాన్ని భరించగలుగుతోంది.

విఠల్ టాక్సీ తీసుకొచ్చాడు. అత్తగారికి నమస్కారంచేసి వెంకట్రావుతో వినయంగా "వెళ్తున్నానని" చెప్పి, గుమ్మంలో నిలబడ్డ అనుపమకు చెయ్యి ఊపి బయలుదేరింది పావని...

## 2

ధన్ ధన్ మని చప్పుడుచేస్తూ పరుగెడుతోన్న రైలు చక్రాలు తన మనసు మీదనుంచే పరుగెడుతున్నంత క్షోభగా ఉంది పావనికి సరళను తలుచుకోగానే...

రామాపురానికి మకుటంలేని మహారాజు జగన్నాధంగారి కూతురు సరళ. ఈనాటికి ఇలాంటి దీన పరిస్థితిలో చిక్కుకుంటుందని ఎవరూహించగలరు?

పావనిని అర్జంటుగా తీసుకురమ్మని మనిషిని పంపాడు జగన్నాధం. కంగారుపడుతూ బయలుదేరింది పావని...

పావని రాగానే తల్లి సుందరమ్మ పావనిని కౌగిలించుకుని బావురుమని ఏడ్చింది.

"ఏం జరిగిందమ్మా! అంతా కులాసాగా ఉన్నారా?" ఏదీ అర్థంకాక అందో ళనగా అడిగింది...

"ఏం చెప్పమంటావే? నీ చెల్లెలు ఆ హరిజనుడ్ని చేసుకుంటానని కూచుంది. ఈ ఊళ్ళో ఇంక తలెత్తుకు బ్రతకగలమా?—చెప్పు..."

విషయం అర్థమయింది పావనికి—సరళ హరిబాబును చేసుకుంటానని ఇంట్లో చెప్పి ఉంటుంది. ఈ విషయం తలిదండ్రులకు కలిగించినంత ఆశ్చర్యం పావనికి కలిగించలేదు.

రామాపురం పల్లెటూరయినా ఆ ఊళ్ళో చాలామంది టౌన్‌కి వెళ్ళి చదువు కునేవారు. ఎల్లయ్యకూడా కష్టపడి కడుపుకట్టుకుని తన కొడుకు హరిబాబును చదివించాడు. హరిబాబు కులానికి హరిజనుడయినా చూడటానికి బాగుంటాడు. తెలివయినవాడు. ఒకే ఊరివాళ్ళు కావటంతో సహజంగా సరళా హరిబాబుల మధ్య చనువు ఏర్పడింది. హరిబాబును సరళ ప్రేమించటంలో విడ్డూరమేమీ కనిపించలేదు పావనికి. కానీ, ఆమాట ఏదో ఘోరం జరిగిపోయినట్లు గోలపెడు తున్న తలిదండ్రుల ముందు అనలేకపోయింది.

"ఎలాగైనా దానికి నచ్చజెప్పవే!" అంది తల్లి.

సరళ పేరుకుమాత్రమే సరళ...మహా మొండిది పావనిని నోరెత్తనియ్య కుండా తనే మొదలుపెట్టింది.

"ఈ అన్యాయం చూడక్కయ్యా! నేనేం తప్పుచేసాను? అందమైనవాడు. మంచివాడు. చదువుకున్నవాడు...అలాంటివాణ్ని చేసుకుంటానంటే కులాల ప్రస్తావన తెచ్చి కాదంటారు కులంట, కులం! ఎక్కడుంది కులం? మొన్న ఎవరో ఆఫీసర్ వస్తే ఆయన యానాదివాడని తెలిసీ నాన్న నెత్తిన పెట్టుకుని ఇంట్లో సకలమర్యాదలూ చెయ్యలేదూ? అప్పుడేమయిపోయింది ఈ కులం? ఎల్లయ్య పేదవాడు కావటంతో, తన కళ్ళముందు కూలిపనిచేసుకుంటూ కని పించటంతో కులం సంగతి గుర్తుకొచ్చింది. నేను హరిబాబునే చేసుకుంటాను. ఏంచేస్తారేం? ఆస్తిలో భాగం ఇయ్యనంటారు. అంతేగా!..."

పావని నోరు మెదపలేకపోయింది. సరళా హరిబాబులు ఈడూ జోడూ చాలా బాగుంటారు. పోనీ, ఈ పెళ్ళి జరిగితేనేం?

జంకుతూనే తల్లితో అంది...

"పోనీ, సరళ కోరినట్లే చెయ్యకూడదమ్మా! హరిబాబుకేం తక్కువయింది?"

సుందరమ్మ గుండె బాదుకుని, "నీకూ్కడా మతిపోయిందా ఏమిటే? దాని కేదో నచ్చజెపుతావని పిలిస్తే...ఆయన ఎవరినైనా బతకనిస్తారా?" అంది ...

"ఛీ! ఛీ! నా కూతురు ఆ హరిజన కొడుకుని పెళ్ళిచేసుకుందని నలుగురికీ, ఎలా చెప్పుకోను? మళ్ళీ నలుగురిలో ఎలా తలెత్తుకుని తిరగను?"

రంకెలువేసాడు జగన్నాధం. ఆయనకు ప్రధానంగా కావలసింది నలుగురిలో తలెత్తుకోవటం...'

పావని సరళకే నచ్చజెప్పటానికి ప్రయత్నించింది...

"పోనీ, సరళా! నువ్వే మనసు మార్చుకోరాదూ! ఎంత గొడవ జరుగుతోందో చూస్తున్నావుగా..."

సరళ పావనిని విచిత్రంగా చూసింది.

"అక్కయ్యా! నువ్వు...ఎం.ఏ. పాసయి లెక్చరర్‌గా పనిచేస్తున్న నువ్వు ...నువ్వుకూడా ఇలాగే మాట్లాడుతున్నావా? నిష్కారణంగా నా మనసు చంపుకోవాలా? ఎందుకూ? గొడవలు జరుగుతాయనా? నేను నిజంగా న్యాయమని నమ్మినదానికోసం ఈ మాత్రం ఎదురోక్కలేనా? పిరికిదానిలా అయినదానికీ, కానిదానికీ తలవంచి బ్రతుకంతా జీవచ్ఛవంలా గడపమంటావా?"

తనకంటె ఎంతో చిన్నదయిన సరళ ఎంతో ఎదిగిపోయి కనిపించింది పావనికి. చదువు పూర్తికాగానే తండ్రి కుదిర్చిన సంబంధం చేసుకుని భర్తను ప్రేమిస్తూ సంసార పక్షంగా అత్తింట్లో కలిసిపోయిన పావనికి సరళ కొత్తగా, వింతగా ఉంది. అయినా సరళ మాటల్లో నిజాలను పావని విజ్ఞానం కాదనలేక పోతోంది.

సరళను ఏ విధంగానూ లొంగదీసుకోలేనని అర్థమయింది జగన్నాథానికి. పట్టుదల హెచ్చింది. మాలగూడెంలో పెద్దలకు కబురుపెట్టాడు. పరుగుపరుగున వచ్చారు వాళ్ళు "దండాలు దొరా!" అంటూ.

"ఏరా! పెద్ద మొనగాళ్ళైపోతున్నారు. మా యింటి పిల్లనే పెళ్ళిచేసుకుంటారా?"

"అదేంటి దొరా! మీ పిల్లను మేమేఁవ భరిస్తాం! మాకెందుకి బెడద..."

భయపడిపోతున్నారు అప్పుడే ఏం జరిగిందో అని.

"ఊఁ!...మీ యెల్లయ్య కొడుకు హరిబాబు సంగతి చూడండి! చదువుకున్నానని కళ్ళు నెత్తిమీద కొచ్చినయ్! వెంటనే కులం పిల్లతో పెళ్ళిచేసెయ్యండి. లేకపోతే మర్యాద దక్కదు."



హుంకరించాడు జగన్నాథం.

గడగడలాడుతూ వెళ్ళిపోయారు ఆ జనం...జగన్నాధం పొలాల్లో కూలి చేసుకుంటేకాని గడవని జనం... ఆ కూలిలేని రోజుల్లో జగన్నాధం దగ్గిర అప్పులు తెచ్చుకుంటే కాని గడవని జనం...

అప్పటి కప్పుడే కులం పెద్దలు హరిబాబును పిలిపించారు...

"అవును. నేను సరళను పెళ్ళిచేసుకుంటాను." అని నిర్భయంగా చెబుతున్న హరిబాబుని చూసి కులం పెద్దలతోపాటు యెల్లయ్యకూడా గుండె బాదు కున్నాడు.

"ఏటేటి? జగన్నాథంగోరి బిడ్డనే? ఆరిని కాదని ఈ ఊళ్లో బతుకుదామనే? యేంటే యెల్లయ్యా? సదివినోడు, సదివినోడు...అంటివి...ఇట్టా తయ్యా రయ్యేడేంటి? నీ కొడుకూ?..."

యెల్లయ్య గుటకలు మింగాడు. ఏం సమాధానం చెపుతాడు? కడుపు కట్టుకుని కొడుకుని చదివించగలడు కాని, పెద్దలను ఎదిరించగలడా? జగన్నాథంగారిని కాదనగలడా?

"యేంటిరా, యిదంతా?..." అమాయకంగా అడిగాడు కొడుకుని...

తండ్రి ముఖం చూస్తోంటే జాలితో కడుపు తరుక్కుపోయింది హరిబాబుకి ...తండ్రి తనమీద ఎన్ని ఆశలు పెట్టుకున్నాడో అతనికి బాగా తెలుసు...

"వురేయ్! మనకి ఒక చక్కని ఇల్లు...రెండుపూటలా తిండి...నీకో చక్కని బిడ్డ...భలే యెల్తదిరా బతుకు..." అనేవాడు కలల్లో తేలిపోతూ...

వెర్రి తండ్రి! కనీసం కలల్లో అయినా కూడూ, గూడూ, మించి ఊహించలేడు. అవి రెండూ లభిస్తే స్వర్గంలో ఉన్నట్లే అనుకుంటాడు. జీవితంగురించి ఇంకేమీ తెలియదు

"తప్పేం లేదయ్యా! ఆ అమ్మాయి కిష్టమయింది. నా కిష్టమయింది ఉద్యోగాలు చేసుకుని హాయిగా బ్రతుకుతాం!" ధైర్యంగా అన్నాడు హరిబాబు.

వాళ్ల సంధ్య పిడుగుపడినట్లే అయ్యింది అందరికీ.

"ఈల్లేదు. యెంతమాత్రం యీల్లేదు. యెల్లయ్యా! పంతులయ్యనడిగి లగ్గం పెట్టించు మన నాగికి ముడెట్టించేద్దాం..."

ఏకగ్రీవంగా తీర్మానించారు అందరూ...యెల్లయ్య మాట్లాడకుండా ఊరుకున్నాడు. తనవేం చెయ్యగలరనే ధీమాతో హరిబాబు కూడా పట్టించుకోలేదు. హరిబాబు టౌన్‌కి పారిపోయి ఉంటే నిజంగానే ఎవరూ ఏమీ చెయ్యలేకపోయేవారు—కానీ జనుల మూర్ఖత్వం దేనైనా బలితీసుకోగలదని ఊహించలేని హరిబాబు సరళను ఒక్కదాన్ని ఊళ్లో వదిలి వెళ్లలేక ఊళ్లోనే ఉండిపోయాడు.

యెల్లయ్యతోకాని, హరిబాబుతోకాని ఏమీ మాట్లాడకుండానే కులం పెద్దలు హరిబాబు పెళ్ళికి ముహూర్తం పెట్టేసారు. పెళ్ళికూతురు బంధువులపిల్ల నాగలక్ష్మి సిద్ధంగానే ఉంది. ఆ పిల్లతోనూ ఎవరూ మాట్లాడలేదు. దాని యిష్టానిష్టాలూ కనుక్కోలేదు.

కులం! కట్టుబాటు! ఎవరు కాదనగలరు? ఇదంతా చూసి హతాశుడయ్యాడు హరిబాబు. తనవాళ్లంతా ఒక కట్టుగా నిలబడి తనకు అండగా ఉంటే జగన్నాథంగారి అహాన్ని ఎదుర్కోవటం ఏమంత కష్టంకాదు. కానీ మూర్ఖత్వంలో మగ్గిపోయే తనవాళ్ళే తనకు శత్రువులయిపోయారు.

"ఈ పెళ్ళి నేను చేసుకోను. చేసుకోనంటే చేసుకోను." అని అరిచాడు.

వెంటనే పది పదిహేను బాణాకర్రలు గాలిలోకి లేచాయి. హరిబాబు వంటిమీద దెబ్బల వర్షం కురిసింది. ఒక్కడు...ఆ జనాన్ని...కల్లుమైకంతో అజ్ఞానపుమైకాన్ని రంగరించి పీకలదాకా తాగి మత్తెక్కి తమ మేలేదో తామే తెలుసుకో

లేని స్థితిలో ఉన్న ఆ జనాన్ని ఏం చెయ్యగలడు? తెలివితప్పి కూలి పోయాడు. ఆతణ్ని అలాగే మోసుకొచ్చి పీటలమీద కూలేసాదు. వెనక మరొ కడు పడిపోకుండా పట్టుకున్నాడు. బాజాలు మ్రోగాయి. పురోహితుడే పెళ్లి కూతురి మెడలో మంగళసూత్రం కట్టేసాడు. పెళ్లిపాటలు పాడారు. ఆడంగులు నవ్వుకున్నారు. ఛలోక్తులు విసురుకున్నారు. పెళ్లితంతులన్నీ ముగిసాక గోలు గోలున యేడుస్తూ యెల్లయ్య పెళ్లికొడుకుని బండిలో వేసుకుని టౌను హాస్పి టల్‌లో చేర్పించాడు.

## 3

చిన్న సూట్‌కేస్ చేత్తోపట్టుకుని జబ్బుపడిలేచిన మనిషిలా పాలిపోయిన ముఖంతో తన ఇంటికి వచ్చిన సరళను చూసి పావని గుండెలు దడదడలాడాయి. సరళను గురించిన సంగతులేవీ పావని తన అత్తగారింట్లో చెప్పలేదు. ఇప్పుడు నిజం తెలిసి ఎవరేమంటారోనని కొద్దిగా భయపడింది.

సరళను పద్మావతి మామూలుగా ఆదరించింది.

"అలా ఉన్నావేమమ్మా? జబ్బుచేసిందా?" అని అడిగింది.

సరళ ఏం సమాధానం చెపుతుందో నన్నట్లు పావని కంగారుగా "సరళా? స్నానంచెయ్యి. బాత్‌రూంలో నీళ్లు పెట్టించాను." అని లేవగొట్టింది.

సరళ ఏదీ పట్టించుకోలేదు. యాంత్రికంగాలేచి వెళ్లి స్నానంచేసి వచ్చింది...

అనుపమ సరళకంటె రెండేళ్ళు జూనియర్.

"ఏవిటిది చిన్న వదినా? ఎవరైనా డాక్టర్‌కి చూపించుకున్నావా?" అని అడిగింది.

''ఎందరో డాక్టర్లు చూసారు. భయంగా ఉంది. అసలు బ్రతుకుతాడో? బ్రతకడో?" అంది సరళ ఎటో చూస్తూ.

అనుపమ తెల్లబోయి "ఏమిటిది వదినా? నే నే మడిగాను? నువ్వేం చెబు తున్నావ్?" అంది.

సరళ అయోమయంగా చూసి తల దించుకుంది. భోజనం దగ్గిర తనకేం కావాలో, తనేం తింటుందో తెలియకుండా భోజనం చేస్తోన్న సరళను వింతగా చూసారు.

"ఇప్పుడే వస్తాను." అని సాయంత్రం యింట్లోంచి బయలుదేరింది సరళ.

"ఉండు. నేనూ వస్తాను." అని లేవబోయింది పావని.

పద్మావతి అడ్డుతగిలింది.

"వెళ్లనీ! కొత్త ఊరా? ఇప్పుడు అబ్బాయి వచ్చేవేళయింది."

పావని ఏమీ అనలేకపోయింది. విఠల్ వచ్చే సమయానికి పావని ఇంట్లో లేక పోతే, విఠల్ పైకి ఏమీ అనలేకపోయినా లోలోపల చాలా కష్టపెట్టుకుంటాడు.

రాత్రి తొమ్మిదయినా సరళ తిరిగిరాలేదు. అశాంతితో దొర్లుతున్న పావనిని చూసి విఠల్ "అలా ఉన్నావేం?" అని అడిగాడు.

"సరళ ఇంకా రాలేదు." అంది పావని.

''నేను వెళ్ళి స్నేహితులెవరింట్లోనైనా ఉందేమో చూసిరానా?'' అన్నాడు విఠల్.

''వద్దు-వద్దు—మీరు వెళ్ళద్దు—" కంగారుగా అంది పావని.

"ఎందుకంత కంగారు?'' నవ్వాడు విఠల్.

పావని మాట్లాడలేదు.

"కొంచెంసేపైనా నన్ను వదలి ఉండలేవా?" అని అల్లరిగా నవ్వుతూ మీద చెయ్యివేసి దగ్గరగా తీసుకోబోయాడు.

భర్త ప్రేమకంటె పావని కోరుకొనేది లేదు. అయినా ఆ సమయంలో అతడు తనను వదిలి పడుకుంటే బాగుండుననుకుంది.

సరళ ఎక్కడికి వెళ్ళి ఉంటుందో అనుమానించగలిగింది పావని అందుకే అంతగా తల్లడిల్లిపోతోంది.

సరళ ఎప్పటికి వస్తుందో? ఏ స్థితిలో వస్తుందో! అయినా తెలిసి తెలిసి తలి దండ్రులు సరళను తన దగ్గరకు ఎందుకు పంపాలి? తల్లి ఉత్తరం రాసింది.

"...సరళ మరీ పిచ్చిదానిలాగ తయారయింది. నేను భరించలేకపోతు న్నాను. నీ దగ్గరకు వెళ్తానంది పెద్దదానివి నువ్వున్నావు కదా, అని పంపిస్తు న్నాను. అయినా హరిబాబుకి పెళ్ళయిపోయింది గనుక పరవాలేదు...''

ఇదీ ఆ ఉత్తరంలో సారాంశం...హరిబాబుకి పెళ్ళయిపోయింది గనుక పరవాలేదుట! పెళ్ళంటే ఏమిటనుకుంటున్నారు వీళ్ళు? తను పెద్దదట! తల్లీ తండ్రీ పెద్దరికాలను లక్ష్యపెట్టని సరళ తన పెద్దరికాన్ని లక్ష్యపెడుతుందా? ఇంత బాధ్యత తను భరించగలదా?

సరళ బాగా పొద్దుపోయి వచ్చింది. స్నేహితురాలు లలితతో సినిమాకు వెళ్ళి వాళ్ళింట్లోనే అన్నం తిని వచ్చానని చెప్పింది పద్మావతికిది బాగుండక పోయినా పరాయిపిల్లను ఏమీ అనలేక ఊరుకుంది.

ఆ మరునాటికే పావని భయంగా ఎదురుచూస్తున్న పిడుగు పడింది...



పద్మావతి కళ్ళు పెద్దవిచేసి ఆశ్చర్యంగా చూస్తూ

"అయితే ఇది నిజమేనుటే!" అంది పావనితో.

పావని బెదురుగా "ఏమిటత్తయ్యా!" అంది.

"పక్కవీధి తులశమ్మ చెప్పింది. మన సరళ హరిజనుడ్ని పెళ్ళిచేసుకుంటా నందిటగా..."

పావని మాట్లాలేదు.

"నేను నమ్మలేకపోయాను. మన ఇళ్ళల్లో ఇలాంటి బుద్ధులెవరి కున్నాయి? కానీ, ఆవిడ అన్నీ వివరంగా చెప్పింది. మీ నాన్న వాడికి వాళ్ల కులందానితో పెళ్ళి జరిపించాట్టగా! మంచపని చేశాడు. లేకపోతే, హవ్వ! ఇంటా వంటా ఎక్కడైనా ఇలాంటివి ఉన్నాయా?"

అప్పటికీ పావని మాట్లాడలేదు. మాట్లాడి ప్రయోజనంలేదు.

"అవన్నీ అలా ఉంచు. ఇది విను. ఆ వెధవ ఇక్కడే ఆస్పత్రిలో ఉన్నాట్ట. వాణ్ని చూట్టానికే ఇది ఇక్కడికి వచ్చిందిట! రాత్రి అక్కడికి పోయిందట. అక్కడకు పోవడానికి వీల్లేదని గట్టిగా చెప్పు. నీ చెల్లెలికి నువ్వు చెప్పకపోతే, ఎవరు చెపుతారు?"

ఆజ్ఞాపిస్తున్నట్లు అంది పద్మావతి.

సరళ ముఖం చూస్తోంటే హృదయం ద్రవించిపోతోంది పావనికి. ఈ విషయాలన్నీ సరళతో ముఖాముఖి మాట్లాడటానికి మనసు రావటంలేదు. అయినా తప్పదు

"సరళా! నిన్న హరిబాబును చూట్టానికి వెళ్లావా?"

"అవునక్కా! ఎంతెంత దెబ్బలు తగిలాయో. నువ్వు చూస్తే కళ్ళు తిరిగి పడిపోతావు. అసలు బ్రతుకుతాడంటావా అక్కయ్యా!"

అమాయకంగా ఓదార్పుకోసం తనను ఆశ్రయిస్తోన్న చెల్లెలితో ఏం మాట్లా డాలో తోచలేదు పావనికి...

"సరళా! నువ్వు అక్కడికి వెళ్లద్దమ్మా!"

"అదేమిటక్కయ్యా! మామూలుగా తెలిసినవాళ్ళు అపాయదశలో ఉంటేనే చూసి సహించలేం కదా? నా ప్రాణానికి ప్రాణమైన హరిబాబును ఈ స్థితిలో చూడకుండా నేను ఉండగలనా?"

పావనికి ఏడుపొస్తూంది. కోపమొస్తూంది.

"సరళా! ఇలా అయితే నిన్ను నా దగ్గిరుంచుకోను. మన ఇంటికి పంపే స్తాను..."

వణికిపోయింది సరళ.

"వద్దక్కయ్యా! ఆ ఊళ్లో ఉంటూ ఆ రాక్షసకృత్యం మళ్ళీ మళ్ళీ గుర్తు చేసుకుంటూ నేను బ్రతకలేను. నన్ను కొన్నాళ్ళు నీ దగ్గిరే ఉండనియ్యి."

వెక్కి వెక్కి ఏడ్చింది సరళ...రెండుచేతులూ జాపి సరళను గుండెల్లోకి తీసుకుంది పావని. తడబడుతోన్న తన కంఠాన్ని అదుపులోకి తెచ్చుకుంటూ, "మరి రేపటినుండీ వెళ్ళవుగా!" అంది.

సరళ మాట్లాడలేదు.

ఆ మరునాడు సాయంత్రంకూడా సరళ వెళ్ళిపోయింది. ఈసారి ఎక్కడికి వెళ్లిందో అందరికీ తెలిసిపోయింది. శాంతమూర్తి అయిన పద్మావతి పావనిమీద కాళికలాగే విరుచుకుపడింది...

"ఇదేమైనా సంసారుల కొంపా! సానుల కొంపా? ఇలాంటి మూక చేరితే పెళ్ళికావలసిన నా కూతురు కూడా పాడైపోతుంది. చేతనైతే నీ చెల్లెలికి బుద్ధి చెప్పి కుదురుగా ఉండమను. లేకపోతే పంపించెయ్యి. కచ్చితంగా చెపుతున్నాను. ఈ ఇంట్లో ఇలాంటివి సాగవు."

అత్తగారి కోపానికి చాలా భయపడింది పావని

సరళ వచ్చేవరకూ మేలుకుని కూచుంది. రాత్రి పన్నెండయింది.

ఇంట్లో గొడవలతో చికాగ్గా ఉన్న పావని అంత రాత్రివేళ సరళ బయటి నుండి రావటం సహించలేకపోయింది.

చాచి లెంపకాయ కొట్టింది. బిత్తరపోయి చూసింది సరళ.

"ఛీ! ఛీ! సిగ్గులేదూ?" అంది చీదరించుకుంటూ.

"సిగ్గెందు కక్కయ్యా? ఏం తప్పు చేసానని?" నిర్భయంగా అడిగింది సరళ.

"తప్పు చెయ్యలేదూ? అతనికి పెళ్లయిపోయింది. తెలియదూ?"

"పెళ్ళి! ఆ అబద్ధాల పెళ్ళికంటె ముందుగానే మా ఇద్దరికి నిజంపెళ్ళి జరిగి పోయింది. నీకు తెలుసా అక్కయ్యా!"

ప్రాన్పడిపోయింది పావని.

"ఏవిటే నువ్వంటున్నది?"

"అవునక్కయ్యా! ఇప్పుడు నాకు అయిదో నెల!"

మతిపోయిన పావని సరళ చెంపలు టపటప వాయించేసింది...

"ఛీ! ఛీ! పాపిష్టిదానా!" అంది కోపంగా

పావని దెబ్బలు లక్ష్యపెట్టకుండా "ఇందులో నేను చేసిన పాపమేముంది అక్కయ్యా! నా త్రికరణాలతో నావాడనుకున్న వ్యక్తికి నన్ను నేను అర్పించు కున్నాను. ప్రకృతిసహజంగా మాతృత్వం వచ్చింది ఈ గొడవలన్నీ మధ్యలో రాకపోతే నేనూ, హరీ, ఈ విషయానికి ఎంత ఆనందించేవాళ్లం!" అంది సరళ.

పావనికి ఆలోచించగలిగే శక్తి పోతోంది.

"వద్దక్కయ్యా! కొంచెం రోజులుండనీ! నేనుంటే హరి తప్పకుండా బ్రతుకు తాడు. హరి కోలుకోగానే నేనూ, హరీ, ఎక్కడికైనా వెళ్ళిపోతాం!"

హడలిపోయింది పావని. ఒకవైపు అత్తమామలు, మరోవైపు తల్లి దండ్రులు – ఎదురుగా సంఘం – వికృతంగా భయపెడుతూ కనిపించారు.

"వీల్లేదు ఎంతమాత్రం వీల్లేదు. రేపే ఎవరినైనా మనిషిని తోడిచ్చి నిన్ను అమ్మదగ్గిరకి పంపేస్తాను."

పిచ్చిదానిలా అరిచింది పావని.

పక్కగదిలోనుండి సరళ ఏడుపు హృదయవిదారకంగా వినిపిస్తోంటే గుండె తరుక్కుపోసాగింది పావనికి. కొంతసేపటికి ఏడుపు ఆగిపోయింది. వెళ్ళి చూడాలనిపించింది. అంతలో గుండె రాయిచేసుకుంది. ముందు తల్లిదగ్గిరకు వెళ్ళిపోనీ ! ఆ మంచిచెడ్డలన్నీ తలిదండ్రులే చూసుకుంటారు. లేకపోతే, "నువ్వే సరళ జీవితం నాశనంచేసావ"ని అందరూ తనను దుమ్మెత్తి పొయ్యరూ ?

రాత్రంతా సరళ దిగులుతో సరిగా నిద్రపట్టక ఆ మరునాడు పావని కొంచెం పొద్దుపోయి లేచింది.

సరళ ఇంట్లో లేదు. గుండె గుభిల్లుమంది. ఎక్కడికి పోతుంది? తల్లి దగ్గరకే వెళ్ళి ఉంటుందని రామాపురానికి మనిషిని పంపారు. వెంటనే సుందరమ్మా, జగన్నాథం కంగారుపడుతూ వచ్చేసారు, 'సరళ మా దగ్గిరకు రాలే'దంటూ...

హరిబాబు దగ్గిరకు వెళ్ళిందేమోనని అందరూ హాస్పిటల్‌కు వెళ్ళారు. హరి ప్రాణాపాయస్థితిలో ఉన్నాడు. వంటిమీద తెలివిలేకుండా ఏదో అతి ప్రయాసతో అంటున్నాడు. దగ్గిరగా వెళ్ళింది పావని తనకున్న జీవశక్తినంతా వినియోగించి హరి ఉచ్చరించిన చివరిమాట "సరళ!"

హరి ప్రాణవాయువులు అనంతంలో కలిసిపోయాయి. యెల్లయ్య గోడు గోడున ఏడుస్తూ తనకు తెలిసిన మనుష్యులను ఏమీ అనలేక తనకు తెలియని దేవతలకు శాపనార్థాలు పెడుతూ పిచ్చివాడిలా వెళ్ళిపోయాడు?

ఆ తరువాత పావని ఏనాడూ స్థిమితంగా నిద్రపోలేకపోయింది. ఏ మూలనుండో సరళ దీనంగా "నన్ను కొంచెంరోజులు నీ దగ్గిర ఉండనియ్యవూ అక్కయ్యా! నే నుంటే హరి చావడు." అని అడుగుతున్నట్లే తోచి ఉలికి పడి లేచి కూచునేది.

జగన్నాథం ఎంత ప్రయత్నించినా సరళ జాడ తెలియలేదు. పోలీస్ రిపోర్ట్ ఇయ్యటానికి ఆయన "నలుగురిలో తలెత్తుకోలేకపోవటం" అడ్డువచ్చింది. లోలోపల కుళిమిపోవటంతప్ప- సుందరమ్మ ఏం చెయ్యలేకపోయింది.

ఆనాటి కీనాడు- సరళదగ్గిరనుండి ఈ టెలిగ్రాం!

ఏ పరిస్థితుల్లో ఉండి తనకీ టెలిగ్రాం ఇచ్చిందో సరళ!

## 4

హోటల్లో దిగి అడ్రస్ వెతుక్కుంటూ సరళను కలుసుకోవటం కష్టమే అయింది పావనికీ, విఠల్‌కీ.

మంచానికి బల్లిలా అతుక్కుపోయిన సరళను చూడగానే గొల్లుమంది పావని.

పావని ఏడుపుని కూడా పట్టించుకోకుండా "అక్కయ్యా! హరి కులాసాగా ఉన్నాడా?'' అని అడిగింది ఆరాటంగా సరళ.

బిత్తరపోయి చూస్తోన్న పాపనిని చెయ్యిపట్టుకుని వెనక్కిలాగి "ఆ! తులాసాగానే ఉన్నాడు." అన్నాడు విఠల్.

"బావగారు కూడా వచ్చారే! జీవితాంతమూ ఇలా తోడునీడగా కలిసి మెలిసి ఉండే దాంపత్యం దొరకటం ఎంత అదృష్టం అక్కయ్యా!"

"కర్మకొద్దీ నీ జీవితం ఇలా అయిపోయింది కానీ, లేకపోతే నువ్వు మాత్రం..." అని ఏదో అనబోతున్న పావని మాటలకు మధ్యలోనే అడ్డు తగిలింది సరళ.

"నా అదృష్టాని కేంలోటు అక్కయ్యా! నూరుమందిలో పదిమంది కూడా నా అంత అదృష్టవంతులుండరు. హరితో గడిపిన ప్రతి క్షణమూ నా మనసులో కోటి కోటి కాంతులను విరజిమ్ముతూనే ఉంటుంది. నా హరి పిరికివాడు కాడు. నన్ను వదలడు కొంచెం కోలుకోగానే తప్పకుండా నన్ను వెతుక్కుంటూ వస్తాడు. అప్పుడు..."

మాట్లాడలేక ఆయాసపడిపోతోంది సరళ ... ఏం మాట్లాడాలో తెలీక కుమిలిపోతోంది పావని.

విఠల్ కల్పించుకుని "ఎక్కువగా మాట్లాడకు సరళా! ముందు హాస్పిటల్‌కు వెళ్దాం పదండి" అన్నాడు.

"నువ్వేం చెప్పినా వింటాను బావా! నాకు బ్రతకాలని ఉంద. మీ ఎవ్వరి ఆసరాలేకుండానే బ్రతకాలనుకున్నాను. బ్రతకగల ననుకున్నాను. కానీ నా వల్ల కాలేదు. ఈ సంఘం నన్ను నిలిచినచోట నిలవనీయకుండా తరిమికొట్టింది ... తాళిబొట్టు లేకుండా తల్లినయ్యాననుట! అదీ నా అపరాధం అంతమాత్రానికి ఈ సంఘం దృష్టిలో వేశ్యకంటె నీచురాలినయిపోయాను. పైకి కనిపించే తాళిబొట్టే వ్యక్తుల పవిత్రతకు నిదర్శనం సంఘం దృష్టిలో ... అంతకంటె ఆలోచించ లేరు. అర్థంచేసుకోలేరు ... హరి కోలుకుని నా దగ్గరకు వచ్చాక..."

భరించలేక గట్టిగా ఏడ్చేసింది పావని

"ఏందు కక్కయ్యా! నాకు నయమవుతుంది. నాకు తెలుసు." విఠల్ సైగతో పావని కళ్ళుతుడుచుకుని నిగ్రహించుకుంటూ "సరళా! అమ్మకి టెలిగ్రాం ఇస్తాను." అంది.

"వద్దు వద్దు అక్కయ్యా! నువ్వా పనిచేస్తే ఇలాంటి స్థితిలో నీ దగ్గర నుంచి పారిపోతాను. అమ్మకి తెలుస్తే నాన్నకి తెలుస్తుంది. ఎంత ఘోరానికైనా సిద్ధపడి నన్ను హరికి కాకుండా చేస్తాడు. అన్నట్లు హరికి ఎన్ని ఉత్తరాలు

రాసినా సమాధానం లేదు ఆ ఊళ్లో లేరనుకుంటాను. వారి అడ్రస్ తెలుసా అక్కయ్యా ?"

పావనికి సమాధానం చెప్పనీయకుండా విఠల్ ముందుకొచ్చి "సరళా ! కూర్చోగలవా ? టాక్సీ తీసుకురానా ?" అన్నాడు.

"కూర్చోగలను" అన్నట్టు తల ఊపింది సరళ.

విఠల్ టాక్సీ తీసుకొచ్చాడు. కూర్చోడానికి కూడా శక్తిలేక తూలిపోతున్న సరళను పావని పొదివి పట్టుకుని విఠల్ సాయంతో టాక్సీలో కూచోబెట్టింది.

ఒక ప్రైవేట్ డిస్పెన్సరీలో చేర్పించాడు సరళని విఠల్

లేడీ డాక్టర్ అలవాటుగా "భర్త పేరు ?" వగైరా ప్రశ్నలు అడుగుతోంటే విఠల్ ముఖం అవమానంతో ఎఱ్ఱబడటం పావని గమనించింది.

"చాలా బలహీనంగా ఉంది. ఎంతో కాలంగా సరిగ్గా ఆహారం తీసుకుంటు న్నట్లుగాలేదు. మానసికంగా కూడా కృంగిపోయినట్లు ఉంది...గర్భంలో శిశువు పరిస్థితి కూడా అనుమానంగానే ఉంది. ఎక్స్‌రే తీస్తాను. రిజల్ట్స్ వచ్చాక కాని ఏ విషయమూ నిర్ధారణగా చెప్పలేను..." అంది లేడీ డాక్టర్.

పావనితోపాటు అక్కడే ఉండటానికి విఠల్‌కి వీలుపడలేదు.

"పావనీ ! నాకు అర్జంట్ కేసులున్నాయి! నేను వెళ్లక తప్పదు హోటల్ దగ్గర్లోనే ఉంది. హాస్పిటల్ ఆయాకి టిప్స్ చేస్తే సహాయంచేస్తుంది. ఏం కావాలన్నా తెప్పించుకో ! డబ్బు సూట్‌కేస్‌లో ఉంది జాగ్రత్త..."

"వెళ్ళిపోతున్నారా ?" అంది పావని బేలగా.

"వెళ్లక తప్పదు పావనీ ! నువ్వు మరీ ఇంత బెంబేలుపడితే సరళకేం ధైర్యం చెపుతావ్ ? జాగ్రత్త ! ఈ పరిస్థితుల్లో సరళకు హరి చచ్చిపోయాడని చెప్పకు. కోలుకున్నాక నచ్చచెప్పి ఏదో ఒకటి ఆలోచించుకోవచ్చు..."

మాటాడలేక తల ఊపింది పావని.

"ఏ అవసరం వచ్చినా టెలిగ్రాం ఇయ్యి. నీ ఆరోగ్యం జాగ్రత్త..."

టాక్సీలో స్టేషన్‌కి వెళ్ళిపోయాడు విఠల్

సరళ దగ్గిరకువచ్చి కూచుంది పావని.

ఆగర్భ శ్రీమంతుల ఇంటిపిల్ల...అల్లారుముద్దుగా పెరిగిన వ్యక్తి-ఈ నాటికి ఇలా అనాథలా పడిఉండవలసి వచ్చింది.

"అక్కయ్యా ! డాక్టర్ ఏమంది ?" ఆరాటంగా అడిగింది సరళ.

పావని పరిస్థితి చాలా కష్టంగా ఉంది. ఒక వంక సరళ పరిస్థితికి చెదిరి



పోతున్న గుండెను చిక్కబట్టుకోవాలి. మరొకవంక సరళతో అబద్ధాలూ చెపుతూ సరళను దక్కించుకోవాలి.

"ఫరవాలేదండి ! కానీ, నువ్వు చాలా బలహీనంగా ఉన్నావు. సరిగ్గా ఆహారం లేదని..."

సరళ నిట్టూర్పు విడిచింది.

"అవునక్కయ్యా ! సరిగ్గా ఆహారం లేదు. రెండు నెలలబట్టీ ఒకపూట తింటే మరొక పూట తినటంలేదు. చెప్పానుగా ఏ ఉద్యోగానికి ప్రయత్నించినా ఒకటే ప్రశ్న..."పెళ్ళికాకుండానే కడుపుతో ఉన్నావా ?" అని. అక్కడితో ఒక పురుగును చూసినట్లు చూడటం ... చివరకు కూలిపనికూడా చేసాను..."

"చెప్పకే ! నేను వినలేను. పోనీలే ! అదంతా పీడకలలా మరిచిపో !"

"అవునక్కయ్యా ! అదంతా పీడకల...హరి అడ్రస్ తెలిస్తే ... అతడు వచ్చేస్తే...ఈ పీడకల నన్నేమీ బాధించదు..."

"సరళా..."

"అక్కయ్యా! నువ్వు వచ్చావు. నా కింక భయంలేదు. నేను బ్రతుకుతాన కదూ!"

"తప్పకుండా బ్రతుకుతావు"

"నాకు చచ్చిపోవాలని లేదక్కయ్యా! నా కింకా పాతికేళ్లు కూడా నిండ లేదు. అప్పుడే ఈ జీవితాన్ని వదిలిపోవాలని లేదు. ఎంత అందమైనది ఈ జీవితం! ఎన్నెన్ని తీయని అనుభవాలు! నా హరితో కలిసి ఈ జీవితాన్ని అనుభవించాలి!..."

ఇంక మాట్లాడలేక అలిసిపోయి కళ్లుమూసుకుంది సరళ. ఆ మూసుకున్న కళ్లవెనుక ఎన్నెన్ని కలల సౌధాలు నిర్మించుకొంటూందో ఊహించుకొన్న పావనికి గుండెలు బద్దలవుతున్నాయి.

శిశువు గర్భంలో చనిపోయిందనీ, ఆపరేషన్‌చేసి తియ్యాలనీ చెప్పింది లేడీ డాక్టర్.

ఆపరేషన్ థియేటర్‌లోకి వెళ్లబోతూ "అక్కయ్యా! నాకు బ్రతకాలని ఉంది ఈ జీవితంలో సుఖాలన్నీ అనుభవించాలని ఉంది" అంది జాలిగా సరళ...

పావని దుఃఖం దిగమ్రింగుతూ "తప్పకుండా ఆరోగ్యంగా తిరిగొస్తావు తల్లీ!" అంది.

కానీ, సరళ ఆశలు నెరవేరలేదు. హరితో కలిసి జీవితాన్ని అనుభ వించాలని కలలు కనే సరళ తనకు తెలియకుండానే హరిని కలుసుకోవటానికి వెళ్ళిపోయింది.

## 5

పావని వచ్చి చెప్పిన తరువాత సరళ చచ్చిపోయిన సంగతి అందరికీ తెలిసింది. సుందరమ్మ కుమిలి కుమిలి ఏడ్చింది. ఆ ఏడుపులూ, మొత్తుకోళ్లూ చూస్తోంటే పావనికి ఏ కోశానా జాలి కలగలేదు. సరళ చచ్చిపోయిందా? లేదు హత్యచేసారు. కన్న తల్లిదండ్రులూ, సంఘమూ, – చివరకు ప్రాణంలా ప్రేమించే తనూ – అందరూ కలిసి హత్యచేసారు. తీరా హత్యాకాండ ముగిసాక తాము చేసిన దారుణం తామే తెలిసికోలేక చేతులారా పారేసుకున్న ప్రేమ ధనం కోసం పరితపిస్తున్నారు.

పక్కమీద అశాంతిగా అటూ ఇటూ దొర్లుతోన్న పావనిమీద ఆప్యాయంగా చెయ్యివేసాడు విఠల్.

"నిద్రపో! పావనీ! మనసు కుదుటపరచుకో! మనం చెయ్యగలిగింది ఏముందీ?" అన్నాడు నిద్రమత్తులో.

ఆ మాటలు పావనికి నచ్చలేదు. మనం చెయ్యగలిగింది ఏమీ లేదా? చాలా ఉంది. కానీ, చెయ్యటంలేదు,

ఎంత ప్రయత్నించినా నిద్రరాలేదు. లేచి వెళ్ళి మావగారికోసం ఉంచిన స్లీపింగ్ టాబ్లెట్ వేసుకుని పడుకుంది.

స్లీపింగ్ టాబ్లెట్స్ బాటిల్ తమ పడకగదిలో చూసి విఠల్ ఆశ్చర్యంగా "ఇది మన గదిలోకి ఎందుకు వచ్చింది?" అన్నాడు.

"రాత్రి నిద్రపట్టక ఒకటి వేసుకున్నాను."

విఠల్‌కి చాలా కోపం వచ్చింది.

"ఇలా నీ ఆరోగ్యం పాడుచేసుకుంటే నేను ఊరుకోను. ముందు ఈ సీసా నాన్నగారి గదిలో పెట్టెయ్యి."

పావని నవ్వి "అబ్బా! ఎంత ప్రేమ! ఈ ప్రేమ నేను ఏం చేసినా ఉంటుందా?" అంది.

"నాకు కోపం వచ్చే పనులు నువ్వెందుకు చేస్తావూ?"

"అంతే! మొగబుద్ధి..."

"అదే మరి, పాడు మొగబుద్ధి. అమ్మాయిగారు కాస్త మూతి ముడుచుకున్నా, తల్లడిల్లిపోతాయి పాడుప్రాణాలు..."

పకపక నవ్వింది పావని.

ఆ రోజు ఎవరో ఇద్దరు అమ్మాయిలు "పావనగారి ఇల్లు ఇదేనా?" అని వెతుక్కుంటూ వచ్చారు.

పావని తనను తను తెలుపుకుని వాళ్ళను కూచోబెట్టి వచ్చిన కారణం అడిగింది.

ఆ పిల్లలిద్దరి వయసూ ఇరవై లోపే ఉంటుంది. చిన్నపిల్ల వయసు మరీ పదిహేనేళ్ళకంటె ఎక్కువ ఉండదనిపిస్తోంది. పెద్దమ్మాయి మాట్లాడింది.

"మీ రవి మా చెల్లెలిని రోడ్డుమీద జడపట్టుకు లాగి అల్లరిపెడుతున్నాడండీ! మీరు బుద్ధిచెప్పుకోండి. లేకపోతే మేమే తగినవిధంగా బుద్ధి చెప్పవలసి వస్తుంది."

విస్తుపోయింది పావని. రవికి పట్టుమని పదిహేనేళ్ళు లేవు. చదువుతున్నది ఇంటర్. . అప్పుడే...

కలవరపాటునుంచి తేరుకుని "నేను రవికి చెప్తాను లెండి. ఇంకమీదట వాడు మీ జోలికి రాడు." అని నచ్చజెప్పి పంపేసింది.

రవి రాగానే కోపంగా "ఏం రవీ! ఆడపిల్లలను ఏడిపించేటంత పెద్దవాడి వయ్యావా?" అంది.

వదిన కోపానికి రవి భయపడ్డాడు. కానీ, అతని ముఖంలో తప్పుచేసి నందుకు సంకోచం కనపడలేదు.

"ఓ! ఆ మొగుణ్ణొదిలేసినదాని కూతుళ్ళు నీ దగ్గిర కొచ్చారా?" అన్నాడు నిర్లక్ష్యంగా...

మరింత విస్తుపోయింది పావని...

"తిన్నగా మాట్లాడు రవీ! ఏవిటా మాటలు మర్యాద లేకుండా..."

"వాళ్ళు మర్యాదస్థులు కారు వదినా! వాళ్ళ అమ్మ మొగుణ్ణొదిలి ఒకర్తే కథ నడిపిస్తోంది. వీళ్ళు అంతకంటె ... ఇది మహా మంచి దనుకున్నావా? మొన్న ఆ ప్రకాశ్‌గాడితో సినిమా కెళ్ళటం నేను కళ్ళారా చూసాను..."

మతిపోతోంది పావనికి. ఆ ఇల్లాలు తన సంసారం ఎందుకు వదులుకోవలసి వచ్చిందో, ఏ బాధలున్నాయో...భర్తను వదిలినంతమాత్రాన సంఘానికి ఆ స్త్రీ బజారు మనిషి అయిపోయింది. ఆవిడ పిల్లలు కూడా అలుసయిపోయారు. ఆ అమ్మాయి తన స్నేహితుడితో సినిమాకు వెళ్ళినంతమాత్రాన నడిరోడ్డుమీద జడపట్టుకు లాగే హక్కు తనకు వచ్చిందనుకుంటున్నాడు రవి!

స్త్రీపట్ల సాంఘిక దృక్పథమంతా రవిలో బీటరూపంలో కనిపిస్తోంది... భరించలేకపోయింది పావని. "నోరు మూసుకో! వాళ్ళెవరో, ఏమిటో నీ కనవసరం! నువ్వు మాత్రం నీ హద్దుల్లో ఉండు. మరోసారి ఇలా ప్రవర్తిస్తే వాళ్ళదాకా పోకుండా నేనే నీకు బుద్ధిచెప్తాను..."

వదిన ఉగ్రరూపంచూసి ఇంకేం వాదించకుండా చల్లగా జారుకున్నాడు రవి.

అనుపమకు పెళ్ళి సంబంధాలు చూస్తున్నారు. కట్నాల సమస్య మామూలే! రూపమూ, గుణమూ, చదువూ అన్నీ ఉన్న అనుపమను భార్యగా స్వీకరించ టానికి ఇరవై వేలవరకూ కట్నాలు అడుగుతున్నారు.

జగన్నాథానికి కొడుకులు లేరు. అతడు ఎవరినీ పెంచుకోనూ లేదు పెళ్ళి లోనే పావనిపేర పది ఎకరాల పొలం పెట్టాడు ఆ పొలం పేరుకి పావనిదే అయినా దానిమీద వచ్చే అయివేజంతా విఠల్ దగ్గిరే ఉంటుంది. ఆ డబ్బు గురించి పావని ఏ నాడూ లెక్కలు అడగలేదు. సరికదా, లెక్చరర్‌గా తనకు







వచ్చే జీతంకూడా అత్తగారి చేతికే ఇచ్చేవాడు. అలా అని పావని ఏ నాడూ డబ్బు ఇబ్బందిపడలేదు. పావని ఏది కొన్నా విఠల్ ఏ నాడూ కాదనడు.

“నా పొలం ఉందిగా! అందులో కొంత అమ్మేసి అనుపమకు కట్నంగా ఇచ్చేద్దాం!” అంది పావని.

విఠల్ ఒప్పుకోలేదు.

“అంత అవసరమేముంది! నేనే ఏదో చూస్తాలే!” అన్నాడు.

పొలం అమ్మటానికి పద్మావతికూడా అంత సుముఖంగా లేకపోవటంతో పావని ఊరుకోవలసి వచ్చింది.

నళిన బి.ఏ విద్యార్థినులందరిలోనూ చాలా చక్కగా ఉంటుంది. బాగా నాట్యం చేస్తుంది. కాలేజీలో కల్చరల్ ప్రోగ్రామ్స్ ఏం జరిగినా నళిని నాట్యం తప్పకుండా ఉంటుంది. స్టూడెంట్స్ యూనియన్‌కి పావని అడ్వైజర్ కావటం వల్ల నళినికి పావని దగ్గిర బాగా చనువు ఉంది.

ఎప్పటిలా కాలేజ్‌డే ఫంక్షన్‌కి నళినిని డాన్స్ చెయ్యమని అడిగింది పావని.

“నేను చెయ్యలేను మేడమ్! నా మనస్సు ఏం బాగులేదు.” అంది నళిని.

“ఆదేం?”

“పై శుక్రవారమే మా అక్కయ్య పెళ్ళి.”

“అక్కయ్యకి పెళ్ళవుతోంటే మరింత హుషారుగా ఉండాలికాని, దిగులు దేనికి?”

“ఈ పెళ్ళిలో దిగులేకాని, హుషారులేదు మేడమ్! మా అక్కయ్య స్నేహితురాలు సుశీల. సుశీల కోసమని వాళ్ళింటికి వెళ్ళింది. దాని ఖర్మకాలి సమయానికి

వాళ్ళింట్లో ఎవరూలేరు. సుశీల అన్నయ్య అక్కయ్యని బలవంతంగా లొంగ దీసుకున్నాడు. అక్కయ్యకి నెల తప్పింది. విధిలేక అమ్మా నాన్నా ఆ దౌర్భా గ్యుడికే పదివేల కట్నంతో సహా అక్కయ్యనిచ్చి పెళ్ళిచేస్తున్నారు. అక్కయ్య కుమిలి కుమిలి ఏడుస్తోంది పాపం, అది చెయ్యని తప్పుకు ఇక బ్రతికున్నంత కాలమూ ఏడవవలసిందే!"

వినలేకపోయింది పావని.

"అది చెయ్యని తప్పుకు ఇక బ్రతికున్నంతకాలమూ ఏడవవలసిందే!" అన్న శశిని మాటలు సరళను గుర్తుచేస్తున్నాయి. ఏ లోకంలోనో ఉన్న సరళ "అక్కయ్యా! నాలాంటి అభాగ్యులను ఆదుకోవూ?" అని అడుగుతున్నట్లే తోచింది.

ఒక నిశ్చయానికి వచ్చి విఠల్‌తో చెప్పేసింది.

"నేను ఆడవాళ్లకి ఒక సమాజం స్థాపించాలనుకున్నాను దానికి పురోగామి అని పేరు పెడతాను. బాగుంటుందా?"

విఠల్ ఒక్కసారి ఆవులించి "ఇంటి పనులూ, కాలేజీ పనులూ సరిపోవటం లేదా, నీ యిష్టం." అన్నాడు పెద్దగా పట్టించుకోకుండా

పద్మావతితో కూడా తన సంకల్పం చెప్పింది పావని

"సమాజమా? నాటకాలూ అవీ వేస్తారుకదూ! నువ్వు మాత్రం వెయ్యకు. బాగుండదు. అయితే సినిమాస్టార్లని కూడా పిలుస్తారా?" కుతూహలంగా అడిగింది పద్మావతి.

అత్తగారితో తన సంకల్పాన్ని అంతకంటె వివరించటం అనవసరం అను కుంది. ఆవిడ మంచి మనిషే కాని అన్ని విషయాలూ అర్థంచేసుకోలేదు. ఒక పరిధిని దాటి ఆలోచించలేదు

తన కొలీగ్స్‌తో కూడా ఈ విషయం చర్చించింది పావని.

"ప్రకృతి ఒక వరంగా ప్రసాదించిన మాతృత్వం కొన్ని సందర్భాలలో స్త్రీకి శాపంగా మారుతోంది. తమ తప్పులేకపోయినా కొందరు అమాయకులు ఈ శాపానికి బలికావలసి వస్తోంది. సంఘంలో ఈ దృక్పథాన్ని మార్చాలి. ఈ కార్యసాధనకు మనమంతా ఒక ఉద్యమంలా కృషి చెయ్యాలి!" అంది

బాగా చదువుకున్న స్త్రీలలో చాలామంది పావని అభిప్రాయాన్ని ఆమో దించలేదు. "ఏమిటండీ మీరనేది. పాడైపోయినా పరవాలేదంటే అందరూ పాడై పోతారు!"

"ఇలాంటివి మనం సమర్థిస్తున్నామంటే అందరూ మనని ఆడిపోసుకుంటారు లేనిపోనిది..."

"రేపొద్దున్న మన పిల్లలకి పెళ్ళిళ్ళు కాకపోతే మనని ఆదుకునే వాళ్ళెవరండీ?"

"అయినా ఆడదన్నాక కాస్త జాగ్రత్తగా ఉండద్దూ? అరిటాకు లాంటిది ఆడదాని బ్రతుకు..."

—ఇలా చెలరేగాయి విమర్శలు. ఒకరిద్దరు మాత్రమే పావని ఆలోచన బాగుందన్నారు. అన్యాయంగా సంఘానికి బలై పోతున్న అమాయక స్త్రీలను ఆదుకోవలసిందే అన్నారు

ఆ ఒకరిద్దరి అండదండలే తనకు చాలనుకుంది పావని. ఒక ఇల్లు అద్దెకు తీసుకుని 'పురోగామి' సమాజాన్ని స్థాపించింది.

ఆ ఊళ్లో భాగీరథమ్మని తెలియనివాళ్ళు లేరు. ఆవిడ పూర్వ సువాసిని. పెద్దగా చదువుకోలేదు కానీ హరికథలు బాగా చెప్తుంది. జరీ అంచున్న కంచి పట్టుచీర కట్టుకుని, మెడలో పొడుగాటి పువ్వులదండ వేసుకుని చిరతలు చేత్తో పట్టుకుని లయగా అడుగులు వేస్తూ ఆవిడ హరికథ చెప్తోంటే అందరూ ముగ్ధులయిపోతారు. భర్తలు ఉద్యోగాలకు పోగానే ఏమీ తోచని పెద్దగా చదువుకోని గృహిణులు, పూర్వ సువాసినులు, ఆకతాయి అల్లరి పిల్లలు, ఆవిడ హరికథలకి ప్రతిరోజూ హాజరవుతారు. కథ చెప్పటంలో ఆవిడ నేర్పరి. ఒక విధమయిన ఉద్రేకంతో పురాణగాథలన్నీ రసవత్తరంగా చెప్పుకుపోతుంది. తానై సొంతంగా ఏదీ ఆలోచించలేకపోయినా ఆ పురాణాల్లోవి తానే చెప్తున్నట్లు ఆర్భాటం చేస్తుంది. మధ్య మధ్య పురాణాల్లో పిట్టకథల్లాగ సాంఘిక దురన్యాయాలని ఖండిస్తూ కొన్ని నీతికథలు కూడా చెపుతూంది—అక్కడితో తానేదో అభ్యుదయవాదిననే అహంకారం కూడా ఉంది ఆవిడకు.

ఆ ఊళ్లో అయిదారు భజన మందిరాలున్నాయి. భాగీరథమ్మ ఏ భజన మందిరంలో హరికథ చెప్తుందో ఆ భజన మందిరానికి ఆనాడు హారతి పళ్ళెంలో బోలెడు డబ్బులు పడతాయి. హారతి పళ్లెంలో పడే డబ్బులకోసం భజనమందిరాలన్నీ ఆవిడకి అన్ని విషయాల్లోనూ అండగా నిలుస్తాయి. పురాణాల్లో హాస్యంలాగ ఆవిడ ఊళ్లో అందరినీ విమర్శిస్తుంది. "జానకమ్మ వెళ్లయినా రెండు జడలేసుకున్నట్లు...", "సుశీలమ్మ లావుగా వున్నా జార్జెట్ చీర కట్టు

కున్నట్లు—" అనేస్తుంది తమని కాకుండా మరొకర్ని వెక్కిరించటం అందరికీ హాయిగానే ఉంటుంది గనుక అందరూ నవ్వుతారు. అక్కడితో తను బ్రహ్మాండంగా హాస్యం పోషిస్తున్నానని మురిసిపోతుంది... ఇలా అందరినీ నోటికొచ్చినట్లు దుమ్మెత్తిపోసే భాగీరదమ్మ తనను ఎవరైనా ఏదైనా అంటే మాత్రం ఊరుకోదు.

"అర్జునుడు మత్స్యయంత్రం కొట్టి సుభద్రను పెళ్ళిచేసుకున్నాడ''ని, బ్రహ్మాండంగా కథ చెప్పేస్తుంది. ఏదో కాలక్షేపంకోసం కథ వినేవాళ్ళూ, ఓనమాలు తెలియనివాళ్ళూ, ఆవిడ ఏం చెప్పినా తలలూపేస్తారు. కాస్త తెలిసినవాళ్ళు ఎవరైనా ''అమ్మా! అర్జునుడు మత్స్యయంత్రం కొట్టి పెళ్ళిచేసుకున్నది ద్రౌపదిని, సుభద్రను కాదు"అని చెప్పారనుకోండి. ఈ మాత్రం విమర్శనుకూడా సహించలేదు.

''చూసారా! నేనంటే ఈర్ష్యతో కళ్ళుకుట్టి నన్ను ఆడిపోసుకుంటున్నారు. సుభద్ర అయితేనేం? ద్రౌపది అయితేనేం! నేను కథ రక్తిగా చెప్పానా లేదా?" అని విరుచుకుపడుతుంది.

ఆవిడ నోటికీ, ధాటికీ భయపడి చాలామంది ఆవిడకి అల్లంతదూరంలోనే తప్పుకుంటారు...

అలాంటి భాగీరదమ్మ తన ఇంటికి వచ్చిందనగానే పద్మావతి గుండెలు దడదడలాడాయి. ఏదో ఒక పెంట సృష్టించడానికి తప్ప భాగీరదమ్మ రాదు.

ఒక్క బొట్టుతప్ప మిగిలిన అలంకారాలన్నీ అన్నివేళలా ఉంటాయి భాగీరదమ్మకి...కంచిపట్టుచీర పొడుగాటి చంద్రహారాలు—ఆ పైన ఒక రాళ్ళనెక్లెస్—మోచేతివరకూ గాజులు...జుట్టుజారుముడి వేసుకుంటుంది ఆ వేసుకోవటంలో జుట్టంతా వదులుగా ముఖంమీద పడేలా స్టైల్‌గా వేసుకుంటుంది. ఆ వయసులో ఆ అలంకరణ ఎబ్బెట్టుగా తోచి అందరూ లోలోపల నవ్వుకుంటారు.

"రండి! రండి! కూచోండి!" అని కంగారుగా ఆహ్వానించింది పద్మావతి.

పద్మావతి చూపించిన కుర్చీలో పట్టుచీర కుచ్చెళ్ళు నలక్కుండా నిండుగా కూచుంది భాగీరదమ్మ.

పద్మావతి హడావుడి పడుతూ కాఫీ తయారుచేసి తీసుకొచ్చింది

ఆ కాఫీ కప్పు చేతిలోకి తీసుకుని "ఇంతకూ ఇవి గేదె పాలేనా? బూత్ మిల్క్‌తో కాఫీ నేను తాగను.'' అంది దర్పంగా భాగీరదమ్మ.

"అయ్యో! గేదెపాలే! పొద్దుగున పిండిన పాలు!"

విన్న వించుకుంది పద్మావతి,

కాఫీ ఒక్కొక్క చుక్క తాగుతూ ప్రారంభించింది భాగీరథమ్మ...

"అందరూ అంటూంటే నమ్మలేకపోయాను. ఎలా నమ్ముతాను? నాకు మీ కుటుంబం చిన్నప్పటినుండీ తెలుసు! ఎలాంటి సంప్రదాయం! అలాంటిది మీ కోడలేమిటి? ఇలా చెయ్యటమేమిటి?"

పద్మావతికి చెమటలు పడుతున్నాయి.

"మా కోడలా? పావని...అది చాలా మంచిది—" అంది తడబడుతూ.

"ఏం మంచదండీ? గెడమంచి? చెడిపోయినా తప్పులేదని బాహాటంగా చాటుతూ చెడిపోయినవాళ్ళకోసం సమాజంకూడా పెడుతోందే!! హవ్వ! ఎక్కడైనా ఉందీ ఉండీ ఇదీ లోకంలో ఇంత రీతి నియమాలు నిలుస్తాయా? లోకం సంగతి వదిలెయ్యండి అగ్నిహోత్రంలాంటి కుటుంబం. మీ కుటుంబానికి ఇలాంటి మచ్చ? మీ ఇంటికోడలు 'ఆడది చెడిపోయినా పరవాలేదు. చెడతిరిగినా తప్పు లేదు' అని సమాజాలు స్థాపిస్తోంటే మీ అనుపమ నెవడు పెళ్ళిచేసుకుంటాడండీ? ఇంక ఊళ్ళో మీరు తలెత్తుకు తిరగ్గలరా? రామ! రామ!"

పద్మావతికి మతిపోయింది. మాట రావటంలేదు.

"మీరు నాకు మొదటినుంచీ తెలుసు. అందుకని పనికట్టుకొచ్చి చెప్పాను. లేకపోతే ఎవరెలాపోతే నాకేం? వస్తానండీ!" అని వెళ్ళిపోయింది భాగీరథమ్మ.

భాగీరథమ్మకి పావని అంటే ఒళ్ళుమంట...పావని ఏనాడూ భాగీరథమ్మ హరికథలను మెచ్చుకోదు. పైపెచ్చు ఆ హరికథల్లో ఆవిడ చెప్పే అసత్యాస్త్రాలన్నీ అందరికీ చెప్పి నవ్వుతుంది. పావనిపైన తన కసి తీర్చుకోవాలని భాగీరథమ్మ మనసు ఎంత ఉడికిపోతున్నా, ఇన్నాళ్ళుగా అవకాశంరాలేదు. హాస్యంలో పెట్టి విమర్శిద్దామన్నా వీలుకాలేదు. తానొకటంటే అదే మాటను తనమీదకే తిప్పి వెక్కిరించగలిగే చమత్కారం ఉంది పావనిలో...అందుకే శాస్త్ర తగ్గింది ఇన్నాళ్లూ ... ఇప్పుడు దొరికిన ఈ అవకాశాన్ని పూర్తిగా వినియోగించుకోవాలనుకుంది. సమాజం దేన్నైనా సహిస్తుంది. కానీ తన నియమాలను బాహాటంగా ధిక్కరించిన వాళ్ళను మాత్రం క్షమించదు. ఈ సమాజపు అండతో పావనిని సర్వనాశనం చెయ్యవచ్చును.

పావని రాగానే విరుచుకుపడింది పద్మావతి...

"ఏమిటే ? ఈ ఇంటి పరువు ప్రతిష్ఠలు మంటగలిపి కాని నిద్రపోవా ?"

సాధారణంగా తనను ఒక్కమాట అనని అత్తగారు తనమీద ఇలా విరుచుకు పడేసరికి పావని తెల్లబోయింది. ఆవిడ సహజంగా ఇలా మాట్లాడదు ఎవరో రెచ్చగొట్టి ఉండాలి

"భాగీరదమ్మ వచ్చిందా ఇక్కడికి ?"

"ఎవరొస్తేనేం ? ముందిదీ చెప్పు : ఆడవాళ్ళు చెడిపోయినా ఫరవాలేదని అంటున్నావుట ! అలా చెడిపోయిన వాళ్ళకోసమే సమాజం పెట్టావుట !... ఇదిదే, నువ్వు పెట్టిన సమాజం ?"

"ఆడవాళ్ళు చెడిపోయినా ఫరవాలేదని నేను అనలే దత్తయ్యా ! పరిస్థితుల ప్రాబల్యంవల్ల కొందరు, కొందరు తమ తప్పేమీ లేకపోయినా సమాజం ముందు దోషుల్లా నిలవవలసి వస్తోంది అలాంటి వాళ్ళను సమాజం బారినుండి రక్షించాలనీ, అసలు సామాజిక దృక్పథంలోనే మార్పుతేవాలనీ నే నంటున్నాను..."

పావని చెప్పిన మాటలు ఏ మాత్రం అర్థంకాలేదు పద్మావతికి...

"మొత్తంమీద నీ సమాజంలో ఉండేది చెడిపోయిన వాళ్ళేగా !" ంది కోపంగా...

ఆవిడకు ఎలా వివరించాలో పావనికి అర్థం కాలేదు.

"వాళ్ళు, పాపం, మంచివాళ్ళే అత్తయ్యా !"

"పెళ్ళికాకుండా కడుపులు తెచ్చుకున్నవాళ్ళూ, మొగుణ్నొదిలి బయటి కొచ్చినవాళ్ళూ, మంచివాళ్ళెలా అవుతారే పిచ్చిదానా ! ఏదో తెలిసీ తెలియక వెధవ సమాజం పెట్టావులే కాని, రేపటినుంచే ఆ సమాజం మూసిపారెయ్యి. మనలాంటి సంసారుల కిలాంటివి బాగుండవు."

తేల్చి చెప్పేసింది పద్మావతి పావని సమాధానం చెప్పలేదు. కానీ సమాజంతో తాను ఎదుర్కోబోయే సంఘర్షణ ఇంట్లోనే ప్రారంభమయిందని అర్థంచేసుకుంది...

దేనినైనా ఎదుర్కోవాలనీ ఎలాంటి త్యాగానికైనా సిద్ధపడాలనీ స్థిరంగా సంకల్పించుకుంది పావని...విఠల్ రాకకోసం ఆరాటంగా ఎదురుచూస్తూ కూచుంది ... తన మనసులో కలతలన్నీ విఠల్‌కు చెప్పుకుంటే కొంత ఊరట కలుగుతుంది.

విఠల్ ఆ రోజు రావటమే చికాగ్గా వచ్చాడు. అతడి ముఖం చూసి తన సమస్యలు చెప్పుకోవటానికి భయపడింది. భోజనాలవీ అయాక పడకగదిలో విఠల్ కరుగ్గా అడిగాడు...



"నువ్వు సమాజం స్థాపిస్తానన్నది చెడిపోయిన ఆడవాళ్ళకోసమా? ఆడవాళ్లు చెడిపోయినా ఫరవా లేదంటున్నావా?"

ఆ కంఠంలో కరుకుదనానికి విలవిలలాడింది పావని మనసు. విఠల్ సహితం ఇలా మాట్లాడితే ఇంక తన కెవరున్నారు? ఏదో మాట్లాడబోయినా మాట గొంతు పెగిలి రాలేదు. కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

పావనిని అలా చూడగానే కరిగిపోయాడు విఠల్.

"ఇవాళ క్లబ్‌లో అందరూ నీ సమాజాన్ని గురించే మాట్లాడుకున్నారు. ఒకరిద్దరు "ఏమిటోయ్? నీ మిసెస్, ఆడవాళ్ళు చెడిపోయినా ఫరవాలేదని ప్రచారం చేస్తోందటగా!" అని హేళనగా నవ్వారు. నేను భరించలేకపోయాను."

విఠల్ కాస్త అనునయంగా మాట్లాడేసరికి పావనికాస్త కూడదీసుకోగలిగింది.

"మన సరళలాగ ఏ ఆడపిల్లా సమాజానికి బలి అయిపోగూడదని నేను సంకల్పించుకున్నాను. అంతే! చెడిపోవటం మంచిదని నే నేనాడూ అనలేదు. అలా అర్థంచేసుకుంటే నేనేం చెయ్యగలను?"

"ఇలాంటి విషయాలను సమాజం ఏ నాడూ సరిగా అర్థంచేసుకోలేదు. అనవసరంగా అప్రతిష్టపాలవుతాము "

"ఒక మాట మనస్ఫూర్తిగా చెప్పండి. నేను చేస్తున్న పని చెడ్డదా ?"

"కాదనుకో ! కాని..."

"చాలు ! మీరు ఈ మాత్రం ఒప్పుకుంటే నేను అనుకున్నది సాధించగలను. ఎవరో అర్థంచేసుకోలేదని మనం మంచి అనుకున్నది మార్చుకోవాలా ?"

"అబ్బ ! మన కెందుకొచ్చిన గోల ఇది ? వదిలెయ్యరాదూ ?"

"ఎవరి మటుకు వారే మన కెందుకొచ్చిన దనుకొంటూ ఉంటే ఇంక ఈ సమస్యలు పరిష్కరించే వారెవరు ?"

విఠల్ సమాధానం చెప్పకుండా అటు తిరిగి పడుకున్నాడు పావని పలకరించబోయినా మాట్లాడలేదు. పెళ్ళయిన తరువాత మొదటిసారిగా విఠల్‌కి దూరంగా పక్కపరుచుకుని పడుకుంది పావని ఆ రాత్రి పావని కన్నీళ్ళతో దిండు తడిసిపోయింది. కాని పావని సంకల్పంమాత్రం చెక్కు చెదరలేదు.

## 7

పావని, శిరీష ప్రాణస్నేహితులు. శిరీష చదువుకునే రోజుల్లోనే ఎవరినో పెళ్ళిచేసుకోవాలనుకుంది. కుదరలేదు. ఆ తరువాత అసలు పెళ్ళి ప్రస్తావన వదిలేసింది. యమ్. యల్. ఏ. అయింది. శిరీష పేరులో ఉన్న కోమలత్వం శిరీష శరీరంలో మాత్రమే ఉంది కాని మనసుకి లేదు. చూడటానికి ఎంత నాజూగ్గా సుమారంగా ఉంటుందో. దానికి పూర్తిగా వ్యతిరేకమయిన వజ్ర సంకల్పం శిరీషది. దేనికీ భయపడని గుండె నిబ్బరం...ఎవరినీ లక్ష్యపెట్టని మనోదార్ఢ్యం.

తన సమస్య వివరిస్తూ శిరీషకు ఉత్తరం వ్రాసింది పావని ... వెంటనే వచ్చేసింది శిరీష...పావని చాలా ఆనందించింది.

"రాజకీయాల్లోకి దిగావు. నేను రమ్మనగానే వస్తావో, రావో, అనుకున్నాను," అంది.

"మా పావని వంటింటి కుందేలనుకున్నాను, ఇన్నాళ్లా - ఈ మాత్రం నడుంకట్టి సంఘంలో కష్టసుఖాలు చూస్తానంటే చెయ్యికలపకుండా ఉంటానా ! ఆప్యాయంగా అంది శిరీష.

"నిజంగా వంటింటి కుందేలునే శిరీషా! మా సరళ విషాదజీవితం నన్ను కట్టి కుదుపకపోతే, నేను ఏ విషయమూ ఆలోచించేదాన్ని కాదేమో!"

సరళను తలచుకోగానే కన్నీళ్ళు పెట్టుకుంటోన్న పావనిని మరిపిస్తూ "సరేలే! మొత్తంమీద చాలా మంచిపని తలపెట్టావు. కానీ, దీన్నొక పెద్ద సంఘంగా రూపొందిస్తే బాగుంటుంది. మన సంఘంలో ఈనాటికీ చదువుకోవాలనే ఆశ ఉండీ, చదువుకునే సదుపాయాలు లేని ఆడపిల్లలు చాలామంది ఉన్నారు. వాళ్ళందరినీ కూడదీసి చదువుకునే అవకాశాలు కల్పిద్దాం! వెనుకబడిన కులాలని ప్రత్యేకించి చూడకుండా కుల మతాలతో నిమిత్తంలేకుండా చదువుకోవాలనే ఆశ ఉన్న బీద విద్యార్థినుల నందరినీ చేర్చుకుందాం. వాళ్ళతోపాటు దగాపడిన చెల్లెళ్ళకి ఆశ్రయం కల్పిద్దాం! కేవలం దగాపడిన వాళ్ళేకాదు. ఏ విధమయిన సమస్యలున్నా మన సంఘంనుండి రక్షణ పొందవచ్చు... ఇలాకాక కేవలం వంచితులే అంటే "చెడిపోయిన వాళ్ళ సమాజం" అని ఇతరులు చిన్నచూపు చూచే అవకాశం ఇచ్చిన వాళ్ళం అవుతాము. అంతేకాదు. వాళ్ళను ప్రత్యేకించి "చెడిపోయిన వాళ్ళు" అని వేలెత్తి చూపినట్లు అవుతుంది. మనం అనుకున్న విధంగా అనేక విభాగాలతో కలుపుకుని సంఘంగా ఏర్పరచుకుంటే, సమాజం విధి వంచితులయిన స్త్రీలను సహజంగా స్వీకరించేలా చెయ్యాలనే మన ప్రయత్నం ప్రాథమికంగా మన దగ్గిరే ప్రారంభమవుతుంది..." అంది శిరీష.

శిరీష అభిప్రాయాన్ని పావని మెచ్చుకుంది. శిరీష మొదటినుండీ ఏ విషయమైనా అన్ని కోణాలనుండీ ఆలోచించేది. తన ధ్యేయం నెరవేరటానికి సామూహికమైన అండదండలు చాలా అవసరం – ముఖ్యంగా శిరీషలాంటి వ్యక్తి తనకు బాసటగా నిలబడితే ఏదైనా సాధించగలరు. సంఘం ఏర్పడ్డాక దానికి గ్రేంట్స్ సేంక్షన్ అయ్యేలాగ ప్రయత్నిస్తానంది శిరీష...

"పురోగామి" సంఘానికి చదువుకుంటామంటూ చాలా మంది ఆడపిల్లలు వచ్చారు. చుట్టుపక్కల పల్లెలనుంచి వచ్చిన ఆడపిల్లలు నాలుగువందలమంది దాకా ఉన్నారు. అంతమందిని చూసి ఆశ్చర్యపోయింది పావని జాగ్రత్తగా పరిశీలించి, కులమతాలతో నిమిత్తంలేకుండా, తెలివితేటలుండీ, చదువుకొనే స్థోమతులేని విద్యార్థినులను రెండువందలమందిని చేర్చుకుంది. విద్యార్థినులు కాని వాళ్ళు వేరు వేరు సమస్య లున్నవాళ్ళు కూడా ఒక పాతికమంది వచ్చారు. శిరీషతో సంప్రదించి వాళ్ళను కూడా చేర్చుకుంది పావని...ఒక్కొక్కరి గాథ

వింటోంటే స్త్రీ జీవితంలో ఎన్నెన్ని సమస్యలున్నాయో అర్థంకాసాగింది పావనికి ... ఇంతవరకూ సాధించిన అభ్యుదయం ఏపాటిదనే నిరాశ కూడా అలముకుంది.

"నా భర్త చచ్చిపోయాడు. ఆయనకు నేనంటే చాలా ప్రేమ. ఆస్తి నా పేరనే రాసాడు. ఆ డబ్బుకోసం నా మరుదులిద్దరు కాచుకుని కూచున్నారు— భర్త పోయిన దుఃఖంలోఉన్న నన్ను నా చిన్న మరిది బలవంతంగా పెళ్ళి చేసుకున్నాడు. అతడు నాకంటె చిన్నవాడు. మొదటినుంచీ నా బిడ్డలా చూసాను. ఈనాడు డబ్బుకోసం ఇంతటి నీచానికి తలపడ్డాడు. ఆ ఇంట్లో ఉండలేక పోయాను. సాహసించి వచ్చేసాను. నాకు తల్లీ, తండ్రీ లేరు. అన్నదమ్ముల కుటుంబాల్లో సర్దుకుని అణగి మణగి గతిలేనిదానిలా పడి ఉండటానికి నాకేం కర్మ కాలింది? ఒంటరిగా ఉంటే! "లేచి వచ్చిన మనిషి!" అని సంఘం పొడుచుకు తింటుందని భయం పెళ్ళికాకపోయినా ఫరవాలేదు మొగుడు చచ్చినా బాధలేదు. ఏదో ఒక మొగుడంటూ ఉండి ఆ బారినుండి బయట పడటానికి ఏ మార్గమూలేదు..." అంది పాతికేళ్లు నిండని ఒక యునితి.

"మేడమ్! పిల్ వేసుకుంటే ఫరవాలేదన్నారు. నర్స్ నడిగాను. పిల్స్ ఇచ్చింది. ఫరవాలేదనుకున్నాను. కానీ, కానీ, వచ్చేసింది, అదే - ప్రెగ్నన్సీ - భయమేసి మొదట్లో ఇంట్లో చెప్పలేదు. చెప్పకపోయినా తెలిసిపోతుందిగా! తెలిసిపోయింది - ఇంట్లోంచి పొమ్మన్నారు - ఇక్కడ ఉండనిస్తారా? నాకు చచ్చిపోవాలంటే చాలా భయం..."

కన్నీళ్ళతో. బెదురు చూపులతో, అజ్ఞానంతో, మాట్లాడటం కూడా సరిగా రాని ఒక పదహారేళ్ళ హైస్కూల్ విద్యార్థిని గోడు-ఫేమిలీ ప్లేనింగ్ పరిజ్ఞానం చివరికి ఇలా దారితీస్తోంది! సరిఅయిన విజ్ఞానం లేకపోవటంవల్ల కలిగే పరిమాణాలివి! ఈ అమాయకులకు ఎవరు చెప్తారు? స్కూల్స్‌లోకాని కాలేజెస్‌లోకాని చెప్పరు. ఇంట్లో అసలు చెప్పరు. అన్నింటికంటె దారుణం ఈ పిల్లలు ప్రెగ్నన్సీ రాకపోతే పరవాలేదనుకోవటం...అంతకుమించిన ప్రాధాన్యం ఈ ప్రణయ వ్యవహారాలకు ఇయ్యకపోవటం.

ఆ పిల్లలో చాంచల్యం స్పష్టంగా కనిపిస్తోన్నమాట నిజమే! కానీ, చిన్నపిల్ల, మొదటే ఇంట్లో పెద్దవాళ్ళుకాని. స్కూల్స్‌లో టీచర్లుకాని అదుపులో పెట్టి ఉంటే దారిలోకి రాకపోయేదా?

"అతడు నన్ను ప్రేమించానన్నాడు నేనూ ప్రేమించాను, తీరానెలతప్పాక, నా అసహాయ పరిస్థితిని ఆధారంగా చేసుకుని యాభై వేలు ఇస్తే కాని పెళ్ళి చేసుకోనంటున్నాడు. అలాంటి వ్యక్తితో నా బ్రతుకు ముడేసుకోవాలని నాకు లేదు. ఒక్క తాళిబొట్టే నా బ్రతుక్కు పరమార్థంకాదు. నేను భయపడుతున్నదీ, బాధపడుతున్నదీ, ఒకే ఒక విషయానికి... నా తొందరపాటుకి ఫలితం అశుభమూ శుభమూ తెలియని నా శిశువు అనుభవించవలసి వస్తుందేమోనని ... నన్ను మీరు పోషించక్కర్లెదు. చదువుకున్నాను, ఉద్యోగం చేసుకుంటాను. సమాజంలో నా శిశువు హీనపడకుండా ప్రతిఘటించటానికి మీ అండమాత్రమే కావాలి !"

ఒక ధీరారులి పశ్చాత్తాపం...

ఇలాంటివే ఎన్నెన్నో గాథలు... సమాజం నడవటానికి డబ్బు కావాలి. శిరీష గ్రాంట్స్ వచ్చే ప్రయత్నం చేస్తానంది. కానీ, ప్రభుత్వానికి సంబంధించిన వ్యవహారాలు ఏవీ అంతత్వరగా పరిష్కారం కావు—

తన ఆస్తి పదెకరాలుంది. అది సమాజంకోసం ఖర్చుపెట్టాలనుకుంది... ఈ అభిప్రాయాన్ని కుటుంబంలో ఎవరూ ఆమోదించలేదు

"నీ డబ్బు-నీ యిష్టం-" అన్నాడు విఠల్ పొడిగా...

"నా డబ్బు అని ఎప్పుడైనా స్వతంత్రంగా వ్యవహరించానా ?" నొచ్చుకుంటూ అంది పావని.

"ఏవో సమాజాలంటూ సొంతఆస్తి ఇలా తగలేసుకోవటం మంచిది కాదనే నా అభిప్రాయం "

"ఏదైనా సాధించాలని అనుకున్నప్పుడు అందులో సాధక బాధకాలను ఎదుర్కోక తప్పుతుందా ?"

"ఆ మాత్రం దానికి నన్నడగటం దేనికి ? సాధించు !" చిరుబురులాడుతూ వెళ్ళిపోయాడు విఠల్.

ఉసూరుమంది పావనికి... చదువుకున్నవాడు, విశాలభావాలున్నవాడు, తనను ప్రేమించేవాడు... విఠల్ ప్రవర్తనే ఇలా ఉన్నప్పుడు మిగిలినవాళ్ళు ఇంకెలా ఉంటారు ?

"ఏమి చేమిటీ ? ఆస్తి అంతా ఆ మాయదారి సమాజానికి ఖర్చుపెడతావా ? వీల్లేదు వీల్లేదంటే వీల్లేదు."

ఖండితంగా అంది పద్మావతి... అవిడంత ఖండితంగా అంటోంటే సమాన స్థాయిలో సమాధానం చెప్పక తప్పలేదు పావనికి.

"మీ నాన్నగారి ఆస్తిలో కలిసిన నాకు వచ్చిన కొంత భాగం ఇలా సద్వినియోగం చెయ్యాలని నిశ్చయించుకున్నాను అత్తయ్యా!" అంది దృఢంగా.

పావని ఇలా ఎదురునిలిచి సమాధానం చెప్పటం చూసి తెల్లబోయింది పద్మావతి. పట్టరాని కోపమూ వచ్చింది. అక్కడినుంచి లేచిపోయింది

కాలేజీలో ఉద్యోగం చేస్తున్నా, సమాజం వ్యవహారాలు చూసుకొంటున్నా ఇల్లు పనులన్నీ తానే స్వయంగా చూసుకునేది పావని...

ఆ రోజు ఎప్పటిలా ఫలహారం తెచ్చి అందియ్యబోతే, తీసుకోలేదు విఠల్... పావని అభిమానం గాయపడింది. తనచేతి ఫలహారం కూడా అందుకోకూడ నంతటి అపరాధం చేసిందా తను! రెండు నిముషాలు చూసి అక్కడి బల్లమీద పెట్టేసింది... ఆ టిఫిన్ తీసుకోనేలేదు విఠల్-ప్రత్యేకించి తల్లిని పిలిచి కాఫీ అడిగి త్రాగి వెళ్ళిపోయాడు.

పావని మనసు అశాంతికి నిలయమయింది ఎప్పటిలా పనిలో సాయం చెయ్యబోతే, "నాకేం వద్దులే! వెళ్ళు!" అని కసిరింది పద్మావతి. పావని కాలేజీకి వెళ్ళబోయే ముందు పద్మావతి దగ్గిరుండి వడ్డించి, బలవంతపెట్టి ఎక్కువ తినిపించేది. ఆ రోజు అన్నం తినమని కూడా అనలేదు. పావని భోజనం చెయ్యకుండానే కాలేజీకి వెళ్ళిపోయింది. కాలేజీలో స్నేహితులు ఏదో పెట్టబోయినా తినాలనిపించలేదు. వడిలిపోయిన ముఖంతో ఇంటికివచ్చి మంచంమీద పడుకున్న పావనిని చూసి పద్మావతికి కళ్ళలో నీళ్ళు తిరిగాయి—

"లే! లేచి అన్నానికి రా! నాకు ఆకలి మండిపోతూంది." అంది.

"ఇంతవరకూ మీరూ తినలేదా?"

"ఏం మాటలే! నువ్వు తిండి తినకుండా బయటికి పోతే, నేను కూచుని మెక్కుతా ననుకున్నావా?"

పావని గబ గబ లేచి ఇద్దరికీ కంచాలు పెట్టింది. భోజనం చేస్తూ పద్మావతి 'పావనీ! నా మాట వినవే! నీకేం తక్కువయింది? ఆ వెధవ సమాజం కోసం... ఎవరో చెడిపోయిన వాళ్ళకోసం పండులాంటి సంసారంలో కలతలు తెచ్చిపెట్టకు-" అంది దీనంగా...

"ఎందరికో ఆశపెట్టి సమాజం ప్రారంభించాను అత్తయ్యా! ఇప్పుడు దాన్ని ఎలా వదిలెయ్యగలను?"




పద్మావతి కోపంగా తింటున్న కంచంలో చెయ్యి కడుక్కొని వెళ్ళిపోయింది.

పావనికి ఆ తరువాత అన్నం సహించలేదు. ఒకప్పుడు తను గట్టిగా తలుచుకుంటే సరళను ఆదుకోగలిగేది. కానీ, ఇలాంటి పరిస్థితులకు భయపడి సరళను బలిపెట్టింది. ఇప్పుడు మళ్ళీ అలా వెనక్కు తగ్గవలసిందేనా? వీల్లేదు. ఎంతైనా భరిస్తుంది. దేన్నైనా ఎదుర్కొంటుంది.

## 8

"పూర్వం వేశ్యావాటికలు ప్రత్యేకించి ఉండేవి. ఇప్పుడలా కాదు. ఏవేవో సంఘాల పేరిట సమాజంలో కలిసిపోయి కనిపిస్తున్నాయి. ఉదాహరణ మన కళ్ళముందే ఉంది." పురోగామి సంఘం..."

హరికథలమధ్య పిట్టకథలో హాస్యంలా చెప్పేస్తోంది భాగీరదమ్మ.

పావని ఏనాడూ భాగీరదమ్మ హరికథలు వినటానికి వెళ్ళదు. అయినా పావని ఏం మాట్లాడినా భాగీరదమ్మకు చేరేసే భక్తులూ ఉన్నారు. భాగీరదమ్మ ఏం మాట్లాడినా పావనికి తెలియపరిచే శ్రేయోభిలాషులూ ఉన్నారు.

తమ సంఘాన్ని గురించి భాగీరదమ్మ ఇలా మాట్లాడుతోందని వినేసరికి పావనికి మండిపోయింది.

భాగీరదమ్మను ముఖాముఖి ఎదుర్కొంది...

"ఆడదానివయి ఉండీ సాటి ఆడవాళ్ళను గురించి ఇలా మాట్లాడటానికి సిగ్గులేదూ? వాళ్ళు నీచులే అయితే ఇలా సంఘంగా సమావేశమయి సమాజాన్ని ఎదుర్కోవలసిన అవసరమే ఉండేదికాదు. నీచులనేకులు పెద్దమనిషి ముసుగులతో సమాజంలో దర్జాగా తిరుగుతూనే ఉన్నారు..." అనేసింది.

పావని మాటలు సహించలేకపోయింది భాగీదరమ్మ.

"చూసావా? ఎంతెంత మాటలంటోందో? అవన్నీ నన్నే! నన్నే నీచురాలి నంటోంది..." అని ఉడికిపోయి తన భజన బృందాలన్నింటినీ ఉసికొల్పింది. ఆ భక్తులందరూ పావని మీదా, పురోగామి సంఘంమీదా చేయవలసినంత విష ప్రచారం చేసారు

బాధపడుతూ ఈ విషయాలన్నీ శిరీషకు వ్రాసిన పావనికి ధైర్యం చెపుతూ శిరీష సమాధానం వ్రాసింది...

"...ఒక్క భాగీరదమ్మకే బెదిరిపోతే నువ్వేం చెయ్యగలవు? ఈ సమాజం నిండా ఇలాంటి భాగీరదమ్మలు ఎందరో! ఒక మంచిని గ్రహించడానికీ మార్పును అంగీకరించడానికీ సమాజం ఏనాడూ ముందుకురాదు కాని, ఉన్న దానికి చిలవలు పలవలు చేర్చి విషయాన్ని అస్తవ్యస్తం చేసి పరిహాసంగా నవ్వ టానికి మాత్రం ఎప్పుడూ సిద్ధంగానే ఉంటుంది... నువ్వు పోరాడవలసింది కరడుగట్టిన మూర్ఖత్వంతోనని మరిచిపోకు... ఆదిమవాసుల అజ్ఞానాన్ని కరి గించటమైనా తేలికవుతుంది కాని, ఈ అత్యాధునికుల తెలివి మీరిన మౌఢ్యం మాత్రం ఎవరూ తొలగించలేరు. ధైర్యంగా నిలబడు..."

ఆ ఉత్తరం ఒకటికి పదిసార్లు చదువుకుని చెదిరిపోతున్న మనసును చిక్క బరచుకుంది పావని.

అనుపమకు సంబంధం నిశ్చయమయింది... పద్మావతికి పావని సమాజం మీద ఎంత కోపంగా ఉన్నా, తలలో నాలుకలా తన కూడా ఉండే పావనిని కష్టపెట్టలేక పోతోంది.

సాటి స్నేహితులు సమాజాన్ని గురించి అనే మాటలు విఠల్ సహించలేక పోతున్నాడు కానీ, పావని చేస్తున్నది తప్పని అనలేకపోతున్నాడు. ఈ సమా జపు గొడవలనుంచి పావనిని తప్పించాలని అతని కోరిక. కానీ, తన ఎదురుగా బేలగా నిలబడిన పావనిని కఠినంగా ఆజ్ఞాపించలేక పోతున్నాడు.

అన్ని విషయాలూ మాట్లాడుకుని నిశ్చితార్థానికి ముహూర్తం నిర్ణయించు కోవటానికి అనుపమ అత్తవారి తరఫువాళ్ళు వస్తున్నట్లు ఉత్తరం వచ్చింది...

పావని వంచిన నడుము ఎత్తకుండా అత్తగారికి వంటలూ పిండి వంటలూ చెయ్యటంలో సహాయంచేసింది...

"వదినా! ఏంచీర కట్టుకోమంటావ్?" అని సలహా అడిగే అనుపమకు నవ్వుకుంటూ చీర సెలక్ట్‌చేసి పెట్టింది. ఇల్లంతా నీట్‌గా సర్దింది. కుషన్ల కవర్లు మార్చింది. కోర్టునుంచి త్వరగా వచ్చిన విఠల్ పావనిని చూసి నవ్వుతూ "అంతా బాగానే ఉంది. నువ్వే పనిమనిషిలా ఉన్నావ్–త్వరగా తయారవు." అన్నాడు...

"నేను పని మనిషినే! పని చేసే మనిషిని. నన్ను అలా అనుకుంటే నాకేం చిన్నతనం లేదు..." అని నవ్వుతూ సమాధానం చెప్పి త్వర త్వరగా ముఖం కడుక్కుని ఇస్త్రీ చీర కట్టుకుని తయారయింది.

ఎదురుచూస్తున్న పెళ్ళివారు వచ్చారు. పావని హడావుడి పడుతూ ఫల హారాలు వాళ్ళముందు పెట్టింది. కానీ వాళ్ళు అవేమీ ముట్టుకోలేదు. వాళ్ళలో ఒక నడివయసు ఆవిడ మాట్లాడటం మొదలుపెట్టింది...

"మేం మర్యాదలకీ, మన్ననలకీ రాలేదు. అసలు విషయం చెప్పకుండా పోవటం సబబు కాదని వచ్చాం! మీ కుటుంబం ఆదర్శ చెడిపోయినా పరవాలేదనే కుటుంబమని తెలిసింది. అలాంటి చెడిపోయిన వాళ్ళకోసం సమాజాలు కూడా స్థాపించి సంఘసేవ చేస్తున్నారుట! ఆ సంఘసేవలేవో మీరే చేసుకోండి. మాకంత విశాలభావాలు లేవు. ఏదో సంసార పక్షంగా బ్రతకాలనుకునే వాళ్ళం... ఏ మాటా చెప్పకపోవటం బాగుండదని వచ్చాం–మీరు మరొక సంబంధం చూసుకోండి..."

వాళ్ళు వెళ్ళిపోయారు...

"నా కర్మ!" అంటూ పద్మావతి కూలబడి ఏడవసాగింది.

విఠల్ పావనిని తినేలా చూసి ఇంట్లోంచి వెళ్ళిపోయాడు. అనుపమ తన అలంకరణ తీసేసి ఒక పుస్తకం పట్టుకుని దాని చాటున ముఖం దాచుకుంది.

పావని స్తంభించిపోయింది.

ఆ రాత్రి చాలా పొద్దుపోయి ఇంటికి వచ్చాడు విఠల్. పావని వడ్డించిన భోజనాన్ని చేత్తో దూరంగా నెట్టి "భోజనం సంగతి తరువాత. ముందు నువ్విది చెప్పు. ఇప్పటికైనా, ఆ సమాజం, గిమాజం— ఎత్తి పారేస్తావా, లేదా?" అన్నాడు.

వావిలు మాట్లాడలేదు.

"మానవు కదూ !"

"మీకు తెలుసు, ఎందుకు మానలేనో..."

"అదంతా నాకు చెప్పకు. నువ్వు ఈ వ్యవహారాలన్నీ కట్టిపెట్టకపోతే నా ఇంట్లో ఉండటానికి వీల్లేదు——"

"...నా ఇంట్లో ఉండడానికి వీల్లేదు..." తలగిర్రున తిరిగింది పావనికి... తరతరాలుగా వస్తోన్న పురుషాహంకారం ! విఠల్ కూడా ఇంతేనా ? ఒక మామూలు మొగవాడేనా? 'నా ఇంట్లో ఉండటానికి వీల్లేదని' భార్యను అదలించే భర్త మాత్రమేనా !

అంతవరకూ జరిగిననానికి పావని తనూ కుమిలిపోతోంది. తనను తాను అపరాధిగా ఊహించుకొని మధనపడుతోంది. చెల్లెలి పెళ్ళి తప్పిపోయినందుకు బాధపడే విఠల్‌ను ఎలా అనునయించాలా అని లక్ష మార్గాలు ఆలోచిస్తోంది... కానీ, విఠల్ ఈ ధోరణి పావనికి బండతనాన్ని తెచ్చిపెట్టింది.

"మనం కలిసి ఉంటున్నాం ! అంతే ! నేను మీ ఇంట్లో మీ పోషణలో ఉండటంలేదు..."

నివ్వెరపోయాడు విఠల్. పావని ఇలా మాట్లాడగలదని ఊహించను కూడా లేదు అతను...

"ఎంత అహంకారం ? చదువుకున్న దానివని కదూ !" పావని నవ్వింది...

"ఆడది చదువుకోకుండా అజ్ఞానంలోనే ఉండి అయోమయంలో, అంధకారంలో బ్రతుకుతుంటేనే మీకు బాగుండేది కదూ !"

"నోర్మూయ్! చదువుకున్నంత మాత్రాన ఇలా అందరూ నీలా వీధిన పడటం లేదు."

"అవును. ఈ నాటికీ చదువుకుని కూడా అమ్మలక్కల స్థాయినుండి ఎదగని ఆడవాళ్ళే ఎక్కువమంది ఉన్నారు. తమకు కూడా ఒక వ్యక్తిత్వముందని అర్థంచేసుకున్న నాలాటివాళ్ళు ఒకరిద్దరుకంటె ఎక్కువమంది ఉండరు..."

"పావనీ ! నువ్వేనా ఇలా మాట్లాడుతున్నది ?"

"నాతోనే, మీరు ఇలా మాట్లాడుతున్నారు !"

"ప్రాణానికి ప్రాణంగా ప్రేమించిన నన్నే తిరస్కరించటానికి సిద్ధపడుతున్నావా ?"

"ప్రేమించారు, మీ అడుగులకు మడుగులొత్తినంతవరకూ, మీ మాట జవదాటనంత వరకూ మీరు ఆడుకునే బొమ్మని ఆప్యాయంగా చూసుకున్నట్లు



ప్రేమించారు... ఈనాడు మీరు అంగీకరించలేని ఒక అభిప్రాయం నాకుందని అనగానే నన్ను ఆక్షేపించి, అదలించి, బెదిరించి మీ నీడగా మార్చుకోవాలని చూస్తున్నారు..."

తెల్లబోయిన విఠల్ కొన్ని నిముషాలు మాట్లాడలేకపోయాడు. "ఓ! అయామ్ సారీ! పావనీ దేవిగారూ! నేను మీ అంత గొప్పవాణ్ణి కాను. అర్థపర్థం లేని సిద్ధాంతాలు పట్టుకుని నా బ్రతుకు నాశనం చేసుకునేటంత వెర్రి నాకు లేదు... మన దారులు కలవనప్పుడు మనం విడిపోవటమే మంచిదేమో!"

విఠల్ పరిహాస ధోరణికి పావని మనసు గాయపడింది...

"తప్పకుండా మంచిది. మనం విడిపోవటం వల్లనే మీరు సుఖపడగలనని అనుకుంటే అలాగే విడిపోదాం!"

"నా సుఖం సంగతి నేను ఆలోచించుకోవటంలేదు. పెద్ద కొడుకుగా కుటుంబం సుఖసౌఖ్యాల గురించి ఆలోచిస్తున్నాను..."

"ఈ ఇంటికి కోడలిగా వచ్చిన నాటినుండీ ఈ ఇంటి సుఖశాంతులనే కోరుతూ అందుకే పొటుపడుతూ వచ్చాను. ఈనాడు మాత్రం మీ అందరి సౌఖ్యానికీ అడ్డుగా ఎందుకు నిలుస్తాను? ఇప్పుడే వెళ్ళిపోతాను."

అంత రాత్రివేళ అప్పటికప్పుడు తన సామాను సర్దుకోసాగింది పావని.

ఒక్కమాట ఆగిపొమ్మని విఠల్ అంటే ఆగిపోవాలని ఉంది పావనికి...

పావని తనను వదిలి వెళ్ళిపోతుందని నమ్మలేక పోతున్నాడు విఠల్...

సమస్యలతో సతమతమయ్యే స్త్రీలకు ఆశ్రయంగా తాను స్థాపించిన 'పురోగామి' సంఘంలోకి తానే ఆశ్రితురాలిగా బయలుదేరింది పావని...

ఒక్కరోజు విఠల్‌కి దూరంగా సంఘంలో గడిపేసరికి జీవితమంతా మోడు వారిపోయినట్లు అనిపించసాగింది పావనికి... ఎంతటి కలతలైనా సహించి స్త్రీలు తమ సంసారాలు ఎందుకు వదులుకోలేరో అర్థంకాసాగింది...

ఆ సంఘంలో చదువుకునే ఒక విద్యార్థిని పావని దగ్గిరకొచ్చి "మేడమ్! మీ ఫేమిలీ అంతా ఏదో ఊరు వెళ్తున్నారు. స్టేషన్‌లో చూసానని ఇప్పుడే సరోజ చెప్పింది_" అని చెప్పింది.

పావని కళ్ళముందు అంధకారం అలముకున్నట్లయింది. కనిపించిన ఆటోలో కూర్చుని రైల్వేస్టేషన్ చేరుకుంది. రైలు ప్లాట్‌ఫాంమీద ఉంది. కంపార్ట్‌మెంట్ గేటుముందు నిలబడిన విఠల్‌ను చూసి "ఏవండీ!" అని పిచ్చిదానిలా కేక పెట్టింది పావని చెయ్యి జాపుతూ...విఠల్ కూడా చెయ్యి జాపాడు. అంతలోనే రైలు కూత కూసి కదిలింది. రైలు వెనుక పరుగు పెట్టినా విఠల్ చేతిని అందుకోలేకపోయింది పావని.

## 9

పావని పైనా, పావని ప్రారంభించిన ఉద్యమం పైనా పావని అత్త వారి కుటుంబానికెంత కోపం వచ్చిందో, అంతకు రెండురెట్లు మండిపడ్డారు పుట్టింటి వారు.

"అది అలా చచ్చింది. ఇది ఇలా చస్తోంది..." అని పావనిని చచ్చిన వాళ్ళలోనే జమకట్టుకున్నాడు జగన్నాథం.

"ఒక కూతురు కాకపోతే, మరో కూతురయినా సుఖపడుతుందనుకున్నాను. నా కర్మ! ఇద్దరి బ్రతుకులూ బండలయిపోయాయి." అని శోకాలు పెట్టింది సుందరమ్మ.

దేనికీ చలించలేదు పావని. తన కృషికి తన పుట్టింటి అండదండలుంటాయని పావని ఏనాడూ ఆశ పెట్టుకోలేదు...

ఏడాది నిండని పసివాడిని ఎత్తుకుని సంఘానికి వచ్చింది ఒక అమ్మాయి... ఇరవై ఏళ్ళు కూడా ఉండవనిపిస్తుంది లేతగా ఉన్న ఆ ముఖం చూస్తోంటే...

"నన్ను మీకు తెలియకపోవచ్చు. కానీ, మీరు నాకు బాగా తెలుసు నేను నళిని అక్కయ్యను..." అంది పావనితో...

నళిని తన అక్కయ్య గురించి చెప్పినదంతా గుర్తుకొచ్చింది పావనికి...అంత చిన్న వయసులోనే అన్ని అనుభవాలు ఎదుర్కోవలసి వచ్చిన ఆ పసిదాన్ని చూస్తే పావని మనసు కరిగిపోయింది.

"ఏం కావాలమ్మా?" అంది ఆప్యాయంగా...

"నా కథ వినే ఉంటారు... నన్ను నాశనంచేసిన ఆ దుర్మార్గుణ్ణి శిక్షించక పోగా ఎదురు నాకే శిక్షగా అతనికే నన్ను కట్టబెట్టారు. దానికి కూడా తల ఒగ్గాను. కానీ, ఆ దుర్మార్గం అంతటితో ఆగలేదు. చీటికీ మాటికీ మా నాన్న నడిగి నన్ను డబ్బు తెమ్మని వేధించటం మొదలయింది. 'నాకు లొంగిన దానివి. ఇంకా ఎంతమందికి లొంగావో?' అని సూటిపోటి విసుర్లు కూడా ప్రారంభమయ్యాయి. చూడండి! ఈ దారుణం! అతనికి నేను లొంగానట! అవును విచక్షణ జ్ఞానంలేకుండా కేవలం పాశవిక సౌఖ్యం కోసం ఒక ఆడ దాని బ్రతుకు సర్వనాశనం చెయ్యటానికి సిద్ధపడిన పశువుతో ఇంతకు మించిన సంస్కారం ఎలా ఉంటుంది! ఇంక ఈ నరకం నేను భరించలేను. మీ సంఘంలో ఉండిపోదామని వచ్చాను. ఏ పాపమూ ఎరుగని నా బాబుని సంఘం పొడిచి పొడిచి చంపుతుందేమో; అభాగ్యురాలే కాని, అపరాధి కాని తన తల్లిని దోషిగా చిత్రించే సంఘం తాకిడికి తట్టుకోలేని నా బాబు తనకు జన్మనిచ్చిన తల్లిని శపించుకోవలసిన దుర్గతి పడుతుందేమోనని ఇన్నాళ్ళూ సందేహించాను... కానీ, తన తల్లి దోషి కాదని నా బాబుకి చెప్పగలిగే సంఘం మరొకటి ఉందనే ధైర్యంతో వచ్చేసాను. నా బాబు పెరిగి పెద్దవాడయ్యాక 'లేచిపోయిన దాని కొడుకు' అని చిన్నచూపు చూడ ప్రయత్నించే మూర్ఖ సమాజాన్ని ఎదుర్కోగలిగే నైతికస్థైర్యం ఈ సంఘం అండదండలవల్ల లభిస్తుందనే ఆశతో వచ్చాను..."

'పురోగామి' సంఘంలో చేరటానికి వచ్చే ప్రతి అభాగ్యురాలిలోనూ తన

సరళే కనిపిస్తోంది పావనికి— కన్నీళ్ళతో ఆ బాబును తను అందుకుని "ఉండమ్మా! మా సంఘం ధ్యేయమే అది—" అంది.

కానీ, కొంచెం రోజుల్లోనే ఆ అమ్మాయికోసం భర్త వచ్చేసాడు.

అసహాయురాలై తననే ఆశ్రయించినంతకాలం కాల్చుకు తిన్న ఆ పురుష పుంగవుడు... సంఘానికి భయపడి స్త్రీ సహనాన్ని తెచ్చిపెట్టుకోవలసిందే అని ధీమాగా ఉన్న ఆ భర్త... మరొక చిన్న సంఘం అండదండలతో ఒక ఆశ్రయాన్ని పొంది తనను లక్ష్యపెట్టని స్త్రీముందు నిలవలేక పోయాడు...

"నన్ను క్షమించు. ఇంకెప్పుడూ నిన్ను కష్టపెట్టను. మన ఇంటికిరా!" అన్నాడు కాళ్ళ బేరానికి వచ్చి...

సంసారం వదులుకోవాలని ఏ స్త్రీకీ ఉండదు. తన భర్త ఈ మాత్రం కనీసపు మానవత్వం చూపించినా చాలనుకుని బిడ్డతో వెళ్ళిపోయింది నళిని అక్కయ్య...

ఈ విజయానికి చాలా ఆనందించింది పావని. వెంటనే శిరీషకి వ్రాసింది...

"ఆనాడు నువ్వు చెప్పిన ఆలోచన ఎంత మంచిదో, ఈనాడు అనుభవంలోకి వచ్చింది. సంఘమంటే ఏమిటి? మనమంతా కలిసిందే కదా! సాంఘికాచారాలూ మనం ఏర్పరుచుకున్నవే గదా! గొర్రెల మందలా ఒక గాడిలో పడి నడవటానికి అలవాటుపడ్డ జనం ఆ గాడి వదిలి మరొక మార్గం ... ఎంత మంచిదయినా సరే...అనుసరించటానికి భయపడుతారు...మనం కూడా మనదైన సంఘబలం ఏర్పరచుకోబట్టే ఈ మాత్రమైనా చెయ్యగలుగుతున్నాం...

తన చికాకులన్నీ మరిచిపోవటానికి పావని యంత్రంలాగ పనిచెయ్యసాగింది. శిరీష పావనిని ప్రోత్సహిస్తూ ఆ ఊళ్ళోనే కాక ఆంధ్రప్రదేశంలో అన్ని ప్రాంతాలలోనూ సంఘాలు స్థాపించి తమ ఉద్యమం వ్యాపించేలా చూడమని చెప్పింది. ప్రభుత్వంనుండి గ్రాంట్స్ సేంక్షన్ అవటానికి సహకరించింది. పావని వివిధ ప్రాంతాలకువెళ్ళి మీటింగ్స్ ఏర్పాటుచేసి తమ ఆశయాలను వివరిస్తూ ఉపన్యాసాలియ్యసాగింది. మొత్తంమీద ఈ విషయం అందరి దృష్టిలోకి వచ్చింది...కొందరు నవ్వారు. కొందరు భయపడ్డారు. చాలామంది వ్యతిరేక ప్రచారాలు ప్రారంభించారు. కొద్దిమంది మాత్రమే పావని ఆశయాలేమిటో సరిగా అర్థంచేసుకోగలిగారు. ఆ కొద్దిమందిలో ఇంకా కొద్దిమంది మాత్రమే అనుసరించటానికి సిద్ధపడ్డారు... ఈ ఫలితాలకు నిరుత్సాహపడలేదు పావని.

పద్మావతి దగ్గిరనుండి ఉత్తరం వచ్చింది పావనికి. తనకు చిరపరిచితమయిన ఆ దస్తూరి చూడగానే ఆనందంతో పొంగిపోయింది పావని మనసు...ఎంతగా

తనను తను మధ్యపెట్టుకున్నా, తన మనసు తన సంసారంకోసం ఎంతగా ఆరాటపడుతోందో అర్థమయి ఉసూరుమంది.

"చి॥ సౌ॥ పావనికి.

ఆశీర్వదించి వ్రాయునది. నువ్వు క్షేమమని తలుస్తాను. నువ్వులేని ఇల్లు ఇల్లు లాగే లేదు. ప్రతిక్షణం నువ్వు గుర్తువస్తూనే ఉన్నావు. అబ్బాయి సంగతి సరే సరి...ముఖంలో ఏ కోశానా కళకాంతులు లేవు...ఇదంతా ఎందుకో, ఏమిటో, నాకేమీ అర్థంకావటంలేదు.

ముఖ్యమయిన విషయం. చి॥ అనుపమకి ఒక మంచి సంబంధం కుదిరింది. కట్నం మాత్రం చాలా ఎక్కువ అడుగుతున్నారు. యాభై వేలు నువ్వు ఏమైనా సర్దుబాటు చెయ్యగలవా? దానికి పెళ్ళిఅయిపోతే నాకు నిశ్చింత. నిన్ను చూడా లని మనసు కొట్టుకుపోతోంది...

ఆశీర్వచనములతో,
అత్తయ్య..."

ఆ ఉత్తరం ఒకటికి పదిసార్లు చదువుకుంది పావని...

అనుపమకి త్వరగా పెళ్ళి కావాలనే పావని కూడా కోరుకుంటోంది...ఒక్క సారి వెళ్ళిపరిస్థితులు తెలుసుకురావాలని అత్తగారు ఇచ్చిన అడ్రస్ ప్రకారం తన ఇంటికి తను చుట్టంచూపుగా వెళ్ళింది...పావనిని చూసి పద్మావతి చాలా సంతోషించింది...

"నీ సంసారం నువ్వు చూసుకో తల్లీ! ఇదంతా ఈదటం నా వల్లకాదు" అంది గంటలో పదిసార్లు.

పావని నవ్వి ఊరుకుంది...అనుపమ పావనిని కౌగలించుకుని కన్నీళ్ళు పెట్టుకుంది.

"ఇంత చిన్న ట్రావెలింగ్ బేగ్‌తో వచ్చావు మళ్ళీ వెంటనే వెళ్ళిపోదామనే కదూ!" అంది నిష్ఠూరంగా.

"అక్కడ పనులు లేవా అనూ! అది సరే! నీ పెళ్ళిసంగతులు చెప్పు. పెళ్ళి కొడుకు నీకు నచ్చాడా,"

"ఆ సంగతి సరేలే వదినా! కట్నం సంగతి చూడు! యాభై వేలు కావాలిట! బాగుందా? ఇలా అయితే ఆడపిల్లగతి ఏమయిపోవాలి?"

"అంత బాధపడేదానివి, కట్నం తీసుకునే వాళ్ళను పెళ్లిచేసుకోనని చెప్పెయ్యి రాదూ!"

"హమ్మో! ఆడపిల్ల పెళ్ళి కాకుండా ఉండటం కష్టం వదినా! నాకు నీ అంత ధైర్యం లేదు."

అనుపమ మాత్రమే కాదు, ఆడపిల్లలంతా ఇంతే! అందరి కందరూ "హమ్మో! పెళ్ళిలేకపోతే ఎలా?" అనుకునేవారే! అందుకే ఈ సమస్యలు పరిష్కారం కావు...

"విఠల్ బేంక్‌లో ఇరవై వేలు మాత్రం వేశాడు. ఆ డబ్బు ఏ మూలకి? కట్నం, పెళ్ళిఖర్చులు...పావనీ! నువ్వు ఆ పొలం మూడెకరాలైనా అమ్మి డబ్బు పంపకపోతే లాభంలేదు." అంది పద్మావతి.

పద్మావతి ఉత్తరం అందుకున్న దగ్గిరనుండీ మనసులో పీడిస్తున్న అనుమానం బయటపెట్టింది పావని...

"మీ అబ్బాయి నన్ను డబ్బు అడగమన్నారా?"

ఆ ప్రశ్న వింటూనే పద్మావతి గుండె బాదుకుంది.

"అయ్యో! ఇంకా నయం. వాడు అడగమంటాడా? తెలిసిందంటే నన్ను తవ్వి పాతేస్తాడు. వాడికి తెలియనియ్యకు. మా అన్నయ్యదగ్గిరో ఎక్కడో, అప్పు తీసుకున్నానని చెపుతాను."

తన సొంత పొలం అమ్మి తను సహాయం చెయ్యాలి. ఆ విషయం విఠల్‌కి తెలియడానికికూడా లేదు. విఠల్‌ని బట్టి కాకపోతే, వీళ్ళంతా ఎవరు తనకి? తను ఈ కుటుంబంకోసం ఎంతగా పాకులాడుతోందో విఠల్‌కి తెలిసే అవకాశం లేకపోయాక సహాయం చెయ్యవలసిన అవసరం తనకేమిటి? విలవిలలాడింది పావని మనసు...

"ఇంతవరకూ మన అనుపమ పెళ్ళి ఎలా అవుతుందా అని తల్లడిల్లిపోతున్నాను. నువ్వు వచ్చావు. నాకు కొండంత బలంవచ్చింది. ఎలాగైనా ఆ డబ్బు పంపిస్తావు కదూ!"

"అలాగే" అన్నట్లు తల ఊపింది పావని...

సాయంత్రం విఠల్ వచ్చాడు. పావనిని చూడగానే అతని ముఖం వికసించింది. ఆ భార్యాభర్తల మధ్య తను ఉండటం ఇష్టంలేక ఏదోపని కల్పించుకుని వెళ్ళిపోయింది పద్మావతి.

"పావనీ!" అంటూ పట్టరాని ఆనందంతో పావనిని తన చేతులలో ఎత్తుకుని పడకగదిలోకి తీసికెళ్ళాడు విఠల్.

కిల కిల నవ్వింది పావని. విఠల్ గుండెల్లో తలదాచుకుని జన్మలో ఎప్పటికీ ఆ సౌఖ్యంనుండి దూరం కాకుండా ఉండగలిగితే బాగుండు ననుకుంది.




"పావనీ! ప్రతిరోజూ ఇంటికొస్తూ నేను ఇంటికొచ్చేసరికి నువ్వు నాకోసం నిరీక్షిస్తూ ఇంటి దగ్గిర ఉంటావని కలలు కనేవాణ్ని...ఇన్నాళ్ళకు నా కల నిజ మయింది..."

పావని చేతులు తన చెక్కిళ్ళకు అదుముకుంటూ ఆప్యాయంగా అన్నాడు విఠల్...పావని మాట్లాడలేదు విఠల్ గుండెలలోంచి కదలలేదు.

"నీ ధోరణిచూసి ఏ నాటికైనా ఆ పాడు సమాజాన్ని వదిలి నా దగ్గిరకు వస్తావనే నమ్మకం లేకపోయింది. అబ్బ! మళ్ళీ సమాజం గిమాజం అంటూ నా ప్రాణాలు తియ్యకు పావనీ!"

ఉలికిపడింది పావని. నెమ్మదిగా విఠల్ చేతులు విడిపించుకుని దూరంగా జరిగింది...

"పావనీ!..."

ఆశ్చర్యంగా చూశాడు విఠల్...

తనను తను అదుపులో పెట్టుకుని మాట్లాడటానికి కొన్ని నిముషాలు పట్టింది .పావనికి...

"నేను సమాజాన్ని వదిలి రాలేదు..."

"వదలలేదూ? అయితే ఎందుకొచ్చినట్లూ? ఏ అపఖ్యాతి భరించలేక ఉన్న పాటున ఊరు వదిలి పొరుగూళ్ళు పట్టానో, ఆ అపఖ్యాతి ఇక్కడికికూడా మోసు

కొద్దామని వచ్చావా? ఇక్కడయినా నన్ను స్థిమితంగా ఉండనియ్యదలుచుకో లేదా? ఇప్పటికయినా నా చెల్లెలి పెళ్ళిచేసుకోనియ్యవా?"

తన పావని తన దగ్గిర కొచ్చిందనే సంతోషం ఆవిరి కాగా కలిగిన ఆశా భంగం భరించలేక ఉద్రేకంతో అన్నాడు...

ఇంత అవమానం భరించలేకపోయింది పావని—

"నా చెల్లెలికి పెళ్ళిచేసుకోనియ్యవా?" అని అడుగుతున్నాడు...తనెందుకు రావలసివచ్చిందో తెలిస్తే...

"క్షమించండి. ఇప్పుడే వెళ్ళిపోతాను."

"వెళ్ళు—వెంటనేవెళ్లు—మళ్ళీ మళ్ళీ వచ్చి మానుతోన్న గాయాన్ని రేపకు...

అప్పటికప్పుడే ప్రయాణమయింది పావని. పద్మావతి కలవరపడుతూ "ఏమిటిరా ఇది? ఉండనీ!" అంది.

"అమ్మా! నువ్వూరుకో!" అని కసిరాడు విఠల్...

మొదటినుండీ మొగవాళ్ళ అధార్టీకి అలవాటుపడిన పద్మావతి...ఆ అధార్టీకి లొంగడమే నీతి అనుకునే పద్మావతి మళ్ళీ మాట్లాడలేదు. తన తరఫున అత్తగారు అలా బ్రతిమాలటంకూడా చిన్నతన మనిపించింది పావనికి...ఎవరితోనూ ఏమీ మాట్లాడకుండా తలవంచుకుని ఆ ఇంట్లోంచి బయటకొచ్చేసింది —

## 10

తన పొలం నాలుగెకరాలు అమ్మేసి నలభై వేలు పద్మావతికి పంపించింది పావని...

ఊళ్ళో చెలరేగే దుమారం భరించలేక విఠల్ తన ప్రాక్టీస్ మరో ఊళ్ళో ప్రారంభించినా రవిని మాత్రం చదువు పాడవుతుందని ఆ ఊళ్లోనే హాస్టల్లో ఉంచాడు. రవి ఒకటి రెండుసార్లు పావనిని డబ్బు అడిగాడు. కాదనలేక ఇచ్చింది పావని. కానీ రవి ఆ డబ్బు దుర్వినియోగం చేస్తున్నాడని తెలుసుకుంది. రవికి కొందరు రౌడీ స్నేహితులు పోగయ్యారు. పరీక్షల్లో కాపీకొట్టి పాసయిపోగలమనే ధీమా స్టూడెంట్స్‌లో ఏర్పడిపోయింది. అందేత చాలామంది పుస్తకాలు పట్టుకోవటంకూడా మానేసారు. వాళ్ళలో రవి ప్రముఖుడై పోయాడు. పావని దగ్గిర తీసుకున్న డబ్బుతో సినిమాలకూ హోటళ్లకూ తిరగటం మొదలు పెట్టాడు...

మరొకసారి రవి డబ్బు అడగటానికి వచ్చినప్పుడు పావని ఊరుకోలేక మందలించింది.

"రవీ! నీ జీవితంలో ఈ దశ ప్రధానమైన మలుపు. తెలివితక్కువగా జీవితం నాశనం చేసుకోకు...మళ్లీ మళ్లీ నీ కేరియర్ నిర్మించుకోవాలన్నా నీ వల్ల కాదు. ఆ రౌడీ స్నేహాలు మానెయ్యి..."

రవి అప్పటికే చాలా పొగరుబోతుగా తయారయ్యాడు. పావని దబ్బు ఇయ్యకపోగా, ఎదురు నీతులు చెప్పుకోవటం రవికి నచ్చలేదు.

"నాకు బుద్ధి చెప్పబోయేముందు నీ సంగతి నువ్వు చూసుకో! నలుగురూ నిన్నెంత నీచంగా అనుకుంటున్నారో తెలుసా! నువ్వు నా వదినవి అని చెప్పుకోవటానికి సిగ్గుగా ఉంది. ఏ ముఖం పెట్టుకుని నాకు బుద్ధులు చెబుతున్నావ్?" అనేసాడు.

నిర్ఘాంతపోయింది పావని. ఆ ముఖంచూసి ఒక్కక్షణం తప్పుచేసిన వాడిలా బాధపడినా, తప్పు ఒప్పుకోగలిగే స్థైర్యంలేక పొగరుగా వెళ్లిపోయాడు.

కాలేజీలో ఉద్యోగం...సమాజంపని...శిరీష ఏ ఊళ్లో మీటింగ్ ఏర్పాటు చేస్తే ఆ ఊరికెళ్ళి తమ ఆశయాల గురించి ఉపన్యాసాలివ్వటం ...ఇలా గడిచిపోతున్నాయి పావనికి రోజులు.

అనుపమ ఉత్తరం రాసింది...

"వదినా,

నా పెళ్లికి నువ్వు లేకపోవటం తలచుకున్నకొద్దీ నాకెంత బాధగా ఉందో రాయలేను. అన్యాయమని తెలిసీ అన్నయ్యను ఎదిరించలేని అశక్తురాలినయి పోయాను. నాఇంటికి నేను వెళ్లాక నిన్ను ఆహ్వానిస్తాను. నన్ను క్షమించి తప్పకుండా వస్తావుకదూ! ఎన్ని ఉన్నా నీ ఆశీర్వచనంలేని ఈ పెళ్లి నాకు వెలితిగానే ఉంది. కొంచెం రోజుల్లోనే నిన్ను నా ఇంటికి పిలిపించుకుని కరువుతీరా నీతో నాలుగురోజులైనా గడపగలననే ఆశతోనే ఈ నిస్పృహకు తట్టుకోగలుగుతున్నాను.

నువ్వెలా ఉన్నావు వదినా! అన్నయ్యను చూస్తే జాలీ, కోపమూ రెండూ కలుగుతున్నాయి. వెనుకటి మనిషే కాదు. ముఖంలో నవ్వు అన్నది లేదు. మళ్ళీ మిమ్మల్నిద్దరినీ జంటగా చూసే అదృష్టం మాకు కలగదా వదినా!

ఉంటాను.

ప్రేమతో,

నీ

అనుపమ..."

అనుపమకు పెళ్ళయిపోయిందన్న మాట ! ఆ పెళ్ళిదూరంనుంచి చూడటానికి కూడా తను పనికి రాకపోయింది పోనీలే! ఆ భార్యాభర్తలిద్దరూ అన్యోన్యంగా సంసారం చేసుకుంటే అంతే చాలు.

రామాపురంనుంచి వచ్చిన రైతు "అమ్మాయిగోరూ ! సిన్నమ్మాయిగోరు దేవతయి యెలిసినారండీ ! అయ్యగోరు గుడి కట్టించి నారండీ ! రేపు వుత్సవం జరుగుతాదండి. మీరు రాటంలేదండీ ?" అన్నాడు వుత్సాహంగా...

పావని తెల్లబోయింది. సరళ దేవతయిందా ? సరళకు గుడికట్టించారా ? ఉత్సవాలు కూడా చేస్తున్నారా ? తనను పిలవలేదు బహుశః దేవతగా వెలసిన సరళకు పూజలు చెయ్యటానికి తను పనికిరాదని కాబోలు !

కుతూహలం ఆపుకోలేక రామాపురానికి వెళ్ళింది. నిజంగానే జగన్నాథం గుడికట్టించి అందులో సరళ విగ్రహాన్ని ప్రతిష్టించాడు ... ఎవరికో సరళ దేవతలా కలలో కనపడి తనకు గుడి కట్టించమందిట ! తరువాత తరువాత సరళ దేవత అయినట్లు చాలా నిదర్శనాలు కనిపించాయట ! జగన్నాథానికి కూడా సరళ దేవతగా కలలో కనిపించి గుడికట్టించమని అడిగిందట...

పూజలు బ్రహ్మాండంగా జరుగుతున్నాయి. మొక్కులతో, కానుకలతో, జనం విరగబడి పోతున్నారు !

హరిబాబును నిర్దాక్షిణ్యంగా హత్యచేసిన జనం — సరళను నిలవనీయకుండా తరిమికొట్టిన జనం...సరళను గుళ్ళో నిలబెట్టి పూజలు చెయ్యటానికి అహమహమికతో ముందుకొస్తున్నారు !

ఇందులో వింత లేదేమో ! ఇది అనాదిగా వస్తోన్న కథేనేమో ! ఇంచుమించు ప్రతి గ్రామంలోను సజీవంగా ఉన్నప్పుడు సాంఘిక మౌఢ్యానికి బలిఅయిపోయి ప్రాణాలు పోయాక దేవతలుగా వెలసిన, స్త్రీమూర్తులు అసంఖ్యాకంగా కనిపిస్తోనే ఉన్నారుగా !

రాను రాను చదువుకుంటామంటూ 'పురోగామి' సంఘంలో చేరడానికి వచ్చే బీద విద్యార్థినుల సంఖ్య ఎక్కువ కాసాగింది. ఇంతమందికి వసతి కల్పించటానికి ప్రభుత్వం సేంక్షన్ చేసిన డబ్బు సరిపోదు. పావని తన పొలంమీద వచ్చిన డబ్బంతా సంఘంకోసమే ఖర్చు పెడుతున్నా ఖర్చులకి తట్టుకోవటం కష్టంగానే ఉంది ఇలాంటి సమయంలో నళినివచ్చి సంఘానికి మరొక అండగా నిలిచింది.




"మేడమ్ ! మీరు మా అక్కయ్యకు చేసిన ఉపకారం మరిచిపోలేను. ఈ సంఘానికి నేను, మా అక్క, మా కుటుంబం, ఎంతగానో ఋణపడి ఉన్నాం. ఈ సంఘ సహాయార్థం నేను డాన్స్ ప్రోగ్రామ్స్ ఇస్తాను," అంది.

శిరీష ఏర్పాటుచేసిన మీటింగ్‌లో ఉపన్యసించి వేదిక దిగిన పావనికి అమృతమూర్తిని పరిచయం చేసింది శిరీష.

"ఈయన చాలా కాలంగా నాకు పరిచితులు అభ్యుదయ భావాలు కలవాడు. సార్థక నామధేయులు-" అని.

అమృతమూర్తి పావనికి నమస్కారంచేసి "మీరు నడుపుతోన్న ఉద్యమం గురించి శిరీషగారి ద్వారా విన్నానండీ ! నిజమే ! ఈ నాటికీ సమాజంలో స్త్రీలు ఎదుర్కోవలసి వస్తోన్న అన్యాయాలకు అంతులేదు. మీలాంటివారు ఈ రకమైన సంస్కరణకి పూనుకోవటం ఎంతో సంతోషంగా ఉంది. మీ రొక్కసారి మా ఇంటికి రావాలి," అన్నాడు.

సాధారణంగా ఎవరింటికీ వెళ్లటం ఇష్టంలేని పావని "పని ఉంద"ని తప్పుకోబోయింది. కానీ అమృతమూర్తి బలవంతం చేసాడు. శిరీష కూడా వెళ్లమని చెప్పింది. శిరీష మాట కాదనలేక ఒప్పుకుంది పావని.

అమృతమూర్తితో అతని ఇంటికి వచ్చిన పావని ఆ ఇంట్లో అనుపమనిచూసి నిర్ఘాంతపోయింది...

"అనూ ! నువ్వు ఇక్కడ ఎందుకున్నావ్ ?" అంది.

అనుపమ పావనినిచూసి పాలిపోయిన ముఖంతో, వణుకుతోన్న పెదవులతో నోట మాటరాక నిలబడింది – అమృతమూర్తి ఆ ఇద్దరినీ ఆశ్చర్యంగా చూస్తూ

"మా అనుపమ మీకు తెలుసా? ఈవిడ నా భార్య. మీ కిద్దరకూ ఎలా పరిచయం? అనుపమ నాకెన్నడూ చెప్పలేదే!" అన్నాడు.

పావని పాలిపోయిన అనుపమ ముఖంలోకి చూస్తూ "ఏం అనూ! నీకు కూడా నేను వదినగా చెప్పుకోవటానికి పనికిరానా?" అంది.

అనుపమ తల మరింతగా భూమిలోకి దిగిపోయింది. అమృతమూర్తి మాత్రం హుషారుగా "వాట్! మీరు మా అనుపమ వదినగారా? అంటే నాకు అక్కయ్య అన్నమాట! వాట్ ఎ గుడ్ న్యూస్?" అన్నాడు.

పావనిలో ఉత్సాహమంతా హరించుకుపోయింది అనుపమ ధోరణి అంతు పట్టడంలేదు. ఇంతగా మారిపోతారా మనుష్యులు?

భోజనాల సమయంలో కూడా అనుపమ ఏం మాట్లాడలేదు. అమృతమూర్తి తానొక్కడే ఏదేదో మాట్లాడాడు. మర్యాదకు పావని సమాధానాలు చెప్పింది.

ఆ రాత్రి తన ఇంట్లో ఉండి మరునాడు వెళ్లమన్నాడు అమృతమూర్తి ... వెంటనే ఒప్పుకుంది పావని. అనుపమ దేనికో బాధపడుతున్నట్లుగా అనిపించ సాగింది పావనికి. అదేదో తెలుసుకోవాలనిపించింది.

ఒక రాత్రివేళ తన ప్రక్కన ఎవరో పడుకున్నట్లుగా తోచి మెలకువ వచ్చింది పావనికి ... అనుపమ చిన్నపిల్లలా ముడుచుకు పడుకుంది - ఆప్యాయంగా అనుపమమీద చెయ్యివేసి "అనుపమా!" అంది పావని ... ఆ మాత్రం అనునయానికే అనుపమ కరిగిపోయి పావని చేతుల్లో ముఖం దాచుకుని వెక్కివెక్కి ఏడ్చింది ... ఏదో మాట్లాడబోతున్న పావని నోటిమీద చెయ్యివేసి గట్టిగా నొక్కి మాట్లాడవద్దన్నట్లు సైగచేసింది.

ఆ మరునాడు అనుపమ ఏం జరగనట్లే నవ్వుతూ కాఫీలు అందించింది అందరికీ ... ఎన్నెన్నో అనుమానాలు మనసును పీడిస్తున్నా ఏమీ మాట్లాడ లేకపోయింది పావని...

అమృతమూర్తి పావనిని రైలెక్కించి "అప్పుడప్పుడు వస్తూ ఉండండి," అన్నాడు.

"అలాగే" అంది పావని.

తరువాత కొంచెం రోజుల్లోనే అనుపమ దగ్గిరనుండి పావనికి ఉత్తరం వచ్చింది...

"వదినా!

గుర్తుందీ? అన్నయ్యకు భయపడి ఊరుకున్నా నా ఇంటికి నేను వచ్చాక

నిన్ను పిలిపించుకుంటానని వ్రాసాను. కానీ, వదినా ఇక్కడికి వచ్చాక తెలిసింది, ఇది నా ఇల్లు కాదని...ఎప్పటికీ కాదని...ఇలా వ్రాస్తుంటే ఆశ్చర్య పోతున్నావు కదూ! అమృతమూర్తితో మాట్లాడిన వాళ్లెవరూ అతని అంత రంగాన్ని గురించి నేను చెప్పినది నమ్మలేరు. అతని పేరు నేతిబీరకాయ వదినా! ఆ పేరులో ఉన్న అమృతం మనసులో ఏ కోశానా లేదు. మేక వన్నె పులి ... పైకి మాట్లాడేవన్నీ అభ్యుదయసూక్తులు. లోలోపల అన్నీ ఛాందస భావాలు. నీలాంటి వాళ్లతో పైకి ఎంతో గౌరవమున్నట్లు మాట్లాడతారు. లోలోపల ఎంతో చులకన. ఇంకో భయంకర రహస్యం చెప్పెయ్యనా? కాస్త స్వతంత్రించి వ్యవహరించే స్త్రీల శీలంలో ఈయనకి నమ్మకంలేదు. పైకి అలాంటి వాళ్లని గౌరవిస్తున్నట్లు మాట్లాడుతూ స్నేహం చెయ్యటం, వాళ్ళు తనకి లొంగిపోతారనే ఆశతోనే!

ఇలాంటి వ్యక్తితో ఎలా కాపురం చేస్తున్నావని అడక్కు ... సంసారం వదులుకుని రాగలిగే సాహసం నాకు లేదు వదినా! జీవచ్ఛవంలా అన్నీ సహిస్తున్నాను. నా మీద కోపం తెచ్చుకోకు. జాలిపడు.

ఉంటాను.
ప్రేమతో
నీ
అనుపమ..."

ఉత్తరం చదువుకుని నిట్టూర్చింది పావని ... ఆ రాత్రి అనుపమ ధోరణిని బట్టి ఇలాంటిదేదో ఉంటుందని ఊహించింది ... "సంసారం వదులుకుని రాగలిగే సాహసం లేదు." అంటూ మౌనంగా ఎన్నెన్నో సహిస్తున్న వాళ్లెందరో ఉన్నారు. వాళ్లలో అనుపమ ఒకర్తి ... ఎవరుమాత్రం చెయ్యగలిగింది ఏముంది?

కేశవమూర్తి ఆ ఊళ్ళో కాలేజీకి కొత్తగా వచ్చిన లెక్చరర్. అతడు చాలా చక్కగా పాఠాలు చెపుతాడు. ఒక్క క్లాసుకూడా ఎప్పుడూ కేన్సిల్ చెయ్యడు. చక్కని విజ్ఞానముంది. తీరైన ఎక్స్‌ప్రెషన్ ఉంది. అంచేత అతనంటే తెలివైన విద్యార్థులకూ, కష్టపడి చదువుకునే విద్యార్థులకూ చాలా ఇష్టం ... స్ట్రిక్ట్‌గా ఉంటాడు. క్లాస్‌లో అల్లరి చెయ్యనియ్యడు. గోలచేసే విద్యార్థులను బయటకు పంపేస్తాడు. అంచేత అల్లరి విద్యార్థులకు అతనంటే ఒళ్ళుమంట.

కేశవమూర్తి పురోగామి సంఘానికి రెండు మూడుసార్లు వచ్చి పావనితో మాట్లాడాడు. పావనిపట్ల అతనికి చాలా గౌరవం ఏర్పడింది

యూనివర్సిటీ పరీక్షలు జరుగుతున్నాయి. వి. సి. ఆర్డర్స్ ప్రకారం కాలేజీలన్నీ కాపీలకు ఏమాత్రం అవకాశం ఇయ్యకుండా పరీక్షలు నడుపుతున్నాయి. కాపీలుకొట్టి పరీక్షలు వ్రాయటానికి అలవాటుపడ్డ విద్యార్థులు దీనికి తట్టుకోలేకపోయారు. కొందరు ఎంత మందలించినా వినకుండా మొండిగా కాపీలు కొట్టారు. అలాంటి వాళ్ళని నిర్దాక్షిణ్యంగా డిబార్ చేసేసారు.

ఆ రోజు కేశవమూర్తి ఇన్విజిలేటర్‌గా ఉన్న హాల్లో ఒక పదిమంది విద్యార్థులు కాపీకొట్టడానికి ప్రయత్నించారు కేశవమూర్తి ఆ ప్రయత్నం కొనసాగనియ్యలేదు. అప్పటికేం చెయ్యలేక ఊరుకున్న విద్యార్థులు కేశవమూర్తి కాలేజీ ఆవరణదాటి బయటికి రాగానే మీదపడి కొట్టారు. కేశవమూర్తికి బలమైన దెబ్బలు తగిలాయి. ఒంటిమీద స్పృహలేని దశలో అతణ్ణి హాస్పిటల్‌లో చేర్చారు...ఈ సంగతి పావనికి తెలిసింది. వెంటనే కేశవమూర్తిని చూడటానికి హాస్పిటల్‌కు వెళ్ళింది అతణ్ణి గవర్నమెంట్ హాస్పిటల్‌నుండి ప్రైవేట్ హాస్పిటల్‌కు మార్పించి తన ఖర్చుతో వైద్యం చేయించింది. అతనికి పూర్తిగా నయమయ్యేవరకూ రాత్రింబగళ్ళు తనే అతణ్ణి కనిపెట్టుకుని ఉంది.

తనమీద విద్యార్థులు ఒక గుంపుగా వచ్చి పడ్డారనీ, వాళ్లెవరో తను చెప్పలేననీ కేశవమూర్తి స్టేట్‌మెంట్ ఇవ్వటంతో, కేశవమూర్తిని కొట్టిన విద్యార్థులపై తగినచర్య తీసుకోవడం జరగలేదు.

ఈ సంఘటన ఖాగీరదమ్మకు కొండంత కొత్త బలాన్ని ఇచ్చింది.

"తన మొగుణ్ని వదిలేసింది. తనకంటె చిన్నవాడైన లెక్చరర్‌తో కులుకుతోంది. ఇదీ, స్త్రీ స్వాతంత్ర్యం పేరిట ఈ ఆధునిక మహిళలుచేస్తోన్న పచ్చి వ్యభిచారం"

అని ప్రచారం మొదలుపెట్టింది... మరొకరిమీద నేరాలు చెప్పుకుని మురిసిపోయే అమ్మలక్కల కేనాడూ సమాజంలో కొదువ లేదుగనుక క్షణాలలో ఈ వార్త చిలవలూ పలవలూ చేర్చుకుని వ్యాపించింది.

## 11

పావని వచ్చి వెళ్ళిన తరువాత అనుపమ పరిస్థితి మరింత క్లిష్టమయిపోయింది.



"ఓ! ఆవిడ నీ వదినగారన్నమాట? చెప్పవేం? ఆడది చెడిపోయినా పరవా లేదనే ఆవిడ నీకు వదిన! నీకూ ఆ సిద్ధాంతాలంటే ఇష్టమేనా?" అన్నాడు వెటకారంగా అమృతమూర్తి.

"నాకు ఏ సిద్ధాంతాలూ తెలియవు. అతి మామూలు ఆడదాన్ని నేను.' శాంతంగానే సమాధానం చెప్పింది అనుపమ.

"కాని, మీ వదిన అంటే ఇష్టమేగా! నేను కనిపెట్టానులే!"

తన వదిన... తమలో ప్రతి ఒక్కరినీ ప్రాణంగా ప్రేమించే వదిన అంటే తనకు అసహ్యమని చెప్పలేక పోయింది అనుపమ.

"ఛీ! ఛీ! సంప్రదాయమైన కుటుంబమని మోసపోయి చేసుకున్నాను..."

ఆ ఛీదరింపు సహించలేక పోయింది అనుపమ...

"అంత కాని పనులు ఇక్కడెవరూ చెయ్యలేదు," అంది రోషంగా.

"నోరు మూసుకో! కుటుంబానికి ఇంత మచ్చ పెట్టుకుని తగుదునమ్మా అని మాట్లాడుతున్నావు."

"మీ వదిన కెందరు బాయ్ ఫ్రెండ్స్ ఉన్నారు? నీకెందరున్నారు?"

అనుపమ సమాధానం చెప్పలేదు.

"ఎంత పొగరు? అడిగినదానికి సమాధానం చెప్పవూ?"

"ఏం చెప్పమంటారు ? నాకు తెలిసినంతవరకూ మా వదిన చాలా మంచిది... నన్ను కాలేజీకి తప్ప మరెక్కడికీ పంపేవారు కాదు మా ఇంట్లో. నాకసలు స్నేహితులే లేరు !"

"చాల్లే ! వేషాలు–మాది ఎలాంటి కుటుంబమో తెలుసా ? మా చెల్లెలికి పన్నెండేళ్ళు నిండకుండానే పెళ్ళి చేసాము."

గర్వంగా చెప్పుకుంటోన్న అమృతమూర్తి మాటలకు ఆశ్చర్యపోతూ "ఇంకా ఈ కాలంలో కూడా అలాంటి పెళ్ళిళ్ళు జరుగుతున్నాయా ?" అంది అనుపమ.

"నీ మొఖం. పల్లెటూళ్ళలోకి వెళ్ళి చూడు. వేల సంఖ్యలో కనిపిస్తారు. ఈ బోడి చదువులొచ్చి ఆడదాన్ని పాడుచేసేస్తున్నాయి."

హడలిపోయింది అనుపమ. సూటూ బూటూ వేసుకున్న ఈ నవ నాగరిక యువక మూర్తిలోనుండి, పాతరాతియుగపు మనిషి కోరలు జాపుతూ ప్రత్యక్షమవుతోంటే నిలవలేకపోయింది.

రోజూ సూటి పోటి మాటలతో సునసును తూట్లు పొడుస్తోంటే భరించలేకపోయింది అనుపమ. ఆ ఇంట్లో ఉండలేక పుట్టింటి కొచ్చేసింది.

అనుపమ చెప్పింది విని పద్మావతి సమాధానపడలేక పోయింది.

"ఇంత చిన్నవిషయానికి కాపురాలు కూలదోసుకుంటారుటే ! అతనేదో అనుకుంటాడు. నిన్ను కాదనుకుంటే పోలా ? ఆడదానివి. అన్నింటికీ ఇలా రాద్ధాంతం చేసుకుంటే ఎలా ?" అని అనుపమకే బుద్ధి చెప్పటం ప్రారంభించింది.

తల్లి పెద్దది. తనను అర్థంచేసుకోలేకపోయింది. కనీసం అన్న అయినా తనను అర్థంచేసుకుంటాడని ఆశపడి అన్నతో తన గోడు చెప్పుకుంది అనుపమ.

"ప్రతిరోజూ నన్ను సూటిపోటి మాటలతో పొడిచి పొడిచి కాని బయటకు కదలరు అన్నయ్యా ! అక్కడికీ, ఎంతో ఓర్చుకుంటాను. నేను ఓర్చుకున్నకొద్దీ ఆయన ధోరణి మరింత ఎక్కువయిపోతుంది. ఏ మాట అంటే నా మనసు ముక్కలవుతుందో అలాంటి మాటలంటారు. విని, విని భరించలేక నేను ఏడుస్తే అప్పుడు పైశాచికంగా నవ్వుకుంటూ వెళ్తారు. ఇంక ఈ నరకం నేను భరించలేను అన్నయ్యా ! నేను మనిషిని–నాకూ ఒక మనసుంది."

చెల్లెలి బాధ చూసి విఠల్ మనసు కరగక పోలేదు. కానీ అనుపమ భర్తను వదిలి పుట్టింట్లో ఉండిపోవటాన్ని మాత్రం హర్షించలేక పోయాడు.

"ఈ మాత్రం దానికే పుట్టింట్లో ఉండిపోతానంటే నలుగురూ నవ్వుతారు అనూ! నేను వచ్చి దిగబెట్టి మీ ఆయనకు నచ్చచెపుతానులే!" అన్నాడు.

సహజంగా సాత్వికురాలయిన అనుపమకు కూడా విఠల్ ధోరణికి కోపం వచ్చింది.

"నువ్వు ఎప్పుడూ ఇంతే అన్నయ్యా! ఏది మంచిదో గుర్తించగలిగీ కూడా నలుగురూ నవ్వుతారని భయపడతావు. ఈ భయంతోనే వదినను దూరం చేసుకుని కుమిలి పోతున్నావు."

తెల్లబోయి చూసాడు విఠల్.

తడబడింది అనుపమ.

"క్షమించు అన్నయ్యా! నీ దుఃఖం చూడలేకనే అన్నాను."

"సరేలే! రేపు నేనే నీతోవచ్చి బావగారికి నచ్చచెపుతాను," అన్నాడు విఠల్ ప్రస్తావన మారుస్తూ.

"వద్దన్నయ్యా! నువ్వేమీ నచ్చచెప్పక్కర్లేదు. అసలు ఎవరు నచ్చచెప్ప వలసినదీ ఏమీలేదు రేపటిదాకా ఎందుకు? ఇవాళే వెళ్లిపోతాను."

"అనూ! కోపం తెచ్చుకోకమ్మా నీ మేలు కోరి ఇలా అంటున్నాను కాని నువ్వు కష్టపడాలని నేను కోరుకుంటానా?"

"నాకు తెలును నన్నయ్యా! అందరూ మేలుకోరేవారే! కానీ, ఆ మేలు ఏమిటో మాత్రం ఎవరికీ తెలియదు."

అనుపమ కన్నీళ్ళలో కదిలే వ్యధ పూర్తిగా అర్థం కాలేదు విఠల్‌కి. ఆ సమయంలో అనుపమకి ప్రోత్సాహమిచ్చి తనదగ్గిర ఉంచుకోవటంకంటె నచ్చచెప్పి భర్త దగ్గిరకి పంపెయ్యటమే మంచిదనుకున్నాడు. కొంతకాలానికి కలతలు అవే సర్దుకుపోతాయని నమ్మాడు.

తన దగ్గిరకు తిరిగి వచ్చిన అనుపమను చూసి అట్టహాసంగా నవ్వాడు అమృతమూర్తి.

"తిన్నగా మీ వదిన సంఘంలోకి వెళ్ళకపోయావా? తిరిగి నా దగ్గిరకు వచ్చావేం?" అని ఇంటికొచ్చిన ఇల్లాలిని కుశలప్రశ్న వేశాడు.

పైట చెంగుతో కన్నీళ్ళు వత్తుకుంటూ లోపలకు నడిచే ఇల్లాలని సంతృప్తిగా సగర్వంగా చూసుకుని చిరునవ్వులు చిందిస్తూ బయటకు నడిచాడు.

## 12

సంఘంలో విద్యార్థినుల మధ్య ఏదో అలజడి అవుతోంచే అదేదో కనుక్కోవడానికి అక్కడికి వెళ్లింది పావని.

సీత అనే అమ్మాయి బిక్కముఖం వేసుకుని ఉంది. సరోజ రోషంగా బుసలు కొడుతోంది. పావని వాళ్ళమధ్యకు వచ్చి "ఏం జరిగింది? ఎందుకు గొడవ పడుతున్నారు?" అంది.

"నన్ను వీళ్ళతో సినిమాకు రావటానికి వీల్లేదంటున్నారు మేడమ్!" అంది దీనంగా సీత

సరోజ పొగరుగా అది పెళ్ళికాకుండానే కడుపుతో ఉంది. దానితో కలిసి సినిమాకు వెళ్తె మమ్మల్నిచూసి నవ్వుతారు" అంది.

పావని కళ్ళముందు చీకట్లు క్రమ్మాయి. కాళ్ళక్రింద భూమి కదిలింది. ఏ ఆశయ సిద్ధికై తను ఈ సమాజాన్ని స్థాపించి ఇంతగా కృషిచేస్తోందో ఆ ఆశయం తమ సమాజంలోనే, తన కళ్ళముందే ఇలా వికృతరూపంతో ప్రత్యక్ష మవుతోంది...

"సరోజా! నేను ఎన్నోసార్లు చెప్పాను. మళ్ళీ చెపుతున్నాను. సీత నీచు రాలు కాదు. అల్పబుద్ధులూ, నీచులూ, తమ అల్పత్వాన్ని రహస్యంగా అణచుకుని పెద్దమనుష్యులుగా చెలామణి అవటానికే ప్రయత్నిస్తారు. తమకు నెల తప్పిందనే విషయం దాచిపెట్టి పెళ్ళిచేసుకునేవాళ్ళూ, రహస్యంగా ప్రసవించి శిశువును అనాధశరణాలయాలకు అప్పగించి మరొకపెళ్ళి చేసుకునేవాళ్ళూ, సమాజంలో గృహిణులుగా గౌరవింపబడుతూనే ఉన్నారు. ఏదో ఒక పొరపాటు కారణంగా ప్రకృతి శాపానికి గురిఅయిన అమాయకులూ, విధివంచితలూ, సమాజంముందు దోషుల్లా నిలిచి పోతున్నారు వీళ్ళు సమాజానికి బలి కాకుండా చూడటమే మన ధ్యేయం. ఇంకొకసారి ఇలా మాట్లాడకు. అందరూ కలిసి సినిమాకు వెళ్ళండి..."

సరోజ అప్పటికి లొంగలేదు.

"మేం బీదవాళ్ళం. మీరు మాకు చదువు చెప్పించినంత మాత్రాన మా పరువు ప్రతిష్ఠలు వదులుకోమనటం న్యాయంకాదు," అంది.

పావనిలో సహనం నశించి అంతులేని కోపం వచ్చింది.

"సరోజా! పరువు ప్రతిష్టలు వదులుకోమనటంలేదు. అవి పెంచుకోమంటున్నాను. ముందు ఆ మాటలకు అర్థం తెలుసుకోమంటున్నాను. సీత ఏ విధంగానూ మీకన్న తక్కువది కాదు. తనమీద మీరెవరూ జాలి చూపించనూ అక్కర్లేదు. అసహ్యించుకోవలసిన అగత్యం అసలే లేదు. మా సమాజం ఆశయాలు ముందే అందరికీ స్పష్టంగా చెప్పాను. చెపుతున్నాను. ఆ ఆశయాలు గౌరవించనివాళ్ళు ఈ సమాజంలో ఉండక్కర్లేదు."

ఇటు సీత కన్నీళ్ళనూ, అటు సరోజ బొమముడినీ కూడా లక్ష్యపెట్టకుండా అక్కడినుంచి వచ్చేసింది పావని.

ఏమిటీ మనుష్యులు ? ఒక విషయాన్ని ఉన్నది ఉన్నట్లుగా ఎవరూ అర్థం చేసుకోరేం ? ఎందుకిలా వికృత రూపాలు కల్పిస్తారు ? దీని నెవరైనా కథగా వ్రాస్తే పాఠకులలో మాత్రం ఎందరు అసలు సమస్య అర్థంచేసుకుంటారు ?

ఎవరో వచ్చి విజిటర్స్‌రూంలో కూచున్నారని ఆయా వచ్చి చెప్పింది.

విజిటర్స్ రూంలోకివచ్చి అక్కడ కూచున్న విఠల్‌ను చూడగానే ఆర్తితో అతని దగ్గిరకు రాబోయిన పావని అతని ముఖంచూసి ఆగిపోయింది. దూరంగా కుర్చీలో కూచుంటూ ''ఇలా వచ్చారేం ?'' అంది మామూలుగా మాట్లాడటానికి విశ్వప్రయత్నంచేస్తూ.

విఠల్ కళ్లు ఎఱ్ఱగా మండుతున్నాయి.

''కేశవమూర్తిని స్టూడెంట్స్ కొట్టారటగా !'' అన్నాడు.

విఠల్ మాట్లాడదలుచుకున్నదేమిటో పావనికి అర్థమయిపోయింది. అప్రయత్నంగా పెదవులమీద చిరునవ్వు విరిసింది. ఆ చిరునవ్వుచూసి మరింత మండింది విఠల్‌కి

''అతణ్ణి నువ్వే హాస్పిటల్‌లో చేర్పించావా ? దగ్గిరుండి సపర్యలు చేసావా?''

''అవును !''

''ఓహో ! మీ సంఘం కార్యకలాపాల్లో ఇదీ ఒక భాగమా ?''

''కాదు.''

''అయితే నువ్వొక్కదానివీ ఇలా అందరికీ సేవలుచేస్తావు కాబోలు !''

''అందరికీ చెయ్యను ''

''అంటే ? ఇతడికి ఒక్కడికీ చెయ్యడానికి ప్రత్యేకమైన కారణముందా ?''

''ఉంది !''

''అదేమిటో తెలుసుకోవచ్చా ?''

పొంగి వస్తోన్న నవ్వును అణచుకుంటూ తన మాటలు జాగ్రత్తగా పేర్చుకుంది పావని.

''నా స్వార్థం.''

చివాలున లేచిపోయాడు విఠల్.

తిన్నగా కేశవమూర్తి రూంకి వెళ్ళాడు. తన గదికి వచ్చినదెవరా అని ఆశ్చర్యంగా చూస్తోన్న కేశవమూర్తిని చాచి లెంపకాయ కొట్టాడు. బిత్తరపోయిన

కేశవమూర్తి క్షణాలలో తేరుకుని మళ్ళీ చెయ్యెత్తిన విఠల్ రెండుచేతులూ గట్టిగా పట్టుకున్నాడు. తనచేతులు వదిలించుకోవటం విఠల్‌కి సాధ్యం కాలేదు.

"మిస్టర్ ! మీరెవరో నాకు తెలియదు-నేను బాక్సింగ్‌లో ట్రైనింగ్ అయిన వాడిని. తలుచుకుంటే మిమ్మల్ని చావ బాదెయ్యగలను. కానీ నిష్కారణంగా నన్ను వెతుక్కుంటూ వచ్చి ఇలా ఎందుకు సన్మానించాలనుకున్నారో, వివరంగా చెప్పండి" అన్నాడు కేశవమూర్తి.

"నా చేతులు వదలండి. మీరు నన్ను చంపినా నాకు బాధలేదు. మీరో, నేనో ఎవరో ఒకరం చావటమే నాకు కావలసింది."

"అమ్మ బాబోయ్ ! పాకం చాలా ముదిరింది. నా అపరాధమేమిటో తెలుసుకోవచ్చా ?"

"తన భార్యను ప్రేమించిన వ్యక్తిని ఎవరూ క్షమించలేరు."

"మీ భార్యను నేను ప్రేమించానా ? అన్యాయం. ఎవరి భార్యనూ నేను ప్రేమించలేదు. ఇద్దరు ముగ్గుర్ని సెలెక్ట్ చేసుకున్నాను. కానీ ఎవరిని ప్రేమించాలో ఇంకా నిర్ణయించుకోలేదు. వాళ్ళలో ఇంకా ఎవరికీ పెళ్లి కాలేదు."

"లోకం కోడై కూస్తోంటే మీరు దబాయించి ప్రయోజనం లేదు."

"లోకం... కోడి... కూత... మైగాడ్ ! మీరు పావనిగారి భర్తగారా ?"

ఈ మాటలంటోనే విఠల్ చేతులు వదిలేసాడు కేశవమూర్తి... మళ్ళీ చెయ్యి ఎత్తలేదు విఠల్-కేశవమూర్తి దగ్గరకి ఎంత ఉద్రేకంతో వచ్చాడో అదంతా తగ్గిపోయి ఏదో సిగ్గు, సంకోచం కలగసాగాయి.

కేశవమూర్తి చాలా చిన్నవాడు. కొత్తగా డిగ్రీ తీసుకుని లెక్చరర్‌గా జాయిన్ అయినట్లున్నాడు. తన వయసూ, తన విజ్ఞానం, ఏమయిపోయాయి? తన పావని మరొకరిని ప్రేమించిదనుకోవటం అంత పిచ్చివాణ్ణి చేసిందా తనను ?''

"వెళ్తాను" అంటూ వెళ్ళపోయాడు విఠల్...

"అరెరె! ఉండండి! ఏదో అడగటానికి వచ్చి ఏదీ తేల్చుకోకుండానే వెళ్లిపోతున్నారేం?"

"అయామ్ సారీ! ఏమిటో పిచ్చెక్కినట్లే ప్రవర్తించాను. ఒకవేళ పావనీ మీరూ ప్రేమించుకున్నా ప్రశ్నించే అధికారం నాకేముంది?"

"శభాష్! పావనిగారు మిమ్మల్ని సరిగానే అర్థంచేసుకున్నారు. కొంచెమే పొరపాటుపడ్డారు."

"ఏమిటి?"




"ఆవిడ హాస్పిటల్లో నా దగ్గిరే ఉన్నప్పుడు 'లోకం ఊరుకోదు' అన్నాను నేనే... 'నిష్కారణంగా ఈ లోకం నన్నెప్పుడో నిందలపాలు చేసింది. నా భర్త మాత్రం నన్నెప్పుడూ అపార్థంచేసుకోరు.' అన్నారు...పావనిగారు వర్ణించిన విశాల హృదయం మీలో కన్పిస్తోంది. కానీ లోకం మాటలకు లొంగిపోయే బలహీనత కూడా కన్పిస్తోంది. అసలిందుకే ఆవిడని దూరంచేసుకున్నారేమో!"

"లోకం మాటలకు లొంగిపోయి కాదు. పావని స్వయంగా చెప్తే సహించలేకపోయాను..."

'ఏం చెప్పారు?"

"మీకు సేవచెయ్యటంలో తన స్వార్థం ఉందని అంది."

"అదా..." పకపకా నవ్వాడు కేశవమూర్తి

"ఆ మాటలు అక్షరాలా నిజం!" అన్నాడు.

తెల్లబోయి చూస్తోన్న విఠల్‌కి వివరంగా చెప్పాడు.

"ఆ రోజు నన్ను కొట్టిన గుంపును లీడ్ చేసింది మీ తమ్ముడు రవి. నన్ను కొట్టింది తన మరిది కావటంవల్ల నన్ను ఆదుకోవటం తన నైతికబాధ్యతగా భావించారు పావనిగారు. ఊళ్ళో పుకార్లు చెలరేగుతాయని తెలిసీ లెక్కచెయ్యకుండా ఒక అక్కలాగ నాకు తోడుగా ఉన్నారు. ఆవిడమీద ఉండే గౌరవంతోనే నేను రవిమీద రిపోర్ట్ ఇవ్వలేదు. నేను రిపోర్టు ఇచ్చి ఉంటే అది రవి

భవిష్యత్తుమీద దెబ్బతీసి ఉండేది. నేను రిపోర్టు ఇవ్వకపోవటం రవిలోకూడా పరివర్తన కలిగించింది.

...తనలాంటి అనేకమంది రౌడీలు డిబార్ కావటంకూడా అతనికి కను విప్పు కలిగించి ఉండవచ్చును. నా దగ్గిరికి వచ్చి క్షమార్పణ చెప్పుకుని సప్లి మెంట్‌కి బాగా చదువుతానని చెప్పాడు. ఇప్పుడిప్పుడు రవితోపాటు కొందరు విద్యార్థులు పుస్తకాల బూజు దులుపుతున్నారు—ఇదే నాకు సేవచేయటంలో పావనిగారి స్వార్థం..."

మ్రాన్పడిపోయి కూచున్నాడు విఠల్.

సంఘం చులకనగా మాట్లాడే మాటలకు తట్టుకోలేక తనే పావనిని తనకు దూరంగా తరిమాడు. అయినా పావని ఈనాటికీ తన తమ్ముడిని బాగుచెయ్యా లని తాపత్రయపడుతోంది...అలాంటి పావనిని, 'నా భర్త నన్ను అపార్థంచేసు కోరు' అని నిబ్బరంగా అనగలిగిన పావనిని...క్షణికంగానయినా ఎలా ఊహించు కున్నాడు తను? తనను తనే అసహ్యించుకున్నాడు విఠల్

పావనిని క్షమార్పణ కోరుకోవాలనీ, తిరిగి తన దగ్గిరకు రమ్మని ప్రాధేయ పడాలనీ సంఘానికి బయలుదేరాడు విఠల్. అప్పటికే పొద్దుటోవటంవల్ల గేటు మూసేసారు. చౌకీదార్ లోపలికి వెళ్ళడానికి వీల్లేదన్నాడు.

"విఠల్‌వచ్చాడని చెప్పు, అమ్మగారు తప్పకుండా రానిస్తారు," అన్నాడు విఠల్...

నిద్రపోతున్న ఆయాని లేపి పావని దగ్గిరకి కబురు పంపించాడు చౌకీదార్.

ఆయా తిరిగొచ్చి "అమ్మగారు ఇప్పుడెవరినీ చూడటానికి వీల్లేదన్నారు" అని చెప్పింది.

"విన్నావ్‌గా? వెళ్ళు" అన్నాడు చౌకీదార్.

విఠల్ వెంటనే కదలలేక పావని గదిలో వెలుగుతోన్న లైట్‌ని చూస్తూ నిల్చున్నాడు.

''అలా నిల్చుంటావేమయ్యా? కదులు!'' అని అదలించాడు చౌకీదార్... చేసేదిలేక వెళ్ళిపోయాడు విఠల్...విఠల్ వెళ్ళిన ఒక నిముషంలోనే గేటు దగ్గిరకొచ్చి కన్నీళ్ళతో దూరమవుతోన్న అతని మూర్తిని చూస్తూ నిల్చున్న పావనిని విచిత్రంగా చూసాడు చౌకీదార్.

## 13

విఠల్ ఇంటికి చేరుకునేసరికి అంతా గందరగోళంగా ఉంది. పద్మావతి కుమిలి కుమిలి ఏడుస్తోంది. జీవంలేని ముఖంతో వెంకట్రావు పడకకుర్చీలో కూచున్నాడు.

"ఏం జరిగింది?" అని అడిగిన విఠల్ చేతిలో టెలిగ్రాం పెట్టాడు వెంకట్రావు...

"అనుపమ కనపడటంలేదు. వెంటనే బయలుదేరి రండి...అమృతమూర్తి."

ఉన్నవాడు ఉన్నట్లుగా బయలుదేరాడు విఠల్.

విఠల్‌ను చూసి "బావగారూ! నా అనూ నన్ను అన్యాయంచేసి వెళ్లిపోయింది" అని ఏడ్చాడు అమృతమూర్తి. ఆ ఏడుపు చూస్తోంటే జాలికలగలేదు సరికదా, అసహ్యంవేసింది విఠల్‌కి...

"ఏం జరిగిందో వివరంగా చెప్పండి..." అన్నాడు.

"ఏముందండీ! ఇటీవల స్త్రీ స్వాతంత్ర్యం అంటూ ఇదొక వేలంవెర్రి బయలుదేరింది. ఊ అంటే తప్పు—ఆ అంటే తప్పు...ఇంట్లో రోజూ నరకమే! అయినా సహించాను చివరకు ఇంతకు తెగించింది."

అనుపమ తన చెల్లెలు కాకపోతే, చిన్నప్పటినుండీ అనుపమ ఎంత సాత్వికుతాలో విఠల్‌కి తెలియకపోతే అమృతమూర్తి మాటలు నమ్మేవాడే!

అంతగా నమ్మించేలా ఉంది అమృతమూర్తి చెప్పినతీరు...

"అనుపమ ఉత్తరమేదీ వ్రాయలేదా?"

తడబడ్డాడు అమృతమూర్తి!

"వ్రాసింది. వ్రాసింది..." అంటూ అనుపమ వ్రాసిన ఉత్తరం విఠల్ చేతికిచ్చాడు...

"ప్రియమైన శ్రీవారికి,

ఇప్పటికీ ఇలాగే సంబోధిస్తున్నాను. నేను మీకు ప్రియమైనదాన్ని అయినా కాకపోయినా మీరు మాత్రం నాకు ఎప్పటికీ ప్రియమైనవారే! మీతో సర్దుకుపోవాలనే విశ్వప్రయత్నం చేసాను. కానీ నేను ఏంచేస్తే మీకు సంతోషం కలుగుతుందో, ఎలా ఉంటే మీకు సంతృప్తి కలిగించగలనో, ఇన్నిరోజుల సాంసారిక జీవితంలో నాకేనాడూ అర్థంకాలేదు. నేను ఏంచేసినా మీకు తప్పుగానే తోస్తుంది. ఎలా ఉన్నా అపరాధమే ననిపిస్తూంది. నా మనసు బండరాయిచేసుకోవాలని ఎంతగా ప్రయత్నించినా ఇంకా అది మనసుగానే మిగిలిపోయింది. మీరు మాట

లతో పొడిచే తూట్లకది తట్టుకోలేకుండా ఉంది...బ్రతికి ఉండి మిమ్మల్ని ఎదిరించే సాహసం లేకపోయింది. చచ్చి దెయ్యాన్నయి మీ అన్యాయం మీకు వివరించగలనేమో!

శాశ్వతంగా సెలవు తీసుకుంటున్నాను.

మీ

అనుపమ..."

ఉత్తరం చదువుతోన్న విఠల్ కళ్ళలోనుండి కన్నీరు జలజల ప్రవహించింది. ఆ ముఖం చూస్తూ ఏం మాట్లాడటానికీ సాహసం కలగలేదు అమృతమూర్తికి. విఠల్ నిగ్రహించుకుని "ఇందులో చచ్చిపోతున్నానని వ్రాస్తే మీరు ఎక్కడికో వెళ్ళిపోయిందంటారేం?" అన్నాడు.

అమృతమూర్తి గుటకలు మ్రింగి "ఎక్కడా శవం కనపడలేదు...అందుకని ..." అన్నాడు.

"మీరు ఎక్కడెక్కడ వెతికారు?"

"చుట్టుపక్కల అనుమానమున్న చోట్లన్నీ వెతికాను."

"అనుపమ సంగతి నాకు బాగా తెలుసు. ఒక్కర్తే ఎక్కడికైనా వెళ్ళి ఉండగలిగే సాహసం అనుపమకు లేదు."

"ఆ సంగతి నాకూ తెలుసు. కానీ వాళ్ళ వదినగారి దగ్గిరకు వెళ్ళిందేమో నని..."

ఆ అనుమానం విఠల్‌కూ వచ్చింది.

"వెళ్ళిచూద్దాం రండి!" అన్నాడు.

తన సంఘానికి వచ్చిన విఠల్ అమృతమూర్తులను ఆశ్చర్యంగా చూస్తూ "బావమరుదులిద్దరూ ఇలా వచ్చారేం?" అంది పావని.

విఠల్ మాట్లాడలేకపోతున్నాడు. అమృతమూర్తి తనే గొంతు పెగుల్చుకుని "అనుపమ కనపడటంలేదు ఇక్కడికి వచ్చిందేమోనని..." అన్నాడు.

"అనుపమ ఇక్కడికి వస్తుందా? ఇక్కడికి రావటం వాళ్ళ అన్నగారి కిష్టం ఉండదని అనుపమకు బాగా తెలుసు. అన్నగారి కిష్టంలేని పని అనుపమ ఎన్నడూ చెయ్యదు. ఈ సంగతి నాకంటే ఆయనకే బాగా తెలుసు..."

విఠల్ మాట్లాడలేదు. మళ్ళీ అమృతమూర్తే సమాధానం చెప్పాడు.

"ఒక్కర్తీ ఎక్కడకూ వెళ్ళదు. మీదగ్గిరకి తప్ప మరొక చోటికి వెళ్ళే అవకాశమే లేదు. ."



"పొరపాటు పడుతున్నారు. నా దగ్గిరకు వచ్చే అవకాశం అసలు రాదు. నా దగ్గిరకు వస్తే వాళ్ళ అన్నయ్యకు నలుగురిలో చిన్నతనం...తన చెల్లెలు చచ్చి పోయినా ఆయన భరించగలరు కాని బ్రతికిఉండి నలుగురిలో నవ్వులపాలుచేస్తే భరించలేరని అనుపమకు తెలుసు...అందుకే చచ్చిపోయి ఉంటుంది."

ఎర్రగా మండుతోన్న కళ్ళతో కసిగా అంది పావని...

"పోనీ, ఒక్కసారి లోపలచూస్తే..." సాహసించి అన్నాడు అమృత మూర్తి...

పావని చీదరించుకుంటూ "చూసుకోండి!" అంది.

విఠల్ కదలలేదు, కానీ, అమృతమూర్తి చొరవగా లోపల అంతా చూసి వచ్చాడు.

పావని నీరసంగా "నమ్మకం కుదిరిందా? ఏం మనుషులు? అనుపమలాంటి సాత్వికురాలు ఎదిరించి నిలబడటానికి కూడా ప్రయత్నిస్తుందా? నిలువునా ప్రాణంతీసుకుంటుంది గాని..." అంది.

"శవం కనపడలేదు." అన్నాడు అమృతమూర్తి.

"కనపడుతుంది ఎప్పుడో, ఏ చెరువులోనో, ఏ రైలుపట్టాల కిందో... ఆకారంకూడా తెలియకుండా మారిపోయి కనిపిస్తుంది. ఆ శవం మన అనుపమదే నని మనకు చెప్పేవాళ్లకూడా ఉండరు. ఎవరో ఈడ్చి పారేస్తారు."

శరీరం జలదరించింది అమృతమూర్తికి...వినలేకపోయాడు విఠల్.

"అలా మాట్లాడకు పావనీ! అనుపమ ఎక్కడో బ్రతికే ఉందేమో!"

"బాధపడుతున్నారా? బాధపడండి. మీ బాధ చూస్తే నాకు జాలిలేదు. అనుపమ బ్రతికి ఉందని ఆశపడుతున్నారా! బ్రతకటానికి ఏ మాత్రం అస్కారం కల్పించారని బ్రతుకుతుంది? తన వారంటూ ఉన్నారని కష్టసుఖాలు చెప్పుకుంటే అండగా నిలవకపోగా నీతులుచెప్పి బెదిరించి తన భర్తదగ్గరకే పంపించారు. అతనికి మరింత లోకువనేసారు. చావక ఏంచేస్తుంది? కొద్దిపాటి సానుభూతితో మీ చెల్లెలి మనసు అర్థంచేసుకుని "నా దగ్గర ఉండు. నీకు భయంలేదు." అని ఒక్కమాట అనిఉంటే బ్రతకటానికే ప్రయత్నించేదేమో! తన భార్య విధిలేక తన కాళ్ళదగ్గరే పడిఉండవలసిన పరిస్థితి లేదని తెలిసివచ్చాక ఆ భర్తలోనూ పరివర్తన వచ్చేదేమో! ఇప్పుడు బాధపడి ఏం ప్రయోజనం? మీకు నలుగురిలో తలవంపులు తేకుండా చచ్చిపోయిందని ఆనందించండి..."

ఆవేదనతో నిప్పులు కక్కుతోన్న పావని ముందు నిలవలేకపోయాడు విఠల్.

"అనుపమ లేకుండా నేను మాత్రం బ్రతకగలనా?" అని బుడిబుడి దీర్ఘాలు తీసాడు అమృతమూర్తి.

మండిపోయింది పావనికి.

"ఏడవకండి. అనుపమ మిమ్మల్ని వదిలి ఎక్కడికీపోదు. దెయ్యమై మీతోనే ఉంటుంది," అంది కసిగా.

బిత్తరపోయి చూసాడు అమృతమూర్తి.

## 14

నళిని దిగాలుగా ఉంది. పావని కారణం అడిగితే "శంకర్‌తో నా పెళ్ళి నిశ్చయం అయింది. కానీ మన పురోగామి సంఘ సహాయార్థం నేను డాన్స్ ప్రోగ్రామ్స్ ఇస్తే శంకర్ నన్ను చేసుకోనంటున్నాడు..." అంది.

సంఘపు ఎదురు తాకిడి పడిపడి అలిసిపోయింది పావని.

"అయితే ఇంకేం! ప్రోగ్రామ్స్ మానేసి పెళ్ళి చేసుకో! ఉన్నదానితోనే సంఘం నడిచినంతవరకూ నడుస్తుంది" అంది నిస్పృహతో.

"అదేమిటి మేడమ్ అలా అంటారు? నేను డాన్స్‌ప్రోగ్రామ్స్ మానను. నేను మంచిదనుకున్న కార్యక్రమాన్ని ఎందుకు మానాలి? జీవితంలో పెళ్ళి ప్రధానమే కావచ్చు కాని, అదే పరమార్థం కాదు. పరవాలేదు, నేను పెళ్ళి లేకపోయినా ఉండగలను."

ధృఢ నిశ్చయంతో అంది నళిని... పావని మనసు పొంగిపోయింది.

సమాజంలో అనుపమలాంటి ఆడవాళ్ళే అధిక సఖ్యాకులు. అయినా నళిని లాంటి వాళ్ళు కూడా ఒకరిద్దరు లేకపోలేదు. ఆ ఒకరిద్దరివల్లనే ఏ నాటికైనా సమాజం బాగుపడాలి.

భాగీరదమ్మ ఒకనాడు సంఘానికి వచ్చింది. ఆపాదమస్తకమూ భగ్గుమనే కోపాన్ని, అసహ్యాన్ని అణచుకుంటూ "ఏం కావాలి?" అంది పావని.

"నన్ను క్షమించండి. ఇన్నాళ్ళూ మీ సంఘానికి వ్యతిరేకంగా ప్రచారం చేసాను. ఇప్పటికి మీ సంఘం ఆదర్శాలు అర్థంచేసుకున్నాను," అంది భాగీరదమ్మ.

భాగీరదమ్మ లాంటి వ్యక్తి తనంతట తను క్షమించమంటూ రావటమా?

పావని సందేహానికి వెంటనే సమాధానం దొరికింది.

"నేను పెళ్ళిచేసుకోవాలనుకుంటున్నాను. అందుకు మీ సంఘం అండదండలు కావాలి!"

మెలికలు తిరిగిపోతూ, సిగ్గుపడిపోతూ అంది భాగీరదమ్మ ... వృద్ధవేశ్య కులుకులు చూపిస్తున్నట్లుగా ఉంది ఆ సిగ్గుపడటం.

మరొకసారి నిర్ఘాంతపోయింది పావని.

"మీకు పెళ్ళా!..." అనేసింది చటుక్కున.

భాగీరదమ్మ చిన్నబుచ్చుకుంది.

"ఈ వయసులో పెళ్ళి ఏమిటని కదూ! దిగుళ్ళవల్లా, పూజలవల్లా, ఉపవాసాల వల్లా, నా వయసు కాస్త ఎక్కువగా కనిపిస్తుంది కాని, నిజానికి నాకు మూడు పదులు నిండలేదు."

తన వయసు చాలా తక్కువని నిరూపించుకోవటానికి తాపత్రయపడే ఆ భక్తురాలి ముఖంలోకి చూడలేక తల దించుకుంది పావని.

"నాకు ఆర్థికసహాయమేమీ అక్కర్లేదు. ఊరికే అండగాఉండి మీ సంఘంలో పెళ్ళి జరిపిస్తే చాలు!"

ఇదేమిటో అర్థంకాలేదు పావనికి...

"హాయిగా ఏ గుళ్ళోనో చేసుకోరాదూ ! ఈ మాత్రం దానికి సంఘం అండ దేనికి ?"

"చేసుకోవచ్చు ననుకోండి. కానీ ఇంతకాలం హరి దాసిగా ఉండి ఇప్పుడు పెళ్ళి చేసుకుంటున్నాను, అంటే బాగుండదు చూడండి."

"ఎందుకు బాగుండదూ ? హరిదాసులూ, హరిదాసినులూ పెళ్లిళ్ళు చేసుకోరూ !"

"అది వేరు... ఇన్నాళ్ళు పెళ్ళి లేకుండా ఉండి పవిత్రురాలినని పేరు సంపాదించుకుని ఇప్పుడు అకస్మాత్తుగా పెళ్ళికూతురి నయితే నవ్వుతారేమో నని... మీబోటివారు బలవంతపెట్టి పెళ్ళి చేసారంటే కాస్త బాగుంటుంది..."

ఇప్పటికి భాగీరదమ్మ ఉద్దేశం అర్థమయింది. నవ్వు ఆపుకోలేక పకపక నవ్వేసింది. భాగీరదమ్మకి రోషంవచ్చింది. అయినా తన అవసరం కనుక అణచుకుంది.

"మీ సంఘానికి వెయ్యిరూపాయలు విరాళంగా ఇస్తాను," అంది.

తను నవ్వినా రోషం తెచ్చుకోకుండా ఎదురువిరాళం ఇస్తానంటూ బ్రతిమాలుతోన్న భాగీరదమ్మను చూస్తే జాలి కలిగింది పావనికి.

ఏ వయసు అయితేనేం ? ఈ కోరికలకు తీరటం అంటూ ఉండదేమో ! పాపం, అందులో ఈ భాగీరదమ్మ మొదటినుండీ జీవితాన్ని ఏమీ అనుభవించ లేదు. తన కోరికలను ఈనాటికైనా సక్రమ మార్గాన తీర్చుకోవాలని తాపత్రయ పడుతోంది. తనలో కోరికలున్నాయని ఒప్పుకోవటానికి సిగ్గుపడుతోంది ఇందులో తప్పేముంది ?

"భాగీరధమ్మగారూ ! మేమే మిమ్మల్ని ప్రోత్సహించి వివాహం జరిపింటా మని ఒప్పుకోవటానికి నాకు అభ్యంతరంలేదు. కానీ... మరోలా అనుకో కండి... మీకు పెళ్ళికొడుకును చూడటం కష్టంకదూ !"

పావని ఈ మాత్రం ఆదరంగా మాట్లాడేసరికి భాగీరదమ్మ ముఖం విక సించింది.

"పెళ్ళికొడుకు సిద్ధంగానే ఉన్నాడు." మరొక్కసారి సిగ్గుపడుతూ అంది.

భాగీరదమ్మ సిగ్గుపడినప్పుడల్లా చూడటానికి పావనికి ప్రాణాంతకంగా ఉంటోంది.

"ఆయన పెళ్ళి చేసుకోమని ఎప్పటినుండో అడుగుతున్నారు. 'కృష్ణా,రామా!' అంటూ బ్రతుకుతోన్న నాకు మళ్ళీ పెళ్ళిగోల ఎందుకని ఒప్పుకోలేదు కానీ,

ఆయనే "ఆడదానికి పతి పదసేవే తారక" మని పదేపదే చెప్పి ప్రాధేయ పడ్డారు. పతిసేవా సౌభాగ్యాన్ని పొందాలనే ఆశతో సరే నన్నాను చివరికి."

పావనికి నవ్వు వచ్చేస్తూంది. అతిప్రయత్నంమీద అణచుకుంది. "చింత చచ్చినా పులుపు చావలేదు" అనుకుంటూ "సరే! మీరు ముహూర్తం నిర్ణయించి తెలియజెయ్యండి. మా సంఘంలో పెళ్లి జరిపిస్తాం" అంది పావని.

పట్టరాని ఆనందంతో పెళ్లిపోయింది భాగీరదమ్మ. భాగీరదమ్మ నిర్ణయించిన ముహూర్తానికి సంఘంలో పెళ్లి ఏర్పాట్లు చేసింది పావని. విద్యార్థినులకు కూడా ఇది తమాషాగా ఉంది "అమ్మమ్మగారి పెళ్లి" అని నవ్వుకుంటూ హుషారుగా పనులు చేస్తున్నారు. ఊళ్ళోజనం మాత్రం "ఈ సంఘానికి మరీ పోయేకాలం! భాగీరదమ్మకు పెళ్లి చెయ్యటమేమిటి?" అన్నారు కొందరు సన్నసన్నగా "ఆవిడ బుల్లిపాపాయి కాదుగా! ఇష్టంలేకుండా ఎవరు పెళ్ళి చెయ్యగలరూ?" అన్నారు.

మొతానికి భాగీరదమ్మ పెళ్లి చూడటానికి జనం విరగబడి వచ్చారు. ముహూర్తం సమీపించింది. పెళ్లికూతురూ రాలేదు. పెళ్లికొడుకూ రాలేదు. సంగతేమిటో తెలుసుకుందామని పావని కొందరు విద్యార్థినులతో భాగీరదమ్మ ఇంటికి వెళ్లింది.

ఆ ఇంటిచుట్టూ కొందరు జనం మూగి ఉన్నారు. గందరగోళంగా ఉంది. పావనిలోపలికి వెళ్లింది భాగీరదమ్మ ఇనప్పెట్టె తెరిచి ఉంది. వస్తువులన్నీ చిందరవందరగా ఉన్నాయి. వాటి మధ్య చలనం లేకుండా కూర్చునిఉంది భాగీరదమ్మ.

చుట్టుపక్కల పోగయిన జనం మాటల బట్టి భాగీరదమ్మ ఎంచుకున్న పెళ్ళికొడుకు, లేదా భాగీరదమ్మను ఎంచుకున్న పెళ్ళికొడుకు, ఆవిడకంటే ఆవిడ డబ్బుకు ప్రాధాన్యమిచ్చి ఆవిడను వదిలి దానితో పరారిఅయిపోయాడు... పాపం! భాగీరదమ్మకు పతిపద సేవాసౌభాగ్యం దక్కకపోగా, కష్టపడి కూడబెట్టుకున్న డబ్బుకూడా దూరమయింది

ఆ సమయంలో భాగీరదమ్మను ఏమని ఓదార్చాలో అర్థంకాక మౌనంగా వెనక్కుతిరిగి వచ్చేసింది. పెళ్ళి చూద్దామని వచ్చిన వారందరికీ విషయం తెలిసింది ఒకనాడు భాగీరదమ్మకు వంతపాడిన భజనబృందాలే ఈ నాడు ఆవిడ భంగపాటుకు నవ్వుకుంటూ వెళ్లిపోయాయి.

కొన్నాళ్ళ తరువాత చెదిరిపోయిన జుట్టుతో, నలిగిపోయిన బట్టలతో రోడ్డు మీద సణుక్కుంటూ వెళ్తోంది ఒక నడివయసు యువతి.

"నేను పవిత్రురాలిని. పరమపవిత్రురాలిని. ఎన్నడూ పరపురుషుణ్ని కన్నెత్తి అయినా చూడలేదు. స్త్రీకి శీలం ప్రధానం...ఆడదన్నాక మొగుడికి అణిగి మణిగి పడిఉండాలి. అత్తమామలకు సేవలు చెయ్యాలి. ఆడబిడ్డల అఘార్టీలకు లొంగి పోవాలి...పురాణాలు చెప్పటంలా? సావిత్రి, దమయంతి, ఎలాంటి పతివ్రతలు? వెధవకాలం! పిదపకాలం, జనం తెలివిమీరిపోతున్నారు. పాడు సంఘాలు! నీతీ నియమంలేని సంఘాలు! ఈ సంఘాలే నాకు...అగ్నిహోత్రంలాంటి నాకు పెళ్ళి చెయ్యాలని తలపెట్టాయి—ఆ శ్రీరామచంద్రుడే కాపాడాడు నన్ను..."

ఆ వ్యక్తిని నిదానించి చూసి భాగీరథమ్మ అని గుర్తుపట్టింది పావని.

పాపం, జీవితాంతమూ భాగీరథమ్మ హరికథలు చెప్పింది. కాని నిజంగా దమయంతీ, సావిత్రీ ఎలాంటి పతివ్రతలో ఆవిడకు తెలుసా? ఏమాత్రం తెలిసినా వాళ్ళతో పోల్చి ఆధునికయువతిని చులకనచేసి మాట్లాడదు.

జాలిగా ఒక్క నిట్టూర్పు విడిచింది పావని.

## 15

అనుపమ అక్షరాలా మహాపతివ్రత. శారీరకంగా అమృతమూర్తికి దూర మయినా గాలిగా మారి అతని ఊపిరిలో నిలిచిపోయింది. అతని ఊహలలో ఆకృతిపొంది నీడలా వెంటనిలిచింది. ఈ తాకిడికి అమృతమూర్తి తట్టుకోలేక పోయాడు. బ్రతికిఉన్న అనుపమను అనేక విధాల ఏడిపించగలిగిన అమృత మూర్తి దెయ్యమై కనిపించే అనుపమకు బెదిరిపోయాడు.

తనను విడిచిపొమ్మని అనుపమ దయ్యాన్ని బ్రతిమాలుకున్నాడు. "మిమ్మల్ని విడిచి నేనెక్కడికి పోతాను?" అన్నట్లు పకాలున నవ్వెందేకాని, అతణ్ని వదల లేదు దెయ్యం. భూతవైద్యులకు చూపించుకొన్నాడు. సైకలాజిస్టులని కలిసాడు. ప్రాచీనాధునిక విధానాలన్నీ అనుసరించినా అనుపమ దెయ్యం బారినుండి విముక్తి కలగలేదు.

అనుపమ పుట్టి పెరిగిన ఊళ్ళో అనుపమకు గుడికట్టించి దేవతగా నిలబెడితే, ఈ దెయ్యం రూపు వదిలిపోవచ్చునని ఒక భూతవైద్యుడు సలహా ఇచ్చాడు. ఆ సలహా బాగా నచ్చింది అమృతమూర్తికి. అనుపమ దగ్గిరనుండి కట్నంగా తీసుకున్న యాభై వేలతో, అనుపమ సొంత ఊళ్లోనే గుడి కట్టించాలని సంకల్పించుకున్నాడు

* * *

బాణాసంచాలు ప్రేలుతున్నాయి. బారీఎత్తున ఊరేగింపు సాగుతోంది. మేళతాళాలు మ్రోగుతున్నాయి. జనం ఒకరినొకరు తోసుకుంటూ మహాప్రవాహంలా ముందుకు సాగుతున్నారు రెండు నెలలు శిరీష దగ్గిరుండి అప్పుడే వచ్చిన పావని "ఏమిటిదంతా?" అని అడిగింది సంఘంలో ఒక విద్యార్థినిని

"మీకు తెలియదా? మీ అనుపమ దెయ్యమయి భర్తను వెంటాడింది. గుడి కట్టించి దేవతగా నిలబెట్టి పూజలుచేస్తే, దెయ్యం రూపు పోతుందని ఎవరో చెప్పారు. అందుకని అమృతమూర్తిగారు గుడి కట్టించి, అనుపమగారిని దేవతగా నిలబెట్టి..."

తరువాత మాటలు వినలేకపోయింది పావని. అనుపమను దేవతగా నిలబెడుతున్నారా? అనుపమ సుఖంగా సంసారం చేసుకుంటుందనే ఆశతో ఇచ్చిన కట్నం ఈ విధంగా ఉపయోగపడుతోందా? అనుపమను దేవనగా పూజించటానికి బయలుదేరిందా ఈ జనప్రవాహం? ఎంత మూర్ఖులు ఈ మందలాంటి జనం!

పూజారులు మంత్రాలతో అనుపమ విగ్రహాన్ని గుళ్ళో ప్రతిష్ఠిస్తున్నారు. పావని "ఆగండి?'' అని గర్జిస్తూ ఆ జనప్రవాహానికి ఎదురునిల్చింది.

"అనుపమని మనిషిగా నిలవనీయని మీరు దేవతగా నిలబెట్టాలని చూస్తున్నారా? సాటి మనిషిని మనిషిగా చూడలేనిమీరు...ఎదుటి వ్యక్తి వ్యక్తిత్వాన్ని మన్నించలేని మీరు...స్వార్థాలతో, అహంకారాలతో కుల మత వర్గ భేదాలతో, ఎదుటివారిని సుఖపడనీయక, మీరు సుఖపడలేక బ్రతుకులు చికాకులు చేసుకునే మీరు, ... నిజాన్ని నిర్భయంగా ఎదుర్కోలేక మూఢాచారాల మాటున దాక్కొని దేవుళ్ళనీ దెయ్యాలనీ మీ పిరికి మనసులకి అడ్డుగా పెట్టుకోవాలనుకుంటున్నారా? ఆపండి! అనుపమని దేవతగా పూజించటానికి వీల్లేదు..."

జనానికి ఒళ్ళు మండిపోయింది. వెర్రెత్తిపోయింది. వాళ్ళలో చాలామందికి అనుపమ దేవత కలల్లో కనిపించి రకరకాల ఆదేశాల్చింది మొక్కుకుంటే ఎందరికో ఎన్నో రోగాలు నయమయ్యాయి.

తమ దేవతని దేవత కాదంటోంది! నాస్తికురాలు! పాపిష్టిది! సిగ్గూ ఎగ్గూ లేకుండా మొగుణ్ణొదిలి సంఘాలంటూ బజారునపడి తిరిగిన ఆడది...ఆడది చెడిపోయినా పరవాలేదని తమ సంస్కృతినే తగలబెడుతోన్న పిశాచం...

పావని మీదకు కర్రలు లేచాయి. రాళ్ళవర్షం కురిసింది...ఆ ఉన్మాదంముందు ఉదాత్తప్రకృతి కూలిపోయింది.

"పావనీ!"

ఆర్తిగా పిలుస్తోన్న ఆ కంఠం విని అతి కష్టంమీద కళ్లు తెరిచింది పావని. కళ్ళకెదురుగా విఠల్ ముఖం కనిపించేసరికి "మీరా?" అంది బలహీనంగా.

"ఇప్పుడెలా ఉంది పావనీ!" ఆరాటంగా అడిగాడు విఠల్.

అప్పుడు జరిగినవన్నీ ఒకదాని వెనుక ఒకటి గుర్తుకొచ్చాయి పావనికి...

"అనుపమని దేవతగా ప్రతిష్ఠించారా?" అంది.

"ఆ! వాళ్ళు మానతారా? చాలామందికి అనుపమ కనిపించిందట! నువ్వెందు కంత తీవ్రంగా అడుకున్నావు? ఏమో! అనుపమ నిజంగానే దేవతే అయిం దేమో!"

విఠల్ ముఖంచూసి నవ్వింది పావని...

"నన్ను వెంటనే శిరీష దగ్గిరకి తీసికెళ్ళండి..." అంది.

"ఈ స్థితిలోనా?"

"అవును—అర్జంట్! ఇప్పుడు నన్ను తీసుకువెళ్ళకపోతే, ఆ తరువాత మీరు జీవితాంతమూ కుమిలిపోవలసి వస్తుంది..."

పావని మాట కాదనలేక టాక్సీలో పావనిని శిరీష దగ్గిరకు తీసుకువెళ్ళాడు విఠల్.

శిరీష ఇంట్లో అనుపమని చూసి నివ్వెరపోయాడు విఠల్.

విఠల్‌ను చూసి తడబడిన అనుపమ పావనిని ఆ స్థితిలోచూసి "వదినా! ఏమిటిది? ఆ దెబ్బలన్నీ ఏమిటి? నిన్ను కొట్టిన రాక్షసు లెవరూ?" అంది ఏడుస్తూ, అన్న ఉనికిని మరిచిపోయి.

పావనికి బలహీనంగా ఉంది. లేని ఓపిక తెచ్చుకుని కష్టంమీద విఠల్‌తో మాట్లాడింది.

"చూశారా! మీ చెల్లెల్ని మీకు అప్పగిస్తున్నాను. నా సంఘంలో ఉంచే నయభయాల మళ్ళీ తీసుకుపోతారని బెదిరిపోయింది. అంచేత శిరీష దగ్గిర ఉంచాను...నేనూ, శిరీష ఎంతో నచ్చజెప్పి, ఆత్మహత్య చేసుకోవాలనే ఆలో చన మనసులోకి రాకుండాచేసి, అనేకవిధాల ధైర్యంచెప్పి ఉద్యోగంలో. చేర్పించాం! గుర్తుందా! ఆ రోజు మీరు రాత్రివేళ మా సంఘానికి వచ్చారు. అప్పుడే అనుపమ నా దగ్గిరకు వచ్చింది...బెదిరిపోయి చెదిరిన గుండెతో బ్రతుకుమీద ఆశలేకుండా నన్ను వెతుక్కుంటూ వచ్చింది. ఆ సమయంలో అనుపమను మీరుచూస్తే తప్పకుండా మళ్ళీ భర్తదగ్గిరకు పంపించటానికే



ప్రయత్నిస్తారని భయపడ్డాను. అదీగాక అనుపమ ఎవరినైనా కలుసుకుని మాట్లాడగలిగే దశలోలేదు అప్పుడు...అందుకే మిమ్మల్ని లోపలికి రానియ్య లేకపోయాను...మీరు ఏమనుకున్నారో కదూ..."

మాట్లాడలేక ఆగిపోయింది పావని...విఠల్‌కి ఆనాడు తాను పొందిన ఆశా భంగం, ఆవేదన గుర్తుకొచ్చాయి.

"నువ్వు తప్పుచేసావని అనుకోలేదు పావనీ! నాకు సరిఅయిన శిక్షనే విధించావని అనుకున్నాను."

"నా భర్త నన్ను అపార్థంచేసుకోరు" అని నిశ్చింతగా అనగలిగిన నిన్ను ఊహామాత్రంగానైనా అనుమానించాను. మళ్ళీ నీ దగ్గిరకు రాగలిగే అర్హత నా కెక్కడిది?"

"మీరు నన్ను అనుమానించలేదు. మీ పావనిని గురించి ఇతరులు మరో రకంగా అనుకోవడం సహించలేకపోయారు. ఆ ఆవేశంలో ఉన్న మిమ్మల్ని నేను తప్పుదారి పట్టించాను. నేను అభిమానవంతురాలినే! కానీ, నా అభిమానానికి మిమ్మల్ని కాదని తిరస్కరించేటంత శక్తిలేదు. విధిలేక మీకు దూరంగా ఉండిపోయినా ప్రతిక్షణమూ మీ పిలుపుకోసమే ఎదురుచూస్తున్నాను. ఆ నిరీక్షణే యాంత్రికమయిన నా జీవితంలో నేను మిగుల్చుకున్న మాధుర్యం...నా ఉనికికి

ఆధారం...నాకు దేవతలలో నమ్మకంలేదు. దెయ్యాలంటే నమ్మకంలేదు. కానీ ప్రేమలో నమ్మకం ఉంది...నేను మిమ్మల్ని ప్రేమించాను. నా త్రికరణాలతో ప్రేమించాను. మీరు నా దగ్గిరకిరాక తప్పదు. ఆ ధైర్యమే. ఆ నమ్మకమే, నా కర్తవ్యనిర్వహణకి కావలసిన నైతికబలాన్నందించింది నాకు. ."

ఓపిక లేకపోయినా విఠల్‌తో మాట్లాడాలనే ఆశతో అన్ని మాటలు మాట్లాడిన పావని అలసటతో కళ్ళుమూసుకుంది.

పనిమీద ఎక్కడికో వెళ్ళివచ్చిన శిరీష పావనిని ఆ స్థితిలో చూసి సంగతులన్నీ తెలుసుకుని చాలా బాధపడింది.

విఠల్ డాక్టర్ని పిలుచుకొచ్చాడు. సంగతి తెలిసి అందరూ వచ్చారు.

ఒక కూతురుపోయిన దుఃఖంలో కుమిలిపోతోన్న సుందరమ్మ పావనిని ఆ స్థితిలో చూసిసహించలేకపోయింది.

"పావనీః నా తల్లీః నన్ను వదిలిపోకేః నీకోసం ఏమైనా చేస్తాను. సంఘాన్నంతటినీ ఎదిరిస్తాను." అని ఆక్రోశించింది.

పావని మెరుస్తోన్న కళ్ళతో "ఏమన్నావ్? సంఘాన్ని ఎదిరిస్తావా? మళ్ళీ అను..." అంది.

"ఆః ఆః నా కూతురికోసం ఏమైనా చేస్తాను. మనుష్యులు సుఖంగా బ్రతకటానికి లేకపోయాక ఎందుకొచ్చిన ఆచారాలివి?" అంది సుందరమ్మ ఏడుస్తూ.

"ఏడవకేః అమ్మాయి బ్రతుకుతుంది. ఎందరికోసమో పాకులాడిన ఆ మంచితనమే అమ్మాయిని కాపాడుతుంది..."

ఏడుపు నిగ్రహించుకుంటూ భార్యను ఓదారుస్తున్నట్లుగా కూతురికి ధైర్యం చెప్పాడు జగన్నాథం.

పావని ఆశ్చర్యంగా తండ్రిని కళ్లెత్తిచూసింది.

దిగులుగా ప్రేమగా నవ్వాడు తండ్రి...ఒక్క నిట్టూర్పు విడిచింది పావని.

పద్మావతి పావనిని చూసి క్రుంగిపోయింది. అనుపమనిచూసి పొంగిపోయింది. ఆనందం పట్టలేక పసిపిల్లను కౌగలించుకున్నట్లు అనుపమని కౌగలించికుని "అబ్బాః నా కడుపు చల్లగా నా కళ్లకి మళ్ళీ కనిపించావేః నువ్వు చచ్చిపోయావనుకుని ఎంతగా కుమిలి కుమిలి ఏడ్చాను? నా బంగారుతల్లివి. మళ్ళీ నిన్ను కళ్ళచూస్తాననుకోలేదేః ఎంత అదృష్టంః" అంది.

"నీలాంటి అభాగ్యులనేకుల కడుపు చల్లగా నాలాంటి దౌర్భాగ్యులను ఆదుకోవటానికేనమ్మా, వదిన తనను తను బలిచేసుకోవటానికి సిద్ధపడుతున్నది, ..." అంది అనుపమ ఏడుస్తూ.

"ఏ దేవుడైనా నా ఆయుర్దాయం తీసుకుని నిన్ను బ్రతికిస్తే బాగుండునే పావనీ!" అంది పద్మావతి పావని మంచం ప్రక్కనే క్రింద కూలబడి.

"మీ అందరి మనసులలో ఇంత మంచిస్థానం సంపాదించుకొన్న నాకు చావు ఎక్కడుంది అత్తయ్యా!'' అంది పావని సంతృప్తితో.

అనుపమ బ్రతికే ఉందని తెలిసి సిగ్గుపడుతూ వచ్చాడు అమృతమూర్తి.

"అనుపమా! నన్ను క్షమించు—నువ్వు దూరమయిన నాటినుండీ ఒక్కనాడూ కంటినిండా నిద్రపోలేదు. కడుపునిండా అన్నం తినలేదు" అన్నాడు

నిజంగానే అమృతమూర్తి చిక్కిపోయాడు. అతడిని చూడగానే జాలిపడుతోన్న తన మనసుమీద తనే చికాకుపడింది అనుపమ "ఛీ! ఆడమనసు..." అనుకుంటూ.

''మీ అశాంతికి కారణం అనుపమ మీకు దూరమవటం కాదండీ! మీ మూర్ఖ. నమ్మకాలు!" కరుగ్గా అంది శిరీష.

"అది కాదనలేను. కానీ ఎక్కడికి పోతుందిలే అనుకున్నంత కాలం అర్థంకాని విలువ పూర్తిగా చెయ్యిజారిపోయింతరువాత అనుభవంలోకి వచ్చింది. నేను నిజమే చెపుతున్నాను," అన్నాడు అమృతమూర్తి.

"మా అనుపమని ఏవిధంగానూ బాధపెట్టనని మాట ఇస్తే తప్ప పంపను" అంది పద్మావతి,—అప్పటికీ ఖండితంగా 'పంపను' అనలేక.

"నీకు ఇష్టంలేకపోతే వెళ్ళక్కర్లేదు అనుపమా! సంసారమనేది అన్యోన్యంగా కలిసి మెలిసి సుఖంగా ఉండటానికి కాని, సంఘంకోసం ఒకరినొకరు అసహ్యించుకొంటూ కలిసిపడిఉండటానికి కాదు!" అన్నాడు విఠల్.

"శభాష్!" అంటూ చప్పట్లు కొట్టింది శిరీష..

"ఆయన దగ్గరకు వెళ్ళటానికి నాకు ఎందుకు ఇష్టంఉండదు అన్నయ్యా! నిలవనీయకుండా తరిమికొడితే దూరంగా వచ్చాను. కాని నా అంతట నేను నా సంసారాన్ని వదులుకుంటానా? ఆదరాభిమానాలతో అందలాలు ఎక్కించక్కర్లేదు. సాటి మనిషిగా చూడగలిగితే చాలు! సర్దుకుపోవటానికే ప్రయత్నిస్తాను."

"ఇదీ, ఈనాటికీ మన స్త్రీల మనస్తత్వం...అమృతమూర్తిగారూ! మీరు అదృష్టవంతులండీ! మళ్ళీ మా అనుపమను దేవతగనో, దెయ్యంగానో మార్చెయ్యక మనిషిగా బ్రతకనీయండి!'' అంది శిరీష

పావనిని చూడటానికి రవి కూడా వచ్చాడు

"మళ్ళీ పరీక్ష పాసయ్యేవరకూ నీ ముఖం చూడలేక నీ దగ్గరకి రాలేక పోయాను వదినా! అసలు నువ్వు ఇంట్లోంచి వెళ్ళకపోతే, నేను ఇలా రౌడీ

స్నేహాలతో పాడయ్యేవాడిని కాను. ఎందుకు వెళ్ళిపోయావు వదినా!" అన్నాడు రవి ఏడుస్తూ.

పావని రవి తలమీద చెయ్యివేసి అభిమానంగా నిమిరింది.

"నేను మీ అందరి దగ్గిరనుండి ఎందుకు వచ్చేసానో, ఇప్పుడు నీకు అర్థం కాదు. కానీ, నీ భార్యకి మాత్రం ఇంట్లోంచి వెళ్ళిపోయే దురదృష్టం కలగ నియ్యకు..."

పావనిని గూడెంలోనికి నళినికూడా వచ్చింది. పట్టరాని దుఃఖంతో "మేడమ్ ఏం తప్పుచేసారని ఇంత దారుణంగా హింసించారు!" అంది.

"క్రీస్తు ఏం తప్పుచేసాడని శిలువ వేసారు? ఒక క్రొత్త మార్గాన్ని చూపిస్తే ...పరంపరగా వచ్చే సూత్రాలకందని సత్యాన్ని వివరిస్తే జనం అంగీకరించలేరు. ఆ వ్యక్తులను సర్వనాశనం చేస్తారు. వ్యక్తులు నాశనమయినా సత్యాలు నాశనం కావుగనుక, అవి నెమ్మదిగా అర్థమవుతాయి. అప్పుడు తెలివి తెచ్చుకుని తాము నాశనం చేసిన వ్యక్తులను తామే దేవతలని ఆరాధిస్తారు." విషాద స్వరంతో అంది శిరీష.

శంకర్ నళినిని వెతుక్కుంటూ వచ్చాడు.

"నన్ను క్షమించు నళినీ! సరళదేవత నా కలలో కనిపించి నిన్ను పెళ్లిచేసు కోమని చెప్పారు! మనిద్దరమూ ఆవిడ మాటను గౌరవించాలి!" అన్నాడు.

ఆ మాటలు విని భరించలేకపోయింది పావని.

"దెయ్యాలకు భయపడుతూనో, దేవతలను ఆశ్రయిస్తోనో తప్ప మనుష్యులు మనుష్యులలాగ బ్రతకలేరు కాబోలు! ఇదేనేమో మానవచరిత్ర సారాంశం!" అంది ఆవేశంగా.

పావని అంత ఆవేశపడటం చూసి భయపడింది శిరీష.

"ఊరుకో! విశ్రాంతి తీసుకో! మాట్లాడకు!" అంది.

"పరవాలేదు. ఇంక నా కేభయంలేదు. నా శరీరంలోకి అమృతం ప్రవ హిస్తోంది."

"అమృతం ప్రవహిస్తోందా?"

"అవును! ఇదిగో చూడు!, ఈ స్పర్శలోంచి..."

తన చెయ్యి ప్రేమగా దృఢంగా పట్టుకున్న విఠల్ చేతిని ఎత్తి చూపింది పావని.

జంటగా ఉన్న ఆ చేతులను ముగ్ధురాలై చూసింది శిరీష.




తలుపులు వేసి ఉన్నాయి. ఆ మూసిన తలుపులవైపు చూస్తూ అలా నిలబడి పోయింది నీరజ.

తప్పదు...కదలాలి! ఆ తలుపులు తట్టాలి!

శక్తినంతా కూడదీసుకుని నడిచింది — తలుపు తట్టింది.

“ఎవరు?” అని విసుగ్గా వినిపించింది వర్ధనిస్వరం—ఒక్కనిముషం తర్వాత తలుపులు తెరుచుకున్నాయి.

నీరజనుచూసి నిర్ఘాంతపోయింది వర్ధని.

“నువ్వు...నువ్వు...” అంది.

“వచ్చేసాను పిన్నీ! బయటపడి వచ్చేసాను!”

పొంగివస్తోంది ఏడుపు నీరజకి — కానీ మరొకరిముందు ఏడవటం నీరజకు అలవాటులేదు. వర్ధనిముందు అసలు ఏడవదు.

వర్ధని ఏంమాట్లాడలేదు. దెయ్యాన్నిచూస్తున్నట్లు నీరజనుచూస్తూ నిలుచుంది— లోపలకు రమ్మనికూడా అనలేదు — నీరజ తనే లోపలకు నడిచింది.

సందడికి పడుకున్నవాడు లేచివచ్చాడు కామయ్య. నీరజనుచూసి సంభ్రమంగా "వచ్చావా ? ఎలా వచ్చావ్ ? ఎక్కడ చిక్కపడ్డావ్ ? పోలీసులు విడిపించారా ?" అన్నాడు. "పోలీసులుకాదు – నేనే తప్పించుకోగలిగాను..."

"ఎలా ?"

వర్ధని కోరచూపులతో కామయ్యమాటలు ఆగిపోయాయి.

"అవును ! నువ్వు తప్పించుకోగలిగావు – వాళ్ళ పనితీరాక అవతలపారేస్తే తప్పించుకుని వచ్చావు – ఇంక మా తిప్పలు మొదలు ! నాకు పెళ్ళికావలసిన ఇద్దరు పిల్లలున్నారు !"

వర్ధని ఒక్కొక్కమాట ఒక్కొక్క గుండుదెబ్బలా తగిలింది నీరజకు.

ఈనాటి వర్ధని మాటలలో తను ఎదుర్కోబోయే సమస్య వికటాట్టహాసం చేస్తూ ప్రత్యక్షమవుతోంది–అందుకే నీరజ భయపడుతోంది–బాధపడుతోంది–

క్షణాలలో నీరజ వచ్చినవార్త చుట్టుపక్కలకు వ్యాపించింది – ఇలాటి వార్తలు వాటికవే రెక్కలువచ్చినట్లు వ్యాపిస్తాయి.

అందరూ వచ్చేసారు...

నీరజ పై ప్రాణాలు పైనేపోయాయి – ఇప్పుడు వీళ్ళందరికీ తను సమాధానాలు చెప్పకోవాలి ! పొమ్మనటానికి లేదు – అది మర్యాద కాదు ! ఇది సమాజం !

సుధ నీరజను కౌగిలించుకుని కన్నీళ్ళుపెట్టుకుంది – ఏ కారణంగానో నిజంగానే కన్నీళ్ళు వచ్చాయి...

"ఎంతపని జరిగింది నీరూ ! ఇలా మళ్ళీ మా కళ్ళబడతావని అనుకోలేదు ..."

ఆగి కన్నీళ్ళు తుడుచుకుంది.

"అయితే నీ గొలుసు ... మొన్న కొత్తగా చేయించుకున్నావు చూడు, అది పోయినట్టేనా ? ఎంత బాగుందో ! తలుచుకుంటే నాకే బాధగా ఉంది..."

"అది పోలేదు !"

"పోలేదూ ?"

ఆశ్చర్యంగా అడిగింది సుధ – ఇందాక లేనిబాధ ఇప్పుడు స్పష్టంగా వినిపించింది ఆ గొంతులో...

"ఆ గొలుసుతప్ప నీ దగ్గిరేముంది తీసుకోవటానికి ?"

"ఏమీలేదు – ఏమీ తీసుకోలేదు –"

"అయితే కేవలం మానభంగంచేసి పంపేసారన్నమాట ? అంతేనా ?"

"ఏ భంగమూ ఎవరూ చెయ్యలేదు !"

అంతవరకూ కుతూహలంగా వింటున్న కామాక్షమ్మ కల్పించుకుని చిరునవ్వుతో అంది –

"నీ ధైర్యానికి మెచ్చుకుంటున్నాను నీరజా ! అవును ! అలాగే సమాధానం చెప్పాలి ! లేకపోతే ఎవరైనా పాడయిపోయామని చెప్పుకుంటారా ? పాడయిపోయిన ఆడదాని బ్రతుకేముంది ? చిరిగిన విస్తరి ... చూశు, ఎవరడిగినా ఇలాగే చెప్పు !... ఇంతకీ ఆ దొంగలు ఎక్కడికి తీసికెళ్ళారు నిన్ను ? ఎక్కడుంచారు ? ఎలా వచ్చావ్ ? వాళ్ళే దింపారా ? నువ్వే వచ్చావా ?"

తన శ్రేయోభిలాషిణికి ఎలా కృతజ్ఞతలు చెప్పుకోవాలో తెలియక పొంగి వచ్చే జుగుప్సను దిగమింగుతూ నవ్వింది నీరజ – ఏడవటం ఇష్టంలేక...

సావిత్రమ్మ అభిమానంగా నీరజ దగ్గరకు జరిగింది–రహస్యం చెప్పింది.

"ఒక్కమాట ! డాక్టర్ చేతిలో ఒక వందో, రెండు వందలో పారేస్తే, నువ్వు చెడిపోలేదని సర్టిఫికేట్ ఇస్తాడు — ఎవడూ నోరెత్తలేడు – నీకు లక్షణంగా పెళ్ళయిపోతుంది. వాళ్ళమీద కోపంతో కేసుపెట్టావంటే నీ బ్రతుకే బజారున పడుతుంది..."

ఇంకా గుసగుసగా ఏదో వాగబోతున్న సావిత్రమ్మనుచూచి లెంపకాయకొట్టాలనిపించింది నీరజకు.

అది చేతకాక అక్కడినుంచి వెళ్ళిపోవాలని లేచి నిలబడింది – ఎక్కడికి వెళ్తుంది ? వర్ధనిచుట్టూ మరో పెద్ద గుంపు ఉంది – ఆబగా కుతూహలంతో వాళ్ళు అడిగే ప్రశ్నలకు తన శాయశక్తులా ఆ కుతూహలం పెంపొందిస్తూ సమాధానాలు చెప్తోంది వర్ధని ... మధ్యమధ్యలో కళ్ళు తుడుచుకుంటోంది !

"ఇది తిరిగి వచ్చిందని ఆనందించనా ? మొత్తం కుటుంబానికే అప్రతిష్ఠ వచ్చిందని బాధపడనా ?"

అని వాళ్ళనే అడుగుతోంది –

వాళ్ళు లోలోపల ఆనందిస్తూ పైకి నిట్టూరుస్తూ సానుభూతి ప్రకటిస్తున్నారు ..

పోలీస్ ఆఫీసర్ మురళి మరో ఇద్దరు కానిస్టేబుల్స్‌తో వచ్చాడు –

పోలీసులను చూడగానే శ్రేయోభిలాషిణులందరూ చెల్లాచెదరైపోయారు...

నిలువునా వణికిన నీరజ 'తప్పదు – తప్పదు' అనుకుని పళ్ళుబిగబట్టి కూర్చుంది.

"కర్మ! చివరకు పోలీసులు ఇంటిమీదకు తయారయ్యే దశ పట్టింది -" అని గట్టిగా స్వగతం పలుకుతూ వెళ్ళిపోయింది వర్ధని...

"మిస్! నీరజ మీరేకదూ!"

నీరజనూ, పరిసరాలనూ జాగ్రత్తగా పరిశీలిస్తూ అడిగాడు మురళి.

"అవును!"

ఆ కంఠంలో స్థైర్యానికి లోలోపల కొంచెం ఆశ్చర్యపోయాడు మురళి...

"సరిగ్గా వారంరోజుల క్రిందట ఒక గేంగ్ ఎత్తుకుపోయింది మిమ్మల్నే కదూ!"

"అవును!"

"ఎలా ఎత్తుకుపోయారు?"

"షాపింగ్ చేసుకని బస్‌కోసం, బస్‌స్టాండ్ దగ్గర నించున్నాను. నాతోపాటు మరికొందరు కూడా ఉన్నారు అందరిమధ్యనుండీ నన్ను ఎత్తుకుపోయి కారులో తీసుకుపోయారు..."

"ఎవరూ ఏమీ చెయ్యలేదా?"

"నేను అరిచాను - మరికొందరు మూగారు. వాళ్ళదగ్గర ఆయుధాలున్నాయి. ఎవరిమటుకు వాళ్ళే భయపడిపోయారు?"

"అది కారా? టాక్సీయా?"

"ఏమో! అవన్నీ గుర్తించేస్థితిలో లేను నేను!"

"కారు నంబర్ కొందరు నోట్ చేసారు. కానీ అది రాంగ్ నంబరని తేలింది! అది ఎలాంటి కారో తెలుసుకోగలిగితే మాకు ఉపయోగిస్తుంది..."

"అయామ్ సారీ! నన్ను కారులో కూచోబెట్టటమూ, కళ్ళకు గుడ్డకట్టడమూ, అన్నీ ఒకదానివెనుక ఒకటి జరిగిపోయాయి — నాకు పెనుగులాడటానికి కూడా అవకాశం లేకపోయింది-"

"వాళ్ళు ఎందరు?"

"అయిదుగురు!"

"ఎక్కడకు తీసికెళ్ళారు?"

"అది ఒక హోటల్ కావచ్చు- సరిగ్గా చెప్పలేను!"

"ఈ వారంరోజులూ అక్కడే ఉన్నారా?"

"అవును!"

"వాళ్ళు మిమ్మల్ని ఏమీ బాధించలేదా?"

"లేదు !"

"అక్కడినుండి ఎలా తప్పించుకోగలిగారు ?"

"నేను తప్పించుకోలేదు !"

"క్షమించండి ? మీరు వివరంగా చెప్పాలి ?"

"వాళ్ళలో ఒకతను నన్ను విడిపించి స్టేషన్ దగ్గిర దింపాడు..."

మురళి కళ్ళు మరింత నిశితంగా చూసాయి...

"ఎవరతను ?"

"నాకు తెలియదు !"

"మీరెవరో తెలియని అతనికి మీమీద అంత అభిమానం ఎలా వచ్చింది ?"

"తెలియదు !"

"వాళ్ళవల్ల మీ కేవిధమయిన హానీ జరగలేదు ?"

"లేదు !"

"మిమ్మల్ని విడిపించిన వ్యక్తి ఎలా ఉంటాడో చెప్పగలరా ?"

"చామనఛాయ - పొడుగనే చెప్పాలి !"

"ఇలాటివాళ్ళు చాలామంది ఉంటారు -"

"ఇంతకంటె ప్రత్యేకించి ఎలా వర్ణించాలో నాకు తెలియటంలేదు - చూస్తే గుర్తుపట్టగలను !"

"పట్టపగలు నడిబజారులోఉన్న మిమ్మల్ని ఎత్తుకుపోవటం సామాన్యమైన విషయంకాదు - వాళ్ళు ఇంత సాహసంచేసింది కేవలం సరదాకా ? దీని వెనుక ఏ ఉద్దేశమూ లేదా ?"

"నా...నాకు తెలీదు -"

"మేడమ్ ! మీరు మా దగ్గిర అన్ని విషయాలూ చెప్పటమే మంచిది !"

"నే నేదీ దాచటంలేదు ?"

మురళి నవ్వాడు - ఆ నవ్వులో అతడు తన మాటలు నమ్మటంలేదని అర్థమయింది నీరజకు -

"ఆల్‌రైట్ ! మీ రొక్కసారి మా ఆఫీస్‌కు రావలసి ఉంటుంది. మా డాక్టర్ మిమ్మల్ని పరీక్షచేస్తాడు !"

నీరజ ముఖం పాలిపోయింది - మరొక్కసారి నవ్వి మురళి వెళ్ళిపోయాడు ...

పోలీసులు వెళ్ళిపోయారని తెలియగానే మళ్ళీ జనప్రవాహం మొదలయింది...

నీరజ నవ్వుతోంది...అందరికీ సమాధానాలు చెపుతోంది...కానీ నీరజ కళ్ళు ఒకే ఒక వ్యక్తికోసం ఆరాటంగా ఎదురుచూస్తున్నాయి-

కొరకరాని కొయ్యలాంటి నీరజ తమ కుతూహలం సరిగా తీర్చనందుకు నిరుత్సాహంతో అందరూ వెళ్ళిపోయారు -

అప్పుడు వచ్చాడు ప్రభు...

అంతవరకు కూడదీసుకున్న నీరజ ఓపిక ప్రభును చూడగానే చెదిరిపోయింది ...

దీనంగా వడిలిపోయిఉన్న నీరజను చూస్తూ ఒక్కమాట మాట్లాడకుండా ఆప్యాయంగా చేతులు చాచాడు ప్రభు - ఆ చేతుల్లో వాలిపోయి వెక్కివెక్కి ఏడ్చింది నీరజ...

"ప్రభూ ! నిజం ! నేను...నేను..."

"హుష్ ! ఏంమాట్లాడకు ; మళ్ళీ నిన్ను చూడగలిగాను - నా దగ్గరకు వచ్చావు - అది చాలు నాకు ! ఏదెలా జరిగినా నువ్వు దూరంకాకుండా ఉంటే చాలు !"

ప్రభు చేతులు మరింత ఆప్యాయంగా నీరజను చుట్టుకున్నాయి...

తనను చుట్టుముట్టి పీడిస్తున్న సమస్తశక్తులనుండీ కాపాడుతున్నట్లు తనను అదుముకున్న ఆ చేతులలో ఒదిగిపోయి తేలికగా నిట్టూర్చింది నీరజ.

* * *

"నువ్వా ? ఎందుకొచ్చావ్ ?"

లక్ష్మీదేవి అడిగిన ఆ ప్రశ్నకు బిత్తరపోయింది నీరజ - నీరజకు లక్ష్మీదేవి కొత్తకాదు - ఆ ఇల్లు కొత్తకాదు...

నీరజకు పదేళ్ళ వయసున్నప్పుడు ... నీరజ తల్లి ఆత్మహత్యచేసుకున్నప్పుడు...చేతులుచాపి నీరజను గుండెలలోకి తీసుకున్నది లక్ష్మీదేవే ! ఆనాటి నుండీ తనకు దూరమయిన మాతృప్రేమను లక్ష్మీదేవిదగ్గిరే పొందగలిగింది నీరజ -

నీరజకు జ్ఞానంవచ్చాక తన తల్లి దుఃఖగాథ లక్ష్మీదేవి నోటినుండీ విందిఎన్నోసార్లు...

"మీ నాయనమ్మ, మీ అత్తయ్యలు, మనుష్యులు కాదమ్మా ! రాక్షసులు... ఏదో ఒక వంకతో మీ అమ్మను సతాయించటంతప్ప వాళ్ళకు వేరేపని ఉండేది కాదు - మీ నాన్న మీ అమ్మతో మాట్లాడితే మండిపడేది మీ నాయనమ్మ...మీ



నాన్న ఒఠ్ఠి గంగిగోవు. దేనికీ సమాధానం చెప్పగలిగేవాడు కాదు...మీ నాన్నా మీ అమ్మాకలిసి సరదాగా సినిమాకు వెళ్ళటానికి లేదు - కబుర్లు చెప్పుకోవటానికి లేదు - చివరకు కాపురంచెయ్యటానికి కూడా లేదు - మీ అత్తయ్యలందరికీ పెళ్ళిళ్ళయ్యాయి - కాని ఒక్కళ్ళూ అత్తవారిళ్ళకు వెళ్ళేవారు కారు - వాళ్ళ మొగుళ్ళే వాళ్ళదగ్గరకు వచ్చేవారు. మీ అత్తయ్యలకీ, వాళ్ళ మొగుళ్ళకీ, వాళ్ళ పిల్లలకీ చాకిరీచెయ్యటమే మీ అమ్మ అనుభవించిన సంసారసుఖం ... మీ అత్తయ్యలు మీ అమ్మ కళ్లెదురుగానే పట్టుచీరలు కట్టుకునేవారు - పువ్వులు సింగారించుకునేవారు. మీ అమ్మ కేమీ ఇచ్చేవారుకారు - ఏమీ పెట్టుకోకపోయినా, ఏ అలంకారమూ లేకపోయినా మీ అమ్మ చాలా అందంగా ఉండేది. అది చూసి కళ్ళలో నిప్పులుపోసుకున్న మీ అత్తయ్యలు లేనిపోని అపనిందలు మోపటం కూడా మొదలుపెట్టారు—అది భరించలేక మీ అమ్మ ఆత్మహత్య చేసుకుంది..."

ఇంతవరకూ చెప్పి కళ్ళుతుడుచుకునేది లక్ష్మీదేవి - వర్ధని ప్రసక్తి రాగానే ఆవిడ ధోరణి మారిపోయేది.

"ఈ వర్ధని వచ్చాక అందరి రోగాలూ కుదిరిపోయాయి- మీ అత్తయ్యలందరూ అత్తారిళ్ళకు వెళ్ళిపోయారు-రమ్మంటే కూడా ఇప్పుడు ఇక్కడికి రారు. తల్లి కొంగుపట్టుకు తిరిగే మీ నాన్న పెళ్ళాం కొంగుపట్టుకుని తల్లిని ఇంట్లోంచి వెళ్ళగొట్టాడు-భలే ఆడది...చండిక..."

"మంచిదేగా అత్తయ్యా ! అలా ఉండబట్టికదా సుఖంగా ఉంది ?"

అమాయకంగా అడిగేది నీరజ-

లక్ష్మీదేవికి ఇది నచ్చేదికాదు - అసహనంతో "మంచిదా? ఆడదంటే ఇలా ఉంటుందా? ఛీ! ఛీ! తలుచుకుంటే కంపరమెత్తుతుంది-" అనేది.

తన తల్లి అష్టకష్టాలూపడి ఆత్మహత్యచేసుకుంటే సానుభూతితో కన్నీళ్ళు కార్చగలిగిన లక్ష్మీదేవి, వర్ధని ఎదురుతిరిగి సుఖపడుతోంటే సహించలేక పోతోంది-లక్ష్మీదేవిలో ఈ ప్రవృత్తి ఎప్పుడూ వింతగానే ఉంటుంది నీరజకి.

వర్ధనికి నీరజమీద ఏకోశానా అభిమానంలేదు ... నీరజకు వయసువస్తున్న కొద్దీ...పరిస్థితులను అర్థంచేసుకోగలుగుతున్నకొద్దీ ... వర్ధనిమీద కోపంకంటె సానుభూతే ఎక్కువగా కలగసాగింది.

వర్ధని అందమైనది...కొద్దిగా చదువుకున్నది-కానీ బీదకుటుంబంలో పుట్టింది. అందుకే కామయ్యకు రెండవ భార్యగా రావలసివచ్చింది - వస్తూనే అత్తవారింటి పరిస్థితిని ఆకళింపు చేసుకుంది-కామయ్యను ఎవరో ఒకరు ఆడించవలసిందేననీ, అలా ఆడించే సమర్థత ఎవరికుంటే అతను వాళ్ళచేతుల్లో కీలుబొమ్మ అయిపోతాడనీ అర్థంచేసుకుంది. క్షణాలలో అతణ్ని తన చేతులలోనే కీలుబొమ్మను చేసుకుంది-కామయ్యకు ఆస్తిపాస్తు లున్నాయిగాని చదువులేదు-ఆ ఆస్తి చూచే వర్ధనిని ఇచ్చారు-కానీ, ఆడపడుచులు కుటుంబాలతోసహా సంవత్సరాలతరబడి తిష్ఠవేసి జల్సాఖర్చులు చెయ్యటంతో ... అత్తగారి పుణ్యకార్యాలతో, సమారాధనలతో ఆ ఆస్తి చాలావరకు హరించుకుపోయింది-వర్ధని చేతిలోకి వచ్చింది. అప్రయోజకుడైన భర్త... అతికష్టంమీద తిండిగడిచే కొద్దిపాటి ఆస్తి ... ఎదుగుతోన్న సవతి కూతురు...

నీరజకు జ్ఞానంవచ్చిన దగ్గరనుంచీ తన సవతితల్లి పరిస్థితులతో ఎలా ఎదిరించిపోతున్నదీ గమనిస్తోనే ఉంది - తనను ప్రేమించలేని వర్ధనిమీద నీరజకు కూడా పెద్దగా ప్రేమలేదు ... కానీ వర్ధని దగ్గిరనుండి నీరజ ధైర్యం, మొండితనం...పరిస్థితులతో తలపడే పట్టుదల, నేర్చుకుంది

ఎప్పుడూ ఏ సందర్భంలోనూ వర్ధనిముందు ఏడవలేదు నీరజ ... లక్ష్మీదేవి దగ్గిరకువచ్చి కూచునేది. అప్పుడు ఏడిచేదికాదు-కానీ నీరజ ముఖం చూస్తూనే లక్ష్మీదేవి సంగతి గ్రహించేది-నీరజను బుజ్జగించి దగ్గిరుండి అన్నం తినిపించి ఆ తరువాతనే ఇంటికి పంపించేది - ఆ లక్ష్మీదేవి ఈనాడు అడుగుతోంది 'ఎందుకు వచ్చావు?' అని...

లక్ష్మీదేవి అలా అడిగిందంటే ఇక నీరజ అక్కడినుండి వెళ్ళిపోవలసిందే!

కానీ వెళ్ళలేదు. వెళ్ళదలచుకోలేదు-లోకంలో దేనినుండైనా సరే తనకు రక్షణ ఇస్తున్నట్లు తనను చుట్టుకొన్న ప్రభు చేతులు తనకు ఎక్కడలేనీ బలాన్ని సమకూరుస్తున్నాయి.

యశోధర బయటికి వెళ్ళినట్టుంది_ అప్పుడే వచ్చింది-నీరజను చూసి మొదట ఆశ్చర్యపోయింది—తరువాత ఆనందంతో కౌగిలించుకుంది.

''నేను ఊళ్లో లేను-ఇవాళే వచ్చాను. నీ దగ్గరకి వద్దామనే అనుకుంటున్నాను-నువ్వేవచ్చావు-వస్తావని అనుకోలేదు-''

"వస్తానని అనుకోలేదా ? ఒక్కరోజైనా మీ ఇంటికి రాకుండా ఎప్పుడైనా ఉన్నానా ?"

"ఇదివరకు సంగతి సరే ! ఇప్పుడు అందరూ చూస్తుండగా రోడ్డుమీదనుండి నడిచి..."

మధ్యలో ఆగిపోయి నవ్వేసింది యశోధర.

నీరజకు అర్థమయింది. లోపలినుండి లక్ష్మీదేవి "యశోధరా !" అని కేక పెట్టింది-

"వస్తాను-" అని యశోధర లోపలికి వెళ్ళింది.

"యశో ! నువ్వు ఇదివరకులాగ ఆ నీరజతో మాట్లాడటానికి వీల్లేదు ?"

"హుష్ ! నీరజకు వినిపిస్తుంది !"

"వినిపించనీ ! అంతగా అవసరమయితే, నీరజముఖంమీదే చెవుతాను !"

"పాపం, నీరజ తప్పేముంది అమ్మా ?"

"తప్పుఉందని నేను అనటంలేదు-కానీ ఈ విషయం ఇంతటితో ఆగదు... వాళ్లెవరో మళ్ళీ నీరజకోసం రాక మానరు-ఇలాటి గొడవల్లో నువ్వు చిక్కుకుంటే నేను భరించలేను !"

"అమ్మా ! నువ్వే నీరజను గురించి ఇలా మాట్లాడుతోంటే మిగిలినవాళ్ళు ఏమంటారో చెప్పు..."

"నాకు నీరజమీద అభిమానం ఉంది ఇప్పటికీ ఉంది. కానీ అది నాకన్నబిడ్డల మీదఉన్న అభిమానంకంటె ఎక్కువదికాదు – నీ మేలుకోరి చెవుతున్నాను. నువ్వు నీరజకి దూరంగా ఉండు..."

తమ సంభాషణ నీరజకు వినిపిస్తుందని యశోధరకు తెలుసు – వినిపించకుండా ఉండాలని తల్లి ఏమీ జాగ్రత్త తీసుకోలేదు – నీరజను ఎలా ఎదుర్కో-

వలసివస్తుందోనని భయపడింది. ఎప్పటి చిరునవ్వుతో ఉన్న నీరజనుచూసి ఆశ్చర్యపోయింది.

"నీరజా! నాకు లోపల కొంచెం పనిఉంది-నువ్వు ఈ పుస్తకాలు చూసు కుంటూ కూర్చుంటావా? వెళ్తావా?"

"కూర్చుంటాను!"

ఒక్కసారి నీరజముఖంలోకిచూసి లోపలకు వెళ్ళిపోయింది యశోధర ... యశోధరకళ్ళు చెమ్మగిల్లి ఉన్నాయి. ఆ కళ్ళలో సానుభూతి ఉంది. మనసులో ఆర్ద్రత ఉంది. అయినా వెళ్ళిపోయింది.

ప్రభు వచ్చేసరికి కొంచెం పొద్దుపోయింది - తన స్నేహితుడు నీలకాంత్‌తో కబుర్లుచెపుతూ కూచున్నాడు-నీలకాంత్ కూడా వస్తానంటే అతడిని కూడా తీసు కుని వచ్చాడు.

తన ఆఫీస్‌రూంలో కూచున్న నీరజను చూసి ఆశ్చర్యపోయాడు - నీరజ తన ఇంటికిరావటం మామూలే! కానీ, ఇంతకుముందు ఎన్నడూ ఇలా ఆఫీస్ రూంలో కూచోలేదు. వంటింట్లో లక్ష్మీదేవికి వంటసాయంచేస్తూనో - యశోధరతో ఒక మంచంమీద పడుకుని కబుర్లు చెపుతూనో ఉండేది...

నీరజను ఎవరో టాక్సీలో తీసుకుపోయారని విన్నప్పుడు లక్ష్మీదేవి ఎంతో బాధపడింది ... ఒకరాత్రి అంతా నిద్రపోకుండా కుమిలి కుమిలి ఏడ్చింది - కానీ, తర్వాత నీరజ తిరిగి వచ్చిందని తెలిసినపుడు ఏమాత్రమూ సంతోషించ లేదు-

"ప్రభూ! నీరజ నా కోడలవుతుందని ఎంతో ఆనందించాను. ఇంక ఆ రాత లేదు. నువ్వు నీరజను మరచిపో?" అంది-

"నీరజ వచ్చింది కదమ్మా! ఇంక మరిచిపోవటం దేనికి?"

"వస్తేమాత్రం? మళ్ళీ మామూలు నీరజ అవుతుందా?"

"నీరజ ఎప్పుడూ నీరజే! నీరజలో మార్పు ఎందుకు వస్తుంది?"

"ఎవరో ఎత్తుకుపోయి కొన్నిరోజులు ఉంచుకొని తిరిగి పంపించిన అమ్మా యిని చేసుకుంటావా?"

"ఎవరో తప్పుచేస్తే దానికి నీరజను శిక్షించమంటావా? ఎప్పటినుంచో నీరజను పెళ్ళిచేసుకుంటానని చెప్తున్న నేను కాదంటే నీరజ కసలు పెళ్ళి అవు తుందా? ఆ అమాయకురాలి బ్రతుకుమొత్తం బలికావలసిందేనా?"

"అందుకని ... నువ్వు చేసుకుంటానంటావా ? అంత త్యాగం నేను చెయ్య లేను ?"

"త్యాగం కాదమ్మా ! నీరజలేకుండా నేను బ్రతకలేను. ఇది స్వార్థమే !"

ప్రభు మాటలు లక్ష్మీదేవికి అర్థంకాలేదు – ఆవిడకు అర్థమయ్యేలా ఎలా చెప్పాలో ప్రభుకు అర్థంకాలేదు – ముందుకు నడుస్తోన్న తరంలోని అభ్యుదయ దృక్పథం ప్రభుది–వెనుకబడిన తరంలోని మగ్గిపోయిన భావాలతోకూడిన మంచి తనం లక్ష్మీదేవిది...

అయినా ప్రభును గట్టిగా ఏమీ అనలేదు. ఎందుకంటే ఆ కుటుంబాని కంతకూ ప్రభు ఒక్కడే ఆధారం–ప్రభు తండ్రి చంద్రశేఖరరావుకు తాతలనాటి ఆస్తులు రాకపోయినా ఆ దర్జాలన్నీ వచ్చాయి. ఉన్న కొంచెమూ కూడా తగల బెట్టుకున్నాడు–ఉద్యోగం చెయ్యటం చిన్నతనమని చెయ్యడు – ఎకౌంటెంట్‌గా ప్రభుతెచ్చే అయిదువందలతోనే ఆ కుటుంబం నడవాలి – తనకు సరీగ్గా అన్నీ అమరటంలేదని చంద్రశేఖరరావు భార్యమీద ఎప్పుడూ చిరాకుపడుతూ ఉంటాడు–లక్ష్మీదేవి అవన్నీ శాంతంగా సహిస్తూ భర్తను సంతృప్తిపరచటానికే ప్రయత్నించేది – తన కష్టార్జితం తల్లి దగ్గిరనుండి తీసుకుని తండ్రి పేకాటలో తగలెయ్యటం ప్రభు సహించలేకపోయేవాడు–

''నాన్నకు డబ్బు ఇయ్యకమ్మా !'' అనేవాడు –

"అడుగుతోంటే లేదనటం ఎలా ?" అనేది లక్ష్మీదేవి... 'భర్తమాట కాదన మంటావా ?' అన్న ధోరణిలో–

ఈ రకమైన మంచితనం ప్రభుకు నచ్చలేదు– రానురాను తల్లికికూడా డబ్బు అందకుండా జాగ్రత్తపడేవాడు–

తన తల్లి చాలా మంచిది–కానీ ఆ మంచితనం ఒక శతాబ్దం వెనుకటిది !

నీరజ ఆఫీస్‌రూంలో కూచుందంటే, తల్లి ఇంట్లోకి రానియ్యలేదన్న మాట ! తను తల్లిని గౌరవిస్తాడు–కానీ భయపడడు.

నీరజనుచూసి ఆప్యాయంగా నవ్వాడు–సమాధానంగా నవ్వబోయిన నీరజ ప్రభు వెనకనే వస్తోన్న నీలకాంత్‌నుచూసి ఆగిపోయింది. అంతవరకూ సహనంతో కూచున్నది, అక్కడ నిలవలేనట్లు వెళ్ళడానికి లేచింది– దారికి అడ్డు తగులుతున్నట్లు గుమ్మానికి చేతులానించి నిలబడ్డాడు నీలకాంత్. నీరజ ముఖం లోకిచూస్తూ నవ్వాడు–నించున్న నీరజ మళ్ళీ కూలబడింది–

* * * *

"కంగ్రాట్యులేషన్స్ నీరజా! గూండాల చేతుల్లో పడికూడా తప్పించుకుని బయటపడ్డావు..."

నవ్వుతూ అన్నాడు నీలకాంత్.

పాలిపోయిన నీరజ ముఖంచూసి జాలిపడ్డాడు ప్రభు.

"ఫర్‌గెట్ ఇట్ నీలకాంత్?" అన్నాడు కటువుగా.

"ఏం? నేను అన్నదాన్లో తప్పు ఏముందీ?"

"తప్పు ఉందనికాదు — ఎందుకు అనవసరంగా మనసుకు కష్టం కలిగించే విషయాలు కెలుకోవ్వటం?"

"నో! నో! ఇందులో కష్టపెట్టుకోవలసింది ఏమిలేదు."

"నీరజా! ఆ గూండా లెవరో నీకేమీ తెలియదా? డర్టీ రోగ్స్! వాళ్ళను శిక్షించకుండా వదిలిపెట్టకూడదు..." నీరజ చివ్వున తలెత్తింది — ఎర్రబారిన కళ్ళు నిప్పురవ్వలను చిమ్మాయి - అంతసెగకూ తట్టుకుని నిర్లక్ష్యంగా నవ్వాడు నీలకాంత్.

"ఇంతవరకూ జరిగిందీ జరగబోయేదానితో పోలిస్తే చాలా అల్పం నీరజా! నువ్వు ఆ గూండాలా చేతుల్లోంచి బయట పడినా, ఈ సమాజం నిన్ను మళ్ళీ వాళ్ళ దగ్గిరకు...ఇంకా అంతకంటె నీచుల దగ్గిరకు తరమక మానదు..."

'నీలకాంత్!" ప్రభు అసహనంతో అడ్డుతగిలాడు—

"సమాజమంటే అమ్మలక్కలు, స్వార్థపరులు మాత్రమే కాదు - నువ్వూ, నేనూ కూడా ఉన్నాం...మన అండ ఉన్నంత వరకూ నీరజకు భయంలేదు!"

"అవుననుకో! కానీ ఒక్క విషయం అర్థంచేసుకో! అసలు మూఢత్వమే ప్రమాదకరమైనది...అందులో సామూహికమైన మూఢత్వం మరింత పట్ట పగ్గాలు లేనిది! పరవాలేదు నీరజా! ఏ క్షణంలోనయినా నేను నీకు సహాయం చెయ్యటానికి సిద్ధంగా ఉంటాను."

ఆడపులిలా చూసింది నీరజ-

"నీ సహాయం కోరే దుర్దశ నాకు కలిగిననాడు...నాకు సహాయం చెయ్యటానికి నువ్వు బ్రతికి ఉండవు."

"నీరజా?" వారిస్తున్నట్లు అన్నాడు ప్రభు...నీలకాంత్ స్నేహంగా ప్రభు భుజంమీద చేత్తో పట్టి "పోనీలే ప్రభూ! నీరజ నన్ను అర్థంచేసుకునే రోజు రాకపోదు. అప్పటి వరకూ నేను శాంతంగా ఎదురుచూడగలను. ఇప్పుడు నేను మీ మధ్య ఉండటం మంచిది కాదు - వస్తాను-" అని నవ్వుతూనే వెళ్ళిపోయాడు.



నీలకాంత్ వెళ్ళిపోగానే నీరజ ఆర్తిగా ప్రభు రెండుచేతులూ పట్టుకుంది...

"ప్రభూ! నామాట విను! నీలకాంత్‌తో స్నేహం మానెయ్యి..."

ప్రభు వెంటనే సమాధానం చెప్పలేకపోయాడు. నీలకాంత్ చేసింది తప్పు కావచ్చును – కాని, తన తప్పు తనే ఒప్పుకుని పశ్చాత్తాపపడ్డాక కూడా క్షమించకపోవటం సమంజసమేనా?

ప్రభు, నీలకాంత్ చిన్నప్పటినుండీ స్నేహితులు కాకపోయినా ఒకరికొకరు తెలుసు... నీలకాంత్ తండ్రి బాగా పలుకుబడి ఉన్న వ్యక్తి... అంత పలుకుబడి సంపాదించిపెట్టిన డబ్బు కూడా ఉంది. సినిమాలకూ, షికార్లకూ విచ్చలవిడిగా డబ్బు ఖర్చుపెట్టే నీలకాంత్‌ను స్నేహితులంతా ఒక నాయకుడిలాగా చూసేవారు. ప్రభు ఒక్కడే నీలకాంత్ డబ్బుకు లొంగేవాడు కాదు. నీలకాంత్ ఎప్పుడూ స్టూడెంట్ లీడర్‌గా ఉండేవాడు–ఏదో ఒక విధంగా అల్లర్లు రెచ్చగొట్టడం... ఆ అల్లరిలో తను నాయకుడుగా ఉండటం అతనికి బాగా ఇష్టం... డిగ్రీ తీసుకున్నాక ప్రభు ఒక ఫరమ్‌లో ఎకౌంటెంట్‌గా చేరాడు. నీలకాంత్ మాత్రం స్టూడెంట్ లీడర్ కావాలని... స్టూడెంట్‌గానే ఉండాలని మరొక సబ్జెక్ట్‌తో మళ్ళా యమ్.ఏ.లో చేరాడు.

ఒక రోజు తన ఫ్రెండ్స్ అందరికీ ఒక హోటల్‌లో పార్టీ ఇస్తున్నాడు నీలకాంత్...నీరజతో కలిసి హోటల్‌కి వచ్చిన ప్రభును చూసాడు. వాళ్ళిద్దరూ ఫేమిలీరూంలో కూచోగానే "హలో ప్రభూ!" అంటూ తను లోపలకు వెళ్ళాడు. నీలకాంత్‌ను చూడగానే నీరజ ముఖం జేవురించింది.

నీలకాంత్ నీరజను చూస్తూ దీనంగా "నన్ను క్షమించండి! ఆ రోజు తొందరపడ్డాను. అప్పటినుంచి ఇప్పటివరకూ మీకు క్షమార్పణ చెప్పుకోవాలని చూస్తూనే ఉన్నాను'' అన్నాడు.

ప్రభు ఆశ్చర్యంగా ''మీ కిద్దరికీ పరిచయం ఉందా ?'' అన్నాడు.

నీలకాంత్ అంతకంటె ఆశ్చర్యంగా "ఈవిడ నీ కేమీ చెప్పలేదా ?" అన్నాడు.

"లేదు.''

"అబ్బా ! ఎంత విశాలహృదయం ! మీ ఇద్దరిముందు నేనే క్షుద్రుడిగా ఫీలవుతున్నాను, ప్రభూ ! నా తప్పు నేనే నీ ముందు ఒప్పుకుంటాను. నువ్వు ఏ శిక్ష విధించినా సరే, అసహ్యించుకున్నా సరే. నీకు తెలుసుగా ! నేను అప్పుడప్పుడు తాగుతాను, కొన్నిసార్లు కొంచెం ఎక్కువగా కూడా తాగుతాను. ఆరోజు ఎక్కువగానే తాగాను. మా ఇంట్లో ఎవరూ లేనప్పుడు...శీతాకోక చిలుకలను ఇంటికి రప్పించుకోవటం నాకు అలవాటే. ఆ రోజూ అలాంటి చిలుక కోసమే ఎదురు చూస్తున్నాను – నీరజ నా గదిలోకి వచ్చింది – నా కోసమే వచ్చిందనుకున్నాను చెయ్యిపట్టుకుని దగ్గరకు తీసుకోబోయాను – ఛెళ్ళుఛెళ్ళున నా రెండు చెంపలూ వాయించింది. నా మైకం దిగిపోయింది. నీరజను క్షమార్పణ కోరుకోవాలనుకున్నాను. కానీ అప్పటికే ఆవిడ వెళ్ళిపోయింది... పభూ ! నన్ను క్షమించు. నేను చేసింది తప్పు. లేదనను. కానీ, పొరపాటున జరిగింది..."

ప్రభు చేతులు పట్టుకున్నాడు. నీలకాంత్ కళ్ళలో నీళ్ళు స్పష్టంగా కనిపిస్తున్నాయి.

ప్రభు వెంటనే ఏమీ అనలేకపోయాడు. నీరజవంక చూసాడు. నీరజ పెదవులు బిగించుకుని కూచుంది...

"దట్సాల్‌రైట్ ! జరిగింది మరిచిపో !'' అన్నాడు, ఆ సందర్భంలో అంతకంటే ఏమనాలో అర్థంకాక...

"థేంక్యూ !" అని ప్రభుచేతిని సంతోషంగా ఊగించి నీరజవైపు తిరిగి మర్యాదగా తలవంచి తన స్నేహితుల మధ్యకు వెళ్ళిపోయాడు నీలకాంత్.

నీలకాంత్ వెళ్ళిపోగానే ప్రభు నీరజతో ''అతను చెప్పింది నిజమేనా ? నువ్వు వాళ్ళ ఇంటికి వెళ్ళావా ?" అన్నాడు.

"అవును, వెళ్ళాను :'

''దేనికి ?"

"ఉద్యోగం కోసం. ప్రసాదరావుగారికి చాలా పలుకుబడి ఉందనీ...ఆయనను కలుసుకుని మాట్లాడితే నాకు ఉద్యోగం తేలిగ్గా దొరుకుతుందనీ చెప్పారు. నేను ప్రసాదరావు గారింటికి వెళ్ళాను. భయపడలేదు, భయపడవలసిన అవసరం ఉంటుందని నాకు తెలియదు. నాకు నౌకరు కనిపించాడు "ప్రసాదరావు గారు ఉన్నారా ?" అని అడిగాను. "పైన ఉన్నారు, వెళ్ళండి" అన్నాడు. తీరా అక్కడ ఈ నీలకాంత్...''

ఆగిపోయింది నీరజ...నీలకాంత్ పేరు ఉచ్చరిస్తున్నప్పుడు నీరజ మనసులో మంట అంతా కళ్ళలో కనిపించింది. ప్రభు ఓదార్పుగా నీరజచేతిమీద తడ్తూ ''సరేలే : మరిచిపో :'' అన్నాడు.

''ఛీ : దుర్మార్గుడు :'' అక్కసుగా అంది నీరజ. పకపక నవ్వాడు ప్రభు.

ఆ తర్వాత నీలకాంత్ ప్రభును వదిలిపెట్టలేదు.

"ప్రభూ : అందరూ నా డబ్బుకోసం నాచుట్టూ కాకుల్లా చేరేవారే : నాకు నిజమైన స్నేహితులు లేరు. నీ స్నేహం వదులుకోలేను..." అన్నాడు.

"అదేమిటి నీలకాంత్ : ఎవరైనా నీ స్నేహం దొరకటం అదృష్టం అనుకుంటారు."

"అవును. నువ్వొక్కడివే అలా అనుకోవు. స్నేహాన్ని స్వార్థానికి మార్చుకునే కపటం నీకు లేదుగనుక. అందుకే నీ స్నేహం దొరకటం నా అదృష్టమని అనుకుంటున్నాను..."

ప్రభు తానై నీలకాంత్ స్నేహాన్ని కోరలేదు కానీ కోరివస్తోన్న నీలకాంత్‌ను పొమ్మనలేకపోయేవాడు. నీలకాంత్ రానురాను ప్రభుఇంట్లో కూడా సన్నిహితుడైపోయాడు. లక్ష్మీదేవికీ యశోధరకూ కూడా నీలకాంత్ అంటే ఇష్టమే. యశోధర నీలకాంత్‌ను కూడా "అన్నయ్యా :" అనే పిలుస్తుంది. నీలకాంత్ కూడా యశోధరను సొంత చెల్లెలులాగే చూసేవాడు. యశోధరకు పెళ్ళి సంబంధాలు నీలకాంత్ చూసేవాడు. ఒక డాక్టర్‌తో సంబంధం నిశ్చయించింది కూడా నీలకాంతే : నీరజ వచ్చినప్పుడు మాత్రం నీలకాంత్ చాలా సంకోచపడేవాడు. సాధారణంగా అక్కడి నుంచి వెళ్ళిపోయేవాడు. ప్రభు తనే బలవంతపెట్టి

నీలకాంత్‌ను కూర్చోబెట్టేవాడు... నీరజకు మాత్రం నీలకాంత్‌ను చూసినప్పుడల్లా తేళ్ళూ జెర్రలూ పాకుతున్నట్టే ఉండేది.

"ఆ నీలకాంత్‌తో స్నేహం మానెయ్యి ప్రభూ!" అనేది.

"ఏం? మళ్ళా ఏమైనా అసభ్యంగా ప్రవర్తించాడా?"

"లేదు...కానీ..."

"నీరజా! ఆనాటి సంగతి మరిచిపో! పొరపాటు అనటానికి ఆధారముందిగా! మనుష్యులను అసహ్యించుకో కూడదు!"

ఇంకేమీ మాట్లాడలేకపోయేది నీరజ.

నీరజను గూండాలు ఎత్తుకుపోయారని విన్నప్పుడు ప్రభు పిచ్చివాడై పోయాడు. నీలకాంత్, ప్రభు కూడా ఉండి ధైర్యం చెప్పాడు. నీరజ తిరిగి వచ్చిందన్న వార్తను ప్రభు ఆఫీసుకే వెళ్ళి చెప్పాడు. అలాంటి నీలకాంత్‌ను నీరజ నిష్కారణంగా అనుమానించటం ప్రభుకు నచ్చలేదు.

"ఆనాటి పొరపాటేనా? మళ్ళీ నిన్ను అవమానించాడా?" అన్నాడు.

నీరజ సమాధానం చెప్పలేకపోయింది. తన ముఖం అతనికి కనిపించకుండా తల మరింత క్రిందకు దించుకుంది.

*    *    *    *

జగమంతా చైతన్యంతో ఉన్నప్పుడు మాటుమణిగిఉండి, సూర్యుడు మాటుమణిగి లోకమంతా నిశ్శబ్దంలోకి జారుకున్నప్పుడు సందడించేవి రెండే రెండు రంగాలు- ఒకటి వ్యభిచారగృహాలు-రెండు దొంగల గుంపులు

రాజేశ్వరి ఆధ్వర్యాన ఆ వ్యభిచార గృహం చాలా సందడిగా ఉంది. కొందరు గుంపులుగాచేరి పాటలు పాడుకుంటున్నారు. మరికొందరు ఇంకా చిన్నవాళ్ళ దేన్స్ నేర్చుకొంటున్నారు. మూసుకున్న తలుపుల వెనకనుంచి కిలకిలారావాలు వినిపిస్తున్నాయి. తమ సరసుడు బానబొజ్జవాడయినా, చిడుమువంటివాడయినా, మొరటువాడయినా, అర్భకుడయినా, వాళ్ళుమాత్రం అలా నవ్వుతూనే వున్నారు, నవ్వడానికే పుట్టినట్లు...కన్నీరు కార్చే అధికారం శాశ్వతంగా పోగొట్టుకున్నట్లు తన పక్కనే పడుకున్న వాడి జుట్టులోకి వేళ్ళుపోనిచ్చి ఆప్యాయంగా నిమురుతూ ఏదో చెప్పబోయి ఆగిపోయింది సుశీల......

"ఏమిటి?" అన్నాడు బాలూ...

"ఏంలేదు. నేను చెప్పినా మీరు నమ్మరు."

బాలూ నవ్వాడు.

"ఎందుకు నవ్వుతున్నారు?"

"నేను నమ్మటం వలన నీకు లాభంగాని, నమ్మకపోవటం వలన కలిగే నష్టం గాని ఏమైనా ఉందా?"

"ఉంది. మీరు నమ్మగలిగితే నాకు ఆనందం కలుగుతుంది."

"అయితే చెప్పు!"

"ఎందుకు? నా ఆనందంకోసం నమ్మినట్లు అబద్ధమాడతారా?"

"ఎంతపిచ్చిదానివి? మా ఆనందంకోసం మీరు అబద్ధాలాడవలసిందేకాని, మాకేంకర్మ! మేం నిర్భయంగా నిజాలు చెప్పగలిగేచోటు ఇదే!"

సుశీల ఒక నిట్టూర్పు విడిచింది—నిదానంగా అంది. "పాతివ్రత్యం అంటే నాకు తెలియదు. పతివ్రతగా ఉండే అవకాశమూ రాలేదు. కానీ మీరు నాకు తెలిసిన తరువాత...ఇంకెవరితోనూ గడపలేకపోతున్నాను. మరొకరి చెయ్యి నామీదపడితే నరకం అనుభవిస్తున్నాను..."

బాలూ ఏ సమాధానమూ చెప్పలేదు. 'నామాటలు నమ్మరా?' అని సుశీల అడగలేదు...

సుశీల పక్కన పడుకున్న బాలూ చటుక్కున లేచాడు సుశీల బిత్తరపోయి చూస్తూ ఉండగానే తన జేబులోంచి నోట్లు తీసి సుశీలకిచ్చాడు...

"ఇవి దేనికి?"

"నేను మళ్ళీ పదిహేనురోజులకి గాని రాను. అప్పటివరకూ మిగిలిన నరసుల బారినుండి నువ్వు తప్పించుకోవటానికి..."

"ఈ డబ్బు మీరు నాకిచ్చినంత మాత్రాన మిగిలినవాళ్ళను నేను రానియ్యనని నమ్మకమేమిటి?"

బాలూ గట్టిగా నవ్వాడు. అప్పుడప్పుడు అతను అలాగే నవ్వుతాడు. ఎదుటి వాళ్ళ తెలివితక్కువతనాన్ని చూసి జాలిగా నవ్వుతున్నట్లు ఉంటుంది అది. ఆ నవ్వంటే సుశీలకు చాలా ఇష్టం...

"నేను ఈ డబ్బు ఇచ్చింది నిన్ను నాకే ఉంచుకోవటానికి కాదు. నువ్వు నరకం అనుకునే దానినుండి తప్పించుకోవటానికి..."

"ఒకవేళ నేను మిమ్మల్ని మోసంచేస్తున్నానేమో!"...

"అయినా బాధలేదు. నేను ఈ డబ్బు మోసంతో సంపాదించినదే!"

"నేను నమ్మను? మీరు మోసం చెయ్యరు!"

"నీ కెలా తెలుసు?"

"మీరు మంచివారు! ఆ మాట మీ ముఖంమీద స్పష్టంగా వ్రాసి ఉంది..."

మనసు కలుక్కుమంది బాలూకు! అందరూ ఇదే పాట! నువ్వు మంచివాడివి అని...'కాను...కాను...కాను' అని అతడు ఎంత మొత్తుకున్నా ప్రయోజనం లేకపోతోంది. తను మంచివాడుకాదు! ఏ మాత్రమూ కాడు! మరి, తన ముఖం ఎందుకు మంచివాడి ముఖంలా ఉండాలి? తను ఇంకా ఎంత చెడ్డవాడైతే తన ముఖం చెడ్డవాడి ముఖంలా తయారవుతుంది? "నన్ను ఎన్ని తిట్లు తిట్టినా సహిస్తాను. కాని, 'మంచివాడు' అని మాత్రం అనకు..."

చిరునవ్వుతోనే శాసిస్తున్నట్లుగా అన్నాడు. బాలూలో సుశీలకు వింతగా అనిపించేది అది ఒకటి...ఉండుండి అత నేదో శాసిస్తున్నట్లు అంటాడు. చిరునవ్వుతోనే అంటాడు. అయినా ఆ మాట కాదనటానికి మాత్రం ఎవరికీ దమ్ములుండవు.

"నమ్మాను!"

"ఒక వేశ్యను! డబ్బుకోసం ఎలాటి మాటలైనా మాట్లాడగలిగిన దానిని నా మాటలు నమ్మగలిగారా?"

''నమ్మగలిగాను – నువ్వు నన్ను ప్రేమిస్తున్నావని అర్థంచేసుకున్నాను గనక..."

సుశీల ముఖం వింతకాంతితో వెలిగింది.

"నేను మిమ్మల్ని...సరే, ఎప్పుడు అర్థంచేసుకున్నారు?"

"నీకు నేను 'సుశీల' అని పేరుపెట్టిన రోజు..." సుశీల మనసు ఆనందంతో నిండిపోయింది.

బాలూ అందగాడు. బాహ్య సౌందర్యాలకు మురిసిపోయే దశ ఏనాడో దాటిపోయింది సుశీలకు. ఇప్పుడావిడకు, అందంగాడూ, వికారీ...అందరూ ఒకటే! బాలూ తరచు వచ్చేవాడుకాదు–నెలకొకసారి వస్తే గొప్ప...వచ్చినప్పుడల్లా సుశీల దగ్గరకే వచ్చేవాడు.

సుశీల ఒకసారి సరదాగా "ఎప్పుడూ నాదగ్గిరకే వస్తారు. నేను అంత అందంగా ఉంటానా?" అంది.

"నీకంటె అందమైన వాళ్ళను లక్షమందిని చూసాను!"

''మరి?..."

"నీలో ఏదో పోలిష్డ్ నేచర్ ఉంది. బహుశః పెద్దింటి పిల్లవు అయి వుంటావు..."

''ఓహో! పెద్దింటి పిల్లననే గౌరవంతో వస్తున్నారా?" అక్కసుగా అంది.



"కాదు. నీ దగ్గర మరొక మనిషితో...సాటి మనిషితో కాలం గడిపిన సంతృప్తి కలుగుతోంది నాకు-అందుకని వస్తున్నాను..."

తెల్లబోయి చూసింది సుశీల...'సాటి మనిషితో కాలం గడపగలిగిన సంతృప్తి... సాటి మనుష్యులతో కాలం గడపగలిగే అవకాశం ఇతనికి లేదా? ఇంత డబ్బున్న ఆసామికి...'

మరొకసారి బాలూ సుశీలను దగ్గరకు అదుముకోబోతోంటే 'అబ్బా' అంది సుశీల.

"ఏం?" అన్నాడు బాలూ.

"ఉదయం జారిపడ్డాను. నడుము కొద్దిగా పట్టింది. పరవాలేదులెండి!"

సుశీల తనే దగ్గరగా రాబోయింది. బాలూ సుశీల చేతులు మృదువుగా తొలగించి "నిద్రపో! నిద్రలో అదే సర్దుకుంటుంది" అన్నాడు.

తెల్లబోయింది సుశీల.

"అయితే మీ డబ్బు మీ కిచ్చేస్తాను."

"నేను వెళ్ళిపోవటంలేదు. ఇక్కడే ఉంటాను. అంచేత ఆ డబ్బు తీసుకోలేను..."

అటువైపు తిరిగి కొన్ని క్షణాలలోనే హాయిగా నిద్రపోయాడు బాలూ.

నిద్రపోతున్న బాలూను చూసిచూసి నెమ్మదిగా అతనికి మెలకువ రాకుండా

మీద చెయ్యివేసింది సుశీల. తనంత తానుగా ఎవరినైనా ఆపేక్షతో స్పృశించటం, చాలా రోజుల తరవాత అదే మొదటిసారి సుశీలకు.

మూడు గంటలకు ఎవరో లేపినట్లు లేచి కూచున్నాడు బాలూ.

సుశీల నవ్వి "నేను మిమ్మల్ని లేపకూడదని అనుకున్నాను..." అంది.

"నువ్వు నిద్రపోలేదా?"

బాలూ జాలిగా చూశాడు.

"పాపం! మమ్మల్ని ఆనందపెట్టడానికి ఎంత త్యాగం చేస్తున్నారు మీరు!"

నిర్ఘాంతపోయింది సుశీల.

తమ వృత్తిని గురించి ఇంతవరకూ ఎందరెందరో ఎన్నెన్ని రకాల మాటలో అన్నారు. కొందరు సమాజానికి చీడపురుగులని అన్నారు. మరికొందరు జలగలని అన్నారు. కొందరు ఉదారులు సానుభూతి చూపి, జాలిపడ్డారు. కాని 'త్యాగం' అనే మాట మాత్రం ఇంతవరకూ ఎవ్వరూ వాడలేదు.

"ఏమన్నారు? మళ్ళీ అనండి!" అంది.

"ఏమో! మరచిపోయాను!" నవ్వి వెళ్ళడానికి లేచాడు బాలూ.

సుశీల మంచంమీదనుంచి లేచి బాలూ రెండు చేతులూ పట్టుకుని కళ్ళకద్దుకుంది.

బాలూ తన చేతులకయిన తడిని చూసుకున్నాడు. సుశీల చెమ్మగిల్లిన కళ్ళను చూశాడు. తలవంచుకుని వెళ్ళిపోయాడు.

అప్పటినుండే సుశీల మనసు బాలూ రాకకోసం ఆరాటంతో ఎదురుచూడసాగింది. అతడు వెళ్ళిపోతుంటే 'అప్పుడేనా?' అనిపించేది. అయినా నోరు విప్పి ఏమీ మాట్లాడేదిగాదు. తనలాటి వ్యక్తి నోట ప్రేమ సంభాషణలు ఎంత హాస్యాస్పదంగా ఉంటాయో ఊహించలేని వ్యక్తి కాదు సుశీల. అంతేకాదు, వెనకటిలా కృత్రిమపు అల్లరి మాటలు కూడా మాట్లాడలేకపోతోంది.

"నీ పేరేమిటి?" అన్నాడు ఒకనాడు బాలూ.

"మాకు ఒక పేరని ఏముంది? ఇక్కడికి వచ్చే మీరంతా మీ వివరాలు చెప్పరు—మా వివరాలు అక్కర్లేదు. ఎవరికి కావలిసిన పేరుతో వాళ్ళు పిలుచుకుంటారు. రాణీ అనో జానీ అనో...మీరే చెప్పండి. నాకు ఏ పేరు పెడతారో..."

"నాకు మూడ్ వచ్చినప్పుడు పెడతాను. ఇప్పుడు కాదు!"

రానురాను సుశీల మనసు మరీ బాలూతో నిండిపోసాగింది. అతడు తన

దగ్గర ఉండే కొద్దిపాటి సమయంలో అతనికి తన దగ్గర ఉన్నదంతా...ఇంకా ...ఇంకా ఎలా అర్పించుకోగలనా అని ఆరాటపడేది.

బాలూ చేతిని తన చెక్కిలి కానించుకుని తన్మయత్వంతో కళ్ళు మూసుకున్న సుశీలను చూసి "నీకు పేరు పెడతాను" అన్నాడు బాలూ.

"పెట్టండి.?"

"సుశీల!"

ఉలిక్కిపడింది సుశీల.

"నన్ను వెటకారం చేస్తున్నారా ?"

"లేదు! లేదు! నిన్ను నిజంగా అలా పిలుచుకోవాలని అనిపించింది."

సుశీల వెక్కి వెక్కి ఏడ్చింది. సుశీల ఏడుపు మరిచిపోయి ఎన్నో రోజు లయింది అన్ని రోజులుగా పేరుకున్న దుఃఖమంతా పొంగివచ్చింది.

"ఒకప్పుడు నేను నిజంగా ఆ పేరుకు తగినదానినే ఒక దుర్మార్గుడు అమాయకురాలిని నన్ను ప్రేమ పేరుతో మోసగించాడు. గుళ్ళో స్నేహితులందరి ముందూ పెళ్ళి కూడా చేసుకున్నాడు. ఆ తరవాత ఈ ఊరు తీసుకొచ్చి ఈ బ్రోతల్ కి అమ్మేసాడు. ఎన్నెన్నో ప్రణయ కలాపాలకూ, అంతులేని వాగ్దానా లకూ తీయని అనునయాలకూ మూల్యం ఇది!"

"బాధపడకు! పోనీ, ఇప్పుడు బయటపడాలని అనుకుంటున్నావా?"

"ఇప్పుడా? ఎందుకు ? ఆ బయటి సమాజంలో బాధలకంటె ఈ బ్రతుకే నయం! చెడిపోయినదాన్ని అని నన్ను తరిమి తరిమి పీక్కు తినరూ! మీరు 'సుశీల' అంటున్నారు..."

"నాకు మాత్రం నువ్వు సుశీలవే! అంతకంటే నే నేంచెయ్యగలను?"

"ఏం చెయ్యలేరూ? మీరు మంచివారు. చదువూ, సంస్కారమూ ఉన్నవారు. ఇప్పటికైనా అలాంటి దుర్మార్గుల్ని నాశనం చెయ్యలేరూ? సమాజంలో జరుగు తోన్న అన్యాయాలను ఎదుర్కోలేరూ?"

బాలూ ముఖం పాలిపోయింది.

తను సమాజంలో జరుగుతోన్న అన్యాయాలను ఎదుర్కోగలడా అంత శక్తి తనకు ఉంటే...

* * * * *

బాలూ కమర్షియల్ టేక్స్ ఇనస్పెక్టరయ్యాడు. ఇంచుమించు ప్రతి ఒక్కరూ అతని అదృష్టానికి అసూయపడుతూ కంగ్రాట్యులేట్ చెయ్యసాగారు. బాలూ

ఆశ్చర్యపడుతూ "ఇది మామూలు ఉద్యోగమే కదా! ఇందులో అంతగా అభినందించవలసినంత ఏముంది!" అన్నాడు.

"చాల్లేవయ్యా! ఉద్యోగం మామూలుదే. కానీ ఈ మామూలు ఉద్యోగంలో వచ్చే మామూళ్ళు మాత్రం మామూలుగా ఉండవు–" అని వచ్చింది సమాధానం...

లంచాలుపట్టే అవకాశం ఉన్న ఉద్యోగం దొరకటం అదృష్టంగా భావించటం...ఆ విషయాన్ని బాహాటంగా ప్రకటిస్తూ అభినందించటం... ఇంకా పూర్తిగా బండబారని బాలూ మనసుకు విడ్డూరంగానే తోచింది. తనను అభినందించే ఇందరిలో ఒక్కరికైనా 'లంచం పట్టనివాళ్ళుకూడా ఉండవచ్చు–' అనే ఊహకూడా రావటంలేదు

ఉద్యోగంలో చేరాక ఈ లంచాలు తీసుకోవడం ఎంత 'మామూలు' విషయమో మరింత బాగా అర్థంకాసాగింది బాలూకు.

మొదటిసారి బాలూ ముఖం చిట్లించుకుని "నా దగ్గర ఈ ప్రస్తావన తేకండి" అన్నప్పుడు అవతలి వ్యక్తి బాలూ లంచం వద్దని అంటున్నాడని ఊహించుకోలేకపోయాడు.

"ఈ రేటు మీకు గిట్టుబాటు కాదా? పోనీ మీ మనసులో ఏముందో చెప్పండి– ఆలోచిద్దాం;" అన్నాడు దర్జాగానే.

"దయచేసి మరొకసారి ఇలాటి మాటలు మాట్లాడకుండా వెళ్ళిపోండి– లేకపోతే ఈ వ్యవహారం చాలా దూరం వెళ్తుంది." అన్నాడు కోపంగా.

అప్పటికి అవతలి వ్యక్తి కొంచెం ఆశ్చర్యంగా "మీ ఉద్దేశం ఏమిటో స్పష్టంగా చెపితే..." అంటూ నాన్చాడు.

"గెటవుట్" అని అరిచాడు బాలూ గట్టిగా, ఆఫీస్ ప్రతిధ్వనించేలా...

అప్పటికికాని ఆ పెద్దమనిషికి బాలూ నిజంగా లంచం వద్దంటున్నాడని అర్థంకాలేదు–అర్థమయ్యేక "వెధవ్వేషాలు!" అని సణుక్కుంటూ వెళ్ళిపోయాడు బాలూ మామూళ్ళు తీసుకునే మనిషి కాదని అందరికీ తెలిసిపోయింది. అందరికీ బాలూ అంటే ఒక చులకన భావం ఏర్పడిపోయింది–అంతటా అవినీతి విచ్చలవిడిగా నాట్యంచేస్తున్న మాట నిజమే! కానీ ఇటీవల కొందరు పనికిమాలిన అధికారులు బాలూ లాంటి పైత్యకారులూ...అవినీతిని నిర్మూలించటానికీ... లంచగొండులను పట్టుకోవటానికీ కూడా పూనుకుంటున్నారు! బాలూ లాంటి

వాళ్ళ మూలంగా పట్టుబడితే పరువుపోతుంది. ఉద్యోగమూ పోతుంది.

ఒకసారి బాలూకు కొంచెం కలనొప్పిగా ఉండి ప్యూన్‌ని కాఫీ తెమ్మన్నాడు.

"నేను తేలేను సార్! అది నా పని కాదు!" అన్నాడు వాడు విసురుగా.

పక్కకు వెళ్ళి బాలూకు వినపడేలాగానే "రూపాయి మామూలు దక్క నియ్యడు కాని కాఫీ కావాలట, కాఫీ..." అన్నాడు అక్కసుగా... మిగిలిన వాళ్ళంతా ఘొల్లున నవ్వారు...

తనను చూసి ఎందుకు నవ్వుతున్నారో బాలూకు తెలుసు-ఎందుకు నవ్వు తున్నారో అర్థంకావటంలేదు.

మొదటి నెల జీతం అందుకుని తల్లి చేతిలో పెట్టినప్పుడు బాలూ ఆనందానికి అంతులేదు-అతనికి ఈ లోకంలో ఉన్నది తల్లి ఒక్కర్తే!

బాలూ తల్లి అందమైనదే! గుణవంతురాలు కూడా! అయినా బాలూ తండ్రి మరొకతెను తెచ్చుకున్నాడు-బాలూతల్లిని ఇంట్లోంచి వెళ్ళిపోయేలా చేశాడు. ఈ కథ తల్లినోటనే విన్నాడు బాలూ. ఆ సంగతి చెప్తున్నప్పుడు బాలూ తల్లి ఏనాడూ భర్తను నిందించేది కాదు...ఏదో కథ చెప్తున్నట్లు చెప్పేది-ఆ తర్వాత బాలూతల్లి అన్నగారి పంచనచేరింది. అన్నగారికి,వదినగారికి కూడా బాలూతల్లిపట్ల ఎలాంటి ఆదర భావమూ లేదు. ఆర్థికంగా బాలూ తల్లి అన్నమీద ఆధారపడి లేదు-ఆవిడ సంగీతం నేర్చుకుంది. మెట్రిక్ పాసయింది. భర్త దగ్గరనుంచి విడి పోగానే ఒకస్కూల్‌లో సంగీతం టీచర్‌గా చేరింది-తన మావ, అత్త అనే మాటలు భరించలేక, బాలూ "అమ్మా, ఇక్కడినుండి వెళ్ళిపోదాం!" అనేవాడు జ్ఞానం వచ్చిన దగ్గరనుండే...

"వద్దు బాలూ! వయసులో ఉన్న ఆడదాన్ని ఒంటరిగా ఉండటం మంచిది కాదు-ఎన్ని గొడవలున్నా మనం మామయ్య దగ్గరే ఉండాలి!" అనేది.

బాలూ చదువు విషయంలో తల్లి ఏమాత్రమూ అశ్రద్ధ చెయ్యలేదు-చదువు కోవటంలో బాలూకూడా అశ్రద్ధ చెయ్యలేదు.

అన్న పిల్లలు పెరిగి పెద్దవాళ్ళయ్యాక, బాలూ ప్రయోజకుడయ్యాక, వృద్ధాప్యం మీదపడ్డాక అప్పుడు అన్నదగ్గరనుండి విడిపోయింది బాలూతల్లి...

తల్లి చేతిలో తన జీతమంతా పెట్టిన ఆనందం ఎక్కువ కాలం నిలవలేదు బాలూకి. ఆ మరునాడే తల్లి అందమైన నూటుబట్ట బాలూకోసం కొని తెచ్చింది.

"చూడు! బాగుందా?" అంది.

బాలూ చాలా బాధపడ్డాడు...

"అలా అయిపోయావేం? నా సెలక్షన్ నీకు నచ్చలేదా?" చిరునవ్వుతో అంది. అతడు ఎందుకు బాధపడుతున్నాడో అర్థమయినా...

"అది కాదమ్మా! నిన్ను చీరలు కొనుక్కోమన్నాను..."

"-న్నావు-నాకు సూటుగుడ్డ కొనాలనిపించింది, నేను స్వార్థపరురాలినిరా! నా ఆనందమే నాకు ప్రధానం..." నవ్వుతూ అంది బాలూ తల్లి.

చినప్పటినుండి కష్టాలనే అనుభవిస్తూ చిరునవ్వు నవ్వుతోన్న ఆ 'స్వార్థపరురాలి' ముఖంలోకి చూస్తూ మరేమీ మాట్లాడలేకపోయాడు బాలూ.

తన తల్లి కళ్ళలో ప్రతిఫలిస్తోన్న ఆనందం...అది చాలు అతనికి!.

సేఠ్ రమణ్‌లాల్ పేరు తెలియనివాళ్ళు ఉండరు-అతనికి అనేక రకాల వ్యాపారాలున్నాయి. లెక్కలేనన్ని మేడలున్నాయి. అందమైన కార్లు ఉన్నాయి-

అలాంటివాడు బాలూ దగ్గరకొచ్చాడు

మొట్టమొదట అందరూ ఈర్ష్యపడ్డారు-కానీ మరుక్షణం బాలూ స్వభావం గుర్తుకొచ్చి స్థిమితపడ్డారు.

బాలూ జ్ఞానవంతుడే కాని లోకజ్ఞానం లేనివాడు-రమణ్‌లాల్ పేరు విన్నాడు-అతని పలుకుబడి గ్రహించాడు-కానీ, అతణ్ని ఎదిరిస్తే ఏమవుతుందో మాత్రం తెలుసుకోలేకపోయాడు.

అందరి ముందు లాగనే అతనిముందు తల అడ్డంగా ఆడించాడు.

రమణ్‌లాల్ బాలూను పరిశీలనగా చూస్తూ చిరునవ్వు నవ్వాడు.

"నా పని నేను ఎలా అయినా సాధించగలను-చిన్నవాడివని దయతో చెప్తున్నాను-మరొకసారి ఆలోచించు..."

"ఇందులో ఆలోచించవలసింది ఏమీ లేదండీ! ఇలాంటి పనులు నావల్ల కాదు!"

కచ్చితంగా చెప్పాడు బాలూ.

రమణ్‌లాల్ విసుగ్గా దర్జాగా వెళ్ళిపోయాడు. తర్వాత రమణ్‌లాల్ కమర్షియల్ టేక్స్ ఆఫీసర్‌నే డైరెక్టెగా కలుసుకున్నాడు. అతని పని నిముషాలలో తెమిలిపోయింది. బాలూ విషయం సూచనగా ఆఫీసర్‌తో అన్నాడు రమణ్‌లాల్.

ఆ తర్వాత కొంచెం రోజులలోనే బాలూమీద విపరీతంగా లంచాలు తీసుకుంటున్నాడని నేరం మోపబడింది. ఆఫీస్‌లో అందరూ ఏకగ్రీవంగా బాలూ లంచగొండి అని సాక్ష్యం చెప్పారు. బాలూను ఉద్యోగంలోంచి డిస్మిస్ చేసారు...

"బాలూ ! నువ్వు లంచం తీసుకున్నావా ?" అడగలేక అడగలేక అడిగింది తల్లి...ఎంత శాంతంగా అడిగినా ఆవిడ కంఠధ్వనిలో బాధ స్పష్టంగా వినిపిస్తోంది.

"లేదమ్మా లేదు ! నేను ఎన్నడూ ఏ అన్యాయమూ చెయ్యలేదు..."

అంతవరకూ పరిస్థితులను ఎంతో స్థైర్యంగా ఎదుర్కొన్న బాలూ కన్నీళ్ళతో దీనంగా అన్నాడు.

కదిలిపోయింది తల్లి...

"పరవాలేదులే బాబూ ! నువ్వు నిజాయితీగా ఉన్నావు. అంతే చాలు ! మరొక ఉద్యోగం దొరుకుతుందిలే" అంది. కానీ అది అంత తేలిక కాదని బాలూ అనుభవంతో తెలుసుకున్నాడు. చేస్తున్న ఉద్యోగం పోగొట్టుకున్నాడు, అదీ బ్లాక్ మార్క్‌తో. మరొక ఉద్యోగం ఎవరిస్తారు ?

అతను దారిలో వెళ్తుంటే "అదిగో, అతని గురించే మొన్న పేపర్లో పడింది. లంచాలు తీసుకోవటం వల్ల ఉద్యోగం పోయిందిట !" అని స్పష్టంగా బాలూకి వినిపించేలాగ చెప్పుకునేవారు.

"మంచి పని జరిగింది. ఇలా పదిమందికి జరిగితేకాని దేశంలో లంచగొండి తనం పోదు," అని సంతోషిస్తూ నీతినిజాయితీల పట్ల తమకు గల అభిమానాన్ని ప్రకటించుకునేవారు.

మూడు నెలలు గడిచిపోయాయి. ఉద్యోగం దొరకలేదని బాధ...సమాజంలో వెలివేసినట్లు చూడబడుతున్నానని బాధ...ఆర్థికమైన ఇబ్బందులకు తట్టుకోలేక బాధ. అన్ని బాధలనూ మించిన బాధ...తన తల్లి కళ్ళలో దైన్యం చూడలేని బాధ...

తట్టుకోలేకపోయాడు బాలూ...తిన్నగా రమణ్‌లాల్ దగ్గరకు వెళ్ళాడు. బాలూను చూసి ఆశ్చర్యపోయాడు రమణ్‌లాల్

"ఇదేమిటి ? నా దగ్గరకు ఎందుకు వచ్చారు ?"

"మీ మూలంగానే నా ఉద్యోగం పోయింది. ఇప్పుడు నాకు మీరే ఉద్యోగం ఇప్పించాలి !"

"అప్పుడు మీరు నామాట వినలేదు. ఇప్పుడు నేను మీకు ఎందుకు సహాయం చేస్తాను ?"

"మీరు సహాయం చెయ్యగలరు, చేస్తే ఈసారి మీమాట కాదనను ఎలాంటిదైనా సరే ! ఏ సందర్భంగా అయినా సరే !"

రమణ్‌లాల్ కళ్ళు మెరిసాయి...

"సరిగా ఆలోచించుకుని అంటున్నాను. నేను ఇంతవరకూ అబద్ధాలాడ లేదు..."

"ఇంకముందు నేను అబద్ధాలే ఆడమంటే ?"

"ఆడతాను !"

"గుడ్ ! మీకు నేను ఉద్యోగం ఇయ్యగలను. జీతం కూడా చాలా ఉంటుంది. మీరు ఆశించినదానికంటె...మీ డిగ్రీతో సంపాదించ గలిగిన దానికంటే చాలా చాలా ఎక్కువగా ఉంటుంది..."

"థాంక్స్ !..."

"ఆగండి. ఈ ఉద్యోగంలో మీరు ఒకచోట స్థిరంగా ఉండరు. ఈ ఊరు నుంచి ఆ ఊరికి తిరుగుతూ ఉండాలి."

బాలూ ఒక్క క్షణం సమాధానం చెప్పలేకపోయాడు.

"ఏం ? ఇష్టంలేదా ?"

"ఇష్టమే !"

"ఊళ్ళవెంట తిరిగేటప్పుడు మీరు ఒంటరిగానే ఉండాలి. మీకు అప్పుడప్పుడు ఆఫ్ వస్తూఉంటుంది, అప్పుడు మాత్రమే కుటుంబాలతో ఉండవచ్చు..."

తను ఒక్కరోజు కనపడకపోయినా తల్లడిల్లిపోయే తల్లి ముఖం కళ్ళ ముందు మెదిలింది బాలూకి...

"ఏం ? ఈ ఉద్యోగం వద్దా ?"

"కావాలి !"

"మరొక మాట ! మీరు ఎక్కడెక్కడ తిరుగుతారో ఆ చిరునామాలన్నీ మీ ఇంట్లోవాళ్ళకి తెలియకూడదు...ఏదో ఒక హోటల్ అడ్రస్ ఇస్తాము. ఉత్తర ప్రత్యుత్తరాలన్నీ ఆ అడ్రస్‌కే జరగాలి..."

"అలాగే ?"

"ఎక్కడ ఏ కొంచెం హెచ్చుతగ్గు వచ్చినా మీకే ప్రమాదం !"

"ఆ భయం అక్కర్లేదు. మరోసారి ఎలాంటి ప్రమాదంలోనూ చిక్కుకోను !"

రమణ్‌లాల్ పకపక నవ్వాడు.

బాలూ తల్లికి బాలూ ఉద్యోగం ఏ విధంగాను సంతోషాన్ని కలిగించలేదు.

"నిన్ను విడిచి నేను ఉండలేను బాలూ !" అంది కన్నీళ్ళతో.



"తరచు సెలవులు వస్తూ ఉంటాయమ్మా! అప్పుడు మనం కలిసే ఉండ వచ్చును..."

"ఏమో!" కృంగిపోతూ అంది...

అంతకంటే కృంగిపోతున్నాడు బాలూ...

"అమ్మా! నువ్వు గట్టిగా వద్దు అంటే నేను వెళ్ళను. ఈ ఉద్యోగం కూడా వదులుకోమని అనకు..."

"వద్దు! వద్దు! ఇది వదులుకోకు! వెంటనే చేరిపో! నువ్వనట్లు సెలవులు ఇవ్వగానే కలుసుకోవచ్చును..."

ఆలోచనల కన్నింటికీ స్వస్తిచెప్పి రమణ్‌లాల్ దగ్గిరకు వచ్చేసాడు బాలూ...

రమణ్‌లాల్‌కు స్మగిలింగ్ వ్యాపారాలు చాలా ఉన్నాయి. ఆ గేంగ్‌లో బాలూని కూడా చేర్చుకున్నాడు. విషయం అర్థమయ్యాక కూడా బాలూ పెద్దగా బాధపడలేదు. మంచికీ చెడ్డకీ అతనికి భేదం లేకుండా పోయింది. తను చాలా డబ్బు సంపాదిస్తాడు. తన తల్లిని చివరిరోజులలోనయినా సుఖపెడ్తాడు. అది చాలు...

తన చేతికి డబ్బురాగానే తల్లికి మనియార్డర్ చేసాడు...ఇంచుమించు నెల రోజుల తర్వాత ఆ మనియార్డర్ బాలూకే తిరిగివచ్చింది...నిర్ఘాంతపోయాడు

బాలూ. ఏమయిపోయింది తన తల్లి? ఇంటికి వెళ్ళాడు. తను వెళ్ళగానే తల్లికి జబ్బుచేసిందనీ మేనమావ తీసికెళ్ళాడనీ తెలిసింది. హోటల్‌వాళ్ళకి మేనమావ అడ్రస్ తెలీదు. తెలుసుకోవలసిన అవసరం వాళ్ళకు లేదు. అందుకే డబ్బు తిరిగి వచ్చింది.

మేనమావ దగ్గరకు వెళ్ళాడు. బాలూను చూస్తూనే మండిపడ్డాడు మేనమావ...

"ఆహా! ఏం సుపుత్రుడివిరా నాయనా! ఎంత తీరిగ్గా వచ్చావు?" అన్నాడు.

"అమ్మ ఏది?"

"ఇంకెక్కడి అమ్మ? తల్లి చావుబ్రతుకులలో ఉంటే పత్తా తెలియకుండా పోయావు. ఏం ఉద్యోగంరా, బోడి ఉద్యోగం. మీ అమ్మ నిన్ను కలవరించి కలవరించి ప్రాణాలు వదిలింది. చివరికి కర్మలు కూడా నేనే చెయ్యవలసి వచ్చింది..."

'అమ్మ చచ్చిపోయింది...' బాలూ మనసు హోరుమంటుంది. అతనికి కన్నీళ్ళు రావటంలేదు. అలా కూర్చున్నాడు. మేనమావ కంగారుపడి కుదుపుతూ "బాలూ!" అన్నాడు.

"అమ్మ ఎలా పోయింది?"

"దరిద్రులంతా ఎలా పోతారో అలాగే! రెండుమూడు నెలలుగా నీకు ఉద్యోగం లేదటగా! ఉన్నదేదో నీకు పెట్టి తను ఉపవాసాలు చేసిఉంటుంది. బాగా నీరసించింది. గుండెనొప్పి వచ్చింది. దానికి తోడు నీకోసం మనోవ్యథ..."

బాలూ కూచున్నచోటినుంచి లేచి బయలుదేరాడు.

"ఎక్కడికిరా?" అన్నాడు మేనమావ.

వెనక్కు తిరగకుండానే "శ్మశానానికి!" అన్నాడు బాలూ.

మేనమావ విసుక్కుని ఊరుకున్నాడు. బాలూ శ్మశానంలో తన తల్లి తగలబడిన చోటు చూశాడు. అక్కడి మంటలను చూస్తూ అక్కడే కూర్చుండి పోయాడు.

మరునాడు పీక్కుపోయిన ముఖంతో ఇంటికివచ్చిన బాలూనుచూసి "స్నానం చేసి భోజనానికి రా!" అన్నాడు మేనమావ ముఖం చిట్లిస్తూ.

"నేను వెళ్ళిపోతున్నాను."

"వెళ్ళు!"

"చిన్నమాట!"

"స్నానం చెయ్యకుండా నేను నిన్ను ముట్టుకోను!"

"ముట్టుకోకుండా ఈ డబ్బు తీసుకో!"

డబ్బుమాట వినగానే మేనమావ గభాలున ముందుకువచ్చాడు. డబ్బుకు మైల లేదు.

బాలూ ఇచ్చిన డబ్బు ఆత్రంగా లెక్కపెట్టుకుని నిర్ఘాంతపోయాడు. రెండు వేలు!

"వద్దురా బాలూ! నామీద ఇంత అభిమానం చూపించకు. అందుకు నేను అర్హుణ్ని కాను."

"నా తల్లిని చివరిరోజులలో ఆదుకున్నావు. అంతకంటె ఏం చెయ్యాలి మావయ్యా!"

"ఒరేయ్ బాలూ! నీ ముందు అబద్ధ మాడలేకపోతున్నానురా! మీ అమ్మను, నాచెల్లిలిని నేనేం ఆదుకున్నానురా! దానికి పళ్ళూ, పాలూ, టానిక్కులూ ఇచ్చి మంచి వైద్యం చేయిస్తే బ్రతికేదేమో! అవన్నీ నేనెక్కడ తేగలనురా!"

"అయితే అమ్మ పోషణలేక, సరిఅయిన వైద్యంలేక చచ్చిపోయిందంటవా మావయ్యా?"

"అక్షరాలా అంతేరా! చచ్చిన దానిమీద అబద్ధాలాడి ఆ డబ్బు గుంజుకో లేను. నీ డబ్బు నువ్వే తీసుకో!"

"వద్దులే మావయ్యా! ఉంచుకో! ఆడబ్బు దగ్గరపెట్టుకుని నేను బ్రతకలేను!"

"ఎంత మంచివాడివిరా!"

"ఆ మాట మాత్రం అనకు మావయ్యా!" కసురుతున్నట్లు అని చర చర వెళ్ళిపోయాడు బాలూ.

ఎవరైనా తనను 'మంచివాడు' అంటే మాత్రం సహించలేడు సుశీల మళ్ళీ ఆ మాట అనగానే ''నీకు తెలియదు. నేను చాలా దుర్మార్గుణ్ని'' అన్నాడు.

"నేను నమ్మను. ఒకవేళ మీరు ఏదైనా కానిపని చేసినా అది పరిస్థితుల ప్రభావంవల్ల కావచ్చు."

విరగబడి నవ్వాడు బాలూ.

"'మైడియర్! 'మంచివాడు' అని తేలిగ్గా అనేస్తారు. మంచివాడు కావటం మాటలుకాదు. అందుకు చాలా చాలా శక్తి కావాలి! పరిస్థితులు సవ్యంగా ఉంటే అందరూ మంచివాళ్ళే! ప్రతికూలించినప్పుడే వ్యక్తిత్వాలు పరీక్షకు వచ్చేది–

మంచి అంటే ఏమిటో అర్థంచేసుకుని...మంచిగా బ్రతకాలనుకొని...చివరకు పరీక్షకు నిలబడలేనివాళ్ళే హీనులు; హీనాతిహీనులు!''

తనను తను శపించుకొంటున్నట్లు కసిగా అన్నాడు బాలూ

*　　　*　　　*　　　*

''మిస్ నీరజా! మిమ్మల్ని సిస్టర్ ట్రోజా రమ్మంటున్నారు.'' అటెండర్ వచ్చి చెప్పింది. టీచర్స్ రూంలో కూచుని పిల్లల హోంవర్కులు చూస్తున్న నీరజ ఆశ్చర్యంగా "నన్నా?" అంది.

సిస్టర్ ట్రోజా ఆ కాన్వెంటులో హెడ్‌మిస్ట్రెస్‌గా ఉన్నారు తగినంత ప్రత్యేకమైన కారణముంటేే తప్ప తన గదిలోకి ఎవ్వరినీ పిలిపించుకోదు.

"మిమ్మల్నే ! నాకు చెవుడులేదు!" చికాగ్గా అని వెళ్ళిపోయింది అటెండర్.

పిల్లల హోంవర్క్ పుస్తకాలు షెల్ఫ్‌లో సర్ది సిస్టర్ ట్రోజా రూంలోకి వెళ్ళింది నీరజ...

సిస్టర్ ట్రోజా నీరజను చూడగానే అనవసరంగా కంగారుపడుతూ ''రా! రా! కూర్చో'' అంది, అలవాటుకు మించిన ఆదరంతో.

నీరజ వచ్చి కూర్చుంది.

''మిస్ నీరజా! నువ్వు చాలా సిన్సియర్ టీచర్‌వి. పిల్లలకుకూడా నువ్వంటే చాలా యిష్టం. పిల్లల మనసుల్లో అలాంటి స్థానాన్ని పొందగలిగిన టీచర్లను నేను చాలా గౌరవిస్తాను.''

సిస్టర్ ట్రోజా పొగుడుతోంది. కాని, ఆవిడ ముఖభంగిమ, మాట్లాడుతూన్న ధోరణి ఏదో సంజాయిషీ ఇచ్చుకుంటున్నట్లుగా ఉన్నాయి. ఒక టీచర్ని పని కట్టుకుని పిలిపించి ఇలా పొగడటం కూడా ఆవిడ స్వభావానికి విరుద్ధమే! దడదడలాడుతున్న గుండెలతో ఆవిడ చెప్పబోయేదానికోసం ఎదురు చూస్తూ కూచుంది. సిస్టర్ నీరజముఖంలోకి ఒకసారి చూసి చూడలేనిదానిలా ముఖం తిప్పుకుని మళ్ళీ ప్రారంభించింది.

"ఇటీవల మన కాన్వెంట్ వరినరాలలో పోలీసులు తిరుగుతున్నారు. పోలీసు ఆఫీసర్ మురళి వాళ్ళను నియమించాడని తెలిసింది. మురళిగారితోనే మాట్లాడాను...'' ఒక్క నిముషం ఆగి గొంతు సవరించుకుంది సిస్టర్...మురళి పేరు వినగానే నీరజ రక్తం చల్లబడిపోయింది. సిస్టర్ గబగబ చెప్పుకుపోసాగింది.

"నీ గురించి చెప్పారు. నడిబజారులో నిన్ను టాక్సీలో తీసుకుపోగలిగిన ఆ గూండాలు చాలా సమర్థులయి ఉండాలి అన్నారు. అంతకంటె విడ్డూరం నువ్వు

వాళ్ళ చేతుల్లోంచి తప్పించుకు రావటం అంటున్నారు. నువ్వే వాళ్ళను కలవటమో...వాళ్ళు నీకోసం రావటమో...జరిగే అవకాశం ఉందనీ...అందుకే నిన్ను కనిపెట్టి ఉంటున్నామనీ అన్నారు. మన కాన్వెంట్ సంగతి నీకూ తెలుసు. గూండాలు, పోలీసులు...ఇలాంటి వ్యవహారాలు ఇక్కడ పనికిరావు..."

ఆ కాన్వెంట్‌లో చదువుకునేవాళ్ళంతా చాలా పెద్దింటి పిల్లలు. చదువు చాలా బాగుంటుంది. క్రమశిక్షణా ఉంటుంది. కానీ ధనిక వర్గాలవారు మాత్రమే భరించగలరు. ఆ కాన్వెంట్‌లో ఒక పక్క ఇలా ధనికవర్గాల దగ్గరనుంచి డబ్బు వసూలు చేస్తారు. మరొకవంక అనాథలను ఆదుకుంటారు.

"నీకు జరిగినట్లే ఇక్కడి పిల్లల కెవరికైనా జరిగితే కాన్వెంట్‌కి ఎంత అప్రతిష్టో ఆలోచించు..."

నీరజ ఏమని సమాధానం చెప్పగలదు.

తను అనదలచుకొన్న ఆఖరి వాక్యం అనేసింది సిస్టర్. "నువ్వెక్కడైనా ఉద్యోగ ప్రయత్నం చెయ్యి. నేను మంచి టెస్టిమోనియల్ ఇస్తాను. ఉద్యోగం దొరికేవరకూ నీకు ఇబ్బంది లేకుండా ఒక నెల జీతం కూడా ఇస్తున్నాను." అతి తియ్యని ఈ మాటల సారాంశం 'నిన్ను ఉద్యోగంలోంచి తీసేస్తున్నాము.' అని.

అటెండర్ సిస్టర్ దగ్గిరకు వచ్చి 'అయ్యగారు వచ్చారు.' అంది.

సిస్టర్ ముఖం చిట్లించి "ఏ అయ్యగారు?" అంది.

"మన కాన్వెంట్‌కు బాగా విరాళాలు ఇస్తారే, ఆయన..."

సిస్టర్ ముఖం వికసించింది.

"రమ్మను."

దర్జాగా అడుగులు వేసుకుంటూ వచ్చాడు బాలూ. కూర్చున్న నీరజ గభాలున నిలబడింది. నడుస్తూన్న బాలూ లిప్తమాత్రం ఆగిపోయి అంతలో నిర్లక్ష్యంగా తలతిప్పుకుని సిస్టర్ చూపించిన కుర్చీలో కూర్చున్నాడు ఆలస్యం చెయ్యకుండా తన జేబులోంచి డబ్బుతీసి సిస్టర్ ముందుంచి, "వెళ్తాను," అని లేచాడు.

"ఒక్క క్షణం కూచోండి! మీరు వచ్చినప్పుడు నాదగ్గిర మరెవరూ ఉండకూడదన్నారు. గుప్తదానమంటేనే మీ కిష్టమని అన్నారు. కానీ, ఇవాళ మీరు ఈ అమ్మాయికి ఏమైనా సహాయం చెయ్యగలరేమో కనుక్కుందామని ఇక్కడే కూచోనిచ్చాను..."

బాలూ ఆశ్చర్యంగా "ఎలాంటి సహాయం?" అన్నాడు.

ఈ మధ్య ఈ అమ్మాయిని గూండాలు ఎత్తుకుపోయిన సంగతి మీరు పేపర్లో చూసే ఉంటారు. ఆ గొడవలతో ఈవిడని ఉద్యోగంలోంచి తీసెయ్యవలసి వచ్చింది. మీరు మరొక ఉద్యోగం చూసిపెట్టగలరా? చాలా మంచి మనిషి. విధి లేక తీసేస్తున్నాను. కాని, చాలా బాధపడుతున్నాను."

నీరజ రెప్ప ఆర్పకుండా బాలూనే చూస్తూ కూచుంది. బాలూ ముఖం తిప్పు కుని "ప్రయత్నిస్తాను." అని చటుక్కున లేచి వెళ్ళిపోయాడు.

సిస్టర్ ఆనందంతో "నీరజా! ఇతడు నీకు సహాయం చేస్తాడు. చాలా మంచి వాడు. 'మీరు మంచివారు' అంటే ఇతనికి చాలా కోపం వస్తుంది. అంత మంచి వాడు!" అంది.

నీరజ పకాలున నవ్వింది. సిస్టర్ తెల్లబోతూ "ఎందుకు నవ్వుతున్నావు?" అంది.

"ఏం లేదు. వస్తాను మేడమ్! ఇవాళే నా రాజీనామ ఇచ్చేస్తాను."

"అయామ్ సారీ నీరజా! కానీ ఆయన నీకు మరొక మంచి ఉద్యోగం చూస్తారు. విష్ యు బెస్ట్ ఆఫ్ లక్!"

"థ్యాంక్యూ మేడమ్!"

చేతులు జోడించింది.

సాధారణంగా ప్రభు నీరజ ఇంటికి రాడు. నీరజే ప్రభు దగ్గరకు వెళ్ళేది. లక్ష్మీదేవి దగ్గర ఉన్న చనువుతో ప్రభు ఉన్నప్పుడూ లేనప్పుడూ కూడా వెళ్ళి అక్కడే ఉండిపోయేది. కానీ ఇటీవల లక్ష్మీదేవి పూర్తిగా మారిపోయింది. నీరజ వెళ్తే పలకరించనుకూడా పలకరించకుండా లోపలకు వెళ్ళిపోసాగింది. తల్లికి భయపడి యశోధరకూడాస్నేహంగా ఉండలేకపోతోంది ... ప్రభు ఇంట్లో ఉంటే నీరజ దగ్గిరకువచ్చి కూచునేవాడు. కానీ ఆ సమయంలో లక్ష్మీ దేవి కళ్ళలో కనిపించే వ్యధకూ, తిరస్కారానికీ, నీరజ తట్టుకోలేకపోయేది. కాని ప్రభుకోసం ఆరాటం మానుకోలేకపోతోం ది. ఏరోజు కారోజు ప్రభు తన దగ్గరకు వస్తాడని ఎదురుచూస్తూనే ఉంది. వస్తాడు! ప్రభు తప్పకుండా తన కోసం వస్తాడు. ఎవరికోసమూ ప్రభును తను వదులుకోలేదు. అంత స్వార్థ త్యాగం తనలో లేదు.

ఆరోజు ప్రభును చూడగానే నీరజ ఆనందం పట్టలేకపోయింది.

"పద, ఎక్కడైనా బయటికిపోయి మాట్లాడుకుందాం!" అంది.

అక్కడే ఉన్న వర్ధని సహించలేకపోయింది.



''సిగ్గులేకపోతే సరి? ఈ దశలో షికార్లుకూడానా? దమ్ముంటే పెళ్ళిచేసుకుని, ఆ తరువాత వెళ్ళండి షికారుకి...'' అంది కోపంగా...

ప్రభు ముఖం ముడుచుకుని అక్కడి చాపమీద కూర్చున్నాడు.

''పోనీలే ఇక్కడే మాట్లాడుకుందాం!'' అన్నాడు.

'నేను నీరజను పెళ్ళి చేసుకుంటాను. మేం ఇప్పుడే బయటికి వెళ్తాము' అని ప్రభు అంటే బాగుండునని నీరజ ఎంతగానో అనుకుంది. కానీ ప్రభు అలా చాపమీద కూచునేసరికి తనూ ఒక వారకి కూచుంది. వర్ధని కదలకుండా అక్కడే ఉంది. నీరజ వర్ధనిని లక్ష్యపెట్ట దలచుకోలేదు.

''ఇన్నాళ్ళు కనపడలేదు!'' అంది.

''అవును. నాకు ఎన్నో రోజులు గడచిపోయినట్లుగా ఉంది. ప్రతి క్షణం నిన్ను తలుచుకుంటూనే ఉన్నాను. యశు పెళ్ళి నిశ్చమయిపోయింది. ఎల్లుండి నిశ్చయ తాంబూలాలు తీసుకోవాలని అనుకుంటున్నారు. ఆ హడావిడిలో రాలేకపోయాను ''

క్షమించమని ప్రాధేయపడుతున్నట్లుగా ఉన్న ప్రభు ధోరణికి నీరజ మనసు చల్లబడింది. కళ్ళతోనే నవ్వింది

"ఫంక్షన్ గొప్పగా చేయాలని అనుకుంటోంది అమ్మ. చాలా మందిని పిలుస్తోంది!"

నీరజ భయపడింది. ఈ పరిస్థితిలో అందరిముందుకూ తను వెళ్ళగలదా? రానంటే ప్రభు ఊరుకుంటాడా? అతనికి ఎలా నచ్చచెప్పాలి?

ప్రభు కొంచెంసేపాగి అన్నాడు:

"యశకు కాబోయే భర్త డాక్టర్! అతనికి చాలామంది స్నేహితులున్నారు. వాళ్ళంతా గొప్పవాళ్ళు...బాగా పలుకుబడి ఉన్నవారు...అందరి మధ్యా నువ్వు...అదే...నీకు ఇబ్బంది అవుతుందేమో! ఏమీ అనుకోకు! నిన్ను మరో సారి వాళ్ళిద్దరూ ఉండగా పిలిచి ప్రత్యేకంగా పార్టీ ఇస్తాను. సరేనా..."

ప్రభు తనను రావద్దని అంటున్నాడు! నీరజ మనసు మొద్దుబారిపోయింది. నీరజ ముఖం చూస్తూ తడబడ్డాడు ప్రభు —

"నీరజా! నువ్వు రా! అందుకు కాదు—నేను...నీకోసమే..."

"ఫరవాలేదు ప్రభూ! నేను రానులే!"

శాంతంగా అంది నీరజ.

ప్రభుకు ఇంక మాటలు దొరకలేదు..."మళ్ళీ వస్తాను" అని వెళ్ళిపోయాడు.

'వాళ్ళంతా గొప్పవాళ్ళు...పలుకుబడి ఉన్నవాళ్ళు...వాళ్ళ మధ్యకు నువు రావద్దు...'

ఈ మాటలు హోరుమంటున్నాయి నీరజ మనసులో...

నీరజ మనసులో ఘోషను మించి విరగబడి నవ్వింది వర్ధని.

"ఆహా! ఏం ప్రేమ! ఏం అనురాగం! నలుగురిలో తనకు తెలిసిన మనిషి అని చెప్పుకోలేకపోతున్నాడు! ఇక పెళ్ళి చేసుకుంటాడు! నమ్మవలసిందే!" ఎంత ఆనందం, ఆ వికటాట్టహాసంలో—

* * *

కరెంట్ పోయింది. వీధిలో విద్యుద్దీపాలు కూడా ఆరిపోయాయి. రాత్రి పదిగంటల సమయంలో ఒంటరిగా నిలబడిన నీరజకు భయంవేసింది.

"నీరజా!" అన్న చిరపరిచితమైన పిలుపు వినిపించింది. ఆ పిలుపు — నీరజ మనసులో పేరుకునే దుఃఖాలన్నిటినీ క్షణాలలో కరిగించగలిగిన ఆ పిలుపు నీరజ మనసులో భయాన్ని ఎగరగొట్టి మరేదో లోకాలలోకి తీసుకుపోయింది.

ప్రభు నీరజ పక్కన నించుని నీరజచేతిని పట్టుకుని "నీరజా!" అన్నాడు మళ్ళీ...

"ఇంత చీకట్లో నన్ను ఎలా గుర్తుపట్టగలిగావు?"

"దాదాపు రెండుగంటలనుంచీ నీకోసం రోడ్డుమీద కాచుకుని ఉన్నాను--"

"ఎందుకూ?"

"అది తెలియకనే! నన్ను ఎందుకిలా తప్పుకు తిరుగుతున్నావో చెప్పు!"

"నీకు అడ్డు రాకూడదనుకున్నాను!"

"పచ్చి అబద్ధం. అనుక్షణం నా ఊహలకు చివరికి నా ఊపిరికీ అడ్డుపడుతూనే ఉన్నావు."

నీరజ నవ్వింది.

"ముందు ఇది చెప్పు! నేను క్లబ్‌లో రిసెప్షనిస్ట్‌గా జాయినయ్యాను-తెలుసా?"

"తెలియకుండా ఇక్కడెలా కాచుకుని ఉంటాను?"

"ప్రభూ! అలాంటి ఉద్యోగాలలో పరువుగల ఆడవాళ్ళు ఎవరూ చేరరు!"

"నువ్వు చేరావుగా! ఇంక ఆ మాట అనటానికి వీల్లేదు!"

"నేను చేరింది..."

"నీరజా! ప్లీజ్! ఇక్కడ కాదు! ఎక్కడికైనా వెళ్ళి మాట్లాడుకుందాం!"

"ఇంత రాత్రివేళ ఎక్కడికి వెళ్తాం?"

"నా ఫ్రెండ్ కొాక ఇల్లు ఉంది. అక్కడ ప్రస్తుతం ఎవరూ లేరు-అక్కడికి

నీరజ కాదనకలేపోయింది.

ఇంట్లో అడుగు పెట్టగానే విద్యుద్దీపాల కాంతిలో నీరజను చూసి "నువ్వు చాలా మారిపోయావు!" అన్నాడు ప్రభు-క్లబ్‌లో ఉద్యోగానికి అత్యంత ఆధునాతనంగా అలంకరించుకుంది నీరజ...

"అవును మారిపోయాను-అలంకరణలో మాత్రమే కాదు-అంతరంగంలో కూడా......"

"ఎన్ని మారినా ఒక్కటి మాత్రం మారలేదు-మారదు - నువ్వు నా దానివి నీరజా!..."

ప్రభు నోట ఇలాంటి మాటలు విన్నప్పుడు ఇదివరకు పరవశించిపోయేది నీరజ. ఇప్పుడు అలా ఆనందించలేకపోయింది. వెటకారంగా నవ్వింది.

"...మో ప్రభూ! ఆ నమ్మకం నాలో సడలవటంలేదు– అదే ఉంటే నేను ఈ క్లెర్క్ ఉద్యోగానికి కక్కుర్తి పడేదానిని కాను!"

"తొందరపడ్డావు నీరజా! ఉద్యోగంలో చేరకుండా ఉండవలసింది!"

"తొందరపడ్డానా! లేదు ప్రభూ! బాగా ఆలోచించుకునే చేరాను! ఎందుకో తెలుసా?...గొప్పవాళ్ళతో ... పలుకుబడిగలవాళ్ళతో ... కలిసి తిరగవచ్చునని..."

నీరజ దెప్పిపొడుపు అర్థమయింది ప్రభుకు–కానీ తను ఎలాంటి పరిస్థితుల్లో అలా మాట్లాడవలసి వచ్చిందో–అది నీరజకు అర్థమయ్యేలా ఎలా చెప్పాలో మాత్రం అర్థంకాలేదు.

ఆహ్వాన పత్రికలమీద పేర్లు రాస్తున్న ప్రభు "అమ్మా! నీరజకు కూడా ఇన్విటేషన్ పోస్ట్ చేస్తే బాగుండదు? నేనే స్వయంగా పిలుస్తాను" అన్నాడు.

"నీకు మతిపోయిందా?" ఆశ్చర్యంగా అడిగింది లక్ష్మీదేవి–ప్రభుకు నిజంగా మతిపోయినట్లే అయింది.

"ఏం?"

"ఫంక్షన్‌కు నీరజను రమ్మంటావా?"

"నీరజ రాకుండా మనింట్లో వేడుక ఏమిటమ్మా!"

లక్ష్మీదేవి మాట్లాడలేదు–ప్రభు కోపంగా తన చేతిలో ఇన్విటేషన్ కార్డ్స్ కింద పడేసాడు.

"ప్రభూ! నీతో నేను వాదించలేను, నీ జీవితం నీయిష్టం! కానీ నీ చెల్లెలి బ్రతుకు పాడుచేసే అధికారం కూడా నీకు ఉందా?"

"ఏం మాటలమ్మా!"

"పరిస్థితి బాగా అర్థంచేసుకుని ఆలోచించి మాట్లాడుతున్న మాటలు ప్రభూ! నీరజను నేను ఎంతగా అభిమానించేదాన్నో నీకు తెలియదా? కానీ, ఈ సందర్భంలో నీరజ ఇక్కడికి వస్తే...అందరి కళ్ళూ నీరజవైపు తిరిగితే... నీరజ గురించి గుసగుసలు నలుగురూ చెప్పుకోవటం మొదలుపెడితే... అదంతా ఎవరికి సుఖమో ఆలోచించు? మరొక సంగతికూడా ఉంది. నీది–విశాల హృదయమని అనాలో... విపరీత మనస్తత్వమని అనాలో...నువ్వొక్కడివి ఇలా ఆలోచిస్తున్నావు–నువ్వు నీరజను చేసుకోవటం అందరూ హర్షించలేరు–

యశోధరకు కావొచ్చు భర్తకు కూడా ఇలాంటివి ఇష్టం ఉండకపోవచ్చు ..ఈ కారణంగా నిశ్చయతాంబూలాలవరకు వచ్చిన పెళ్ళి ఆగిపోతే ఎవరికి నష్టమో ఆలోచించు.. యశోధర పెళ్ళి అయిపోయాక నీయిష్టం వచ్చినట్లు చేసుకో! నేనేమీ మాట్లాడను!"

ప్రభు సమాధానం చెప్పలేకపోయాడు-ఈ విషయంలో పట్టుబట్టి అంతా నిశ్చయమయిపోయిన చెల్లెలి పెళ్ళి చెడగొట్టడానికి అతని మనసు అంగీకరించలేదు.

"నీరజ దగ్గరకు నేనే వెళ్ళి పరిస్థితి అంతా వివరించి రావద్దని చెపుతాను." అంది లక్ష్మీదేవి.

"వద్దు వద్దు నేనే చెపుతాను!" అన్నాడు ప్రభు...

ఆరోజు "పరవాలేదు ప్రభూ! నేను రానులే!" అని శాంతంగా అన్న నీరజ మాటల్లో అంతర్లీనమై ఉన్న వ్యధను ప్రభు మనసును కోస్తూనేఉంది. నీరజతో ఒక్కసారి మనసు విప్పి మాట్లాడాలని ఎంతగానో ప్రయత్నించాడు-ప్రభు. ఎప్పుడు ఎక్కడికి రమ్మన్నా ఆ సమయంలో 'ఊఁ!' అనేది నీరజ-కానీ వచ్చేది కాదు-నీరజకోసం పడిగాపులు పడి విసిగిపోవటమే ప్రభుకు దక్కేది-నీరజకు కాన్వెంట్‌లో ఉద్యోగం పోయిందని విని బాధపడ్డాడు-క్లబ్‌లో జాయినయిందని విని భయపడ్డాడు—ఆ రోజు ఏమైనాసరే నీరజను కలుసుకుని తీరాలని క్లబ్ ముందు పడిగాపులుపడుతూ నించున్నాడు...

నీరజ దగ్గరగా వచ్చి అనునయంగా నీరజ చేతులు తన చేతుల్లోకి తీసుకున్నాడు ప్రభు.

"నీరజా! నా ఆనందంకోసం మిగిలినవాళ్ళ జీవితాలు చికాకు చేసేటంత స్వార్థం లేకపోయింది నాకు-అందుకే ఆరోజు నిన్ను రావద్దని అనవలసి వచ్చింది-అర్థం చేసుకోలేవా?"

అర్థంచేసుకుంటోంది నీరజ-అర్థమవుతోన్నకొద్దీ తన సమస్య మరింత భయంకరంగా ప్రత్యక్షమవుతోంది-సమాజం ఎన్నటికీ తనను ఎప్పటిలా స్వీకరించలేదు-తనతో కలిసి ప్రభు అడుగడుగునా ఎలాంటి సమస్యను ఎదుర్కోవలసి వస్తుందో? అంత సంఘర్షణకు అతణ్ని గురిచెయ్యటం తనకు న్యాయమేనా? అంత స్వార్థం ఉందా తనలో...

"ప్లీజ్ నీరజా!"

చేతులు జాపాడు ప్రభు-తనమీద తనకేమీ అధికారం లేనట్లు తూలి ఆ

చేతులలో వాలిపోయింది నీరజ...మాటలకందని మహాశక్తి ఏదో తమను బంధించినట్లు ఒకరికొకరు హత్తుకుపోయారు.

"అయామ్ సారీ!" అన్న మాటలు విని ఉలికిపాటుతో ప్రభుకు దూరంగా జరిగింది నీరజ—ఎదురుగా నీలకాంత్‌ను చూసి నిర్ఘాంతపోయింది.

నీలకాంత్ నవ్వుతూ "ప్రభూ! నీరజను ఇక్కడికి తీసుకొస్తున్నానని నాకు చెప్పి ఉండవలసింది. నేను వచ్చేవాణ్ని కాదు!'' అన్నాడు.

"దట్సాల్ రైట్!'' సిగ్గుపడుతూ అన్నాడు ప్రభూ...

"ఈ ఇల్లు నీలకాంత్‌దా?" పాలిపోయిన ముఖంతో అడిగింది నీరజ.

"ఏం? తెలిస్తే వచ్చేదానివి కాదా!"

కవ్విస్తున్నట్లు అడిగాడు నీలకాంత్.

"కంఠంలో ప్రాణం ఉండగా వచ్చేదాన్నికాను!"

"నీరజా..." మందలిస్తున్నట్లుగా ఏదో అనబోయాడు ప్రభు...నీలకాంత్ కల్పించుకున్నాడు...

"ఆవిడ భయమంతా తన రహస్యం నేను నీకు చెప్తానని ప్రభూ! నీరజా! భయపడకు. ఆ రహస్యం నానోటినుండి రాదు!"

నీరజ మాట్లాడలేదు–పెదవిమాత్రం పళ్ళకింద నలిగిపోతుంది.

ప్రభు ముఖం జేవురించింది.

''నీరజ నాదగ్గర రహస్యంగా ఉంచవలసిన విషయాలేమీ లేవు–భయపడవలసిన అవసరం అసలే లేదు. అదేమిటో చెప్పు నీలకాంత్!"

"నేను చెప్పలేను ప్రభూ! నీరజనే అడుగు!"

"నీరజా! నీ రహస్యం తెలుసుకోవాలని నాకేవిధమయిన కుతూహలమూ లేదు–ఎలాంటి విషయమయినా మన మధ్య అడ్డుగా నిలవలేదనీ...నీ విషయంలో నేను క్షమించలేనిదంటూ ఏదీ లేదనీ ... రుజువుచేసుకోవటానికి అదేదో చెప్పెయ్యి నీరజా! ఈ తెరలు చీల్చేసుకుంటేనేకాని మనకు శాంతి ఉండదు!"

జీవంలేని తన ముఖాన్ని పైకెత్తింది నీరజ.

"నాదగ్గిరనుంచి వెళ్ళిపో ప్రభూ! శాశ్వతంగా వెళ్ళిపో!"

ఆ చిమ్మచీకట్లోకి పిచ్చిదానిలా పరుగుపెట్టింది.

* * * * *

ప్రతిరోజూ ఆ క్లబ్ ఎదురుగా నీరజకోసం ఎదురుచూస్తూ నిలబడుతున్నాడు ప్రభు...వారంరోజులు గడిచాయి. నీరజ జాడలేదు–ప్రభు ఆందోళనను

అణచుకోలేకపోయాడు-క్లబ్‌కు వెళ్ళాడు. ఎంక్వయిరీలో "మిస్ నీరజను కలుసుకోవాలి! ఆవిడతో చెప్పగలరా?'' అన్నాడు. అక్కడి క్లర్క్ ''మిస్ నీరజను ఇక్కడ ఉద్యోగంలోంచి తీసేసారు. ఇప్పుడు ఇక్కడ లేదు-'' అన్నాడు.

"ఉద్యోగంలోంచి తీసేసారా?''

"ఆవిడ వెనక పోలీసులు తిరుగుతున్నారని తెలిసింది. ఇది పెద్దమనుష్యులు వచ్చే క్లబ్-అలాంటివాళ్ళను ఎలా ఉంచుకోగలం?''

అది పెద్దమనుష్యులు వచ్చే క్లబ్-ఆ పెద్దమనుష్యులకు న్యాయమైనవీ, అన్యాయమైనవీ అనేక వ్యవహారాలుంటాయి, ఆ క్లబ్‌లో...పోలీసుల దృష్టి ఆ క్లబ్‌మీద పడటం ప్రమాదమే మరి!

చేసేది లేక నీరజకోసం ఇంటికే వెళ్ళాడు ప్రభు...వర్ధని చిరునవ్వుతో ఆప్యాయంగా ఆహ్వానించింది.

''నీరజ ఏంచేస్తోంది అత్తయ్యా?''

వర్ధని విస్తుపోయి చూసింది-కంగారుపడ్డాడు ప్రభు.

''అయితే, నీకు నిజంగానే తెలీదా?''

"ఏమిటి అత్తయ్యా?"

''నీరజ ఇక్కడెక్కడ ఉంది!"

"ఎక్కడికి వెళ్ళింది?"

"ఏమో! ఎక్కడకు వెళ్ళిందో. ఎలా వచ్చిందో, తెలియదు. మళ్ళీ ఎక్కడకు వెళ్ళిందో, ఎప్పుడు వస్తుందో అసలు తెలియదు. నేనేం చెప్ప గలను?"

వర్ధని చిన్న కూతురు కల్పించుకుని "కాదు! అమ్మ వెళ్ళిపొమ్మంది!" అంది.

"నోరు మూసుకో!" అని కూతుర్ని కసిరింది వర్ధని. ప్రభును చూస్తూ "అవును. నేనే వెళ్ళిపొమ్మన్నాను. నేను సామాన్యురాలినే! నాకు పెళ్ళి కావలసిన పిల్లలున్నారు. ఇన్ని గొడవలతో ఉన్న ఆ పిల్లను రొమ్ములమీద కుంపటిలా ఎలా భరించగలను?" అంది.

"వస్తానత్తయ్యా!" అని లేవబోయాడు. వెళ్ళనివ్వలేదు వర్ధని...

"కూచో, కూచో! అన్నట్లు ఈ మధ్య మా రాధను చూసావా నిముషాలలో ఎదిగి కూర్చుంది - ఈ ఆడపిల్లలు కాదుగాని-అంటే దృష్టి కొడుతుందని

భయంగా ఉంది. ఎంత అందంగా తయారయిందనుకున్నావ్? నీరజకంటె ఎంతో అందంగా ఉంది. ఇప్పుడు దీని పెళ్ళి చెయ్యాలి... నీలాంటి వాళ్ళు కట్నం తీసుకోకుండా చేసుకుంటే ఏదో చెయ్యగలం కాని, లేకపోతే మామోటి వాళ్ళం ఆడపిల్లల పెళ్ళిళ్ళు చెయ్యగలమా? అమ్మాయ్ రాధా! బాపకి కాస్త వక్కపొడి పట్రా అమ్మా!''

రాధ సిగ్గుపడుతూ వక్కపొడి పట్టుకువచ్చింది. ప్రభుకు తల తిరిగి పోసాగింది. వర్ధని ఉండమంటున్నా అక్కడి నుంచి తప్పించుకుని వచ్చేసాడు.

నీరజ కోసం ఎక్కడ వెతకగలడు?

యశోధర పెళ్ళి చాలా వైభవంగా జరిపించాడు ప్రభు. మనసు ఎంత మథన పడుతోన్నా అన్ని పనులూ యాంత్రికంగా యథావిధిగా చేస్తోనే ఉన్నాడు.

యశోధరకు ఒక చిన్న పార్సెల్ కానుకగా వచ్చింది... ఒంటి ముత్యం పొదిగిన బంగారు ఉంగరంతో పాటు ఒక చిన్న ఉత్తరం కూడా ఉంది అందులో...

"ప్రియమైన యశోధరకు ప్రేమతో..." అంత మాత్రమే!

"ఎవరిది? సంతకం కూడా లేదు!" అంటోన్న యశోధర ఏదో గుర్తు వచ్చినట్లు ఆగిపోయింది. భయంగా ప్రభువంక చూసింది. ప్రభు యశోధర చేతిలోంచి ఆ ఉత్తరం తీసుకున్నాడు. గుండెలు ఝల్లుమన్నాయి. సందేహం లేదు. అది నీరజ దస్తూరి...ఆత్రుతగా పార్సెల్ మీద అడ్రస్ చూసాడు. ఆ ఊరి పేరు నోట్ చేసుకున్నాడు. ఆ రాత్రి బయలుదేరాడు.

ఆ ఊరంతా గాలిస్తూ వారంరోజులు తిరిగాడు ప్రభు. ఎక్కడా నీరజ జాడ లేదు. నిరాశచేసుకుని మళ్ళీ ఇంటికే ప్రయాణమయ్యాడు. టికెట్ కొనుక్కొని ప్లాట్‌ఫాం మీద నిలబడ్డాడు. ఒక యువతి చేతిలో చిన్న సూట్‌కేస్ పట్టుకుని హడావుడిగా ప్లాట్‌ఫాం మీదకు వచ్చింది. ప్రభును చూస్తూనే గిర్రున తిరిగి వెళ్ళిపోబోయింది. ప్రభు వెంటనే నీరజను గుర్తుపట్టాడు. "నీరజా!" అన్నాడు నీరజ పరుగులాంటి నడకతో స్టేషన్ బయటకు నడిచింది. ప్రభు సర్వమూ మరిచి "నీరజా!" అని పిలుస్తూ వెంటపడ్డాడు. నీరజ నడకవేగం హెచ్చించింది. ప్రభు నీరజనేచూస్తూ పరిగెత్తి నీరజను అందుకోబోయాడు. అంతలోనే ఒక కారు ప్రభును గుద్దేసింది. "నీరజా!" అని ఒక వెఱ్ఱికేక పెట్టాడు ప్రభు.



ప్రభు కళ్ళుతెరిచేసరికి నీరజ ఎదురుగా ఉంది. "ప్రభూ!" అంటూ ఆందోళనగా...

"హమ్మయ్య! ఇక్కడే ఉన్నావా? మళ్ళీ నిన్ను పోగొట్టుకుంటానేమోనని ఎంత ఆరాటపడిపోయానో తెలుసా?" నీరజ మాట్లాడలేదు...ప్రభు తన చుట్టు పక్కల చూసుకున్నాడు—హాస్పిటల్.

"ఏమిటిది? నాకు ఏక్సిడెంట్ అయింది కదూ! అయితే అయింది. నిన్ను కలుసుకున్నాను..."

నీరజ ప్రభు హృదయంమీద తల ఆన్చి ఏడ్చింది...నీరజ చేతిని తన చేతిలోకి తీసుకుని "ఇన్నాళ్ళూ ఏమయిపోయావు నీరజా! ఎంతగా వెతికాను నీ కోసం?" అన్నాడు...

క్లబ్బులో ఉద్యోగంపోయాక...వర్ధని నిర్దాక్షిణ్యంగా ఇంట్లోంచి పొమ్మన్నాక నీరజకు దిక్కుతోచలేదు. ఆ సమయంలో భగవంతుడి పిలుపులాగా కనిపించింది పత్రికలలో ప్రకటన...

ఊరికి దూరంగా కొండ ప్రాంతంలో ప్రత్యేకించి గిరిజనులకోసం ఒక పాఠశాల నడుపుతున్నారు. అందులో పనిచెయ్యటానికి టీచర్ కావాలని... అక్కడి హెడ్మాస్టర్‌కు యాభై యేళ్ళ పైన వయసు ఉంటుంది. ఆయనను అందరూ 'స్వామీజీ' అని పిలుస్తారు. అలా అని ఆయనకు గెడ్డాలూ మీసాలూ ఏమీలేవు. లుంగీకట్టుకుని లాల్చీ వేసుకుని పరమ నిరాడంబరంగా ఉంటారు. ఏ మాత్రం స్వార్థం లేకుండా, ఆ గిరిజనులను పైకి తేవడానికి పాటుపడు

తున్నారు. అందుకే అందరికీ ఆయన అంటే గౌరవం. ఆస్కూల్‌లో పనిచేసేది ఆయన, నీరజ, ఇద్దరే! నీరజ దాపరికం లేకుండా ఆయనకు తన కథ అంతా చెప్పింది...

"మీరు ఉండమంటే ఇక్కడ ఉంటాను. లేకపోతే వెళ్ళిపోతాను." అంది.

"నేనెందుకు వెళ్ళమంటానమ్మా! కానీ, నీకు ఆ గూండాలతో లావాదేవీలు ఏవీ లేవుగా!"

"నేను దౌర్భాగ్యురాలినే కాని దుర్మార్గురాలిని కాను బాబుగారూ!"

ఆయన నొచ్చుకుని "సరేనమ్మా. సరే? ఇక్కడి కొచ్చి పనిచేసే వాళ్ళు ఎవరున్నారు? నువ్వు ఉంటానంటే మా అందరి అదృష్టం కాదూ?" అన్నారు.

వారం పదిరోజుల్లోనే నీరజ కూడా అందరి అభిమానమూ సంపాదించుకో గలిగింది. స్వామీజీ చెప్పిన మీదట అక్కడి చిన్నపిల్లలందరూ నీరజను "అక్కా!" అని పిలవటం కూడా మొదలుపెట్టారు.

ఒకరోజు బడికి ఒక్కళ్ళుకూడా రాలేదు. నీరజకూ స్వామీజీకీ ఆశ్చర్యం కలిగింది. ఇద్దరూ కనుక్కోవటానికి వెళ్ళారు. వాళ్ళంతా నీరజను చూస్తూనే గబగబ గుడెసెల్లో దూరి తడికెలు బిగించుకున్నారు. నివ్వెరపోయింది నీరజ. స్వామీజీ ఒకటి రెండుసార్లు పిలవగా పెద్దవాళ్ళు ఇద్దరు ముగ్గురు వచ్చారు.

"ఆయమ్మమీద పోలీసుల నిఘా ఉందటగా సామీ! ఓయ్ నాయినోయ్! యములాల్ల బాధలన్నా పడొచ్చుగాని, ఆ పోలీసోల్ల బాధలు పడలేం సామీ!"

ఏడుస్తూ, రాగాలు పెడుతూ అన్నారు వాళ్ళు... స్వామీజీ ఎన్ని విధాల నచ్చజెప్పాలని ప్రయత్నించినా లాభం లేకపోయింది.

ఆ సాయంత్రం నీరజ తన చిన్న సూట్‌కేస్ సర్దుకుని స్వామీజీకి నమస్క రించి "నేను వెళ్తున్నాను" అంది.

ఆయన తలవంచుకున్నారు.

అంతా విని ఒక్క నిట్టూర్పు విడిచాడు ప్రభు...

"పోనీలే నీరజా! అంతా మన మంచికే జరిగింది...నువ్వు ఆకొండకోనల్లోనే ఉంటే నిన్నసలు కలుసుకోలేక పోయేవాడిని...మనం ఎప్పుడు వెళ్దాం?"

"నన్నూ నీతో రమ్మంటావా?"

"మళ్ళీ అదేపాటా?"

"డాక్టర్‌ని కనుక్కుంటాను. నిన్ను ఎప్పుడు డిస్చార్జ్ చేస్తారో..."

కారుడ్రైవర్ సడెన్‌బ్రేక్ వెయ్యటంవల్ల ప్రభు ప్రాణాలకు ప్రమాదం లేక పోయింది కాని దెబ్బలు మాత్రం బాగానే తగిలాయి కారులో ఉన్నవ్యక్తి నీరజకు సహకరించి ప్రభును హాస్పిటల్‌లో చేర్పించాడు.

డాక్టర్ రౌండ్స్‌కి వచ్చినప్పుడు ప్రభును ఎప్పుడు డిస్చార్జ్ చేస్తారని నీరజ అడిగింది...

"రెండు మూడు రోజులలో వెళ్ళిపోవచ్చు. కానీ, ఈయనకు గుండె దగ్గర బలమైన దెబ్బతగిలింది. ఆ కారణంగా ముందుముందు ఎప్పుడైనా గుండె నొప్పి రావచ్చును. కొంచెం జాగ్రత్తగా చూసుకుంటూ ఉండాలి!"

డాక్టర్ వెళ్ళిపోయాక నీరజతో అన్నాడు ప్రభు. "విన్నావుగా! నాకు గుండెనొప్పి రావచ్చుట! నన్ను విడిచిపెట్టి వెళ్ళవుగా..."

కన్నీళ్ళు ఆపుకుంటూ "వెళ్ళను" అన్నట్లు తల ఆడించింది నీరజ

* * *

లక్ష్మీదేవి ఏది జరగకూడదని వెయ్యిదేవుళ్ళకు మొక్కుకుంటోందో, అదే జరిగింది. ప్రభు నీరజతో కలిసి ఇంటికి వచ్చాడు. చలనంలేని బొమ్మలా నిలబడిపోయింది.

"అమ్మా! నీరజ కనిపించింది. రానంటే రానంది-మన నీరజ మన దగ్గరికి రాక ఏమయిపోతుందమ్మా! నేను బలవంతంగా..."

పేలవమైన నవ్వుతో సంజాయిషీ ఇచ్చుకొంటున్నట్లు, నచ్చజెప్పుతున్నట్లు ఏదో అనబోతున్న ప్రభుమాటలు, లక్ష్మీదేవి గిర్రున తిరిగి లోపలికి వెళ్ళిపోవ టంతో ఆగిపోయాయి...దిగులుగా తనను చూసే నీరజచెయ్యి గట్టిగా పట్టుకొని లోపలకి నడిపించుకుని వెళ్ళాడు ప్రభు...

క్షణాలలో నీరజ అక్కడికి వచ్చిన వార్త చుట్టుపక్కల ఇళ్ళకు వ్యాపిం చింది. అందరూ, చేస్తున్న పనులు అలాగే వదిలేసి లక్ష్మీదేవి ఇంటికి చేరు కున్నారు. నీరజ గదిలోకి పారిపోయి తలుపు గట్టిగా బిగించుకుంది. అమ్మ లక్కలకు లక్ష్మీదేవి మాత్రమే దొరికింది.

"ఇదేమిటి లక్ష్మీదేవీ! ఇంత బ్రతుకు బ్రతికి దాన్ని కోడలిగా తెచ్చుకుంటు న్నావా? ఇంక ఈ ఇంటి పరువుప్రతిష్టలు..."

"పరువు ప్రతిష్టల సంగతి సరేలే! ముందు ప్రాణమానాల సంగతి ఆలో చించుకోండి! దానికోసం ఆ గూండాలు ఇంటిమీదకూడా పడితే మీ గతేమిటి?"

"ఎందుకైనా మంచిది! దాన్ని నీ కొడుకు గదిలోకి రానియ్యకు!"

"ఇంకా నయం! ఇప్పుడది ఉన్నది ఎక్కడనుకుంటున్నావు?"

"ఏమిటి? ఇంకా పెళ్ళికాకుండానే ఇద్దరూ ఒక్కగదిలో ఉంటున్నారా?"

"సరేలే! దానికి పెళ్ళి, కార్యం, ఈ తతంగాలన్నీ తక్కువయ్యాయా?"

అన్నీ వింటూ శిలలా కూర్చుంది లక్ష్మీదేవి-వచ్చినవాళ్ళ కెవరికీ సమాధానంగా లేదు.

"అయ్యో! లక్ష్మీదేవీ! నీ బ్రతుకు ఎంతకు దిగజారిందే తల్లీ!" అంటూ లక్ష్మీదేవిని కౌగిలించుకుని బావురుమంది ఒకావిడ ... లక్ష్మీదేవి అతి ప్రయత్నంమీద ఆ కౌగిలి వదిలించుకుని కాస్త దూరంగా జరిగికూర్చుంది.

"పరవాలేదులే! ఇప్పుడేదో మోజులో దాన్ని తీసుకొచ్చాడేగాని ఈ మోజు నిలుస్తుందా, పాడా? నాలుగురోజులు పోతే తనుచేసిన దానికి తనే పశ్చాత్తాపపడి దాని దారిన దాన్ని పంపించేస్తాడు. అప్పుడు లక్షణంగా మరో సంబంధం చూసి పెళ్ళిచెయ్యొచ్చు..."

ఆశాభావం వ్యక్తంచేస్తూ ఓదార్పుగా అంది మరొక వ్యక్తి...

లక్ష్మీదేవి దగ్గరినుంచి తగినంత ప్రోత్సాహం రాకపోవటంతో విసిగి వెళ్ళిపోయారు అమ్మలక్కలు...

నీరజ ఆపుచేస్తోందే బలవంతాన నిగ్రహించుకుంటూ లోపల కూర్చున్న ప్రభు విసురుగా బయటకు వచ్చాడు...

తల్లిముఖం చూడగానే అతని విసురంతా ఎక్కడిదక్కడ ఎగిరిపోయింది. ఎంతగానో కుమిలిపోతూ దానిని అణచుకునే ప్రయత్నం లక్ష్మీదేవి ముఖంలో స్పష్టంగా కనిపిస్తోంది. ఎన్నెన్నో అందామని వచ్చిన ప్రభు కొంతసేపటివరకు మాట్లాడలేకపోయాడు

"వాళ్ళందరినీ పొమ్మనకపోయావా అమ్మా!" అన్నాడు.

"పొమ్మనను-నీకు పుణ్యం ఉంటుంది నువ్వు పొమ్మని అనకు"

"అలా వాగుతుంటే..."

"పరవాలేదు! ఎన్ని సాధింపులైనా భరిస్తూ సమాజంలో ఉండటమే సుఖం! సమాజానికి వెలివడి బ్రతకలేము. నువ్వు చేసే పనుల ఫలితాన్ని నీ ముందు తరంలో తలిదండ్రులూ, నీ తరువాతితరంలో సంతానము అనుభవించక తప్పదు..."

లక్ష్మీదేవి అంత శాంతంగా దృఢంగా మాట్లాడుతోంటే ప్రభు మనసులో ఏదో అవ్యక్తమైన భయం కలిగింది కొంచెంసేపు.

అప్పుడే పేకాటలోంచి వచ్చాడు చంద్రశేఖరరావు

"ఏరా ప్రభూ! నీరజను తీసుకొచ్చావా? వీల్లేదు! ఆ చెడిపోయిన దాన్ని మన ఇంట్లో ఉంచటానికి వీల్లేదు!" అన్నాడు గట్టిగా అరుస్తూ.

ఏనాడూ ఇంటి బాధ్యత పట్టించుకోకుండా, తను నెమటఓడ్చి సంసారం నడుపుతోంటే విలాసాల్లో, మునిగితేలుతూ ఈనాడు ఇలా ఆజ్ఞాపిస్తున్న తండ్రిని చూస్తోంటే జుగుప్స కలిగింది ప్రభుకు...

"ఈ ఇంటికోడలు! ఈ ఇంట్లో ఉండక ఎక్కడికి వెళ్తుంది?" అన్నాడు.

"ఈ ఇంటికోడలా? దాన్ని పెళ్ళిచేసుకుంటావా? అలా ఒరగటానికి పేల్లేదు."

"నేను తప్పకుండా నీరజను పెళ్ళిచేసుకుంటాను!"

"ఇదియటా! కని పెంచి ఇంతవాణ్ని చేసినందుకు బాగా నువ్వు చూపించే కృతజ్ఞత?"

ప్రభులో సహనం నశించిపోయింది...

"మీరు కనబోయే ముందు నన్ను అడిగి ఉండవలసింది ... కన్నంత మాత్రాన ఎదిగాకకూడా వ్యక్తిత్వం పెంచుకోకుండా మీకు బానిసలా పడిఉండ లేననీ...నన్ను కనవద్దనీ...చెప్పి ఉండేవాణ్ని!"

వెటకారంగా అన్నాడు ప్రభు. ఖిత్తరపోయి చూశాడు చంద్రశేఖరరావు. లక్ష్మీదేవి సహించలేకపోయింది...

"అవును ప్రభూ! పెద్దవాడి వయ్యావు-నిన్ను శాసించే అధికారం మాకు లేదు-బయటకుపోయి మా బ్రతుకులు మేము బ్రతకగలిగే సామర్థ్యమూ లేదు. దయతలిచి గుప్పెడు మెతుకులు పడేస్తున్నావు. తిని పడిఉండక నీకు బుద్ధులు చెప్పటంకూడానా? క్షమించు!..."

భర్త చెయ్యిపట్టుకుని లోపలకు లాక్కుపోయింది. ప్రభుకు తల తిరిగినట్ల యింది! నీరజకు పిచ్చిఎక్కినట్లే అవుతోంది!

''నేను వెళ్ళిపోతాను ప్రభు!'' అంది బ్రతిమాలితున్నట్లుగా...

నీరజ రెండుచేతులూ గట్టిగా పట్టుకున్నాడు.

"వద్దు! ఆ మాటమాత్రం అనకు! ఈ బాధలన్నీ నీతోకలిసి సుఖంగా అనుభ వించగలను. నువ్వు వెళ్ళిపోతే మాత్రం నరకమే నాకు!"

లక్ష్మీదేవికి వంటపనుల్లో సాయంచెయ్యటం మొదటి నుంచీ అలవాటే నీరజకు-ఎప్పటిలా వంటలో సాయం చెయ్యబోయింది.

"వద్దులేః నువ్వు కూచోః నేను చేసుకోగలనుః" మామూలుగానే అంది లక్ష్మీదేవి...

లక్ష్మీదేవిలో తనపట్ల వెనుకటి ఆదరభావంలేదని అర్థమయినా తనే కల్పించుకుని కూడాకూడా తిరుగుతోంది నీరజ—

"నువ్వే కూచో అత్తయ్యాః ఈమాత్రం వంట నేను చెయ్యలేనా ?" ఇంచుమించు బలవంతంగా వంటలో జొరబడింది నీరజ. లక్ష్మీదేవి వంటఇల్లు వదిలి బయటకు వచ్చేసింది...

నీరజ వంటంతా చాలా చక్కగా చేసింది. కానీ ఆరోజు లక్ష్మీదేవి అన్నం తినలేదు.

"వంట్లో ఏదోగా ఉంది. అన్నం తినాలని లేదు" అంది.

"డాక్టర్ని పిలుచుకురానా?" అంది నీరజ.

"ఈ మాత్రందానికి డాక్టరెందుకుః కళ్ళుమూసుకు పడుకుంటే అదే తగ్గిపోతుంది..."

"పోనీ. పాలుతాగు అత్తయ్యాః''

''తీసుకురాః" విసుగ్గా అంది లక్ష్మీదేవి.

ఆ మరునాడు అలాగే జరిగింది. ఆరోజు పక్కింటి పిన్నిగారు లక్ష్మీదేవిని చూడటానికి వచ్చింది.

"అలా ఉన్నావేం? చాలా నీరసంగా..." అంది.

"రెండు రోజుల్నించీ అన్నం తినటంలేదుః" అని చెప్పింది నీరజ.

పిన్నిగారు లక్ష్మీదేవి నుదురూ చెంపలూ ముట్టుకుచూసి ముఖం చిట్లించింది.

"వంట ఎవరు చూస్తున్నారు? నువ్వేనా?" అంది నీరజతో.

"అవును" అంది నీరజ తెల్లబోతూ.

పక్కింటి పిన్నిగారు వెంటనే ఇంటికివెళ్ళి ఒక కారియర్‌లో భోజనం సర్ది తీసుకొచ్చి లక్ష్మీదేవిని బలవంతపెట్టి దగ్గిరుండి తినిపించింది.

నీరజకు అప్పటికి అర్థమయింది. నిర్ఘాంతపోయింది.

ఆ మరునాడు నీరజ తనే లక్ష్మీదేవితో "అత్తయ్యాః వంట నువ్వే చేసుకోః నేను ఏమీ ముట్టుకోనుః" అంది.

లక్ష్మీదేవి ఏమీ మాట్లాడలేదు. వంటింట్లోకి నడిచింది. లక్ష్మీదేవి వంట పూర్తిచేసి ప్రభుకు, చంద్రశేఖరరావుకు వడ్డించి తను పెట్టుకుతిన్నాక నీరజ తినేది.

ఒకరోజు లక్ష్మీదేవి వంట ఇంకా పూర్తికాకుండానే పొరుగింట్లో ఎవరో సత్యన్నారాయణవ్రతమని తీసికెళ్ళారు. ప్రభుకు ఆఫీస్‌కు టైమయిపోయింది.

"నీరజా! టైమయిపోయింది వడ్డించు" అన్నాడు. ఏదో పుస్తకం చదువు కుంటోన్న నీరజ తలెత్తి అమాయకంగా చూసింది.

"ఆలోచిస్తావేమిటి? త్వరగా వడ్డించు..." అన్నాడు.

నీరజ నవ్వటానికి ప్రయత్నిస్తూ "అబ్బా! నేను ఈ పుస్తకం వదలలేను. నువ్వే పెట్టుకు తిందూ!'' అంది.

విస్తుపోయి చూసాడు ప్రభు-నీరజ చేతిలోంచి పుస్తకంలాగి అవతల పారేసాడు.

"చాల్లే! త్వరగా పెట్టు!"

"ఏవిటా మొండితనం! ఒక్కరోజు పెట్టుకుతింటే అరిగిపోవులే!"

"అదేం కుదరదు! పెట్టవలసిందే!''

''నేను పెట్టను"

"పెట్టవూ?"

''ఊహు!"

''అయితే సరే! నేను అన్నం తినకుండానే వెళ్ళిపోతాను." కోపంగా బూట్లు తొడుక్కుని ప్రయాణమయ్యాడు. ఎప్పటికప్పుడే నీరజ తనను ఆపుచేస్తుందని ఆశతో ఎదురుచూసి నీరజ చలనంలేని బొమ్మలా కూర్చునేసరికి కోపంగా వెళ్ళిపోయాడు.

తరవాత కంగారుపడుతూ వచ్చింది లక్ష్మీదేవి. నీరజను చూసి ''ప్రభు వెళ్ళిపోయాడా?'' అంది.

"వెళ్ళిపోయాడు.''

"అన్నం తినలేదా?"

"పెట్టమన్నాడు. నేను పెట్టలేదు."

"నన్ను పిలవకపోయావా?''

"పూజ జరుగుతున్నచోటికి నేను రావచ్చునా? దేవుడు మైలపడిపోడా?"

లక్ష్మీదేవి మాట్లాడకుండా వెళ్ళిపోయింది. ఆవిడకూడా అన్నం తినలేదు.

చేతులలో ముఖందాచుకుని ఏడుస్తోన్న నీరజ తలమీద చెయ్యిపడేసరికి ఉలికిపడి తలెత్తి ప్రభునుచూసి గబగబ కళ్ళు తుడుచుకుంది...

ఆఫీస్‌కు వెళ్ళాడేగాని ప్రభు స్థిమితంగా ఉండలేకపోయాడు. నీరజ అహం

కారంతో తనకు వడ్డించలేదని అనుకోలేకపోయాడు. అక్కడ ఉండలేక పోయాడు. అతడు అనుమానించినట్టే నీరజ ఏడుస్తోంది

"అన్నం పెట్టకుండా పంపించి తిరిగ్గా ఏడుస్తూ కూచో! బుద్ధిలేకపోతే సరి. ఇప్పుడైనా పెట్టు!" అన్నాడు.

నీరజ గబగబా కళ్లు తుడుచుకుని "అత్తయ్యా! ప్రభు వచ్చాడు. అన్నం పెట్టండి!" అంది.

అప్పటికి ప్రభుకు అర్థమయింది. "నీరజా..." అన్నాడు ఆశ్చర్యంగా.

పొంగివచ్చే దుఃఖాన్ని అణచుకుంటూ తల తిప్పుకుంది నీరజ.

రెండుచేతులూ జాపి ఓదార్పుగా నీరజను తన గుండెలలోకి తీసుకున్నాడు ప్రభు.

* * * *

సుశీల గర్భవతి అయింది. ఆ గర్భాన్ని కాపాడుకోవటానికి సుశీల చాలా యాతన పడవలసివచ్చింది.

"నేను మీకొక అపురూపమైన కానుక ఇయ్యబోతున్నాను" అంది సుశీల.

"నువ్వు కానుక ఇస్తావా?" ఆశ్చర్యంగా అడిగాడు బాలూ.

"ఏం? మీకు కానుక ఇయ్యగలిగే శక్తిలేని నిర్భాగ్యురాలినని కదూ..."

"అదికాదు! ఇయ్యగలిగినంతా ఇచ్చావు—ఈ జీవితంలో మరెక్కడా నేను పొందలేని ఆనందాన్ని నీదగ్గిర పొందగలిగాను—అంతకు మించిన కానుక ఈయ గలవా?"

"ఆ! అంతకు మించినదే!"

"ఏమిటో అది?"

"అల్లరి అబ్బాయి కావాలా? అందాల పాపాయి కావాలా?"

"ఏవిటి నువ్వనేది?"

"ఏం? నా మాటల్లో మీకు నమ్మకం లేదా? ఈ సంతానం మీదేనని అనుకో లేరా?"

"అదికాదు- లాభంలేదు సుశీలా! ఇది పోయేమార్గం చూడు!"

సుశీల కన్నీళ్ళతో రోషంగా చూసింది.

"పోయేమార్గం చూడనా? ఎంత కష్టపడి దానిని నిలుపుకున్నానో, మీరు ఊహించగలరా?"



"ఆ సంతానం ఎక్కడ పెరుగుతుంది? ఎలా పెరుగుతుంది?"

''ఆ భయం నాకు లేదు. ఇది నా మనసులో చిగురించిన పవిత్రమైన ప్రేమ ఫలం_మనుష్యులలో మంచితనం ఎప్పటికీ నాశనంకాదని రుజువుచేస్తూ నాబాబు తప్పకుండా, హాయిగా పెరుగుతాడు. మీరేమీ భయపడకండి! నా శిశువు బరువు బాధ్యతలేవీ మీమీద పెట్టను..."

బాలూ చిత్రంగా నవ్వాడు ''పిచ్చి సుశీ...'' అన్నాడు జాలిపడుతున్నట్లు.

ఆ క్షణంలో సుశీలముఖం చూస్తోంటే బాలూ మనసులో మమత పొంగి వచ్చింది...

''ఇలాటి సమయంలో ఆడవాళ్ళ మనసులో ఎవేవో కోరికలు ఉంటాయని అంటారు_నీకేం కావాలో అడుగు..."

"అనవసరంగా ఆశ పెట్టకండి! నా కోరికలు మీరు తీర్చలేరు?"

"ఈ బాలూ సంగతి నీకు అర్థంకావటంలేదు! అడిగి చూడు...".

"సరే! అడిగేస్తున్నాను_నన్ను ఒక్కరోజు ఒక్కగంట ఎక్కడికైనా బయటికి తీసికెళ్ళండి ..."

నివ్వెరపోయి చూసాడు బాలూ.

"చూసారా? అప్పుడే ఎలాగ అయిపోయారో..."

"అదికాదు...ఇలాంటి కోరిక..."

''భయపడకండి! ఏ విధంగానూ మిమ్మల్ని బంధించను_ఎప్పుడూ ఇలా ఈ

మామూల గదిలో మీతో గడపడం నాకు ఎలానో ఉంది. విశాలమైన ప్రకృతి ఒడిలో మీదాన్నిగా_స్వేచ్ఛగా—ఒక్క క్షణం ఊపిరితీసుకోవాలని ఉంది...''

ఆర్తితో అంటున్న సుశీలచెయ్యి ఆప్యాయంగా తనచేతిలోకి తీసుకున్నాడు బాలూ.

"తప్పకుండా తీసికెళ్తాను ..''

సుశీల కళ్ళు మెరిశాయి.

సుశీలను బయటకు తీసికెళ్తానని రాజేశ్వరితో చెప్పాడు బాలూ...రాజేశ్వరి ఎంతమాత్రమూ ఒప్పుకోలేదు-బాలూ ఎంత ఇస్తానన్నా ఒప్పుకోలేదు.

"నేను సుశీలను తీసుకువెళ్తున్నాను. ఏంచేస్తారో చేసుకోండి——"

మొండిగా అని సుశీల చెయ్యి పుచ్చుకుని తీసుకువచ్చాడు బాలూ...

వీధి గుమ్మానికి అడ్డుగా యమభటుడిలా నించున్నాడు, ఆ బ్రోతల్‌ని కాపలా కాసే గూండా. బాలూ ఆగిపోయాడు.

రాజేశ్వరి వెక్కిరింతగా నవ్వి ''తీసుకువెళ్ళండి..." అంది.

బాలూ విచిత్రంగా ఈల వేసాడు-మరుక్షణం ఎక్కడినుంచి వచ్చారో, ఎలా వచ్చారో నలుగురు మనుష్యులు చేతిలో పిస్టల్స్‌తో సహా అక్కడికి హాజరయ్యారు.

బాలూ రాజేశ్వరిని చూసాడు.

"ఇప్పుడు చెప్పండి! తీసుకువెళ్ళనా? ఇంకా ఏమైనా అభ్యంతరాలా?"

రాజేశ్వరి ముఖం పాలిపోయింది. బాలూను దెయ్యాన్ని చూసినట్లు చూస్తూ అస్పష్టంగా ఏదో గొణిగింది.

బాలూ సుశీలను చూసి ''రా!" అన్నాడు.

సుశీలముఖం రాజేశ్వరిముఖాన్ని మించి పాలిపోయింది_అప్రయత్నంగా ఒక్క అడుగు వెనక్కి వేసింది.

"ఓ!...సరే! ఇప్పుడు నేనెవరో తెలిసిపోయింది కదా! నీకు ఇష్టంలేకపోతే రానక్కర్లేదు_ఎలాంటి పరిస్థితిల్లోనూ నేను ఎవరినో ఎవరికీ తెలియనియ్యను-నీకోసమే ఇంత సాహసం చేసాను-లోపలికి వెళ్ళిపోతావా?"

"లేదు! మీతో వస్తాను..."

సుశీల ముందుకు నడిచి బాలూ చేతిలో చెయ్యి వేసింది.

బాలూ తిన్నగా హోటల్‌కి తీసుకువెళ్ళాడు.

"మళ్ళీ ఇక్కడికా..." అంది సుశీల చిరాగ్గా...

"ఇక్కడ మనం ఉండేది కొన్ని గంటలే! నువ్వు తయారవ్వటానికి... ముందు ముందు ఏదెలా జరుగుతుందో చెప్పలేను-కానీ ఇవాళ ఒక్కరోజు... డబ్బువల్ల లభ్యమయ్యే అన్ని రకాల ఆనందాలూ నీకు రుచి చూపించగలను..."

బాలూ వెళ్ళి కొన్ని నిమిషాల్లోనే బట్టలు, వాటికి సరిపోయే నగలూ తీసుకుని వచ్చాడు.

"త్వరగా అలంకరించుకో! గొప్పింటి పిల్లలాగ ఉండాలి." బాలూ తెచ్చిన చీర ఎంతో బాగుంది-ఆకుపచ్చ రంగుమీద జరీ పువ్వులు... పచ్చలూ, ముత్యాలూ పొదిగిన దుద్దులు, నెక్లెస్, ఉంగరం...ఆకుపచ్చ బొట్టు కూడా చూసి "ఎంత తెలుసు!" అని నవ్వుకుంది సుశీల...శ్రద్ధగా అలంకరించుకుంది.

పై అలంకరణకంటె మనసు నిండిన తృప్తి ఎక్కువగా మెరుస్తోంది సుశీల ముఖంలో...సుశీల ముఖంలో ఆ ఆనందం అర్థంచేసుకుని లోలోపల నిట్టూర్చాడు బాలూ. సుశీలను తీసుకుని పెద్దపెద్ద హోటళ్ళకూ, షాపులకూ తిరిగాడు బాలూ...ప్రతిచోట బాలూకు, అతనితోపాటు తనకు జరుగుతోన్న మర్యాదలకూ, సత్కారాలకూ నివ్వెరపోసాగింది సుశీల...బాలూ లోలోపల నవ్వుకున్నాడు-సుశీలను కాన్వెంట్‌కు తీసుకువెళ్ళాడు-సిస్టర్ ఎంతో సంభ్రమంగా, ఆదరంగా ఆహ్వానించింది.

"ఈవిడ మీ..." అని ఆగిపోయింది.

"భార్య!-" టక్కున చెప్పాడు బాలూ... సుశీల బాలూ ముఖంలోకి చూసి తల దించుకుంది.

"అలాగే అనుకున్నాను-ఇంతమంది అనాధ శిశువులకు అండగా నిలబడుతున్నారు. మీ బాబు తప్పకుండా చాలా గొప్పవాడవుతాడు..."

సుశీల అప్రయత్నంగా రెండు చేతులూ జోడించింది-సిస్టర్ అప్రతిభురాలై పోయింది-సుశీల గర్వంగా నవ్వినా, సిగ్గుగా తల వంచుకున్నా, ఆవిడ అర్థం చేసుకోగలిగేది-ఇలా చేతులు జోడించటం......

"గొప్పవాళ్ళలో ఇంత నిరాడంబరంగా...ఇంత మంచిగా ఉండేవాళ్ళను ఎక్కడా చూడలేదు..." అంది.

"డబ్బున్నంత మాత్రాన గొప్పవాళ్ళు కారు సిస్టర్! నిజానికి మీకంటె గొప్పవాళ్ళు ఎక్కువమంది ఉండరు..." మరింత ఆశ్చర్యపోయింది సిస్టర్. బాలూ వైపు తిరిగి నవ్వుతూ "ఇన్నాళ్ళూ మీరే మంచివారని అనుకునేదానిని. మీ

శ్రీమతి అన్నివిధాలా మిమ్మల్ని మించిపోయారు—ఇలాంటి సంస్కారమూ సహృదయమూ, ఎక్కడా చూడలేదు—మీరిద్దరూ చాలా అదృష్టవంతులు—" అంది.

బాలూ సిస్టర్‌కి "థేంక్స్" చెప్పి సుశీలతో వచ్చేసాడు—చెమ్మగిల్లిన సుశీల కళ్ళను చూస్తూ 'ఇవాళ నాతో సంతోషంగా గడపాలని బయలుదేరావు...' అన్నాడు...

''ఇప్పుడు నేను సంతోషంగా లేనని ఎవరు చెప్పారు? కొన్ని కొన్ని సందర్భాలలో వచ్చే కన్నీళ్ళలో ఎంత ఆనందం ఉంటుందో తెలుసా?"

తెలిసింది బాలూకి. కళ్ళు చెమ్మగిల్లినా, ఏదో అపూర్వమైన కాంతితో వెలిగి పోయే సుశీలముఖం చూస్తోంటే...

సుశీలతో కలిసి నదిలో బోట్‌మీద తిరిగాడు బాలూ. పట్టరాని ఆనందంతో పసిపిల్లలా పకపకలాడింది సుశీల...

''నే నెవరో తెలుసా? మీ భార్యను—" గర్వంగా అంది.

''కొంపతీసి తాళి కట్టమంటావేమిటి? ఆ తాళివల్ల కట్టిన నాకు కాని, కట్టించు కున్న నీకుకాని ఎలాంటి ప్రయోజనమూ లేదు.''

"మీకేంతెలియదు—భార్య అంటే తాళి కట్టించుకున్నది కాదు—ప్రేమించిన స్త్రీ."

రెండు చేతులూ జాపి సుశీలను ఆదరంగా గుండెలలోకి తీసుకున్నాడు బాలూ......

* * * * * * *

యశోధర, భర్త వేణుతో కలిసి వస్తున్నానని ఉత్తరం రాసింది. నీరజ వెలతెలపోతూ ''పోనీ, నేను కొన్ని రోజులు ఎక్కడికైనా వెళ్ళి ఉండనా?" అంది...

"కొన్ని రోజులు కాదుగదా, కొన్ని క్షణాలైనా నువ్వు ఈ ఇంట్లోంచి వెళ్ళడానికి వీల్లేదు—యశోధరకు పెళ్ళి అయిపోయింది—కాబట్టి నా కారణంగా నా చెల్లెలి జీవితం పాడవుతుందేమోనని భయపడక్కర్లేదు. ఇంక ఏది ఎలా జరిగినా ఎదుర్కోగలను."

తీవ్రంగా అన్నాడు ప్రభు...లక్ష్మీదేవి ఏమీ మాట్లాడలేదు...

మొత్తంమీద యశోధరా వేణుల రాకతో ఇంట్లో వాతావరణం కొంత

ఉత్సాహంగా ఉంది...వేణు ప్రభును మనసారా అభినందించాడు, "ఇలాంటి భార్య దొరకటం మీ అదృష్టం..." అని...

యశోధర, వేణు, రోజూ సాయంత్రం ఎక్కడికో ఒక చోటికి షికారుగా బయలుదేరేవారు - ఒకరోజు వేణు ప్రభుతో "మీరూ రండి!" అన్నాడు. నీరజ కంగారుపడి 'మీమధ్య మేమెందుకు? మీరు వెళ్ళి రండి!" అంది.

వేణు నవ్వుతూ "అంత కంగారెందుకు చెల్లెమ్మా! మీ ఇద్దరికీ మేం అడ్డు రాములే! సరదాగా వెళ్దాం రండి,..." అన్నాడు.

యశోధర, వేణు సరదాగా తిరుగుతోంటే ప్రభులో తనుకూడా నీరజతో అలా తిరగాలనే కోరిక కలగసాగింది-నీరజను పక్కకు పిలిచి "మనమూ వెళ్దాం నీరజా! ఎంతకాలమని ఇలా ఇంట్లో మగ్గిపోతాం? సంఘాన్ని లెక్క-చెయ్యకుండా నిలబడాలని నిర్ణయించుకున్నాం! నిలబడదాం..." అన్నాడు.

గుమ్మం కదలకుండా ఏదో అపరాధంచేసి బందీ అయినట్లు ఇంట్లోనే ఉండి పోవటం నీరజకు కష్టంగానే ఉంది-తయారయి బయలుదేరింది.

నలుగురూ సరదాగా కబుర్లు చెప్పుకుంటూ నడవసాగారు-కానీ, ఆ సంతోషం ఎక్కువసేపు నిలవలేదు-ఆ నలుగురికీ వినపడేలాగ జనం మాటలు విసర సాగారు...

"ఆ అమ్మాయి నీరజ కదూ."

"ఆ మధ్య ఎక్కడికో వెళ్ళిపోయిందన్నారు..."

"వెళ్ళటం...రావటం...ఆవిడకు అలవాటే కదూ..."

"ఈసారీ మళ్ళీ అక్కడికే నంటావా?"

"దేవుడికి తెలియాలి!"

"చిత్రంగానే ఉంది."

"అంతకంటె చిత్రం! ప్రభు ఆ అమ్మాయిని చేసుకుంటానని అనటం..."

"ఎంత సాహసం!"

"నెమ్మదిగా అంటున్నావా? శీలం సింగినాదం వదిలెయ్యి...ఆ గూండాలతో లావాదేవీలు...ప్రాణాలకు సుఖం ఉంటుందా?"

"ప్రభుకు అంత ప్రేమ ఉందా ఆవిడమీద?-"

"వెఱ్ఱి వేయి విధాలు..."

నీరజకు తల తిరిగిపోసాగింది. ప్రభు చెయ్యి గట్టిగా పట్టుకోకపోతే తూలి

పోయేదే: వేణు మొదట ఈ మాటలు తమను ఉద్దేశించినవని అనుకోలేదు...కానీ అవతలివాళ్ళు కావాలని రెట్టించి రెట్టించి అనటమూ, యశోధర కంగారు పడటమూ; నీరజ ముఖం పాలిపోవటమూ, ప్రభు బాధపడటమూ అతనికి అనుమానం కలిగించాయి నీరజను మళ్ళీ పరీక్షగా చూసాడు అతనికి గుర్తుకు వచ్చింది అవును-ఆ మధ్య పేపర్లలో వచ్చిన వార్త ఈ అమ్మాయిని గురించే.

ఆ రాత్రి భార్యను నిలదీసి అడిగాడు వేణు.. చేసేదిలేక యశోధర సమస్తమూ చెప్పేసింది.

"ఏమిటీ? అలాంటిదాన్ని...ఆ గూండాల చేతుల్లోపడి తిరిగివచ్చినదాన్ని... మీ అన్నయ్య చేసుకుంటున్నాడా?" అన్నాడు ఆశ్చర్యంగా వేణు.

"అవును పాపం!, ఇందులో నీరజ తప్పు ఏముంది? నీరజ ఎంత మంచిదో నాకు బాగా తెలుసు."

"ఛీ! ఛీ, సిగ్గు లేకపోతే సరి." చీదరించుకుంటూ అన్నాడు వేణు.

ఒక రాత్రివేళ తనపక్కన ఎవరో పడుకున్నట్లు అయి మెలకువ వచ్చింది నీరజకు.

ఎవరో మొగవాడు తన పక్కన పడుకుని తనను గట్టిగా కౌగిలించు కుంటున్నాడు.

ప్రభు కాదు! ప్రభు ఎప్పటికీ అలా ప్రవర్తించడు.

"ఎవరూ?" అంది భయంగా...గట్టిగా.

ఆ ఆకారం నీరజ నోరు నొక్కేసింది.

"హుష్ నేనే!"

వేణు కంఠస్వరం గుర్తుపట్టింది నీరజ-నిర్ఘాంతపోయింది.

తనను చెల్లెమ్మా అని నోరారా పిలిచిన వేణు...ప్రభును ఎంతగానో అభి నందించిన వేణు...ఇంత నీచంగా...చెప్పుడు మాటలకు ఇంత ప్రభావం ఉంటుందా?

"వెళ్ళిపొండి-" అంది కోపంతో-చికాకుతో వణికిపోతూ

"పెద్ద పతివ్రతా వేషాలు వెయ్యకు."

నీరజ అసహ్యం అవధులు దాటింది

"వెళ్ళిపోతారా? అరవనా?" గట్టిగానే అంది.

వేణు భయపడి లేచిపోయాడు.



జరిగిన సంగతి ఎవరికైనా చెప్పాలో, చెప్పకూడదో కూడా నిర్ణయించుకో లేకపోయింది నీరజ.

ఏమీ జరగనట్లే ఊరుకుంది నీరజ-కానీ వేణు-ఊరుకోలేదు-ప్రభును పిలిచి "నేను ఒక్కసారి నీరజను పరీక్ష చేయాలి!" అన్నాడు.

ప్రభుకు చాలా కోపం వచ్చింది.

"పరీక్ష చెయ్యవలసిన అవసరంలేదు-ఏమీ జరగలేదని నీరజ చెప్పింది."

"ఆవిడ అలా కాక ఇంకెలా చెప్తుంది?"

"నాకు నీరజ మాటల్లో నమ్మకముంది. అదీ కాక పోలీసులు నియమించిన డాక్టర్ కూడా నీరజకు ఏ ప్రమాదమూ జరగలేదని చెప్పాడు."

"దానిదేముందీ? కాస్త లంచం పడేస్తే ఎలా అంటే అలా చెప్తాడు."

ప్రభు కోపం అణచుకోలేకపోతున్నాడు.

"అయినా మీకెందు కాబాధ? పెళ్ళి చేసుకోబోతున్నది నేను!" వెటకారంగా నవ్వాడు ప్రభు.

"అవును నువ్వే! ఇంతటి మహాకార్యం మరొకరు చెయ్యలేరు-కానీ ఇది ఒక్క శీలానికి సంబంధించినది కాదు. ఆరోగ్యానికి కూడా సంబంధించినది... ఆవిడకు ఏవైనా జబ్బులు పట్టుకునే అవకాశం ఉంది వెంటనే చెక్ చేయించు కోకపోతే, ఇంట్లో అందరి ఆరోగ్యాలూ పాడవుతాయి"

ప్రభు నోట మాటరాలేదు-ఎంత దారుణంగా మాట్లాడుతున్నాడు వేణు!

"నాకు నీరజలో నమ్మకం ఉంది. ఏ పరీక్ష చెయ్యవలసిన అవసరంలేదు-ఎవరికీ ఎలాంటి జబ్బులూ రావు."

"పోనీ, ఒక్కసారి పరీక్షచేస్తే వచ్చిన నష్టం ఏముంది?"

"నావల్ల కాదు-నీరజను అలా అవమానించలేను."

"అయితే నేను ఇక్కడిక ఉండలేను. మీకు ఉన్నంత త్యాగబుద్ధి నాకు లేదు."

"మీ యిష్టం."

ఈ సంభాషణ అంతా రహస్యంగా జరగలేదు...నీరజ, లక్ష్మీదేవి, యశోధర ఉండగానే జరిగింది.

"నాకు చావు ఎందుకురాదో!" అని తల కొట్టుకుని లక్ష్మీదేవి అక్కడినుండి వెళ్ళిపోయింది.

"త్వరగా నీ సామానులు సర్దుకో!" అన్నాడు యశోధరతో వేణు.

"సర్దుకునే ఉన్నాను!"

శాంతంగా చెప్పింది యశోధర.

"నిజంగానా?" ఆశ్చర్యంగా అడిగాడు.

"ఎందుకంత ఆశ్చర్యం? మా అందరిమేలూ కోరి మీ రింతగా చెప్తోంటే కాదంటానా? ఎంత స్వార్థత్యాగం మీది! మీకు ఏం వచ్చినా పరవాలేదనుకొని అర్ధరాత్రి పక్క దగ్గరకే వెళ్ళగలరు-మిగిలినవాళ్ళ ఆరోగ్యం గురించి మాత్రం ఎక్కడలేని శ్రద్ధా తీసుకోగలరు!" స్థాణువై నిలబడిపోయాడు వేణు.

"ఎవరు చెప్పారు ఈ సంగతి? నీరజేనా?"

"కాదు! నీరజకు అంత మంచిబుద్ధిలేదు-జరిగిందంతా మింగేసి సహనంతో నోరు మూసుకుంది-ఆ రోజు నీరజ గట్టిగా అరిచేసరికి నాకే మెలకువ వచ్చింది. నేనే అంతా విన్నాను."

"విని."

"విని కూడా నోరు మూసుకున్నాను-ఈ ప్రస్తావన మళ్ళీ మీదగ్గర తేవటానికి కూడా అసహ్యం వేసింది-కానీ, ఇవాళ మీ ఔదార్యం చూసాక..."

వేణు తల వంచుకుని వెళ్ళిపోయాడు-మళ్ళీ వెళ్ళిపోతానని అనలేదు-కానీ వాతావరణంలో మాత్రం వెనకటి ఉల్లాసం పూర్తిగా లోపించింది.

యశోధర, వేణు వచ్చిన దగ్గరనుండి, లక్ష్మీదేవి, నీరజ వీధిగదిలో పడుకుంటున్నారు-ఒక రాత్రివేళ లక్ష్మీదేవికి ఎందుకో మెలకువ వచ్చింది. వీధి తలుపులు తెరిచి ఉన్నాయి. లక్ష్మీదేవి గుండెలు ఝల్లుమన్నాయి.

''దొంగ! దొంగ!'' అని గట్టిగా అరిచింది-ఆ గోలకు ఇట్లో అందరూ లేచారు-కంగారుగా వెతుక్కున్నారు-అన్ని వస్తువులూ ఉన్నాయి. ఏమీపోలేదు.

"అన్నట్లు నీరజ ఏదీ?" అన్నాడు వేణు.

అందరూ నీరజకోసం చూసారు-ఏక్కడా లేదు.

ఎవ్వరూ ఏమీ మాట్లాడలేదు-ఎవరిమటుకు వారికే నోరు విప్పడానికే భయంగా ఉంది-కానీ ఎవరూ నిద్రపోలేదు-అందరూ హాలులోనే కూర్చున్నారు.

"ఆ రాక్షసి నా కొడుకు గుండెలు పగలకొట్టడానికే పుట్టింది..." అంటూ ఏడ్చింది లక్ష్మీదేవి.

ఆ ఏడుపు విన్నాక మాట్లాడటానికి వేణుకు ధైర్యం వచ్చింది.

''ప్రభూ! మీరా అమ్మాయిని మరచిపోవటమే మంచిది-ఎప్పటికప్పుడే ఇలాంటి ఉపద్రవాలను ఎదుర్కొంటూ ఎన్నాళ్ళని సహించగలరు''? అన్నాడు.

''అసలు నీరజ మళ్ళీ వస్తుందా?'' బెంగగా అంది యశోధర.

''పీడా వదలిపోతుంది-అది రాకపోతే వెయ్యి దేవుళ్ళకు కొబ్బరికాయలు కొట్టుకుంటాను.'' కసిగా అంది లక్ష్మీదేవి.

సరిగ్గా ఆ సమయంలో ఇంట్లోకి అడుగుపెట్టింది నీరజ.

ముఖంలో కంగారూ భయమూ, ఆరాటమూ స్పష్టంగా కనిపిస్తున్నాయి. ఎంతో దూరంనుండి నడిచివచ్చినదానిలా అలసటగా ఉంది-అందరి ముఖాలలోకీ ఒక్కసారి చూసి తలవంచుకుని నిలబడింది.

"ఎక్కడికి వెళ్ళావు నీరజా!" అనునయిస్తున్నట్లుగా అడిగాడు ప్రభు.

నీరజ మాట్లాడలేదు.

అలాంటి పరిస్థితిలో కూడా ప్రభు నీరజతో అంత ఆప్యాయంగా మాట్లాడటం లక్ష్మీదేవి మనసు మండించింది.

"నీరజా! నిన్ను నమ్మి కళ్ళుమూసి పడుకున్నందుకు తలుపులు బార్లా తీసి పోయావెందుకు? దొంగలుపడి ఇల్లు దోచుకుపోతే ఏంజరిగేది?"

వేణుకు అవకాశం దొరికింది.

"ఏమిటండీ మీ పిచ్చి! నీరజ ఇక్కడ ఉండగా మీ ఇంటికి దొంగలెందుకు వస్తారు?'' అన్నాడు.

నీరజ ఎవరి మాటలకూ సమాధానం చెప్పలేదు. ఆ సమయంలో ఇంటి ముందు కారు ఆగింది. అందులోంచి నీలకాంత్ దిగాడు. నీరజ దెయ్యాన్ని చూసి నట్లు బెదిరింది. నీలకాంత్ నీరజను చూసి కనపడీ కనపడనట్లు నవ్వి "ఇదేమిటి ఇంత రాత్రివేళ అందరూ ఇలా కూర్చున్నారేం?" అన్నాడు.

"మీరు ఎలా వచ్చారు ఈ సమయంలో—" ఆశ్చర్యంగా అడిగింది యశోధర.

"రెండో ఆట సినిమా చూసి వస్తున్నాను. ఇంట్లో లైట్లు వెలుగుతోంటే మెల కువగా ఎందుకున్నారోనని ఆశ్చర్యపోతూ కనుక్కుందామని వచ్చాను."

నీలకాంత్ మాటలకు వేణు సమాధానం చెప్పాడు.

"నీరజ అర్ధరాత్రి ఇంట్లోంచి ఎక్కడికో వెళ్ళిపోయింది. దొంగలు పడతా రని అత్తయ్యగారు ఆందోళనపడుతోంటే...నీరజ ఉండగా ఆ భయంలేదని నేను చెప్తున్నాను..."

నీలకాంత్ వేణువంక చురుగ్గా చూసాడు. వేణుకళ్ళలో నీలకాంత్ కేదో కనిపించింది

"వేణూ మీరు నీరజపైన లేనిపోని అభాండాలు వేస్తున్నారు. నీరజ నాకు బాగా తెలుసు. పోనీ, మీరన్న మాటలు నిజమయితే, ఇంతరాత్రివేళ ఎక్కడికో వెళ్ళివచ్చిన నీరజ దగ్గర డబ్బో, దస్కమో, ఏదో ఒకటి ఉండాలిగదా..."

నీరజ చేతిలో ఉన్న చిన్న బేగ్ వైపు వేణుకు సైగచేస్తూ అన్నాడు నీల కాంత్.

వేణు పులిలా ముందుకు దూకి నీరజ చేతిలో బేగ్ లాక్కుని తెరచి చూశాడు.

అందులో బేంక్ బుక్ ఉంది. ఆ బుక్‌లో అంతకు ముందురోజే నీరజ పేర యాభైవేలు డిపాజిట్ చెయ్యబడినట్లుగా ఉంది.

ఆ బుక్ అందరికీ చూపిస్తూ విరగబడి నవ్వాడు వేణు.

నీలకాంత్ ఆశ్చర్యం నటిస్తూ "నేను ఏదో యధాలాపంగా అంటే నిజంగా జరుగుతుందని అనుకోలేదు. అయామ్ సారీ నీరజా!" అన్నాడు.

నిస్సహాయంగా ఉన్న వ్యక్తిని నిష్కారణంగా గుండెల్లో పొడుస్తోంటే ఆ వ్యక్తి ముఖం ఎలా ఉంటుందో అలా ఉంది నీరజ ముఖం.

"ఛీ!ఛీ! ఇంక ఈ ఇంట్లో ఒక్కక్షణం ఉండను..." అని యశోధర

చెయ్యిపట్టుకుని బరబర ఈడ్చుకుపోయాడు వేణు. లక్ష్మీదేవి వంటింట్లోకి పోయి దేవుడిముందు కూలబడిపోయింది.

"డోంట్ వర్రీ ప్రభూ! ఇప్పటికీ నాకు నీరజలో తప్పు ఉందని అనిపించటం లేదు. అనవసరంగా నీరజను కష్టపెట్టకు. ఇద్దరూ అన్ని విషయాలు స్పష్టంగా మాట్లాడుకుని అపార్థాలన్నీ తొలగించుకుని అన్యోన్యంగా ఉండండి..." అని ప్రభుభుజంమీద తట్టి వెళ్ళిపోయాడు నీలకాంత్.

తలెత్తి నీరజ ముఖంలోకి చూసిన ప్రభు మనసు కరిగిపోయింది. అంత దీనంగా ఎవరి ముఖమూ అతనెప్పుడూ చూడలేదు.

"నీరజా! నీకు నా దగ్గర భయమెందుకు? ఏం జరిగిందో..." ప్రభు మాటలు పూర్తి కాకుండానే అడ్డుతగిలింది నీరజ.

"నన్ను క్షమించు ప్రభూ! నీకేమీ చెప్పలేను. కానీ నావల్ల నీకు ఇబ్బంది రానియ్యను. వెళ్ళిపోతాను..."

గుమ్మందాకా వెళ్ళిన నీరజను చెయ్యి పుచ్చుకుని బలవంతంగా లోపలకు లాగి తలుపులు దభాలున మూసాడు ప్రభు.

*  *  *  *

ప్రభు కాలుకాలిన పిల్లిలా ఇల్లంతా తిరుగుతున్నాడు. వెతికినవే మళ్ళీ మళ్ళీ డ్రాయర్లన్నీ వెతుకుతున్నాడు. లక్ష్మీదేవి ఎన్నోసార్లు "ఏం జరిగింది?" అని అడిగింది. నీరజ కూడా "ఎమిటి ప్రభూ!" అంది.

కంపెనీ డబ్బు అయిదువేల రూపాయలు బేంక్‌లో జమచెయ్యాలి. కొంచెం అశ్రద్ధచేసి ఆ మరునాడు వేద్దామని డ్రాయర్‌లో పెట్టి తాళంవేసాను. ఇప్పుడది పోయింది. ఆ డబ్బు జమకట్టకపోతే ఉద్యోగం పోతుంది. పైగా బ్లాక్ మార్క్..."

నీరజ ముఖం పాలిపోయింది.

"జాగ్రత్తగా చూసావా?"

"ఆ! అన్నివిధాలా అన్నిచోట్లా వెతికి నిరాశ చేసుకున్నాకే నీకు చెపుతున్నాను..."

నీరజ ఇంకేమీ మాట్లాడలేదు. కొన్ని క్షణాలు నీరజ సమాధానంకోసం ఎదురుచూసి, రాకపోవటంతో తల్లిదగ్గిరకు వెళ్ళి సంగతంతా చెప్పి "ఎలా అయినా ఆ అయిదువేలు పుట్టించగలమా అమ్మా!" అన్నాడు.

"అయిదువేలు! ఎక్కణ్ణించి వస్తాయి? యశో పెళ్ళి ఈ మధ్యనేగా చేసాము! ఇంకా ఆ అప్పు తీరనేలేదు...పోనీ, ఎక్కడైనా అప్పుగా దొరుకుతుందేమో చూడు '

"ఎవరిస్తారమ్మా!"

"ఛ!ఛ! అన్నీ శనిరోజులే! ఆ నీరజది మొదటినుండీ శనిజాతకమే! తల్లిని మింగింది. పోనీ ఎలాగో బ్రతుకుతుందనుకుంటే ఎప్పటికప్పుడే ఉపద్రవాలు. దాన్ని ఈ ఇంటికి తెచ్చావు. ఇక్కడా శని పట్టుకుంది..."

"అమ్మా!" బిగ్గరగా, కోపంగా మందలించాడు ప్రభు.

"అన్నట్లు నీరజ దగ్గర యాభై వేలు ఉండాలి కదా, అడిగితీసుకో!"

ప్రభు మాట్లాడలేదు. లక్ష్మీదేవికి చికాకులేసింది. తనే నీరజను కేకేసింది.

"ప్రభుకు అర్జంట్‌గా అయిదువేలు కావాలి. లేకపోతే వాడి ఉద్యోగమే పోతుంది..."

"చెప్పాడు అత్తయ్యా! అది తలచుకునే బాధపడుతున్నాను."

"బాధపడటం దేనికి? నీదగ్గిర యాభై వేలున్నాయిగా! అయిదువే లియ్యి..."

"అత్తయ్యా! అది నా డబ్బు అయితే నువ్వు చెప్పేవరకూ ఆగేదానినా!"

"ఏం నంగనాచివే! నీ డబ్బుకాకపోతే నీ పేరుమీద బేంక్‌లో ఎందుకుంది!"

"ఆ సంగతులేవీ నేను చెప్పలేను!"

"పోనీ, నీ పేరుమీద ఉందిగా! ప్రస్తుతం తీసియ్యి. తరువాత చూసుకోవచ్చును..."

"ఆపని నేను చెయ్యలేనత్తయ్యా! ఏ పరిస్థితుల్లోనూ ఆ డబ్బు నేను వాడననే నమ్మకంతోనే దానిని నా పేరుమీద ఉంచారు."

"ఛిఛీ! అందరి కందరూ స్వార్థపరులు. డబ్బుదగ్గిర ఎవరిమటుకు వాళ్ళే గట్టివాళ్ళు! వంకలకేం...కావలసినన్ని."

"అమ్మా..." ప్రభు ఏదో అనబోయాడు.

"ప్రభూ ! అమ్మా అమ్మా' అంటూ నా నోరు ముయ్యడానికి ప్రయత్నించకు. నీకోసం...నీ క్షేమంకోసం...నా మనసు అల్లాడిపోతోంది. దీని కోసం నువ్వేంత చేసావు? ముష్టి అయిదువేలు ఇవ్వలేదూ? అంత కాపీనమా? దాని కర్మాన దాన్ని వదిలి లక్షణంగా మరో మంచి పిల్లను చూసుకుంటే కట్నంగా అయిదుకాదు, పదివేలు వస్తాయి...'

"ఇదంతా జరిగేపని కాదులే అమ్మా!..."

"అంటే...ఈ శనిగొట్టు దరిద్రదేవతకోసం...ఈ పాషాణపు పిసినిగొట్టు కోసం...ఈ స్వార్థపిశాచికోసం నీ ఉద్యోగం కూడా పోగొట్టుకుంటావా?..."

"ఏదో ఆలోచిద్దాంలే!"

వెళ్ళిపోయాడు ప్రభు.

"ఛీ!ఛీ! ఇంత నరకం పగవాళ్ళకి కూడా వద్దు ... ఇంతకింతా అనుభవిస్తుంది. అనుభవించి తీరుతుంది..." కసిగా శపించింది లక్ష్మీదేవి.

లక్ష్మీదేవి ఆవేదన నీరజకు అర్థమవుతోంది. తను చెయ్యగలిగినది ఒకటే ఉంది.

"ప్రభూ! అత్తయ్య చెప్పిన ఉపాయమే బాగుంది..."

"ఏమిటది?"

"నువ్వు ఎవరినైనా పెళ్ళిచేసుకో! కట్నంగా బోలెడు డబ్బువస్తుంది. అన్ని సమస్యలూ తీరిపోతాయి..."

"ఏం? నన్ను చేసుకోవాలని లేదా నీకు?"

"లేదు..."

"అవును, నాకు ఉద్యోగంపోతే, ఈ బీదవాడితో నువ్వు కష్టాలుపడవలసి వస్తుంది..."

"సరిగ్గా ఊహించావు – నాకు సుఖపడాలని ఉంది...బోలెడు సుఖం."

నీరజ ఆ మాటలన్నధోరణికి ప్రభు నవ్వాడు.

"నీరజా! నేను మరొకరిని చేసుకుని సుఖపడగలనని నువ్వు అనుకోగలవేమో, కానీ నన్ను వదిలి నువ్వు సుఖపడతావని నేను ఒక్కనాటికీ అనుకోలేను. నీదగ్గిర నిజంగా డబ్బు ఉంటే నాకు కాకుండా దాచుకుంటావని కూడా ఊహించలేను. అసలే నా మనసు చికాగ్గాఉంది. ఈ ప్రస్తావనవదిలి మనకు అయిదువేలు ఎక్కడ అప్పుగా దొరుకుతుందో ఆలోచించు..."

నీరజ ఏం ఆలోచించగలదు?

ఆ సాయంత్రమే నీలకాంత్ ప్రభుదగ్గరకు వచ్చాడు.

"ప్రభూ! అయిదువేలకోసం అనవసరంగా ఇబ్బందులలో చిక్కుకుంటున్నావా?" అన్నాడు

"నీకెవరు చెప్పారు?"

"నువ్వు చెప్పకపోయినా నాకు నీ సంగతులు తెలుస్తూనే ఉంటాయి–ఇవిగో, అయిదువేలు తీసుకువచ్చాను."

ప్రభు కళ్ళు నీరజకళ్ళతో కలుసుకున్నాయి. ఆ కళ్ళలో అంత భయం... దేనికి?

"వద్దు నీలకాంత్ ఏదో ఉపాయం ఆలోచిస్తాలే!"

"పోనీ అప్పుగానే తీసుకో ప్రభూ! నెమ్మదిగా తీర్చుకోవచ్చు-ఆపదలో నిన్ను ఆదుకోలేకపోతే, ఆతర్వాత స్థిమితంగా ఉండలేను..."

ప్రాధేయపడుతున్నట్లు అన్నాడు నీలకాంత్-లక్ష్మీదేవి ముఖం ఆవిరులను చిమ్ముతోంది...తను ఇంకా అభ్యంతరపెడితే తల్లి నీరజను ఇంకా ఎన్నెన్ని మాటలంటుందోనని భయపడ్డాడు ప్రభు. అదీగాక తనకైనా మరొక మార్గం తోచటంలేదు. చెయ్యిజాపి నీలకాంత్ దగ్గర డబ్బు తీసుకున్నాడు. "థేంక్యూ!" అన్నాడు గొణుగుతున్నట్లు. నీలకాంత్ నీరజనుచూసి నవ్వి వెళ్ళిపోయాడు.

ప్రభు ఉద్యోగం పోలేదు-కానీ గుసగుసలు చెలరేగాయి-అటు ఆఫీసులోను, ఇటు ఇంట్లోను స్థిమితంలేక ప్రభు గుండెనొప్పి తిరగబెట్టింది.

ఏమాత్రం లేవలేని స్థితిలో అడ్డంపడిపోయాడు.

"ఇది ఏమాత్రమూ అశ్రద్ధచెయ్యటానికి వీల్లేదు అత్తయ్యా! వెంటనే హాస్పిటల్లో చేర్పించాలి'' అంది నీరజ.

"నీకెలా తెలుసు?"

''ఈ నొప్పిరావటానికి ఒక రకంగా కారణం నేనే! అప్పుడు నాకోసం వస్తూనే కారుక్రిందపడి దెబ్బతగిలించుకున్నాడు..."

ఈ సంగతి వినేసరికి లక్ష్మీదేవి కోపం, ఉద్రేకం పట్టలేకపోయింది.

"దౌర్భాగ్యురాలా! వాడి ప్రాణానికి నువ్వెక్కడ దొరికావే! వాడిని మింగి నా కడుపున చిచ్చుపెట్టి...ఛీ! ఛీ! ఏం మాట్లాడుతున్నాను నేను?''

దేనికీ చలించలేదు నీరజ...ఎక్కడలేని ధైర్యమూ తెచ్చుకుంది. హార్ట్ స్పెషలిస్ట్ నారాయణరావుగారి హాస్పిటల్లో ప్రభును చేర్పించింది. డాక్టర్ నారాయణరావుకు చాలా మంచిపేరు ఉంది. అయితే అతడి హాస్పిటల్లో సామాన్యులు చేరలేరు. డాక్టర్ ఫీజు, రూం రెంట్ అన్నీ చాలాచాలా ఎక్కువగా ఉంటాయి.

"ఇప్పుడెలా చేర్చావు ఆ హాస్పిటల్లో ... వాడి ప్రాణంమీదకు వచ్చాక, ఇప్పుడు...ఆడబ్బు నీదయిందా?..."

లక్ష్మీదేవి మాటల్లో ఏ ఒక్కదానికీ ఎలాంటి సమాధానము చెప్పలేదు నీరజ.

ప్రభు సిక్ లీవ్ పెట్టి నాలుగయిదునెలలు విశ్రాంతి తీసుకోక తప్పదు. తను ఏంచెయ్యాలో నిర్ణయించుకుంది.

*    *    *    *

ఫ్రాక్, బాబ్డ్ హెయిర్, లిప్‌స్టిక్...ఈ వేషంలో నీరజనుచూసి తన కళ్ళను తను నమ్మలేకపోయింది లక్ష్మీదేవి.

''అత్తయ్యా! నేను ఉద్యోగప్రయత్నంమీద వెళ్తున్నాను'' అంది నీరజ.

లక్ష్మీదేవికి కంపరమెత్తింది.

''వాడు అలాపడిఉంటే నువ్వింత విడ్డూరంగా సింగారించుకుని ఉద్యోగాని కంటూ బయలుదేరుతున్నావా? ఇలా సింగారించుకోకపోతే ఆ ఉద్యోగం దొరకదా?''

''దొరకదు!''

''అదెలాంటి ఉద్యోగమో!''

''చెప్పుకోదగినంత పరువైనది కాదు.''

నీరజ వెళ్ళిపోయింది ... వెనుకటి అనుభవాలతో మళ్ళీ నీరజపేరుతోనే ఉద్యోగప్రయత్నం చేయటానికి భయపడింది నీరజ.

నీరజ క్లబ్‌లో రిసెప్షనిస్ట్‌గా ఉద్యోగం చేస్తున్నరోజులలో కొన్నికొన్ని విషయాలు తెలుసుకుంది. ధనిక కుటుంబాలలో కొందరు ఆడవాళ్ళు ఇంటి విషయాలు ఏవీ పట్టించుకోరు. పిల్లల విషయం చూసుకోవటానికి ఇంటి వ్యవహారాలు నిర్వహించుకోవటానికి మంచి జీతాలిచ్చి, వాళ్ళు చదువూ, సంస్కారమూ ఉన్న తనలాంటి వాళ్ళను పెట్టుకుంటారు. అలాంటి ఉద్యోగాలు నాలుగయిదు ఉన్నాయని తెలుసుకుంది. ఒక్కొక్కచోటికీ వెళ్ళి విచారించింది. సేఠ్ రమణ్ లాల్ ఇంట్లో అన్నివిధాలా అనుకూలంగా తోచింది ...అతని భార్య రోగిష్టిది- అదేం రోగమోకాని ఎప్పుడూ మంచంలో పడుకుని మూలుగుతూ ఉంటుంది... అతనికి ఇద్దరు పిల్లలు-ఒక ఆడపిల్ల — ఆ పిల్లకు మనస్థిమితం లేదు. పెద్ద మొద్దుగా ఉంటుంది. ఒక మగపిల్లవాడు ... వాడికి రెండు కాళ్ళూ లేవు. వీల్ ఛైర్‌లో దిగాలుగా కూర్చుని ఉంటాడు.

''అంతకు ముందు ఉన్నమనిషికి మూడువంద లిచ్చాను. నీకు నాలుగు వంద లిస్తాను...'' అన్నాడు రమణ్‌లాల్.

పని చాలా ఎక్కువ...అనారోగ్యంతోఉన్న గృహిణిని, వెర్రిబాగుల పిల్లను, కుంటిపిల్లవాడిని చూసుకోవాలి...ఏ రోజుకారోజు ఇంటి వ్యవహారాలన్నీ చూసు

కుంటూ లెక్కలన్నీ రమణ్‌లాల్‌కు అప్పగించాలి...వేళకు మందులియ్యటంలో కాని, అన్నపానాదులలోకాని, ఎక్కడా ఏ పొరపాటూ జరగటానికి వీల్లేదు... కానీ, నాలుగువందల జీతం బాగా ఆకర్షణీయంగా ఉంది.

లక్ష్మీదేవి మొదట్లో నీరజను ఎంత చీదరించుకున్నా రానురాను మెచ్చుకోకుండా ఉండలేకపోయింది. పగలంతా పనిచేసివచ్చినా, రాత్రి ఒక్క నిముషమయినా విశ్రాంతి తీసుకునేదికాదు నీరజ ... ప్రభు మంచం పక్కనే కూర్చునేది ... డాక్టర్ ఇయ్యమన్న మందులు తనే స్వయంగా ఇచ్చేది ... నీరజ మనిషా, యంత్రమా అని ఆశ్చర్యపడేది లక్ష్మీదేవి.

నెలరోజులు హాస్పిటల్‌లో ఉండేసరికి ప్రభు ఆరోగ్యం చెప్పుకోదగినంత బాగుపడింది.

"నువ్వు ఉద్యోగం చేస్తున్నావా?" అన్నాడు ప్రభు.

నీరజ బ్రతిమాలుతున్నట్లు "నీకు పుణ్యం ఉంటుంది-ఇప్పు డేమీ అనకు... ఇప్పుడిప్పుడే అత్తయ్యకు నామీద కోపం పోతోంది. పైగా..."

ఏదో చెప్పబోయి ఆగిపోయింది నీరజ.

"పైగా...ఏమిటి?" రెట్టించాడు ప్రభు.

"మనం నీలకాంత్ అప్పు తీర్చుకోవద్దా?..." తలవంచుకుని అంది నీరజ.

ప్రభు నవ్వి నీరజచేతిని ఆదరంగా నొక్కాడు.

డాక్టర్ నారాయణరావుగారు ఆపరేషన్ చేస్తానన్నారు.

"ఆపరేషన్‌చేస్తే ఇంక ఈ నొప్పి మళ్ళీమళ్ళీ రాకుండా పూర్తిగా తగ్గిపోయే అవకాశం ఉంది-కానీ కనీసం రెండునెలలైనా నా అబ్జర్‌వేషన్‌లో హాస్పిటల్‌లోనే ఉండాలి."

ప్రభు ఆపరేషన్ చేయించుకోవటానికి ఒప్పుకున్నాడు. ప్రభు నచ్చజెప్పగా లక్ష్మీదేవికూడా ధైర్యం తెచ్చుకుంది. దిగాలుగా కూర్చున్న నీరజ చెక్కిలిమీద కొట్టి "ఏమిటా పోజు? నువ్వు పక్కనఉండగా నాకేం భయం?" అన్నాడు ప్రభు.

నీరజ నవ్వేసింది.

డాక్టర్ నారాయణరావుగారు ప్రభుకు ఆపరేషన్ చేసారు. సక్సెస్ అయింది. నీరజ చేస్తున్న సేవనుచూసి లక్ష్మీదేవి మనసులో కోపమంతా పోయింది.

నీలకాంత్ అప్పుడప్పుడు ప్రభును చూడటానికి వస్తూనేవున్నాడు. నీలకాంత్



రాగానే అదోకవిధంగా మారిపోయే నీరజను చూస్తోంచే ప్రభుకు జాలిగానేఉంది. ఆ రహస్యమేదో తనకు చెప్పకుండా ఎందుకు ఉండాలని కష్టంగానూ వుంది.

ఆ రోజు ఒక యువతి, యువకుడు వచ్చారు. వాళ్ళతో కలిసి రమణ్‌లాల్ తన గదిలోకి వెళ్ళాడు. తనకు ఆలస్యమవుతుందని నీరజ లోలోపల చికాకు పడింది. పది, పదకొండు దాటినా రమణ్‌లాల్ క్రిందకు రాలేదు. అసహనంగా ఎదురుచూస్తోన్న నీరజకు సన్నని మూలుగు వినిపించింది. ఆ గదిలోకి ఎవ్వరూ రాకూడదని రమణ్‌లాల్ ఆర్డర్. ఆ కారణంచేత మూలుగు వినిపించినా వెళ్ళ లేకపోయింది నీరజ . . . మూలుగు మళ్ళీ వినిపించింది . . . శక్తినంతా కూడ దీసుకుని ఎవరో గొంతెత్తి పిలుస్తున్నట్లుగా ఉంది. నీరజ ఉపేక్షించి ఊరుకో లేకపోయింది. సాహసించి పైకి వెళ్ళింది. తలుపులు వేసిఉన్నాయి. కిటికీలోంచి చూసింది. రమణ్‌లాల్ కిందపడి ఉన్నాడు. వాళ్ళిద్దరూ అతనిదగ్గర ఏదో వెతుకుతున్నారు. గౌనుకోపలి జేబులోంచి పిస్టల్‌తీసి పిచ్చిగా పేల్చింది. అదా టుగా ఉన్న వాళ్ళిద్దరూ అదిరిపడ్డారు.

"డర్టీ రోగ్! వాడి జాగ్రత్తలో వాడు ఉన్నాడు ..." అంటూ యువకుడు యువతి చెయ్యిపట్టుకుని మెరుపులా పారిపోయాడు-నీరజ గదిలోకివచ్చి రమణ్ లాల్‌ను చూసింది. స్పృహలేకుండా పడిఉన్నాడు. బలమైన దెబ్బలు తగిలాయి.

అతిప్రయత్నంమీద రమణ్‌లాల్‌ను సరిగ్గా పడుకోబెట్టింది నీరజ. దెబ్బలకు

కట్లుకట్టింది. ముఖంమీద చన్నీళ్ళు జల్లింది. ఒక్కసారి కళ్ళుతెరచి నీరసంగా ఏదో గొణిగి మళ్ళీ కళ్ళుమూసుకున్నాడు రమణ్‌లాల్.

ఏంచెయ్యాలో తోచక అక్కడే అలాగే కూచుండిపోయింది నీరజ.

దాదాదాపు రెండుగంటల తర్వాత స్పృహవచ్చింది రమణ్‌లాల్‌కి. తన ఎదురుగా కూచున్న నీరజను ప్రశ్నార్థకంగా చూసాడు.

"వాళ్ళు వెళ్ళిపోయారు..." అంది నీరజ.

ఒక్కసారిగా జరిగిందంతా గుర్తుకువచ్చింది రమణ్‌లాల్‌కి. ఒక్క ఉదుటున లేచికూచుని 'స్కౌండ్రల్స్' అన్నాడు పళ్ళునూరుతూ ... తనను తను నిగ్రహించుకుని ఆశ్చర్యంగా నీరజనుచూస్తూ "నువ్వు వాళ్ళను వెళ్ళగొట్టగలిగావా?" అన్నాడు.

"తప్పుచేసేవాళ్ళకు వాళ్ళ మనసే పెద్ద శత్రువు-పైగా వాళ్ళు ఏవైపునుండీ ఏ ఆపదా శంకించకుండా ప్రమత్తులై ఉన్నారు. నేను కిటికీలోనుండి పిస్టల్ పేల్చేసరికి కంగరుపడి పారిపోయారు.'

"పిస్టల్! నీదగ్గర పిస్టల్ ఉందా?"

"వయసులోఉన్న ఆడపిల్లను. ఏ క్షణంలో ఏంజరుగుతుందోనని పిస్టల్ ఎప్పుడూ నాదగ్గర ఉంచుకుంటాను."

అకస్మాత్తుగా ఏదో గుర్తుకువచ్చినట్లు రమణ్‌లాల్ తన జేబు తడుము కున్నాడు. పర్స్ తగిలేసరికి వికసించిన ముఖంతో పైకితీసి ఆత్రంగా నోట్లు లెక్కపెట్టుకున్నాడు. సంతృప్తిగా నిట్టూర్పు విడిచాడు.

పకపక నవ్వింది నీరజ ... సిగ్గుపడినట్లు తలవంచుకున్నాడు రమణ్‌లాల్.

తన పర్స్‌లోంచి కొన్ని నోట్లు తీసి "ఇందః" అన్నాడు.

"దేనికి?"

"వెయ్యిరూపాయలు!"

"ఎంత? అని అడగలేదు. 'దేనికి?' అన్నాను."

"ప్రతి మనిషికి ఒక్కొక్క భాష ఉంటుంది. ఏ భావాన్నయినా అతను ఆ భాషతో మాత్రమే వ్యక్తీకరించగలడు. ఇవాళ నన్ను కాపాడినందుకు నీకు నేను కృతజ్ఞతలు చెప్పుకోగలిగిన భాష ఇదే!"

అప్పటికీ నీరజ చెయ్యిజాపలేదు.

"నా ప్రాణం విలువ నా దృష్టిలో వెయ్యిరూపాయలేనా అని ఆశ్చర్యపడు

తున్నావా? అది అంతే! బ్రతికి బయటపడ్డానుగా! డబ్బు తేలిగ్గా వదులుకోలేను. తీసుకో! డబ్బును చులకనగా చూడకు! దానితో చాలా అవసరాలు ఉంటాయి.''

ముందు ముందు అవసరాలమాట ఎలావున్నా, అప్పటికప్పుడు డబ్బు కావలసిన అవసరమే ఉంది నీరజకు—నారాయణరావుగారి ఫీజ్ చెల్లించాలి... ఆ డబ్బు తీసుకుంది.

''బాగా పొద్దుబోయింది పద! నిన్ను మీ ఇంటిదగ్గర దింపినస్తాను'' అన్నాడు రమణ్‌లాల్.

రాత్రి రెండుగంటలకు రమణ్‌లాల్ కారులోంచి దిగిన నీరజను పైనుండి క్రిందకు కాల్చేసాలా చూసింది లక్ష్మీదేవి.

లక్ష్మీదేవికి సమస్తమూ చెప్పాలనుకునే వచ్చింది నీరజ ..కానీ ఆ చూపులతో నీరజ నోరు మూతబడిపోయింది.

ప్రభు మనసుకు చాలా ఆహ్లాదంగా ఉంది అతడు ఇంకా హాస్పిటల్‌లోనే ఉన్నాడు కాని లేచి అటూ ఇటూ తిరుగుతున్నాడు.

ఎక్కడికీ కదలకుండా ప్రభుదగ్గరే ఉండిపోవాలని ఉంది నీరజకి...కానీ రమణ్‌లాల్ ఇంటికి వెళ్ళవలసిన సమయం దగ్గరపడుతోంది.

''నిన్ను ఇంకొక్క వారంరోజుల్లో డిస్చార్జ్ చేస్తానన్నారు, డాక్టర్‌గారు.''

''అవును! ఆ తరవాత ఇంక గుండెనొప్పి రాదనికూడా అన్నారు...నీరజా! ఒక రహస్యం చెప్పెయ్యనా? నిన్ను మా యింటికి తీసుకురాగానే పెళ్ళిచేసుకోవాలని అనుకున్నాను కానీ, ఈ గుండెనొప్పికి భయపడి అందుకు సాహసించలేకపోయాను...ఏమో! ఏది ఎలా జరుగుతుందో?''

''ప్రభూ!...'' ఆశ్చర్యపోయింది నీరజ, రోషంగా అంది.

''ఒకవేళ గుండెనొప్పి తగ్గలేదనే అనుకుందాం! నేను నిన్ను వదిలి వెళ్ళగలనని అనుకున్నావా?''

''అనుకోలేదు—అందుకనే నా ఆలోచన నీకు చెప్పలేదు.'' ఉల్లాసంగా నవ్వాడు ప్రభు.

''ఇప్పుడు మనం ఇంటికి వెళ్ళగానే పెళ్ళిచేసుకుందాం ... హాయిగా నిశ్చింతగా బ్రతుకుదాం.''

అనురాగంతో ప్రభుజుట్టులోకి చెయ్యి పోనిచ్చి దువ్వింది నీరజ.

నీలకాంత్ సకిలించటంతో నీరజ ఉలికిపడి దూరంగా జరిగింది.

ఆ సమయంలో నీలకాంత్ రాకకు ప్రభు ఏమంత సంతోషాన్ని కలిగించ లేదు.

"హలో!" అన్నాడు పొడిగా.

"సారీ! రాకూడని సమయంలో వచ్చినట్లుగా ఉన్నాను-నేను ఇంకొక అరగంటలో బొంబాయి వెళ్తున్నాను ప్రభూ! పదిరోజులవరకు రాను-అందుకే నిన్ను చూడటానికి వచ్చాను!"

''వెళ్ళిపోతున్నావా?'' ఆందోళనగా అన్నాడు ప్రభు.

"అవును, ఏం?"

ప్రభు వెంటనే సమాధానం చెప్పలేకపోయాడు. అంతకు నాలుగురోజుల క్రిందట ప్రభు డాక్టర్‌తో తన ఆరోగ్యం గురించి మాట్లాడాడు.

''యు ఆర్ ఫర్‌ఫెక్ట్లీ ఆల్‌రైట్! మీ కీజబ్బు ఇంక జన్మలో రాదు..." అన్నాడు నారాయణరావు.

"బిల్ ఎంతయింది డాక్టర్?"

"ఆఫీస్‌లో కనుక్కోండి-ఎకౌంట్స్ వేసి ఉంచుతారు."

ఆరోజే ఆఫీస్‌లో కనుక్కున్నాడు ప్రభు-వెయ్యి రూపాయలపైన ఉంది... ఇంత డబ్బు నీరజ ఎలా తీర్చగలదు?

మళ్ళీ నీలకాంత్‌నే అడగాలని అనుకున్నాడు-నీరజ ఎదురుగా నీలకాంత్‌ను అడగటం ఇష్టంలేదు-కానీ, వ్యవధానం లేదు.

"నీలకాంత్? ఇప్పటికే నీకు చాలా ఋణపడి ఉన్నాను-మరో వెయ్యి అప్పుగా ఇయ్యగలవా? ఇదంతా వీలైనంత త్వరలో తీర్చుకుంటాను."

ఉలికిపడింది నీరజ-విస్తుపోయి చూసాడు నీలకాంత్.

"నీకు సహాయం చెయ్యటానికి ఎప్పుడూ సిద్ధమే, కానీ, ఎందుకు నీకు డబ్బు?"

"డాక్టర్ బిల్ ఇయ్యాలి."

"అది నీరజ ఇచ్చేసిందిగా."

"నీరజ ఇచ్చిందా?"

"పిచ్చివాడా! నీరజ ఉండగా నీ కేంలోటు? నీరజ నీకోసం ఎంత త్యాగమన్నా చెయ్యగలదు ... తన శరీరాన్ని అమ్ముకుని అయినా నీకు ఖరీదైన హాస్పిటల్స్‌లో వైద్యం చేయించగలదు."

"షటప్!" నీలకాంత్ చెంప పగిలిపోయేలాగ కొట్టాడు ప్రభు.

అప్పుడే వచ్చిన లక్ష్మీదేవి ఆశ్చర్యంగా "ప్రభూ?" అంది.

అంత దెబ్బ తగిలినా నీలకాంత్ కష్టపెట్టుకోలేదు. కోపం తెచ్చుకోలేదు. చిరునవ్వుతోనే ఉన్నాడు.

"సారీ ప్రభూ! నీకు తెలుసుననే అనుకున్నాను...ఇదివరకు దొంగల చేతుల్లోపడి తిరిగివచ్చినా ఎలా సహించావో...ఇప్పుడు అలాగే అంతా అర్థం చేసుకుని ఊరుకున్నావనుకున్నాను—అయినా అమ్మగారికి అంతా తెలుసునే! నీకు తెలియకుండా ఎలా ఉంది?'' ప్రభు తల్లిముఖంలోకి చూసాడు.

ఆనాడు రమణ్‌లాల్ కారులోంచి రాత్రి రెండుగంటలకు ఫ్రాక్‌తో దిగుతోన్న నీరజ స్వరూపం లక్ష్మీదేవి కళ్ళముందు కదిలింది. కంపరంతో శరీరం జలదరించగా తల వంచుకుంది.

నీలకాంత్ కనీకనిపించకుండా నవ్వాడు.

"ప్రభూ! టేకిట్ యీజీ! పాపం నీనీరజ కోసమేగా ఇంత చేసింది!...నీ ఆరోగ్యంకోసం...నువ్వు సుఖపడాలని."

"షటప్! షటప్!'' అరిచాడు ప్రభు.

నీలకాంత్ మాట్లాడలేదు.

నీరజ శిలలా అలానే కూర్చుంది–ప్రభులో సహనం నశించిపోసాగింది-దెబ్బ తిన్న పిట్టలా ఆర్తస్వరంతో "నీరజా! ఎందుకు చేసావు ఇలాంటి పని?'' అన్నాడు.

ఏం సమాధానం చెప్పాలి? ఏ ప్రాంతాలకు పారిపోయినా ఈ నీలకాంత్ తనను వదులుతాడా? ఈ శాపంనుండి తనకు విముక్తి లేదు_తెలిసి తెలిసి తనతో పాటు ప్రభును కూడా ఈ సుడిగుండాలలోకి లాగటం తనకు న్యాయమేనా? అంత స్వార్థమా తనకు! ప్రభులాటి అమృతమూర్తికి తను అందించే ప్రేమ విలువ అంతమాత్రమేనా?

నీరజ మాట్లాడకుండా అలానే కూర్చుంది.

"ఛీ! ఛీ! ఇంతకంటె నేను గుండెనొప్పితో చచ్చిపోయినా ఆనందించే వాడిని."

నీరజ లేచి నించుని ''వెళ్తాను..." అంది.

''వెళ్ళు! మళ్ళీ ఎన్నడు ఇక్కడికి...నా దరిదాపులకి తిరిగి రాకు "

నీరజ ముందుకు కదిలింది.

"వేళ్ళగలుగుతున్నావా?"

కోపంగా అన్నాడు ప్రభు.

నీరజ ఆగి శాంతంగా అంది.

"వెళ్ళగలుగుతున్నాను–ఇంక నీకు ఆ గుండెనొప్పి రాదని తెలుసుకున్నాను–ఎక్కడ ఉన్నా...నువ్వు సుఖంగా–సంతోషంగా...ఉంటావన్న ధైర్యంతో–వెళ్ళిపోగలను."

నీరజ గుమ్మం దాటకుండానే వచ్చి అడ్డుగా నిలబడ్డాడు ప్రభు

''నిన్ను వెళ్ళనివ్వను–నాకు నిజం చెప్పు నీరజా!"

"మాటలలోకి మార్చి చెప్పగలిగినదంతా నిజంకాదు ప్రభూ! అంతకు మించిన నిజం...మనసుతో అర్థంచేసుకోగలిగినది–వేరే ఉంది...నన్ను వెళ్ళ నియ్యి–అదే మన ఇద్దరికీ మంచిది.''

ప్రభును తప్పించుకుని వెళ్ళిపోయింది నీరజ.

* * * * *

నీరజ తనదగ్గర ఉండిపోవటానికే వచ్చిందని తెలుసుకుని చాలా సంతోషించాడు రమణ్‌లాల్ ... కుంటిపిల్లవాడు ఆనందంతో చప్పట్లు చరిచాడు...చివరకు వెఱ్ఱిబాగులపిల్లకూడా "నువ్వు ఇక్కడే ఉండిపోతావా?" అని వెఱ్ఱిగా నవ్వింది.

కుంటిపిల్లవాడిని వీల్ ఛైర్‌లో కూర్చోబెట్టి సాయంత్రం వేళ అటూ ఇటూ తిప్పుకుని వస్తుంది నీరజ–అలాంటి సమయంలో ఒకనాడు తనను ఎవరో పరిశీలనగా చూస్తున్నట్లు తోచి, తనూ ఆ వ్యక్తిని పరీక్షగా చూసింది–తనూ చూడటం మొదలు పెట్టగానే ఆ యువకుడు అక్కడినుండి వెళ్ళిపోయాడు–ఎక్కడో బాగా చూసిన ముఖం అనిపిస్తోంది–ఎంత ఆలోచించినా గుర్తుకు రాలేదు. ఇంటికి వచ్చాక గుర్తుకు వచ్చింది–పోలీస్ ఆఫీసర్ మురళి! కలుసుకుని చాలా రోజులు కావటంవల్ల–మఫ్టీలో ఉండటంవల్ల...వెంటనే గుర్తుపట్టలేక పోయింది...అయితే మురళి ఇంకా తనను అనుసరిస్తోనే ఉన్నాడన్నమాట!

రమణ్‌లాల్ భార్య ఆరోగ్యం నానాటికీ దిగజారుతూ ఏ క్షణంలో ఏం జరుగుతుందో అన్నట్లుగా ఉంది.

ఆ రోజు ఆవిడ మరీ మూసినకన్ను తెరవకుండా పడిఉంది–రమణ్‌లాల్ ఎప్పటిలాగే ప్రయాణమయ్యాడు.

"ఇవాళ వెళ్ళకండి! ఆవిడ స్థితి మరీ ప్రమాదకరంగా ఉంది..." అంది నీరజ.



రమణ్‌లాల్ ముఖం చిట్లించుకున్నాడు.

"నేను ఉండిమాత్రం ఏంచెయ్యాలి?"

రమణ్‌లాల్‌ను తను ఆపుచెయ్యలేనని గ్రహించింది నీరజ.

"పోనీ, మీరెక్కడికి వెళ్తున్నారో చెప్పండి! అవసరమయితే కబురు చేస్తాను.'' అంది.

రమణ్‌లాల్ కొంచెంసేపు ఆలోచించి చిన్న కాగితంమీద ఫోన్ నంబర్ వేసి "ఈ నంబర్‌కు రింగ్ చెయ్యి అత్యంత అవసరమయితేనే..." అని వెళ్ళిపోయాడు.

రమణ్‌లాల్ భార్య ఊపిరాడక అవస్థపడుతోంది-ప్రాణాలు ఉగ్గబట్టుకుని రోగిదగ్గరే కూర్చుంది నీరజ.

కాలింగ్ బెల్ మోగింది.

రమణ్‌లాల్ వచ్చేసాడా? ఎంతైనా అతనూ ఒక మనిషేగా.

వెళ్ళి తలుపు తీసింది నీరజ-ఎదురుగా మఫ్టీలో మురళి.

"మీరా...'' అంది.

"గుర్తుపట్టారన్నమాట!''

కూర్చోమని అనకుండానే కూర్చుంటూ అన్నాడు మురళి, తాపీగా సిగరెట్ వెలిగించుకుంటూ "కూర్చోండి!" అన్నాడు.

వణుకుతోన్న చేతులను ఒకదానిలో ఒకటి చేర్చి నిబ్బరాన్ని కూడదీసుకుంటూ కూర్చుంది నీరజ.

"నాతో ఏంపని?"

"పని మీతో కాదు, రమణ్‌లాల్‌గారితో."

"ఆయన ఇంట్లో లేరు."

"ఎక్కడికి వెళ్ళారు?"

"నాకు తెలియదు!"

"నిజం చెప్పండి!"

"నిజంగా తెలియదు."

"ఆయన భార్య చావు బ్రతుకులమీద ఉంది. ఇలాంటి పరిస్థితుల్లో...మీతో కూడా ఏమీ చెప్పకుండా వెళ్ళిపోయారా?"

"ఈ సంగతులు మీకెలా తెలుసు!"

"ఏం ప్రశ్న! నే నెవరో మీకుతెలియదా! అన్ని సంగతులూ తెలుసుకోవటమే నా వృత్తి. చెప్పండి! ఆయన ఎక్కడికి వెళ్ళారు? అత్యవసరంగా కలుసుకోవాలి."

"నిజంగా ఎక్కడికి వెళ్ళాడో నాకు తెలియదు. ఫోన్ నంబర్ మాత్రమే ఇచ్చారు ఫోన్ చెయ్యనా?"

ఫోన్ దగ్గరకు నడిచింది నీరజ-ఫోన్ చెయ్యబోతున్న నీరజ చేతిని గట్టిగా పట్టుకున్నాడు మురళి.

"వద్దు! ఫోన్ చెయ్యకండి! ఆ నంబర్ ఇయ్యండి చాలు." తన దగ్గరున్న ఫోన్ నంబర్ మరొక కాగితంమీద వేసి మురళికి ఇచ్చింది నీరజ.

ఆ కాగితం జేబులో పెట్టుకుని చిరునవ్వుతో వెళ్ళిపోయాడు మురళి.

కొన్ని క్షణాలు అయోమయంగా కూర్చుండిపోయింది నీరజ.

రమణ్‌లాల్‌కు ఈ విషయం ఫోన్ చెయ్యాలా? వద్దా? తను అతనిదగ్గర పనిచేస్తోంది. ఫోన్ చెయ్యటమే తన కర్తవ్యం.

ఫోన్ చెయ్యబోయింది – ఆర్డర్‌లో లేదు–అంతవరకు బాగానే ఉంది! అకస్మాత్తుగా ఎలా పాడయింది? మురళి డిస్‌కనెక్ట్ చేయించి ఉండాలి!

ఎందుకు? ఏం జరగబోతోంది?

మరొక్క అరగంటకే రమణ్‌లాల్ భార్య కన్ను మూసింది.

మురళి రమణ్‌లాల్‌ని అతని గేంగ్‌తో సహా పట్టుకున్నాడు. నీరజను కూడా కస్టడీలోకి తీసుకున్నాడు.

వివరాలన్నీ ఆ మరునాటి వార్తాపత్రిక లన్నింటిలోనూ వచ్చాయి.

నీరజ గేంగ్ చేతుల్లో పడటమూ, ఏ అపాయమూ జరగకుండా తప్పించు కోవటమూ-మురళికి విచిత్రంగా తోచింది-ఆ గేంగ్‌లో ఎవరితోనైనా నీరజకు ఏదో ఒకవిధమైన సంబంధం ఉండవచ్చునని అనుమానం తోచింది-అప్పటి నుండీ నీరజను రహస్యంగా అనుసరిస్తూనే ఉన్నాడు.

నీరజను తన గేంగ్‌వాళ్ళు ఎత్తుకుపోయిన సంగతి రమణ్‌లాల్‌కు తెలియదు...నీరజ విషయం పేపర్లలో చూసాడు కాని అప్పుడే మరిచిపోయాడు నీరజ వేషమూ, పేరూ కూడా మార్చుకోవటంతో అసలు అనుమానించలేదు-నీలకాంత్‌కు తెలిసినా రమణ్‌లాల్‌కు చెప్పలేదు-చెప్పవలసిన అవసరం అతనికి తోచలేదు-నీరజను అనుసరించే మురళికి అప్రయత్నంగా రమణ్‌లాల్ రహస్యాలు తెలియటం మొదలుపెట్టాయి-చివరకు నీరజ ఇచ్చిన ఫోన్‌నంబర్ సహాయంతో అందరినీ పట్టుకోగలిగాడు.

వార్తాపత్రికలన్నీ మురళిని ప్రశంసించాయి-గేంగ్‌లో అందరి ఫొటోలూ పేపర్లలో వచ్చాయి-నీలకాంత్‌ను గేంగ్‌లో చూసి జనం నిర్ఘాంత పోయారు-ఒక ప్రఖ్యాత పురుషుడి కొడుకు గేంగ్‌లో వ్యక్తి!!

* * * * *

విచారణలో అన్ని విషయాలూ బయటపడ్డాయి.. నీలకాంత్‌ను కావాలనే తన గేంగ్‌లో చేర్చుకున్నాడు రమణ్‌లాల్! ఒక ప్రముఖ వ్యక్తి కొడుకు తమలో ఒకడు కావటం గేంగ్‌కి రక్షణగా ఉంటుందని అనుకున్నాడు...రమణ్‌లాల్ ఆశించినట్లే నీలకాంత్ కారణంగానే గేంగ్ మొత్తం ఒకటి రెండుసార్లు ఆపదల లోంచి తప్పుకుంది-తరువాత తండ్రి నీలకాంత్‌ను చాలా కఠినంగా మంద లించాడు-కానీ నీలకాంత్ చెవిన పెట్టలేదు చదువు సంధ్యలు అబ్బని అతనికి ఆ జీవితం ఎంతో నచ్చింది.

నీరజ తనను చెంపమీద కొట్టి అవమానించి వెళ్ళిపోగానే ఎలాగైనా నీరజ పైన ప్రతీకారం సాధించాలని నిశ్చయించుకున్నాడు...వళ్లమాలిన కండ కావరంతో నీలకాంత్ తనవాళ్ళను పంపి పట్టపగలు నీరజను బలాత్కారంగా తనదగ్గరకు రప్పించుకున్నాడు.

నీరజ అదృష్టంకొద్దీ సరిగ్గా ఆ సమయానికి బాలూ కూడా అక్కడికి వచ్చాడు...నిలువెల్లా వణికిపోతూ కన్నీళ్ళతో నిస్సహాయంగా ఉన్న నీరజను చూసాడు. విషయం తెలుసుకున్నాడు.

"ఈ అమ్మాయిని వదిలెయ్యండి..." అన్నాడు ఆజ్ఞాపిస్తున్నట్లుగా.

"పిల్లేదు," అన్నాడు నీలకాంత్...గేంగ్ ఒకరిముఖాలు ఒకరు చూసుకున్నారు-నీలకాంత్ హోదానుబట్టి ఆతనంటే అందరికీ భయగౌరవాలున్నాయి-కానీ బాలూ అంటే భక్తి...ప్రేమ...ఆరాధన.

ఎవరికి కాలులో ముల్లుగుచ్చుకున్నా ప్రాణాలొడ్డి తీసేవాడు బాలూ ఎవరు ఆపదలో చిక్కుకున్నా ఎంతకైనా సాహసించి విడిపించేవాడు బాలూ! నీ, నా, భేదంలేకుండా అందరినీ అన్ని వేళలా ఆదుకునేవాడు బాలూ! ఆ కారణంచేత ఎవరూ బాలూ మాట కాదనరు.

నీలకాంత్ విషయం అర్థంచేసుకున్నాడు.

"బాలూ! జరిగిందేదో జరిగింది ఈ విషయంలో ఇంక నువ్వు కలిగించుకోకు." అన్నాడు.

"ఒక అమాయకురాలి బ్రతుకు నాశనం చేస్తానంటావా? నన్ను కల్పించుకోవద్దంటావా?'

"నేను ఆ అమ్మాయి బ్రతుకు నాశనంచెయ్యను. పెళ్ళిచేసుకుంటాను."

"ఉద్ధరించావు! ఆ అమ్మాయికి ఇష్టంలేకపోయినా పెళ్ళిచేసుకోవటం ఆ బ్రతుకు మరింత నాశనంచెయ్యడం కాదా? ఇదంతా జరగనివ్వను."

బాలూ పట్టుదల నీలకాంత్‌కు తెలుసు. గేంగ్‌లో అతనికున్న విలువా తెలుసు. అన్నింటినీ మించి ఇది రమణ్‌లాల్‌కు తెలియకుండా జరిపించిన వ్యవహారం. "ఒక్క విషయం ఆలోచించు. ఇప్పుడు నీరజకు మన రహస్యం తెలిసిపోయింది. మనం వదిలిపెడితే బండారం బయటపెట్టదూ,"

బాలూ ఆలోచనలో పడ్డాడు.

"అవును అదీ నిజమే?" అన్నాడు.

బాలూ వచ్చి తనను విడిపించమని అన్నదగ్గరనుంచి చచ్చిపోయిన ఆశలకు ఊపిరిపోసుకొంటోన్న నీరజ ఈ మాటలతో హడలిపోయింది.

"లేదు, లేదు! నేను మీ రహస్యాలేవీ బయటపెట్టను" అంది దీనంగా.

"ఇంకేం నీలకాంత్! వాగ్దానం చేస్తోందిగా!" అన్నాడు బాలూ

"నాన్సెన్స్! ఇలాంటి వాగ్దానాలు నేను నమ్మను. ఇక్కడినుండి బయట పడ్డాక ఈ వాగ్దానం నిలబెట్టుకుంటుందని నమ్మకమేమిటి?"

"మనం మనుష్యుల్ని నమ్మాలి నీలకాంత్!"

"ఓహో! ఏం శ్రీరంగనీతులు! నీనోట రావటం, నేను వినటం! భలే!..."

"పోనీలే నమ్మకు. అయినా ఈవిడ మన రహస్యం చెప్పదు. అలా చెబితే

ఆ మరుక్షణం మళ్ళీ నువ్వు ఈవిడను తెప్పించుకోవచ్చు...అప్పుడు నేను అడ్డు రాను...''

"తీరా చెప్పేసాక ఏంచెయ్యగలం?''

"అమాయకంగా మాట్లాడకు? నీమీద నేరం ఆరోపించి రుజువుచెయ్యటం నీరజలాంటి సామాన్యురాలికి సాధ్యంకాదు. ఈలోగా ఆవిడ బ్రతుకు సర్వనాశన మయిపోతుంది. అంత తెలివితక్కువగా ఆవిడ ప్రవర్తించదు. కానీ ఈలోగా ఈవిడమీద నువ్వు ఏదైనా అత్యాచారం చెయ్యడానికి సాహసిస్తే నన్ను మొదటిసారిగా హంతకుణ్ని చేసిన ఘనత దక్కించుకుంటావు. జాగ్రత్త..."

నీలకాంత్ రక్తం చల్లబడినట్లు అయింది. బాలూ అన్నంతపనీ చేస్తాడని అతనికి తెలుసు.

బాలూ స్వయంగా నీరజను విడిపించి ఇంటికి పంపించాడు.

నీలకాంత్ రహస్యం చచ్చినట్లు తనలోనే ఇముడ్చుకోవలసి వచ్చింది నీరజ ఇది ఒక ఆయుధంగా ఉపయోగించుకుంటూ ఎప్పటికప్పుడే నీరజను చిత్రవధ చెయ్యటానికి ప్రయత్నిస్తూనే ఉన్నాడు నీలకాంత్.

బాలూ మీదకూడా నీలకాంత్ పగబట్టాడు. కానీ బాలూను అతను ఏమీ చెయ్యలేడు. అటు రమణ్‌లాల్‌కూ ఇటు గేంగ్‌కూ బాలూ గుండెకాయ.

సుశీలకు అతి ప్రయత్నంమీద గర్భం నిలిచిందేకాని ఆరోగ్యం పాడయింది. అదివరలో ఆవిడతిన్న మందులూ, చేయించుకున్న ఒకటి రెండు ఆపరేషన్లూ ఆవిడ ఆరోగ్యాన్ని బాగా కృంగదీసాయి.

ఒక మగపిల్లవాణ్ని కని మరణించింది.

చివరి క్షణాలలో సుశీల దగ్గరే ఉన్నాడు బాలూ.

"ఇదీ? చివరికి నువ్వు సాధించింది...'' అన్నాడు నిష్ఠూరంగా.

"ఏం నా బ్రతుకులో నేను సాధించింది చాలా అమూల్యమైనదే? నా చివరి క్షణాలలో నా కోసం కన్నీళ్ళు కారుస్తూ నా అనేవాళ్ళు నా దగ్గర ఉన్నారు. ఏ వేశ్యకు పడుతుంది ఇలాంటి అదృష్టం? ఆమాటకొస్తే ఎంతమంది గృహిణులు ఇలాంటి ప్రేమను అనుభవించగలరు? నాకు ఏ దిగులూ, ఏ విచారమూ, ఎలాంటి పశ్చాత్తాపమూలేదు. చాలా సంతృప్తిగా, సంతోషంగా ఉంది. బాబు గురించికూడా నాకు దిగులులేదు. వాడు మీ కొడుకు. మీ మంచితనం వాడిని కాపాడుతుంది...''

"వద్దు సుశీలా! ఆ మాట అనకు..." ఆ సమయంలో కూడా 'మంచి' మాట విని సహించలేక అడ్డుతగిలాడు బాలూ.

సుశీల మెంకెగా తల అడ్డంగా తిప్పుతూ "మీరు మంచివారు. ఆ మంచితనం కాపాడుతుంది. తప్పకుండా కాపాడుతుంది." అంటూ బాలూ చేతిని ఆప్యాయంగా చెక్కిలికానించుకుని కళ్లు మూసింది.

తల్లిపోయినప్పుడు కూడా కన్నీళ్లు కార్చని బాలూ కుమిలికుమిలి ఏడ్చాడు. అతనినుండి ఏదో శక్తి దూరమయినట్లు అనిపించింది.

కళ్ళు తెరవని పసిగుడ్డు-సుశీల అప్పగించిన యాభై వేల రూపాయలు. . బాలూకు మిగిలాయి.

బాలూను సాధించటానికి నీలకాంత్‌కు మంచి ఉపాయం దొరికింది. ఆ శిశువును స్వాధీనంచేసుకుని బాలూను లొంగదీసుకోవాలని అనుకున్నాడు. ఇలాంటి విషయాల్లో రమణ్‌లాల్ కల్పించుకోడు. ఒకసారి ఆ శిశువును తీసుకుపోవటానికి ప్రయత్నించాడు. సమయానికి బాలూ అడ్డుకుని కాపాడుకున్నాడు. రాజేశ్వరికి సుశీల సంతానంమీద ఏం శ్రద్ధ! జరిగిన గొడవలతో చికాకుపడి ఆ శిశువును వదిలించుకోవాలనే ఆవిడ చూస్తోంది. బాలూకు భయపడి ఏమీ అనలేకపోతోంది.

బాలూ విషయం అర్థంచేసుకున్నాడు. రాజేశ్వరి రక్షణలో తన బాబును ఉంచటంఇష్టంలేకపోయింది. అతని కాసమయంలో నీరజ గుర్తుకు వచ్చింది. రాత్రివేళ రహస్యంగా నీరజను కలుసుకున్నాడు.

"ఈ బాబు నా కొడుకు! వీడిని కాన్వెంట్‌లో అప్పగించండి! అనాథ అని చెప్పండి! వీడికోసం వీళ్ళ అమ్మ యాభై వేల రూపాయలు ఇచ్చింది. అవి ప్రస్తుతం మీపేర బేంక్‌లో వేసాను. వాడికోసం ఖర్చుపెట్టి వాడు ప్రయోజకుడు అయ్యేలాగ చూడండి.. "

"ఎంత నమ్మకం నామీద మీకు! ఈ డబ్బు ఒకవేళ నేను వాడుకుంటే..."

"మీయిష్టం! ఒక దీనురాలు తన సర్వస్వమూ కరిగించి కొడుకుకోసం దాచిన డబ్బు అది! నేను చెయ్యగలిగినది నేను చేస్తున్నాను. మీరు చెయ్యాలనుకున్నది మీరు చెయ్యండి..."

బాలూ తనకు చేసిన మహోపకారం నీరజ మరిచిపోలేదు. అతడు తనను ఇంత చిన్న సహాయం.కోరుతోంటే కాదనలేకపోయింది. ఆ రాత్రివేళ అప్పటికప్పుడే బాలూ కొడుకును కాన్వెంట్‌లో చేర్పించింది.

నీలకాంత్ బాలూ ఏంచేసాడో తెలుసుకున్నాడు. బాలూను, నీరజను ఏ విధంగానూ సాధించలేక నీరజను అవమానించి పగతీర్చుకున్నాడు.

శేఠ్ రమణ్‌లాల్ ఆస్తి, ఇంకా గేంగ్‌లో అందరి ఆస్తిపాస్తులూ ప్రభుత్వం స్వాధీనపరచుకుంది. ఒక్క బాలూకే సొంత ఆస్తి ఏమీలేదు. విచారణలో అతడు ఎన్నెన్ని సంస్థలకు సహాయపడ్డాడో అతనికి ఇష్టంలేకపోయినా బయట పడింది.

నాలుగు మూలలనుండీ "బాలూ చాలా మంచివాడు. అతడిని వదిలిపెట్టండి" అంటూ అభ్యర్థనలు కుప్పలుతిప్పలుగా వచ్చాయి.

కానీ, ఆ అభ్యర్థనలకు బాలూయే ఒప్పుకోలేదు.

"నేను చేసిన నేరాలకూ, ఇతరులకు చేసిన సహాయాలకూ ఏ విధమయిన సంబంధమూ లేదు. ఈ గేంగ్‌తో మిగిలినవాళ్ళతో పాటుగానే నాకూ శిక్ష విధించండి!" అన్నాడు.

జడ్జి ఆశ్చర్యంగా బాలూను చూసి అప్రయత్నంగా "నువ్వు మంచివాడివి" అన్నాడు.

బాలూ కసిగా పిడికిలి గట్టిగా బిగించి "డేమ్" అన్నాడు కసిగా.

నీరజను విడుదలచేసారు.

కోర్టుబయట తనకోసం ఎదురుచూస్తున్న లక్ష్మీదేవిని చూసి ఆశ్చర్య పోయింది నీరజ. ప్రభుకోసం చూసింది కనపడలేదు.

"నేను నిర్దోషినని తెలిసి వచ్చావా అత్తయ్యా!" అంది నిష్ఠూరంగా.

"లేదమ్మా! నువ్వు ఇక్కడ ఉంటావనే తెలిసి వచ్చాను. నువ్వు ఎక్కడ ఉంటావో, నిన్ను ఎలాగ కలుసుకోవాలో తెలిస్తే ఎప్పుడో వచ్చేదానిని..."

లక్ష్మీదేవి మాట్లాడే ధోరణికి నీరజ భయపడింది.

"ఏం జరిగింది అత్తయ్యా!" అంది.

"నీకు పుణ్యం ఉంటుంది. వెంటనే రా. చేతులు జోడించి ప్రార్థిస్తున్నాను. నా ప్రభును నాకు దక్కించు..."

నీరజ ఇంక ఏ ప్రశ్నలూ వెయ్యలేదు. లక్ష్మీదేవితో బయలుదేరింది.

"అదిగో ఎప్పుడూ ఆ గదిలో తలుపులు వేసుకుని కూర్చుంటాడు. అప్పు తీర్చాలని ఆఫీసుకు మాత్రం వెళతాడు. ఎవరితోనూ మాట్లాడడు." బాధ పడుతూ అంది లక్ష్మీదేవి.

నీరజ తలుపు తట్టింది.



"ఎవరు?" అన్నాడు ప్రభు తలుపు తీయకుండానే.

"నేను!" కంపిస్తోన్న గొంతుకతో అంది నీరజ.

వెంటనే తలుపులు తెరుచుకున్నాయి.

కొద్దిరోజులలోనే గుర్తుపట్టరానంత మారిపోయిన ప్రభును చూసి నీరజ కళ్ళు చెమ్మగిల్లాయి. ఇద్దరూ ఒకరి నొకరు చూసుకుంటూ బొమ్మల్లా నిలబడిపోయారు.

"నిన్ను నా దగ్గరినుంచి పొమ్మన్నాను. మళ్ళీ ఎందుకొచ్చావ్?"

"ఇప్పటికీ నీ మనసులోంచి పొమ్మనలేక పోయావని తెలుసుకుని వచ్చాను..."

"ఒక్క నిజం విని వెళ్ళిపో! నువ్వు శీలం పోగొట్టుకున్నావని నా బాధకాదు. నా ఆరోగ్యంకోసం, అనవసరంగా అంత త్యాగం ఎందుకు చెయ్యాలని..."

"ఒక్క నిజం చెప్పి వెళ్ళిపోతాను. నువ్వు నిజం చెప్తే నమ్మలేవని కాదు. అనేక గొడవల మధ్య ఇరుక్కుపోయిన నాతో నిన్నుకూడా చిక్కుల్లోకి దింపటం ఇష్టంలేక..."

నీరజ పొయ్యేదానిలా వెనక్కు తిరిగింది.

ప్రభు "నీరజా!" అని పిలిచాడు. నీరజ గిర్రున తిరిగి చిరునవ్వు నవ్వింది.

ప్రభు చేతులు జాపాడు.

నీరజ అతని హృదయంమీద వాలిపోయింది.




సాయంకాలం సరిగ్గా నాలుగున్నర అయింది. పెద్ద చప్పుడు చేస్తూ వాల్టేర్ స్టేషన్లో ట్రెయిన్ ఆగింది. ఎయిర్ బేగ్ చేత్తో పట్టుకుని మధుమూర్తి కిందికి దిగేడు. ప్రయాణికుల కోలాహలంతో ప్లాట్ఫారం చాలా రద్దీగా వుంది.

అలా నిలబడి ఆ మనుషుల్నీ-తెలుగు మాటల్నీ వింటూంటే మధుమూర్తికి ప్రాణం లేచొచ్చినట్టయింది. పుట్టిన పాతికేళ్లకి సరిగ్గా తెలుగుగడ్డ మీద అడుగెట్టేడు. ఎక్కడి కలకత్తా ? ఎక్కడి వాల్టేరు !

గేటు దగ్గర టికెట్టు ఇచ్చేసి బయటికి నడిచేడు. స్టేషన్కి ఎదురుగా కాస్త

దూరంలో ఒక హోటలుంది. పేరు 'స్టేషన్ హోటల్' కాస్తంత కాఫీ తాగి తర్వాత ప్రోగ్రాం నిర్ణయించుకుందా మనుకున్నాడు మధుమూర్తి. హోటల్లోకి నడిచి ఓ కార్నర్ సీట్లో కూర్చున్నాడు.

వెయిటర్ రాగానే "సింహనిలయం ఎక్కడుందో తెలుసా నీకు?" అనడిగేడు మధుమూర్తి.

"కంట్రాక్టర్ సింహాచలం గారేనాండీ?"

"అవును"

"ఆయనిల్లు సీతమ్మ ధారకవతల వూరికి దూరంగా వుందండి."

"అక్కడి కెళ్లాలంటే టాక్సీ మీదే పోవాలా?"

"అవునండి. లేకపోతే సిటీబస్సు లున్నాయండి. సిటీబస్ సీతమ్మధార దాకే ఎల్తాదండి. అక్కణ్నించి అరమైలు నడవాలండి."

"సరే. నాకో కాఫీ తెచ్చిపెట్టు."

వెయిటర్ వెళ్లిపోగానే మధుమూర్తి తన బట్టలకేసి చూసుకున్నాడు. ప్రయాణంలో గోనె పట్టాలాగా తయారైంది పాంటు. షర్ట్ పూర్తిగా మాసిపోయింది: ఈ క్షణాన తనని ఎవరేనా చూస్తే ఏ ఇంజన్ డ్రయివరో అనుకుంటారు. కాని అసలు విషయం ఎవరికి తెలుసు?

అంతలో మధుమూర్తి దృష్టి హోటల్‌కి ఎడమభాగంలో ఓ మూల కూర్చున్న ఇద్దరిమీద పడింది. ఇద్దరూ రహస్యంగా ఏమిటేమిటో మాటలాడుకుంటున్నారు. ప్రేయసీప్రియులేనా అంత రహస్యంగా మాట్లాడుకోరేమో! ఒకతను చాలా పొడుగ్గా సన్నంగా వున్నాడు. ఇంకో అతను పొట్టిగా లావుగా వున్నాడు లారెల్ అండ్ హార్డీ గుర్తుకొచ్చి తనలో తానే నవ్వుకున్నాడు మధుమూర్తి. సన్నంగా పొడుగ్గా వున్నతను కాగితం మీద ఏదో రాసి పొట్టిమనిషికి ఇచ్చేడు. కాసేపు ఏదో మాటాడుకుని ఇద్దరూ వెళ్లిపోయేరు.

కాఫీ రాగానే మెల్లిగా సిప్‌చేయడం ప్రారంభించేడు మధుమూర్తి. కాఫీ తాగడం పూర్తి కాగానే బిల్లు చెల్లించి బైట పడ్డాడు. రెండుమూడు ఫర్లాంగుల దూరం నడిచేక ఓ లాడ్జింగ్ హౌస్ కనిపించింది. ముందో గది తీసుకున్నాక— శుభ్రంగా స్నానం చేయాలనుకున్నాడు...రెండో అంతస్థులో ఓ సింగిల్ రూం దొరికింది. అడ్వాన్సిచ్చి, పేరూ వూరూ రాసి మేడ మెట్లెక్కేడు.

హోటల్ బోయ్ ఓ చోట ఆగి గదిని చూపించేడు. గది చాలా నీట్‌గా వుంది. డన్‌లపిల్లో బెడ్- చిన్న టేబుల్, మూడు వెదురుకుర్చీలు. ఓ పక్క బాత్‌రూం లేవటరీ.

ఎయిర్ బేగ్ మంచం మీద పడేసి బాత్‌రూంలోకి నడిచేడు మధుమూర్తి. పది నిమషాల్లో స్నానం, అలంకరణ, డ్రెసింగ్ పూర్తయింది. నీలంరంగ్ టెర్లిన్ పాంటులో లేత నీలం రంగు షర్టు దోపుకున్నాడు. ఎర్రని చారలున్న టై కట్టు కున్నాడు... కోటుకూడా తొడుక్కుని కోటు జేబుల్లోకి చెయ్యిపోనిచ్చేడు. సంతృప్తికరంగా నవ్వుకుని గదికి తాళం వేసి మెట్లమ్మట కిందికి దిగేడు.

రోడ్డు మీద క్షణంసేపు ఆగేడు. టాక్సీ మీద పోతేనో—అనుకున్నాడు. 'నాన్సెన్స్—నడిచి చాలాకాలమైంది. నడుద్దాం' అనుకుని ముందుకి సాగిపో యేడు. అక్కడక్కడ వాకబు చేస్తూ సింహనిలయంకి దారి తెలుసుకున్నాడు.

అలా ఆ రోడ్డు మీద నడిచి వెళ్తొంటే మధుమూర్తి హృదయంలో రకరకాల భావాలు, పూర్వస్మృతులు ఒక్కసారిగా చెలరేగేయి. అత్యంత క్లిష్టపరిస్థితుల్లో తనకి జన్మిచ్చిన మాతృమూర్తి. ఒక పూట తింటే మరొకపూట తిండిలేని గడ్డు రోజులూ, వీధి దీపాలకింద పరీక్షలకని తను చదువుకున్న రోజులూ. బి. ఏ పాసయ్యేక ఉద్యోగం కోసం పొట్ట చేతపట్టుకుని తిరిగిన చెడ్డరోజులూ...గుర్తుకి వచ్చేయి. రాచపుండుతో మందులేక మరణించిన తల్లి— ఆమె ఆఖరి మాటలూ గుర్తుకి వచ్చేయి. అలా ఆలోచించుకుంటూ అతను చాలా దూరం నడిచేశాడు. డాబాగార్డెన్స్, జైల్‌రోడ్, నక్కవాని పాలెం కూడా దాటిపోయేడు. 'సింహ నిలయం' ఇంకో మైలు దూరంలో వుందేమో :

ఒక్కసారి ఉలిక్కిపడ్డాడు మధుమూర్తి. వెనకనుంచి ఓ మోటారుసైకిలు దాదాపు అతన్ని ఢీకొన్నంత పని చేసింది. మరుక్షణంలో మోటారుసైకిలు కన్పించనంత దూరం వెళ్లిపోయింది. 99 అన్న అంకెలు మాత్రం మధుమూర్తి దృష్టిని తప్పించుకోలేక పోయేయి.

'ఎందుకబ్బా—అంత తొందర :' అనుకున్నాడు. 'నయం కాస్తలో తప్పి పోయింది గాని ఈ పాటికి ఠపీమని ఎగిరిపోదును.'

ఆ మోటార్ సైకిలు 'సింహనిలయం' వేపే వెళ్తొంది...

కోటు జేబులోంచి ఫోటో నొకదాన్ని బయటికి తీసి మరోసారి చూసేడు మధుమూర్తి. దీర్ఘంగా వూపిరి వొదిలి ముందుకి నడిచేడు. మరో వంద గజాలు నడిచేక—ఆగిపోయేడు.

ఎదురుగా పెద్ద భవంతి. చుట్టూ కాంపౌండ్ వాల్. లోపల చెట్లు, లతలు, పొదలు, మొక్కలు. గేటుకున్న బోర్డుని చూసేడు.

నల్లని బోర్డు, ఎర్రని అక్షరాలు అదే 'సింహనిలయం' :

గేటు తీసుకుని లోపలికి నడిచేడు మధుమూర్తి. రకరకాల మొక్కలూ, పువ్వులూ దారి పొడుగునా అతన్ని పలకరించేయి. పోర్టికో వరకు వచ్చి మెట్లెక్కేడు. వీధి తలుపు వేసివుంది. కాలింగ్ బెల్ బటన్ ఏదన్నా వుందేమోనని అటు చూసేడు. బటన్ నొక్కిన మరుక్షణం తలుపు తెరుచుకుంది. గుమ్మాని కవతల యూనిఫామ్‌లో వున్న బట్లర్ నిలబడి వున్నాడు.

"సింహాచలంగారున్నారా?" ప్రశ్నించేడు మధుమూర్తి.

"సింహాచలంగారా?"

"అవును. ఇది 'సింహనిలయమే' గదూ?"

"అవునండి. సింహాచలంగారితో మీరు ఎపాయింట్‌మెంట్ ఫిక్స్ చేసుకున్నారా?"

"లేదు."

"మీ పేరు?"

"మధుమూర్తి."

"మీ దగ్గర విజిటింగ్ కార్డుందా?"

"లేదు."

ఏదో ఆలోచిస్తున్నట్టు ముఖం పెట్టేడు బట్లర్. తన నడకంతా వృధాయేనా అని సందేహించ సాగేడు మధుమూర్తి.

"ఆయన మీతో మాట్లాడరేమోనని నా అనుమానం!" అన్నాడు బట్లర్ ఆఖరికి.

"అయన్నడిగితే తెలుస్తుందిగా!"

ఏమనుకున్నాడో ఏమో 'రండి సార్ లోపలికి' అన్నాడు బట్లర్. మధుమూర్తి ముందుకి నడిచేడు. హాల్లో సోఫాలో ఎవరో వ్యక్తి కూచుని వున్నాడు. అతన్నెక్కడో చూసినట్టు అన్పించింది.

మోటార్‌సైకిల్తో తనని డేష్ చేయబోయినది ఇతనేనా? ఆశ్చర్యంగా అతన్నే చూడసాగేడు మధుమూర్తి.

"ఏంటలా చూస్తున్నారు? నా ముఖంతోగాని కోతులాడ్తున్నాయా?" అన్నాడతను.

"సారీ...నా పేరు మధుమూర్తి. మీ పేరేమిటో తెలుసుకోవచ్చా?"




"ఓ ఎస్ నా పేరు శివకోటి."

"బాగా విన్నట్టే అన్పిస్తోంది. మిమ్మల్ని ఎక్కడో చూశాను కూడా!"

"ప్రఖ్యాతనటుడు, నాటక ప్రయోక్త, దర్శకుడు శివకోటిని మీరెరుగుదురా? ఈ శాస్త్రీ వాడే!" అన్నాడతను.

ఇంతలో పోర్టికోలో కారాగిన చప్పుడైంది. ఇద్దరు యువతీ యువకులు దిగి హాల్లోకి వచ్చేరు.

"మనమే ఫస్ట్ అనుకున్నాం. మనకన్నా ఇద్దరు ముందొచ్చేశారు, చూసేవా చలం!" అందామె అతన్ని చూస్తో.

"అవునవును. గుడీవినింగ్‌టు ఎవ్విరిబడీ" అన్నాడతను.

"గుడీవినింగ్. సారీ. నేను ఏ విందుకీ రాలేదు..." అంటూ ఏదో అనబోయేడు మధుమూర్తి.

"మీకు ఇన్విటేషన్ రాలేదా?" అందామె.

"లేదు. విందులాంటి దేదో ఇక్కడ జరగబోతోందని నాకు తెలీదు. నాకే ఆహ్వానం రాలేదు."

"ఆహ్వానమా? ఆర్డర్ అనండి." అన్నాడు శివకోటి మధ్యలో.

ఆ ఇద్దరూ గదికి ఓ మూలవున్న సోఫా వేపు నడిచేరు.

"సార్"

తలెత్తేడు మధుమూర్తి. బట్లర్.

"ఓ. కే. నేనింకోసారివస్తాను." అన్నాడు మధుమూర్తి.

"సింహాచలంగారు మిమ్మల్ని వుండమన్నారు సార్."

"గుడ్. నాతో మాట్లాడ్తారా ?"

"వారు మిమ్మల్ని వుండమన్నారు." మళ్ళీ అదేమాట !

చిరాకేసింది మధుమూర్తికి. ఎంచేతో అసౌకర్యంగా వున్నట్టూ అన్పించింది.

"సరే—నేను ముఖం కడుక్కోవాలి. ప్రయాణంలో చాలా అలసిపోయేను..."

"రండి సార్" అంటూ హాలుకి కుడివేపు తీసుకెళ్ళేడు బట్లర్. ఓ మూలగా వాష్‌బేసిన్ వుంది. పక్కనే పెద్ద 'క్లోక్‌రూం' వుంది క్లోక్‌రూంలో చాలా హేంగర్స్ వున్నాయి. ఒక హేంగర్‌కి తన కోటు తగిలించి, వాష్ బేసిన్లో ముఖం కడుక్కున్నాడు. పొరబాటుచేశానా అనిపించింది మధుమూర్తికి. సింహాచలాన్ని ఈ సందట్లో ఎలా కలుసుకోవడం ? ఇంతమందిలో ఏం మాట్లాడడం ? మర్నాటికి తన సమావేశాన్ని వాయిదావేసి వుండవలసింది. ఇప్పుడేం లాభం ? సింహాచలం తనని వుండమన్నప్పుడు వుండక తప్పదుగా ! అలా ఆలోచించుకుంటూ మళ్ళీ ముందున్న హాల్లోకి నడిచేడు. హాల్లో మరో కొత్తమనిషి నిల్చొని వున్నాడు. ఇతనూ విందారగించడానికే వచ్చివుంటాడు. బట్లర్‌కి తన హేటూ, ఓవర్‌కోటూ చాలా విసుగ్గా అందిస్తున్నాడు. అతన్ని చూస్తూనే మధుమూర్తి ఆశ్చర్యంలో మునిగేడు. 'ఇందాక సాయంకాలం స్టేషన్ హోటల్లో ఇతన్నేగదూ చూసిందీ !' అనుకున్నాడు.

"చాలా పెద్ద పార్టీయే నన్నమాట !" అన్నాడు మధుమూర్తి బట్లర్‌ని ఉద్దేశిస్తూ.

"అవునండి. చాలామంది అతిధులు వస్తున్నారు."

"పార్టీ ఎన్ని గంటలకి ప్రారంభిస్తారు ?"

"ఎనిమిది గంటలకి సార్ !"

రిస్ట్‌వాచ్‌కేసి చూసేడు మధుమూర్తి. ఎనిమిది అవడానికింకా 24 నిమిషాలున్నాయి.

"సింహాచలంగారికి నా సంగతి మరోసారి గుర్తు చేస్తావా ?"

"ఆయన కేవిషయం మనం గుర్తుచేయనవసరం లేదు." అని క్లోక్‌రూం వేపు నడిచేడు.

హాల్లోకి ఎవరెవరో ఇంకా వస్తూనే వున్నారు. అందరూ అతనికి అపరిచితులే. ఇద్దరు ముగ్గుర్నిమాత్రం ఎక్కడో చూసినట్టుంది. ఏం చేయడానికీ పాలుబోక గుమ్మం దగ్గర నిల్చున్నాడు.

"ఈజిట్ మిస్టర్ మధుమూర్తి ?" అన్న గంభీరస్వరం విన్పించి వెనుదిరిగి చూశాడు.

తెల్లగా పొట్టిగా వున్నాడతను. కోరమీసాలు. ముఖంలోని గంభీరతతోపాటు కొంచెం చోటుచేసుకున్న క్రౌర్యం.

"మీరేనా సింహాచలంగారు ?"

"అవును," అన్నాడతను నవ్వుతూ.

అంతలో అతని చూపు హాలువేపు మళ్ళింది. "అందరూ రెడీయేనా ?" అన్నాడు.

చాలాసేపటిదాకా ఎవరూ మాటాడలేదు. ఇది చాలా వింతగా కన్పించింది మధుమూర్తికి. ఆ నిశ్శబ్దాన్ని ఒకే ఒకవ్యక్తి ఛేదించేడు. అతని పేరు లింగస్వామి.

"ఒక్కొక్కళ్ళ పేరు చదవ్వోయ్. ప్రెజెంట్ సార్ అని పలుకుతాం. అప్పుడు తెలుస్తుందిగా అందరూ వచ్చిందీ లేనిదీ ?"

"ఎందుకూ దండగ. ఎవరు వచ్చేరో ఎవరు రాలేదో నాకాపాటి తెలీదూ ? సలీం ఇంకా రాలేదా ?"

"వస్తే ఏమైపోతాడు ?"

"ఎనిమిది గంటలకి డిన్నర్ ప్రారంభం అవుతుంది. 7-45 కల్లా అందరూ రావాలన్నాను. పంక్చుయాలిటీ లేని మనుష్యులంటే నాకు పరమఅసహ్యం. ఆల్‌రైట్—ఇప్పుడా పదమూడో నెంబర్ కుర్చీలో ఎవరు కూర్చుంటారు ?"

"పదమూడా ?"

సింహాచలం మధుమూర్తిని చూసేడు. "మిస్టర్ మధూ: సరిగ్గా సమయానికి వచ్చేరు."

"నేను విందుకని రాలేదు."

"పోనీ—నేను ఇప్పుడు ఆహ్వానిస్తున్నాను."

"ఒకవేళ సలీంగారు గనక వస్తే !?"

సింహాచలం మరోసారి వాచ్‌చూసుకున్నాడు. అంతలో హాల్లోని గడియారం ఎనిమిది గంటలు కొట్టింది.

"సలీం రానట్టే. మనం డిన్నర్‌కి లేవొచ్చు. కమాన్ మిస్టర్ మధూ" అంటూ ముందుకి నడిచేడు సింహాచలం.

అందరూ అతన్ని అనుసరించేరు.

## 3

సింహాచలం వెనకాలే అందరూ డైనింగ్ రూంలోకి నడిచేరు. ఓవల్ షేప్‌లో వున్న డైనింగ్ టేబులు చుట్టూరా పధ్నాలుగు కుర్చీలున్నాయి. టేబులు మీద తినుబండారాల పళ్ళేలున్నాయి. ఒక్కొక్క కుర్చీకి ఎదురుగా ప్లాస్టిక్‌తో చేసిన ఎముకలు టేబులుమీద వున్నాయి. వాటిమీద ఏవేవో పేర్లున్నాయి. గదినిండా ఎర్రనికాంతి ! ఓ కుర్చీలో ఎవరో కూర్చుని వున్నా దప్పుడే !

"ఓ గెస్ట్ మనకన్నా ముందే తయారయ్యేడు. లెటజ్ జాయిన్ హిమ్ !" అన్నాడు సింహాచలం.

"వారు మీ నాన్నగారా ?" అన్నాడు మధుమూర్తి.

"ఎలా పోల్చుకున్నారు ?"

"వారి పోలికలు మీలోనూ వున్నట్టు కనిపెట్టేను."

"ఇంకా ఏమిటి కనిపెట్టేరు, మధుమూర్తీ !" సింహాచలం గొంతులో ఏదో అసహజత కొట్టొచ్చినట్టు కనిపించింది.

"ఆమె ఎవరు ?" మళ్ళీ ప్రశ్నించేడు మధుమూర్తి.

"వారిజ. నా మేనల్లుడు వెంకటచలం భార్య."

" అలాగా"

దాదావు అందరూ డైనింగ్‌రూంలోకి వచ్చేశారు.

"అందరూ కూర్చోండి. ప్రతీ కుర్చీకి ఎదురుగా టేబులు మీద మీ నేమ్ ప్లేట్ వుంటుంది. వూఁ...సిడౌన్ లింగస్వామీ !"

లింగస్వామి ఒక్కసారి ఖస్సుమన్నాడు.

"సింహాచలం ! ఏమిటిదంతా ? ఈ ఎముకలేమిటీ ? వాటిమీద మా పేర్లేమిటీ? ఈ ఎర్రని కాంతేమిటి ? ఇదేం విందుభోజనమా ? తద్దినం భోజనమా ?"

"లింగస్వామీ, దీని వెనుక చాలా కథుంది. అదంతా ఓపిగ్గా చెప్తాను, ముందు కూర్చొని భోజనం చేయ్ !" కటువుగా అన్నాడు సింహాచలం.

ఒకొక్కరూ కుర్చీల్లో సర్దుకోసాగేరు.




"మిస్టర్ మధూ, నలీం సీట్లో మీరు కూర్చోండి. ఈ నాటి విందు భోజనం మీరు జీవితంలో మరచిపోలేరని మీకు హామీ యిస్తున్నాను." అన్నాడు సింహాచలం నిలబడ్డ మధుమూర్తిని చూస్తూ.

"థాంక్స్" అంటూ నలీమ్ సీట్లో కూర్చున్నాడు మధుమూర్తి. అందరూ భోజనం ప్రారంభించేరు. మధుమూర్తిభోజనం చేస్తూనే తనున్న వాతావరణాన్ని పరిసరాల్ని శ్రద్ధగాగమనించసాగేడు. అతనున్న వరుసలో అయిదుగురున్నారు. టేబులికి ఇటూ అటూ సింహచలం, అతని తండ్రి వేదాచలం వున్నారు. వేదాచలంకి దగ్గరదగ్గరగా ఎనభై ఏళ్లుంటాయేమో: కాళ్లూ చేతులూ కదలవు. పక్షవాతం.ఇంతలేని కళ్లతో మిడుతూ మిడుతూ అందరికేసీచూస్తున్నాడు. అతని పక్కనే రమ కూర్చునివుంది. దగ్గిరదగ్గిర ఇరవై ఏళ్ళు వుంటాయి. ఆకర్షణీయ మైన ఆకృతి. ఆమె వుండుండి మధుమూర్తిని చూస్తోంది. అలా ఆమె చూస్తూన్నపుడల్లా మధుమూర్తికి ఏదో అనిర్వచనీయమైన సంతోషం కలుగుతోంది. ఆమె రాజారావుకూతురు.

ఆమె పక్క కూర్చున్న వ్యక్తిని చూసి అసహించుకున్నాడు మధు. గొట్టాం పేంటూ పొట్టి చొక్కా. మనిషికూడా పొట్టే. అతనికి దగ్గర దగ్గర పాతికేళ్ళుంటాయి. ముఖంనిండా స్ఫోటకం మచ్చలు. అతని పేరు వరహగిరి.

అతనికి తర్వాత కూర్చున్నది శివకోటి. నాటకాలమనిషి. అపర గిరీశం. అతని నుదుటి మీద ఏదో పెద్ద మచ్చ. కాలినమచ్చ గాబోలు. అది మనిషిని మరింత అందవికారిగా చేసింది. అతడు సింహాచలంకేసి అప్పుడప్పుడు నమిలి మింగేసేలా చూస్తున్నాడు.

శివకోటిపక్క మధుమూర్తికూచుని వున్నాడు. మధుమూర్తికి అటువేపు వరుసలో పక్కగా రమతంత్రి రాజారావూ, ఆనక కృష్ణభగవాన్లు. తర్వాత వారిజ కూర్చుని వుంది. వారిజ తర్వాత సింహాచలం.

సింహాచలం ఏదో ఆలోచిస్తూ తదేకంగా భోజనం చేస్తున్నాడు.

సింహచలం తర్వాత పురోహితుడు కృష్ణభగవాన్లు భార్య అలివేలుమంగ వుంది. మధ్య మధ్య దగ్గుతూ ఒకో ముద్దా మింగుతోంది.

ఆమె తర్వాత సింహాచలం మేనల్లుడు వెంకటచలం కూర్చొనివున్నాడు. యువకుడు. అతని పక్క కృష్ణభగవాన్లు. బోడిగుండు. చిన్న పిలక. చెవులకి కుండలాలు, చేతికి కడియం. అతనిపక్క లింగస్వామి. ఇతనూ కంట్రాక్టరే ! సింహాచలంకి ప్రత్యర్థి. అతనిపక్క కూర్చున్న స్త్రీ శిరీష. ముప్ఫయ్యేళ్ల యువతి. చెవులకి రింగులు. ఈమె సింహాచలంకి ఏమౌతుంది ?

భోజనాలు ముగిసినై. అందరూ ప్లేట్లలో చేతులు కడుక్కున్నారు.

"ఏ ప్రమాదంలేకుండా సగం కార్యక్రమం పూర్తయింది." అన్నాడు సింహాచలం అదోలా.

"అంటే—ఏదో ప్రమాదం జరుగుతుందని మీరనుకున్నారా ?" ప్రశ్నించేడు మధుమూర్తి.

"అవును. కారణం చెప్తాను...బట్లర్ ! ద్రాక్షరసం పెట్టు. పెట్టాక ఓ గంట దాకా ఇక్కడి కెవరూ రాకండి !"

మరుక్షణంలో గ్లాసులు తయారయ్యేయి.

జేబులోంచి ఓ కాగితం తీసేడు సింహాచలం. అలివేలుమంగకి ఇచ్చేడు.

"చదివి—అందరికీ పాస్ చేయండి"

దాన్ని ఒక్కొక్కరూ చదివేరు. మధుమూర్తి వంతు వచ్చింది.

అది పావులావుసైజు రూళ్ళకాగితం. ఎవరో ఎడంచేత్తో రాసినట్టు అక్షరాలు వంకర టింకరగా వున్నాయి.

"నీ రక్తం

నా నోటికి తీర్థం—

తయారుగా వున్నావా, నరకానికి
తరలడానికి !!"
—అని వుంది అందులో !
తను చదివేక రాజారావుకిచ్చేడు మధుమూర్తి. అదలా ఆఖరికి సింహాచలంకే చేరింది. దాన్నోసారి చదువుకుని జేబులో పెట్టేసుకున్నాడు సింహాచలం. లేచి నిలబడ్డాడు. గొంతు సవరించుకుని అందర్నీ చూశాడు.

## 4

గదినిండా నిశ్శబ్దం రాజ్యంచేస్తోంది. అతిధుల కళ్ళన్నీ నిలబడ్డ సింహాచలం వేపే వున్నాయి.

"లేడీస్ అండ్ జెంటిల్మన్ ! నా ఆహ్వానాన్ని మీరందరూ అంగీకరించి ఇక్కడికి వచ్చినందుకు కృతజ్ఞుణ్ని.

ఇందాక మీరుచూసిన వుత్తరం నాకు నాలుగు రోజులకింద పోస్టులోవచ్చింది. రాసిన ఆకాశరామన్న ఎవరో తెలుసుకుందామనే ఈ విందు ఏర్పాటు చేశాను. ఇప్పుడు ఈ క్షణంలో ఆ వుత్తరం రాసినవ్యక్తి ఇక్కడున్నాడని నేను ఖచ్చితంగా చెప్పగలను.

మీలో ప్రతిఒక్కరికీ ఆ వుత్తరం రాసే అవకాశం, కారణం వున్నాయని నాకు తెలుసు. మీకూ తెలుసు !

నిజం చెప్పాలంటే మీరందరూ నాకు శత్రువులు. పోనీ నేనే మీకు శత్రువుని. నా చావు మీ అందరికీ ఆనందం కలిగిస్తుంది. అయితే శత్రువులతో విందేమిటని మీరడగొచ్చు. ఒక విషయం మీ దృష్టికి తెద్దామని ఈవిందు ఏర్పాటు చేసేను.

నాకు చావంటే భయంలేదు. నేను మృత్యువుని ఆనందంగా ఆహ్వానిస్తాను. అన్నట్టు నే నీమధ్య ఓ గ్రంథం రాసేను దాని పేరు 'మృత్యువు కథ' మృత్యువంటే ఏమిటో—దాని దశలేవో అందులో వర్ణించేను. చాలా చిన్న పుస్తకం... అది మీకు చదివి వినిపించేక మనం ద్రాక్షరసం తాగేద్దాం. దాంతో విందు సరి. జనగణమన పాడేసి ఎవరిళ్ళకు వారు వెళ్ళిపోవచ్చు...ఒక విషయం గుర్తుంచుకోండి. నా శత్రువుని నేను చచ్చి సాధిస్తాను..."

"కానీ, మరి తొరగా !" అన్నాడు లింగస్వామి విసుగ్గా.

సింహాచలం పక్కనేవున్న గది తలుపుతీసి లోనికెళ్ళేడు. అతని వెనకాలే గది తలుపు మూసుకుంది.

కొన్ని క్షణాలు గదిలో భయంకర నిశ్శబ్దం మంచులా పేరుకుంది. చీమ చిటుక్కుమన్నా వినిపించేంత నిశ్శబ్దం. ఉద్వేగపూరితమైన మనస్సుతో లైబ్రరీ రూంవేపే చూడసాగేడు మధుమూర్తి.

అంతలో లైబ్రరీగదిలో కేకలు విన్పించేయి.

"వెధవన్నర వెధవలు. పుస్తకాలునరిగ్గా పేర్చడంకూడా రాదు... ఇదేం విఁటి రామాయణం. ఇగి బైబిలు...ఉమర్ ఖయాం 'మృత్యువు కథ' ఎక్కడ పెట్టేను చెప్మా !"

అర నిమిషం నిశ్శబ్దం.

"పెట్టిన పుస్తకం పెట్టిన చోట వుండదు. అందుకే ఎవర్నీ రావద్దంటాను ఈ గదిలోకి...ఛ...ఛ..."

మధుమూర్తే కాదు అందరూ అటే నిర్నిమేషంగా చూస్తున్నారు.

"గదిలో శవం, మిస్టరీలోని హిస్టరీ, చచ్చిన శవం, శవంచేసిన హత్య, శవానికో సవాలు, వురితాడు, పలకల వెండిగ్లాను, పగలు పకీరు, రాత్రి అమీరూ, లక్షాధికారి హత్య, కిరాయి పిల్ల, భయం—భయం, కాళరాత్రి, ఒక వెన్నెల రేయి, అణాకోబేడ స్టాంపు, లక్షా రెండు లక్షలా ఎంతకావాలి ?, విందుకి వెళ్ళిన విమల, ఖైదీ నెంబర్ వన్, దేవుడెక్కడ, ఆమె చెప్పిన కథ...ఈ పుస్తకాలన్నీ ఇక్కడెవరు పెట్టేరు. అసలు పుస్తకం ఏదీ ?"

ఓ పక్క లైబ్రరీరూంలో అలా కేకలు వేస్తూనే వున్నాడు సింహాచలం. డైనింగ్ హాల్లో అతిధులందరూ అవాక్కయి కూచుని వున్నారు.

ఆ భయంకర నిశ్శబ్దాన్ని ఛేదిస్తూ గడియారం ఖంగుఖంగున మోగనారంభించింది. మధుమూర్తి జాగ్రత్తగా లెక్కెట్టేడు. ఒకటి...రెండు...మూడు... నాలుగు...అయిదు...ఆరు...ఏడు...ఎనిమిది...తొమ్మిది...అంతే.

హఠాత్తుగా లైట్లారిపోయేయి. గదినిండా చిక్కని చీకటి.

"ఏమైంది ? లైట్లెవరు ఆర్పేరు ?? ఎవరు ?" అంటూ సింహాచలం గొంతు లైబ్రరీరూంలో ఖంగున మోగింది.

ఎవరూ మాటాళ్ళేదు.

"ఎవరూ మాట్లాడరేం ? నాన్సెన్స్ ! ఈ తలుపుకి తాళం వేసిందెవరు ? ఎవరు ?? ఎవరూ ???"

డైనింగ్ హాల్లో టేబులు దగ్గర ఏదో అలికిడి అయింది...మధుమూర్తి అటు



చూసేడు. చీకట్లో ఏం కన్పించలేదు. ఎవరో కుర్చీని వెనక్కి లాగిన చప్పుడు. ఇంకెవరో అగ్గిపుల్ల గీసేరు. గుడ్డి వెలుగు గదంతా నిండింది

ఆ కాసేపట్లో చుట్టూ చూసేడు మధుమూర్తి. శివకోటి నిశ్చలంగా కూర్చుని వున్నాడు. శిరీష నిలబడివుంది. లైబ్రరీరూంవేపు వెళ్తూ వెళ్తూ ఆగిపోయి నట్టుంది. సింహాచలం ద్రాక్షరసం గ్లాసుదగ్గర వారిజ కుడిచెయ్యి వుంది. అంతలో 'అమ్మో' అన్నాడు కృష్ణభగవాన్లు.

"అగ్గిపుల్ల...పడిపోయింది" వెంకటచలం గొంతు.

"మరోటి వెలిగించండి." అంది వారిజ.

"మరగ్గి పుల్లల్లేవు."

"ఎవరది ? కుర్చీల వెనక ఎవరదీ ??"

చీకట్లో ఆ గొంతెవరిదో గుర్తుపట్టేడు మధుమూర్తి. రమది !

లేచి నిలబడ్డాడు. గాల్లోకి చేతులు చాపేడు. ఎవరో వున్నారు బోయేడు. పట్టుజారిపోయింది...

అంతలో 'ఢాం' అని రివాల్వర్ పేలిన శబ్దం. మరో క్షణంలో మళ్ళీ 'ఢాం' అని పేలింది రివాల్వర్. మధుమూర్తి మణికట్టు కారంపోసినట్టు మండింది. బులెట్ దూసుకునిపోయి వుంటుంది. పక్కనే ఎవరో వున్నట్టు అన్పించింది మధుమూర్తికి. చటుక్కున పట్టుకున్నాడు. ఆ వ్యక్తి తప్పించుకోడానికి ప్రయత్నించలేదు. 'నేను రాజారావుని.' అన్నాడతను. మధుమూర్తి పట్టు వదిలేశాడు.

హఠాత్తుగా లైబ్రరీ గది తలుపు తెరుచుకుంది. వెలుగుతున్న కొవ్వొత్తిని పట్టుకుని సింహాచలం గుమ్మంలో నిలబడి వున్నాడు.

"నన్ను గదిలోపెట్టి బైటతాళం వేసిందెవరు ?" అన్నాడు నింపాదిగా.

ఎవరూ సమాధానం ఇయ్యలేదు.

"పోనీ తాళం మళ్ళీ ఎవరు తీసేరు ?"

"నేను కాదు." అంది శిరీష అప్రయత్నంగా.

"మరెవరు ? రివాల్వర్ రెండుసార్లు ఎవరు పేల్చేరు ? నో రిప్లయ్ ! ఆల్ రైట్, వెంకట్ నీ సీట్లోకి పో...వరహగిరి ఏడీ ? టేబిలు కిందున్నాడా ? చూడండి."

టేబులుకింద దాక్కున్న వరహగిరి బయటికి వచ్చేడు. యధాప్రకారంగా కుర్చీలో కూర్చున్నాడు.

"నేను ముందే అన్నట్టు నా చావుకి చాలామంది ఎదురు చూస్తున్నారు. గుడ్...నరే ఈ ద్రాక్షరసం తాగి విందు ముగిద్దాం !" అంటూ సింహాచలం తన గ్లాసెత్తి గడగడా తాగేడు. అంతే !

చిన్న శబ్దంచేస్తూ గ్లాసు టేబులుమీద పడిపోయింది. సింహాచలం కుప్పగా కుర్చీలో కూలబడ్డాడు. తల ఓ పక్కకి వాలిపోయింది.

సింహాచలం జీవితం ఆఖరైంది !

## 5

'సింహనిలయం' ముందు క్రీక్ మని చప్పుడు చేస్తూ పోలీస్ వేన్ ఆగింది. అందులోంచి ఆరుగురు వ్యక్తులు కిందికి దిగేరు. ఓ కాన్‌స్టేబుల్ వేన్ దగ్గర

వుండిపోయేడు. ఇంకొక కాన్‌స్టేబులు సింహనిలయం పెరటివేపు నడిచేడు. ఇన్‌స్పెక్టర్ కాలింగ్‌బెల్ బటన్ ప్రెస్ చేశాడు. మరుక్షణంలో ఒక యువతి తలుపు తీసింది. ఆమె వెనక ఒక మధ్య వయస్కుడు నిలబడివున్నాడు.

"నేను డిటెక్టివ్-ఇన్‌స్పెక్టర్ సుధాకర్‌ని. వీరు పోలీస్ సర్జన్ డాక్టర్ వైద్యనాథం. సింహాచలంగార్ని వీరు మొదట చూడాలి."

"నేను రాజారావుని. ఇందాక మీకు ఫోన్ చేసింది నేనే. రండి డాక్టర్ః మిమ్మల్ని డైనింగ్ హాల్లోకి తీసుకెళ్తాను."

డాక్టర్ వైద్యనాథం, రాజారావు గబగబ డైనింగ్‌హాల్‌వేపు నడిచేరు.

"మీరెవరో నేను తెలుసుకోవచ్చా?" అన్నాడు ఇన్‌స్పెక్టర్ సుధాకర్ ఎదురుగావున్న యువతిని చూసి.

"నా పేరు శిరీష. సింహాచలంగారి మరదల్ని." అందామె.

"మిగతా అతిథులేరీ?"

శిరీష హాలు వేపు తల తిప్పింది "అక్కడున్నారు" అంది.

"అందరూనా?"

"రాజారావుగారు తప్ప—ఆయనిప్పుడే మీ డాక్టర్‌గారితో బాటు డైనింగ్ హాలువేపు వెళ్లేరు. సింహాచలంగారి తండ్రి వేదాచలంగారు మేడమీదే వున్నారు. ఆయన పక్షవాతం మనిషి. కదల్లేరు. పనివాళ్లందరూ కిచెన్లో వున్నారు."

"థాంక్యూ. ఇంకో చిన్న హెల్ప్ చేయాలి. ఇక్కడికొచ్చిన అతిథుల పేర్లూ, ఇక్కడ నివసించేవారి పేర్లూ, నౌఖర్ల పేర్లూ... చిన్న లిస్టు తయారు చేయండి..."

"అలాగే" అంటూ శిరీష డ్రాయింగ్‌రూం వేపు నడిచింది.

అంతలో మంచి పొడగరీ, స్ఫురద్రూపీ అయిన ఓ వ్యక్తి ఇన్‌స్పెక్టర్ సుధాకర్ని సమీపించేడు.

"ఎస్?" అన్నాడు సుధాకర్.

"నా పేరు మధుమూర్తి. శిరీష ఇంతకుముందు ఓ విషయం మీకు చెప్పేరు. అది పొరబాటు. బహుశ ఆమెకి తెలిసుండదు."

"ఏమిటది?"

"మేమందరం హాల్లోనే వున్నామన్నారు కదూ? కాని ఒక వ్యక్తి కనిపించటం లేదు?"

"ఎవరు?"

"అతని పేరు వరహాగిరి. అయిదు నిమషాల కిందట అతన్ని చూశాను. ఇప్పుడు లేడు."

"అతను బయటికి వెళ్లడం మీరు చూసేరా?"

"లేదు. నేనే అటువేపు పనుండి వెళ్లేను."

"ఎటువేపు?"

"ఆ కొసాని, క్లోక్‌రూం దగ్గరున్న వాష్ బేసిన్ వేపు. నేనూ రమా వెళ్లేం రివాల్వర్ ప్రేలుడు గురించి మీరు వినే వుంటారు. నా మణికట్టుకి చిన్న దెబ్బ తగిలింది. రమ బాండేజ్ కట్టిందక్కడ!"

"ఇంకెవరికీ దెబ్బలు తగల్లేదు గదా!"

"లేదు."

"దట్స్‌గుడ్. వరహాగిరిగారి సంగతి కనుక్కుందాం. అతనెంతో దూరం వెళ్లివుండడు. సార్జంట్ నువ్వు డ్రాయింగ్‌రూంలోకి వెళ్లు. గెస్టులందర్నీ కద లొద్దని చెప్పు. అన్నట్టు శిరీషగారుగాని లిస్ట్ పూర్తి చేస్తే నాకిమ్మని చెప్పు. నేను డైనింగ్ హాల్లో వుంటాను. అప్పలస్వామీ, నువ్వు వంటగది వేపు వెళ్లు. అక్కడ వంటమనిషీ, నౌకర్లూ వుంటారు. ఎక్కడి వాళ్లని అక్కడే వుండ మన్చెప్పు."

"యస్సర్" అంటూ చీకట్లో టార్చ్ వెలిగించుకుంటూ ముందుకి నడిచేడు. ఓ పది గజాలు నడిచేడో లేదో "బాబోయ్" అని అరిచేడు.

సుధాకర్ గబగబ అటు నడిచేడు. టార్చి వెలుగులో నేలమీద పడున్న ఓవ్యక్తి కన్పించేడు. ఇన్‌స్పెక్టర్‌కి అప్పలస్వామి ఏదో అనబోయేలోగా ఆ వ్యక్తి మెల్లిగా కదిలేడు.

"పడిపోయేరా వరహాగిరీ?"

అతను మాట్లాడలేదు. కళ్లు నులుముకుంటూ సుధాకర్‌ని చూశాడు.

"ఎవరేనా మిమ్మల్ని పడదోసేరా? లేక పొరబాటున నేలమీద పడ్డారా? ఏమైంది?" మళ్ళీ ప్రశ్నించేడు ఇన్‌స్పెక్టర్ సుధాకర్.

"ఏమిటో అకస్మాత్తుగా మగత కమ్మింది. తెలివితప్పి పడిపోయేను."

వరహాగిరి కళ్లల్లోని భయాన్ని పసికట్టేడు సుధాకర్.

"ఎందుకలా అయింది."

"ఏమిటో— ఇవాళంతా నా మనస్సు పాడయిపోయింది..."

"అదికాదు మీరేదైనా తిన్నారా? తాగేరా? ఎంచేతలా మగత కమ్మింది?"



"చెప్పానుగా. డ్రాయింగ్‌రూం వదలి చీకట్లో తడుముకుంటూ ఇక్కడికి వచ్చేను. క్లోక్‌రూం దగ్గర ఎవరో వున్నట్టనిపించింది. అటు వెళ్లేను. అంతే స్పృహ పోయింది. ఇవన్నీ మీరెందుకడుగుతున్నారు? అసలు నా పేరెలా తెలిసింది మీకు?" అన్నాడు వరహగిరి లేచి నిలబడి.

"నేను పోలీస్ ఇన్‌స్పెక్టర్ సుధాకర్‌ని." అంతలో సుధాకర్ దృష్టిని ఓ వస్తువు ఆకర్షించింది. 'మీరు సిగరెట్టేదేనా తాగేరా?'

"లేదు!"

"నిజంగానా!"

"అవును."

"సరే. మీరు డ్రాయింగ్‌రూం లోకి వెళ్లండి." అన్నాడు సుధాకర్.

వరహగిరి అలా డ్రాయింగ్‌రూంవేపు వెళ్లగానే సుధాకర్ చటుక్కున కిందికి వంగి ఆ వస్తువుని అందుకున్నాడు. అది - పదోవంతు మాత్రం కాలిన సిగరెట్టు పీక! వానన చూసేడు—— అందులో మత్తుమందు కలిసుంది? మరి వరహగిరి అలా అబద్ధం చెప్పడానికి కారణమేమిటి?——దాన్ని జాగ్రత్తగా జేబులో వేసుకుని డైనింగ్‌రూం వేపు నడిచేడు.

## 6

డైనింగ్ హాల్లో ఒక హరికెన్ లాంపూ, రెండు కొవ్వొత్తులూ వున్నాయి. వాటి వెలుగులో డాక్టర్ వైద్యనాథం తన పని చకచక చేసుకుంటున్నాడు. కుతూహలంగా అటే చూస్తున్నాడు రాజారావు. చప్పుడు చేయకుండా లోనికి నడిచేడు సుధాకర్.

"మీ అభిప్రాయం ఏమిటి డాక్టర్ ?"

తలెత్తి చూశాడు వైద్యనాథం.

"నో డౌట్. పాయిజన్. అయితే ఏ పాయిజనో ఇప్పుడప్పుడే చెప్పలేను..."

సింహాచలంకి ఎదురుగా టేబులుమీద గ్లాసు పడివుంది ఇంకా అందులో ఒకటి రెండు చుక్కలున్నాయి.

"అటు చూడండి డాక్టర్. లాబ్‌కి దాన్ని పంపండి."

"ఇది మామూలు నార్కొటిక్ పాయిజన్ మాత్రం కాదు. తాగిన కొద్ది సెకన్లలో చనిపోయాడు..." అన్నాడు డాక్టర్.

"విషం ఏదన్నా కానివ్వండి. విషం ఇచ్చిన వ్యక్తి ఇంకా యిక్కడే వున్నాడు." అన్నాడు ఇన్‌స్పెక్టర్ దాదాపు స్వగతంలా.

"అది మీ పని !" అని మళ్ళీ తన పనిలో నిమగ్నమయ్యేడు వైద్యనాథం.

"ఎక్జాక్ట్‌లీ, డాక్టర్. విషంపేరు మీరు చెప్పండి. విషం యిచ్చిందెవరో నేను చెప్తాను. టేబిలు మీదున్న మిగతా గ్లాసులన్నీ ద్రాక్షరసంతో వున్నాయి. ఎవరూ తాగినట్టు లేదు." అన్నాడు సుధాకర్ టేబుల్ని చూస్తూ.

"సింహాచలం మమ్మల్ని చాలా భయపెట్టేడు ... చెప్పాలంటే ఎన్నో విషయాలు వున్నాయి..."

"కాని నేను రెడీగా లేను రాజారావుగారూ ! డాక్టర్‌జీ, మిగతా ద్రాక్షరసం గ్లాసులుకూడా పరీక్ష చేయించే ఏర్పాట్లు చూడండి."

అంతలో శిరీష డైనింగ్ హాల్లోకి ప్రవేశించింది. మనిషి ఫ్రీగా లేదు. రకరకాల ఉద్రేకాల్నీ—ఉద్వేగాల్నీ బలవంతాన అణుచుకొంటున్నట్టు కన్పిస్తోంది.

"ఇదుగో. మీరడిగిన లిస్ట్" అంది.

లిస్ట్‌ని తేరిపార చూశాడు సుధాకర్. గుండ్రంగా ముత్యాలకోవలా వుందామె దస్తూరీ.



"థాంక్యూ, శిరీషగారూ !"

"ఇందాక నేనో చిన్న పొరబాటు చేశాను. మీరడిగినప్పుడు అతిథులందరూ డ్రాయింగ్‌రూంలో వున్నారన్నాను."

"లేరా అయితే ?"

"వరహాగిరిగారు లేని సంగతి నేను గమనించలేదు."

"పోనీ...ఇప్పుడున్నారుగా !"

"ఇప్పుడే మీ కాన్‌స్టేబుల్ అతన్ని డ్రాయింగ్‌రూంలోకి తీసుకొచ్చేడు."

"గుడ్. టేబులు మీదున్న ద్రాక్షరసం గ్లాసులు చూశారా ? ఒక్క సింహాచలంతప్ప ఇంకెవరూ ద్రాక్షరసం తాగలేదు. కారణం ?"

"నా మట్టుకి నేను భయంగా సింహాచలంగార్ని చూస్తూ కూర్చున్నాను" అంది శిరీష.

"అది సరే. ఆయనెవరు ? ఇంకా ఇక్కడే ఎందుకున్నారు ?"

"వారు సింహాచలంగారి తండ్రి, వేదాచలంగారు. తనిక్కడే వుంటా

"ఆయన్నడిగేను."

"అయ్‌సీ, ఆయన్తో మీరు సంభాషించగలరన్నమాట !

"చిన్న చిన్న విషయాలు తెలుసుకోగలను. ఆయన మాట్లాడలేరు. కదల్లేరు. పక్షవాతం."

"చూడగలరా ?"

"నాకన్నా బాగా చూడగలరు !"

"వెరీ ఇంటరెస్టింగ్. ఆయనకింకా ఇక్కడుండాలనుందేమో కనుక్కోండి !"

శిరీష వేదాచలం దగ్గరికి వెళ్ళి ముఖంలోకి చూసింది. వెంటనే ఇన్‌స్పెక్టర్‌ని చూస్తో 'వుంటారట' అంది.

"సరే." అంటూ లైబ్రరీరూం తలుపు దగ్గరికి నడిచేడు సుధాకర్. తలుపు తీసి చూశాడు. చూశాక తలుపు మూసేడు. టేబులు వేపుచూస్తూ—టేబులుకిందికి ఓసారి చూసేడు.

"చూడండి శిరీషగారూ, ఆ కుర్చీలో కూర్చున్నది ఎవరు ?"

"నేనే !"

"రివాల్వర్ పేల్చేక దాన్ని మీరు కింద పడేశారన్నమాట !"

ఆశ్చర్యంతో అవాక్కయి ఇన్‌స్పెక్టర్ని చూడసాగింది శిరీష. రాజారావు కూడా ఆశ్చర్యంగా సుధాకర్‌ని చూశాడు. డాక్టర్ మాత్రం యిదేమీ పట్టనట్టు తనపని తను చేసుకుంటున్నాడు.

"నేనే రివాల్వర్ని పేల్చలేదు !"

"సరిగ్గా మీ కాళ్ళ దగ్గిర—టేబులుకింద వుంది రివాల్వర్."

"నాకు దాని గురించి ఏమీ తెలీదు. నన్ను నమ్మండి" అంది శిరీష దాదాపు వణికిపోతూ,

"ఆ పక్షంలో మీరు వర్రీ అవ్వాల్సిన అవసరం ఏముంది ? రివాల్వర్ చీకట్లో గదూ పేలింది ? అన్నట్టు మెయిన్‌స్విచ్ ఎక్కడుంది ?"

"హాల్లో మెట్లకింద. చూపించమన్నారా ?" అంది.

"ఒక్క నిమషం. లైట్లెప్పుడు ఆరిపోయేయి ?"

"సరిగ్గా తొమ్మిది గంటలకి. అప్పుడే గోడగడియారం 9 కొట్టింది." అన్నాడు రాజారావు.

"అంటే సరిగ్గా ౩౫ నిమిషాల కిందట కరెంటు ఆఫ్ అయిందన్నమాట" ఆలోచనాపూర్వకంగా అన్నాడు ఇన్‌స్పెక్టర్.

'మైగాడ్. ఇంతేనా ? ౩౫ యుగాలనిపించింది.' అనుకుంది శిరీష మనసులో. పైకిమాత్రం "అవును" అంది.

"౩౫ నిమిషాలై కరెంట్ లేదు, ఇప్పటికీ రాలేదు, మీలో ఎవరూ స్విచ్‌లు గానీ, ఫ్యూజ్‌బాక్స్‌లుగానీ పరీక్షించినట్టు లేదు. కారణం ?" ప్రశ్నించేడు సుధాకర్.

"మామూలు పరిస్థితుల్లో అయితే ఎవరేనా అదే చేసేవారు. కాని ప్రస్తుతం ఈ భవనంలో ఒక హత్య జరిగింది...అతిథులం అయిన మా తక్షణ కర్తవ్యం మేము చేశాము. అంతా మీరే చూసుకుంటారన్న ఉద్దేశ్యంతో మేమేమీ కల్పించు కోలేదు." అన్నాడు రాజారావు ఇన్‌స్పెక్టర్ సుధాకర్‌ని చూస్తో.

సుధాకర్ తనలో తాను నవ్వుకున్నాడు. ఒక్క క్షణం ఆలోచించి రాజా రావువేపు తిరిగేడు."రాజారావుగారూ, మీరిక్కడే వుండండి. నేనూ, శిరీషగారూ కిందికి వెళ్తాం. కమాన్ శిరీషా !" అన్నాడు.

శిరీష ముందు నడిచింది. ఆమె వెనగ్గా ఒక్కొక్క మెట్టూ కిందికి దిగు తున్నాడు సుధాకర్. మనోహరమైన పరిమళం శిరీష దుస్తుల్లోంచి వస్తోంది. సెంటువాసన చాలా బ్రహ్మాండంగా వుంది. చాలా రేర్ సెంట్ !- అనుకున్నాడు సుధాకర్.

"అదే మెయిన్‌స్విచ్" అంది శిరీష.

ఫ్యూజ్ బాక్స్ కనిపించకుండా తెర ఒకటి వేలాడ్తోంది.

"గుడ్. శిరీషగారూ, మీరు మరో చిన్న ఉపకారం చేసి పెట్టాలి."

"చెప్పండి. తప్పక చేస్తాను."

"మీరు డ్రాయింగ్‌రూంలోకి వెళ్లి అక్కడే కూర్చోండి. అక్కడున్న మా సార్జెంట్ విశ్వాన్ని నా దగ్గరికి పంపించండి...అన్నట్టు టార్చ్ ఇమ్మన్నారా?"

"అఖ్ఖర్లేదు. ఈ ఇంట్లో ప్రతిమూలా నాకు తెలుసు."

"గుడ్"

శిరీష అలా వెళ్లగానే మెయిన్ స్విచ్ దగ్గరున్న తెరని సమీపించేడు. తెరని వాసన చూసి నివ్వెరపోయేడు. 'సందేహం లేదు: శిరీష వాడిన సెంటూ— ఈ సెంటూ ఒక్కటే!' అనుకుంటూ తెర తొలగించేడు.

వెనక బరువైన బూడ్సుల చప్పుడు వినిపించింది.

తల తిప్పకుండానే. 'నే చూస్తూన్నది ఏమిటో గమనించేవా విశ్వం?' అన్నాడు ఇన్‌స్పెక్టర్ సుధాకర్.

సార్జెంట్ కళ్లు సంతోషంతో మెరిశాయి. 'యస్సర్' అన్నాడు.

"అదన్న మాట సంగతి! లైట్లు ఆఫ్ అయితే— ఆ సంగతి సందర్భాలు మనకే వదిలేశార్ట! ఆఁ ఏమిటి విశేషాలు?"

"ఏమున్నాయి సర్! అప్పలస్వామి ఆ వరహగిరిని వెనక్కి తీసుకొచ్చి డ్రాయింగ్ రూంలో కూచోబెట్టేడు. ఇప్పుడు కిందని వున్నాడు. రహీం వీధి గేటు దగ్గరా, ఏడుకొండలు వంటగదిలోనూ వున్నారు సార్!"

"గుడ్. డ్రాయింగ్‌రూంలో అతిధులు ఏమైనా మాటాడుకుంటున్నారా? ఎనీ ఇంటరెస్టింగ్ కాన్వర్‌సేషన్?"

"నోసర్. అందరూ గుసగుసలే సర్, ఏం వినబడ్లేదు."

మరోసారి సుధాకర్ నవ్వేడు.

"సరే సార్జంట్, ఆ కర్టెన్ వాసన చూడు."

ఇన్‌స్పెక్టర్ చెప్పినట్టు చేసేడు.

"భలేగా వుంది సార్ సెంటూ!"

"బజార్లో చాలా ఖరీదు. ఇంకోసారి శిరీషగారి దగ్గరకెళ్లి ముక్కుపుటాలు వెడల్పు చెయ్యి. ఇదే సెంటు!" అన్నాడింకా నవ్వుతూనే.

"అంటే సార్, కొంపదీసి..."

"అదేమీ కాదులే! చూడక్కడ ఏదో రుమాలున్నట్టుంది."

నేలమీదున్న రుమాలు తీసి ఇన్‌స్పెక్టర్ సుధాకర్‌కి అందించేడు సార్జంట్ విశ్వం.

రుమాలుకి ఓ మూల 'L' అన్న అక్షరం వుంది. శిరీష యిచ్చిన లిస్ట్ చూసేడు సుధాకర్. L తో ప్రారంభం అయ్యే పేరు ఒకటే వుంది అందులో!

'లింగస్వామి!'

"ఎస్ సర్, వాట్ నెక్స్‌ట్?!"

"నెక్స్‌ట్, అందర్నీ డైనింగ్ హాల్లోకి రమ్మను. ఇంకేమీ చెప్పొద్దు ...




"ఇంకా—" అంటూ సార్జెంట్ చెవిలో రహస్యంగా ఏవో చెప్పేడు ఇన్స్పెక్టర్ సుధాకర్.

ఉత్సాహంగా పెద్దపెద్ద అడుగు లేస్తూ ముందుకి నడిచేడు సార్జెంట్ విశ్వం.

అతిధులందరూ మేడ మెట్లెక్కి డైనింగ్ హాలు వేపు నడిచేరు. అందరూ లోనికి రాగానే సుధాకర్ వాళ్లని నవ్వుతో చూశాడు.

"ఇప్పటివరకూ అసలిక్కడేం జరిగిందో నాకు పూర్తిగా తెలీదంటే మీరు ఆశ్చర్యపోతారేమో! రాజారావుగారు ఏవో కొన్ని ముఖ్యమైన విషయాలు మాత్రమే చెప్పేరు... పెర్సనల్ ఇంటర్వ్యూలు తర్వాత చేస్తాను. అసలు జరిగిన విషయం ఏమిటో మీ అందరి నోటంటా వినాలనుంది......"

"అంటే—ఎలా? మీరు ఒన్ టూ త్రీ అనగానే అందర్నీ ఒక్కసారి అరవమన్నారా?" విసుగ్గా అడిగేడు లింగస్వామి.

"కాదు. మధుమూర్తిగారు వివరాలు చెప్తారు. ఆయనేమన్నా పొరబడ్తే మీలో ఎవరేనా సరిదిద్దండి"

"ఓకే."

"మీరందరూ మీమీ స్థానాల్లో కూర్చోండి. కమాన్ మిస్టర్ మధూ, ప్రారంభించండి." అన్నాడు సుధాకర్.

మధుమూర్తి లేచి నిలబడ్డాడు. ఏదో అనేలోగానే డాక్టర్ వైద్యనాథం గొంతు అడ్డొచ్చింది. "వాటీజ్ దిస్ ఇన్‌స్పెక్టర్, నేను నా పరీక్ష చెయ్యాలా వద్దా?"

"చెయ్యండి. నాకేం అభ్యంతరంలేదు"

"మీకు లేకపోవచ్చు. కాని నాకు వుంది. శవాన్ని మరో గదిలోకి తీసుకుపోవచ్చా?"

"ఫోటోగ్రాఫర్ వచ్చేవరకు వీలుకాదు. పోనీ మీ పరీక్షని ఓ పావుగంట పాటు వాయిదా వెయ్యండి..."

"ఆల్‌రైట్"

"కానివ్వండి మధుమూర్తీ, సరిగా గంట క్రితం ఏం జరిగిందీ గదిలో?!" అన్నాడు సుధాకర్ అతన్ని ఉత్సాహంగా చూస్తూ.

"సరిగా గంట క్రితం..." అని మధుమూర్తి అనే సరికి విచిత్రమైన సంఘటన జరిగింది. అందరి కళ్లూ జిగేల్మనేలా లైట్లు వెలిగాయి. చిమ్మచీకటిలో నిండిన సింహనిలయం యధాప్రకారంగా జ్వాజ్వల్యమానంగా వెలగ సాగింది.

"కరెంటెలా వచ్చింది?" ఎవరో అన్నారు.

"వెరీ సింపుల్. ఈ యింట్లో—ఆ మాటకొస్తే ఈ గదిలో వున్న ఒక వ్యక్తి మెయిన్ స్విచ్ ఆఫ్ చేశారు. మా సార్జెంట్ దాన్ని ఆన్ చేశాడు. అంతే!" అన్నాడు ఇన్‌స్పెక్టర్ ముసిముసి నవ్వులు నవ్వుతూ.

"కానివ్వండి మధుమూర్తీ! మరి మీకు ఇక అడ్డుగా రాము."

"సరిగా గంటక్రితం సింహాచలంగారు మా అందరికీ ఓ వుత్తరం చూపేరు. కింద సంతకం ఏదీ లేదు. ఎవరో రాసి తనకి పంపి వుంటారనీ, అది మాలోనే ఎవరో ఒకరు అయివుండాలనీ అన్నారు .."

"ఏఁవిటా వుత్తరం?"

"నీ రక్తం నానోటికి తీర్థం: తయారుగా వున్నావా నరకానికి తరలడానికి! అనివుంది. తనకి మృత్యువంటే భయం లేదనీ, చావుని సంతోషంగా ఆహ్వానిస్తాననీ అన్నారు. తను 'మృత్యువు కథ' అనే పుస్తకం రాసినట్టు చెప్పేరు. అది తెస్తానని లైబ్రరీ గది వేపు వెళ్లేరు. అతని వెనకే తలుపు మూసుకుంది..."

"తర్వాత?"

మధుమూర్తి నిస్సహాయంగా చూసేడు.

"నేను చెప్తాను. మంచి నటుడికి మంచి జ్ఞాపకశక్తి వుండాలిగా. లైబ్రరీ రూంలో ఆయనన్న మాటల్ని—అంటే ఆయన డైలాగుల్ని చెప్పమన్నారా?" అన్నాడు శివకోటి.

"వెరీగుడ్. చెప్పండి." అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"వెధవన్నర వెధవలు. పుస్తకాలు సరిగా పేర్చడం కూడా రాదు... ఇదేమిటి— రామాయణం, ఇది బైబిలు... ఉమర్‌ఖయ్యాం... 'మృత్యువు కధ' ఎక్కడ పెట్టేను చెప్మా?

''పెట్టిన పుస్తకం పెట్టిన చోట వుండదు. అందుకే ఎవర్నీ రావద్దంటాను ఈ గదిలోకి...ఛ...ఛ...

"గదిలోశవం, మిస్టరీ హిస్టరీ, చచ్చిన శవం, శవం చేసిన హత్య, శవానికో సవాలు, ఉరితాడు, పలకల వెండిగ్లాసు, పగలు పకీరు, రాత్రి అమీరూ, లక్షాధికారి హత్య, కిరాయిపిల్ల, భయం భయం, కాళరాత్రి, ఒక వెన్నెల రేయి, అణాకో బేడ స్టాంపు, లక్షా రెండు లక్షలా ఎంత కావాలి?, విందుకి వెళ్లిన విమల, ఖైదీ నెంబర్ వన్, దేవుడెక్కడ? ఆమె చెప్పిన కధ... ఈ పుస్తకాలన్నీ ఇక్కడెవరు పెట్టేరు? అసలు పుస్తకం ఏదీ?"

డిటెక్టివ్ ఇన్‌స్పెక్టర్ సుధాకర్ ఆసక్తిగా శివకోటిని చూస్తున్నాడు.

"అప్పుడే గడియారం తొమ్మిది కొట్టింది...... ఏమైంది? లైట్లెవరు ఆర్పేరు? ఎవరూ?... ఎవరూ మాట్లాడరేం? నాన్సెన్స్. ఈ తలుపుకి తాళం వేసిందెవరు? ఎవరు?? ఎవరూ???...... అంతే!" అని వుస్సురంటూ కుర్చీలో కూర్చున్నాడు శివకోటి. ముఖంమీది స్వేద బిందువులను రుమాల్తో తుడుచుకోసాగేడు.

## 8

అంతలో 'సింహనిలయం' పోర్టికోలో మరో పోలీస్‌వేన్ ఆగింది. ఫొటోగ్రాఫర్ అండ్ ఫింగర్‌ప్రింట్స్ ఎక్స్‌పర్ట్ పాపారావు తిన్నగా డైనింగ్‌హాల్ దగ్గరికే వెళ్ళి ఇన్‌స్పెక్టర్ సుధాకర్‌ని విష్ చేశాడు. చకచక నాలుగైదు కోణాల్లో ఫొటోలు తీశాడు. సరంజామానంతా పట్టుకుని ఇన్‌స్పెక్టర్ ఆదేశంతో కిందవున్న క్లోక్‌రూం దగ్గరికి వెళ్ళేడు. సింహాచలం శవం మరో గదిలోకి తరలించేరు. అతని తండ్రి వేదాచలంను అతని గదిలోకి చక్రాల కుర్చీద్వారా తీసుకెళ్లేరు.

"ఇప్పుడు మీ అందరి జేబుల్లో ఏముందో నేను వెదకాల్సి వుంటుంది" అన్నాడు ఇన్‌స్పెక్టర్ సుధాకర్ అందర్నీ చూస్తూ.

"మీ పరిశోధనలో ఇది తప్పదంటారా?" అన్నాడు కృష్ణభగవాన్లు సందేహంగా.

"అనవసరమైన విషయాల జోలికి నేనెప్పుడూ పోను."

"మీరన్నది...నిజమే?" అన్నాడు కృష్ణభగవాన్లు తలాడిస్తూ.

లింగస్వామి మాత్రం కళ్ళల్లోనుంచి నిప్పులు కురిపిస్తూ ఇన్‌స్పెక్టర్ని చూస్తున్నాడు.

"మీరేమంటారు, స్వామీజీ?"

"మీ ఉద్యోగధర్మాన్ని అతిక్రమిస్తున్నారేమో ఇన్‌స్పెక్టర్!"

"ఈ యింట్లో మీ అందరి కళ్ళముందూ విషం మూలంగా హత్య జరిగింది. రివాల్వర్తో ఎవరో హత్యాప్రయత్నం చేశారు. మీ మాటల్ని నేను చాలా సీరియస్‌గా తీసుకుంటున్నాను."

"ఓ.కే...ఓ.కే...మీ ఇష్టం. కానివ్వండి."

"అన్నట్టు ఆ రివాల్వర్ సంగతో!" అన్నాడు రాజారావు హఠాత్తుగా.

"రివాల్వర్ దొరికింది. టేబులు కింద నా కుర్చీకి ఎదురుగా వుంది" అంది శిరీష.

"ప్రస్తుతం ఆ రివాల్వర్ మీది వేలిముద్రల్ని మా పాపారావు పరిశీలిస్తున్నాడు. నేను తెలుసుకోవలసిన విషయాలు చాలా వున్నాయి. రివాల్వర్ ఎవరిది? ఎందుకు పేల్చారు? సింహాచలంగారికి విషం ఎవరిచ్చేరు? కరెంట్ ఎవరు ఆఫ్ చేశారు? సింహాచలంగార్ని, లైబ్రరీ గదిలో పెట్టి బయట ఎవరు తాళం వేశారు? ఇవన్నీ ఒకే మనిషి చేశాడా...?"

"అది అసంభవం!" అన్నాడు రాజారావు మధ్యలో.

"అయితే హంతకుడికి ఓ అసిస్టెంట్ కూడా వున్నాడని మనం అనుకోవాలి"

"బట్లర్ సంగతేమిటి?" మధుమూర్తి అన్నాడు.

"బట్లర్‌గాని, కుక్‌గాని, నౌఖర్లందరికీగానీ ఈ హత్యతో సంబంధం లేదు. వాళ్ళందరూ ద్రాక్షరసాన్ని గ్లాసుల్లో నింపేక మరి యిటు రాలేదు. అది నిశ్చయం!"

మొట్టమొదట ఇన్‌స్పెక్టర్ సుధాకర్ వెంకటచలం జేబులు వెదికేడు. డిన్నర్




ఇన్విటేషన్, కొంతడబ్బు, రుమాలు, తిరుపతికి రిటర్న్ టికెట్లూతప్ప మరేమీ లేదు.

ఇన్స్పెక్టర్ నవ్వుతూ లింగస్వామిని చూసేడు.

"లింగస్వామిగారూ, మీ వంతు !"

"ఓ. కే !"

లింగస్వామి జేబుల్లో ఏదో బిజినెస్ లెటర్, మనీపర్స్ తప్ప మరేమీలేవు.

తర్వాత వరహగిరి. ఎందుకోగాని అతను కొద్దిగా వణుకుతున్నట్టు అనిపించింది సుధాకర్‌కి.

అతని జేబులో ఒక తాళం, రుమాలు, చవకరకం సిగరెట్ కేసు, అరిగిపోయిన పెన్సిలు, మడతపెట్టబడిన చిన్న కాగితం వున్నాయి. ఆ కాగితాన్ని విప్పేడు సుధాకర్.

"ఏమిటిది ?"

"మీకది అర్థం కాదు లెండి ?"

"కనకే, ఏమిటని మిమ్మల్ని అడిగేను."

"ఫర్నిచర్ డిజైన్."

"మీరే చేశారా ?"

"అవును."

"దేని డిజైనిది ?"

"ఏమిటి ?"

"మీకు వినపళ్లేదా ?"

"బీరువా డిజైను. పెద్దది...రకరకాల అరలూ...డ్రాయర్లూ..."

"అల్‌రైట్. ఇది చెప్పండి. ఇక్కడ × గుర్తు పెట్టేరు. ఎందుకు ?"

"ఇంటూ గుర్తు ఎక్కడా ?" అని అటు చూసేడు వరహాగిరి. వణుకు ఇంకా ఎక్కువైంది.

"అదా, అక్కడే తాళం అమర్చాలి" అన్నాడు ఆఖరికి... !

సుధాకర్ ఆ డిజైన్‌ని తన జేబులో వేసుకున్నాడు. వరహాగిరి కిక్కురు మన్లేదు. సుధాకర్ శివకోటివేపు తిరిగేడు. అతని జేబులో పెద్ద తాళం చెవీ, వదిరూపాయిల నోటొకటి, 'కన్యాశుల్కం' మొదటి ముద్రణ కాపీతప్ప మరేం లేవు.

తర్వాత మధుమూర్తి !

మధుమూర్తి జేబులో చిన్న ట్యూబ్‌తప్పితే మరేమీ లేవు. ఎవరూ చూడకుండా దాన్ని గుప్పెట్లో దాచేడు సుధాకర్...

తర్వాత—ఎవరి జేబుల్లోనూ క్లూలు దొరకలేదు. ఆలోచనాపూర్వకంగా తలూపాడు ఇన్‌స్పెక్టర్ సుధాకర్.

అంతలో సార్జెంట్ విశ్వం గదిలోకి వచ్చేడు. అతని చేతుల్లో మూడు కోట్లున్నాయి.

"ఏమేనా 'క్లూ' లా ?"

"అవును సర్ !"

"గుడ్ !"

"సార్ !"

బూడ్సుల చప్పుడు వినవస్తూన్న వేపు చూశాడు సుధాకర్.

"పెరటిగోడ ఆవతల తుప్పల్లో ఓ మోటార్‌సైకిలుంది సార్ !"

మధుమూర్తి ముఖం వికసించింది "ఇన్‌స్పెక్టర్! ఒకమోటార్‌బైక్ సాయంకాలం నాకు దేష్ ఇవ్వబోయింది. ఆఖరి అంకెలు 99. నాకు బాగా గుర్తు."

"పెరట్లో ఇటుకలు కుప్పలుగా వున్నాయి సర్. అక్కడో మనిషి పడున్నాడు !"

ఇన్‌స్పెక్టర్ శరీరంలోకి ఒకసారి విద్యుత్ ప్రవహించినట్టయింది.

"అందరూ డ్రాయింగ్ రూంలోకి వెళ్ళండి. కాన్‌స్టబుల్, నాకాచోటు చూపించు. సార్జెంట్, డాక్టర్ వైద్యనాధాన్ని తీసుకుని నువ్వూ రా !"



## 9

తుప్పల్లో దాచబడిన మోటార్ సైకిల్‌ని చూడడం అయ్యేక పెరటిద్వారం గుండా లోపలికి వెళ్లేరు సుధాకర్, కాన్‌స్టబుల్ అప్పలస్వామి. పెరట్లో ఓవార పాడుబడ్డస్విమింగ్‌పూల్ ఒకటుంది. దానిపక్కనే ఎప్పుడో తెప్పించిన ఇటుకలు గుట్టలుగుట్టలుగా పడిఉన్నాయి. వాటి మధ్య ఏవో పిచ్చిమొక్కలుకూడా చోటు చేసుకున్నాయి. అక్కడే ఓ శవం వెల్లకితలా పడివుంది. మోకాళ్ళమీద కూర్చుని శవాన్ని పరిశీలనగా చూసేడు సుధాకర్. పాతికేళ్ళవయస్సుంటుంది. వులెన్‌సూట్లో వున్నాడు. తలకి పెద్దగాయం.

అంతలో సార్జెంటూ, డాక్టర్ వైద్యనాధంకూడా అక్కడికి వచ్చేశారు. వస్తూనే వైద్యనాధం తనపని ప్రారంభించేడు.

"చనిపోయి ఎంతకాలం అయివుంటుంది."

ఇన్‌స్పెక్టర్ ప్రశ్నవిని కాసేపు ఆలోచించేడు వైద్యనాధం "తలకి తగిలిన

దెబ్బమూలంగా చనిపోయేడు. చాలా రక్తం కారిపోయింది. మరణించి బహుశః నాలుగైదుగంటలు అయుంటుంది. కొంత పరీక్ష చేశాక మిగతా వివరాలు చెప్తాను.'' అన్నాడు.

"అంటే సింహాచలం కన్నా చాలా ముందు చనిపోయాడన్నమాట!" ఆలోచనాపూర్వకంగా అన్నాడు సుధాకర్. హఠాత్తుగా అతని బుర్రలో ఏదో మెరిసినట్లయింది. చప్పున జేబులోంచి ఓ కాగితం తీసి సార్జెంట్‌కి ఇచ్చేడు.

"అప్పలస్వామీ!"

''ఎస్సర్''

"నువ్వు వెంటనే డ్రాయింగ్‌రూంలోకివెళ్లు. శిరీషగార్నీ, మధుమూర్తినీ నేనిక్కడికి రమ్మన్నాననిచెప్పు. నువ్వు డ్రాయింగ్‌రూంలోనే వుండు. ఎవరూ గది దాటకుండా చూడు. గో—!"

''ఎస్సర్''

''వాట్ సార్జెంట్, అదేమిటో గ్రహించేవా?''

"ఏదో ఇంటి ప్లానులా వుందిసార్''

"అవును. అగి ఈ ఇల్లే. అందులో ఒక చోట × మార్క్ చేసేరు. అదేమిటో చెప్పుకో."

సార్జెంట్ విశ్వం క్షణంసేపు దాన్ని తీవ్రంగా చూసేడు. ఏదో తట్టినట్టయి హుషారుగా ఈల వేసేడు.

"సరిగా ఆ గుర్తు పెట్టినచోటే మనం వున్నాం."

"కరెక్ట్"

"ఎక్కడ దొరికిందిసార్, ఇది?"

"వరహగిరి జేబులో!" అని ఇన్‌స్పెక్టర్ సుధాకర్ అనేలోగానే శిరీషా, మధు అక్కడికి వచ్చేరు.

"శిరీషగారూ, ఆ వ్యక్తిని చూడండి. ఎవరో గుర్తు పట్టగలరా?"

"గుర్తు పట్టగలను. అతనే సలీమ్!"

"ఇతనేనా విందుకి రాని అతిథి?"

అవునన్నట్టు ఆమె తలాడించింది. చెవులకున్న రింగులు సమ్మోహనకరంగా మెరిసేయి.

"విందుకి ఈయన రాకపోతే ఆ సీట్లో మిమ్మల్ని కూర్చోపెడతున్నారా సింహాచలంగారు?" అన్నాడు సుధాకర్ మధుమూర్తిని చూస్తూ.

"అవును." అన్నాడు మధుమూర్తి.

"మోటార్ బైక్‌ని గుర్తు పట్టేరా?"

"సందేహం లేదు అదే. కాని ఇతన్నే సరిగా పోల్చలేకపోతున్నాను. చాలా స్పీడులో పోతున్నాడు......"

"అతను కావాలని మీకు డేష్ ఇవ్వబోయేడా?"

"అయివుండదు. తొందర్లో—అలా జరిగివుంటుందనుకుంటాను."

"సరే, శిరీషగారూ, ఈయనే సలీం అని మీకెలా తెలుసు?"

"ఏవో కంట్రాక్ట్స్ గురించి మాట్లాడ్డానికి ఇక్కడికోసారి వచ్చేరు ..."

"ఒక్కసారేనా?"

శిరీష తడబడింది

"ఆ...అవును ఒక్కసారే!"

"అయ్‌సీ...సరే, ఇక మీరు డ్రాయింగ్ రూంలోకి వెళ్లొచ్చు. అవసరమైతే మళ్ళీ కబురంపుతాను."

## 10

డైనింగ్ హాల్లోకి వెళ్ళబోయేముందు క్లోక్‌రూం దగ్గర ఆగేడు ఇన్‌స్పెక్టర్ సుధాకర్. లోపల పాపారావు సీరియస్‌గా వర్క్ చేసుకుంటున్నాడు. ఒక వేపు వరసగా ద్రాక్షరసం గాసులున్నాయి. ఓ పక్క రివాల్వర్ వుంది.

"పాపా, ఏమిటి కథ?"

"రివాల్వర్ మీద చాలా మంది ఫింగర్ ప్రింట్స్ వున్నాయి సార్"

"ఎవరెవరివో తెలిసిందా?"

"ఒక్కరిది మాత్రం తెలిసింది సార్, మిస్టర్ వరహగిరి."

"ఇంకా?"

"మెయిన్ స్విచ్ మీద ఎవరి వేలిముద్రలూ లేవుసార్. రుమాల్తోగానీ, గ్లోవ్స్‌తోగానీ ఆఫ్ చేసివుండాలి."

"ఇంకా?"

"ప్రస్తుతానికి ఇంతే సర్."

"గుడ్. ఏమైనా తేల్తే నాకు చెప్పు. కారీ ఆన్." అంటూ ఇద్దరూ డైనింగ్ హాలు మెట్లెక్కేరు. ఇన్‌స్పెక్టర్ సుధాకర్ లైబ్రరీరూం తలుపు తీసి లోనికి చూసేడు.

"నైన్‌రూం! ఒకటీ—రెండూ—మూడు—నాలుగూ—అయిదూ—ఆరు! ఆరు పుస్తకాల బీరువాలు. రెండు కిటికీలు ఓ కిటికీ దగ్గర టేబులూ! సార్జెంట్!"

"ఎస్సర్"

"వెంకటచలంగార్ని నే రమ్మన్నానని చెప్పు. మేము మాట్లాడ్తూవుంటే నువ్వో టేబులు దగ్గర నోట్‌బుక్‌తో కూర్చో...అండర్‌స్టేండ్?"

"ఎస్సర్"

"గుడ్ కారీ ఆన్!"

## 11

లైబ్రరీ గదిలోకి అడుగెట్టిన వెంకటచలంకి సార్జెంట్ విశ్వం తల కన్పించింది. గదికి మధ్యగా వున్న టేబులుదగ్గరున్నాడతను. కొంచెం ఎడం వేపుకి కళ్ళు తిప్పేసరికి ఇన్‌స్పెక్టర్ కన్పించేడు. సుధాకర్ కళ్ళు చాలా గంభీరంగా వున్నాయి. రెప్పవాల్చకుండా తీక్షణంగా వెంకటాచలాన్నే చూస్తున్నాడు.

"దయచేసి కూర్చోండి వెంకటచలంగారూ!"

వెంకటచలం కూర్చున్నాడు.

"ఇప్పుడు చెప్పండి. మీరు మీ మామయ్యకి విషం యిచ్చేరా?"

బల్లెంలాంటి ఆ ప్రశ్నకి వెంకటచలం నిర్ఘాంతపోయేడు.

"మైగాడ్...నే నివ్వలేదు."

"పోనీ మీరివ్వలేదనుకుందాం. ఒక వేళ మీరే యిచ్చివుంటే దానికి కారణం ఏమై వుంటుందంటారు?"

"మీ ప్రశ్న చాలా సిల్లీగా వుంది..."

"అంటే మీ వుద్దేశం? నా ప్రశ్నకి సమాధానం చెప్పడం మీకిష్టంలేదా?"

"ఎందుకులేదు. తప్పకుండా జవాబిస్తాను. ఏదైనా కారణం అంటూ వుంటే నాకు పిచ్చి పట్టిందన్నమాట?"

"అంతకన్నా వేరే కారణం ఏదీ వుండటానికి అవకాశం లేదన్నమాట. నే నిది నమ్మవచ్చునా?"

వెంకటచలం వెంటనే సమాధానం ఇవ్వలేదు. కాస్సేపు ఆలోచిస్తూ వుండి పోయేడు.

"అందర్లాగా మీరుకూడా మా మామయ్య వీలునామా గురించి ఆలోచిస్తున్నారన్నమాట"

"దానివల్ల మీ కేమైనా లాభిస్తుందను కుంటున్నారా?"




"ఒకానొకప్పుడనుకునే వాణ్ణి"

"ఇప్పుడో?"

"ఏమో నాకు తెలీదు. మావయ్యతో ఘర్షణ పడ్డాక విలునామా మార్చేడని విన్నాను...విందుకి ఆహ్వానిస్తూ అతను రాసిన వుత్తరం మీరు చదివేరుగా. మళ్ళీ తన మనస్సు మార్చుకున్నాడేమో అనుకున్నాను. ఇంకా ఏ విషయం తెలియందే మావయ్యకి విషమెందుకు యిస్తాను ఇన్‌స్పెక్టర్? మీరన్నట్టు ఒకవేళ నాకా వుద్దేశ్యమే వుంటే ఆ పని చేస్తానా చెప్పండి!"

కాస్సేపు నిశ్శబ్దం.

"మీరు ఆయనతో ఘర్షణ పడ్డానన్నారే, అదెప్పుడు. ఒక సంవత్సరం అయివుంటుందా?"

"అవును." అన్నాడు వెంకటచలం సందేహిస్తూ.

"దాని గురించి చెప్పడం మీకిష్టమేనా?"

"ఒకవేళ నాకిష్టం లేకపోతే–?"

"ఈ క్షణాన ఏ విషయమూ చెప్పమని మిమ్మల్ని బలవంతం చెయ్యలేను–"

"కాని–ఎప్పటికైనా మా నోటినుంచే చెప్పిస్తారు. మీ పద్ధతులు మీకున్నాయిగా. ఆల్‌రైట్. చెప్తాను వినండి. నా తల్లిదండ్రులు నా చిన్నప్పుడే చనిపోయేరు. అప్పట్నించీ మావయ్య ఇల్లే నా ఇల్లయింది. రెండేళ్ళకిందట అను

కుంటాను—వారిజ మావయ్యకి సెక్రటరీగా వచ్చింది. మొదట్లో ఆమె చేత టౌన్లోవున్న అఫీసులోనే వర్క్ చేయించేవాడు-"

"ఆఫీసు ద్వారకానగర్లో కదూ వుంది ?"

"అవును. అప్పుడప్పుడు వారిజ మా యింటికొచ్చేకూడా వస్తుండేది. రాత్రి పది గంటలవరకూ డిక్టేషన్లు యిచ్చేవాడు అవి టైపుచేసి ఏ పన్నెండు గంటలకో లేచేది. కొన్నాళ్ళకి మావయ్య వారిజకీ యింట్లోనే ఓ గది యిచ్చేడు..."

వెంకటచలం ఒక క్షణం సందేహంగా ఆగి మళ్ళీ ఇలా అన్నాడు.

"సారీ ఇన్‌స్పెక్టర్, నాకీ విషయాలన్నీ మాట్లాడ్డం ఇష్టంలేదు. చచ్చిన వాడెలాంటి వాడైనా అతని గూర్చి చెడు మాటాడ్డం బావుండదు"

"మీ బాధ నేనర్థం చేసుకున్నాను చలంగారూ! కాని ఈ మిస్టరీ విడదీయ డానికి మీరు కొద్దిగా సాయపడక తప్పదు."

"...ఈ ఇంట్లో వున్నన్నాళ్లూ వారిజ ఎప్పుడూ విచారంగా వుండేది. ఈ విషయం గ్రహించడానికి నాకెక్కువసేపు పట్టలేదు. శిరీషకూడా ఆమె బాగోగులు సరిగా చూసేది కాదు. అంటీ ముట్టనట్టూరుకునేది. ఆఫ్‌కోర్స్ మా మావయ్య ప్రవర్తనే అందుకు కారణం అనుకోండి..."హఠాత్తుగా కుర్చీ లోంచి లేచి కాస్సేపు అటూఇటూ పచారు చేసేడు

"ఒక రోజు వెక్కి-వెక్కి ఏడుస్తున్న వారిజ కన్పించింది. ఎక్కడో కాదు. ఇక్కడే! ఈ గదిలోనే! నేనప్పుడు ఏదో పుస్తకం కోసమని ఇక్కడికొచ్చేను. ఎంతగా అడిగినా కారణం చెప్పలేదు, ముందు కాని అదేవిటో నేను వూహించ గలిగేను. వారం రోజులు పోయేక అనుకుంటాను—ఏక్సిడెంటల్‌గా నేనో సంభా షణ విన్నాను. మావయ్య వారిజని బలాత్కరిస్తున్నాడు. తనకి లొంగకపోతే నల్లిని నలిపేసినట్టు నలుపుతానంటున్నాడు. ఆ క్షణాన ఆ రాక్షసుణ్ణి చంపేద్దా మన్పించింది. కాని, నేను అశక్తుణ్ణి. వెంటనే హాల్లోకి వెళ్ళి వారిజని మావయ్య బారినుండి తప్పించేను. మర్నాడే ఇద్దరం బెజవాడకి ప్రయాణం కట్టేం. అక్కడే మా వివాహంకూడా జరిగింది...అంతే!"

"వీలునామా సంగతి ?"

"నా పేరు అందులోంచి తీసేశానని తర్వాత మావయ్య నాకో వుత్తరం రాసేడు. దాన్ని వెంటనే చింపేసేననుకోండి. అయినా మా మావయ్య డబ్బు లేకపోతే బతకలేమా ఏంవిటి ?"

"అయితే బెజవాడలో మీకు ఉద్యోగం దొరికిందా ?"

"నా ఒక్కడికే కాదు. మా ఇద్దరికీ దొరికింది. నేనో ప్రయివేట్ కంపెనీలో మేనేజర్‌గా పనిచేస్తున్నాను. అందులోనే వారిజ టైపిస్టు. ఆఫ్‌కోర్స్ ఇంకో రెండు నెలల్లో ఆమెను మాన్పించేద్దామని చూస్తున్నాను. వస్తుత: వారిజ ఆరోగ్యం అంతగట్టిది కాదు..."

"అలాగా, మరో విషయం. శిరీషగారు ఎన్నాళ్ళనుంచీ యిక్కడుంటున్నారు ?"

"అదో పెద్దకథ. ఆవిడగారు మా మావయ్యకి ఏదో దూరపు బంధువునంటుంది. అవునోకాదో ఆ భగవంతుడికి తెలుసు !"

"నే వేసిన ప్రశ్న మర్చిపోయేరు-!"

"ఆఁ—అదా ? శిరీష దాదాపు అయిదేళ్ళనుంచీ యిక్కడే వుంటోంది."

"వేదాచలంగారికి సపర్యలు చేస్తూ వుంటుందా ?"

"ఆవిడగారి విద్యుక్తధర్మాల్లో అదొకటి."

"వేదాచలంగారికి పక్షవాతం వచ్చి ఎన్నాళ్ళవుతుంది ?"

"నేను పుట్టిందగ్గర్నుంచీ ఆయన అలాగే వుండేవాడు...మా మావయ్య ఇంట్లోంచి పారిపోయి తిరిగి వచ్చేటప్పటికి అతనికి పక్షవాతం వచ్చిందంటారు..."

"ఏఁవిటీ, మీ మావయ్యగారు ఇంట్లోంచి పారిపోయేరా ?"

"అవును, పద్నాలుగేళ్ళప్పుడు వెస్ట్‌బెంగాల్ వెళ్ళిపోయేడు. కొన్నాళ్ళు సింద్రీలోనూ, కొన్నాళ్ళు కలకత్తాలోనూ వున్నాడు..."

"ఇంటికి రాకుండా అలా ఎన్నాళ్లున్నారు ?"

"పదేళ్ళనుకుంటాను. ఇల్లంటే విరక్తి కలిగి పారిపోయేట్ట...అయాంసారీ... ఇదంతా అనవసరం అనుకుంటాను. కదండీ ?"

"నేననుకోను. అతనికి ఇంటిమీద విరక్తి కలగడానికి కారణమేఁవిటో మీకు తెలుసా ?"

వెంకటచలం సందేహిస్తున్నాడు.

ఇన్‌స్పెక్టర్ సుధాకర్ నిశ్చలంగా నిలబడ్డాడు. అతని మౌనం ఇన్‌స్పెక్టర్ పెదవుల్ని కదిపింది.

"మీరే విషయం చెప్పినా—ఈ మర్డర్ మిస్టరీ ఛేదించడంలో నాకు సహాయపడ్తారు. చెప్పండి మిస్టర్ చలం. సింహాచలంగారి స్వభావం ఎటువంటిది ?" అన్నాడు సుధాకర్.

"స్వభావం గురించి చెప్పాలంటే కొన్ని గ్రంథాలు రాయొచ్చు...తన మాటే తప్ప ఇంకొకరి మాట చెల్లనివ్వడు. తల్లయేది, తండ్రయేది తప్పుచేస్తే నోటికొచ్చినట్టు తిడ్తాడు. తన దగ్గరికెవరొచ్చినా పురుగుల్ని చూసినట్టు చూసి, ఈసడిస్తాడు. హేళనచేసి పైశాచికానందం పొందుతాడు."

"అతని చిన్నతనంలో తలిదండ్రులు కఠినంగా వుండేవారనుకుంటాను..."

"అతని తండ్రి–అంటే ముసలి వేదాచలంగారు చాలా కఠినంగా వుండేవాడట. అయితే కలకత్తానుంచి మావయ్య తిరిగొచ్చేసరికి పరిస్థితులు మారేయి. తండ్రికి పక్షవాతం. దించిన విజయధ్వజం ఎత్తేడు. ఇప్పటికీ ఓ విషయం తల్చుకుంటూ వుంటే నవ్వొస్తుంది. ఎందుకు లెండి, అదంతా ?"

"మిస్టర్ చలం ! మీరు చెప్పబోయే విషయం నాకు సహాయం చేస్తుందేమో ఒక్కసారి ఆలోచించండి. మీరేం చెప్పినా సర్దాకీ, ఆయనమీద కోపానికీ చెప్పరుగదా ! మీరు చెప్పే విషయం అమాయకుల మీదుండే అనుమానాన్ని తొలగిస్తుందేమో ! ఈ సమస్యని విడదీస్తుందేమో "మీ మావయ్య గురించి ఇంకేమన్నా చెప్పగలరా ?"

"అంతే, ఇన్‌స్పెక్టర్."

"సరే–డైనింగ్‌రూంలో లైట్లారిపోయేక మీ కదలికల్ని మా సార్జెంట్ వర్ణిస్తాడు. కరెక్టో కాదో చెప్పండి..." అని సుధాకర్ సార్జెంట్ విశ్వాన్ని చూసేడు.

"మిస్టర్ వెంకటచలం, లైట్లారిపోయేక అగ్గిపుల్ల వెలిగించేరు. అలివేలుమంగ తెలివితప్పి తనమీద పడగానే వెలుగుతున్న అగ్గిపుల్ల ఆరిపోయింది. అది అలివేలుమంగగారిమీద పడగానే ఆమె కేక వేసేరుఅవతలివేపు ఏదోకలకలంగా వుంటే సింహాచలంగారికీ అలివేలుగారికీ మధ్యనున్న తమ భార్యవద్దకు వెళ్ళేరు. అప్పటికి సింహాచలంగారు చనిపోలేదు. లైబ్రరీలో వున్నారు. చీకట్లో వారిజగారి భుజం మీద చెయ్యి వెయ్యగానే ఆమె కేకవేసేరు. సింహాచలం వచ్చేదాకా వెంకటచలంగారు వారిజగారి కుర్చీపక్కనిలబడ్డారు. అంతే గదండీ ?" అన్నాడు విశ్వం.

"అంతే. కాని చిన్న సవరణ. అలివేలుగారు పూర్తిగా తెలివితప్పిపోలేదు..."

"చిన్న మగత కమ్మిందన్నమాట !" అందుకున్నాడు ఇన్‌స్పెక్టర్ సుధాకర్.

"ఇక నేను పోవచ్చాండీ ?" అంటూ వెంకటచలం లేచేడు.




"ఒక్క ప్రశ్న—సలీమ్ ఎవరో మీకు తెలుసా?"

"ఆ పేరు ఇవాళ రాత్రే విన్నాను. ఇంతకుముందెప్పుడూ వినలేదు."

"అంతే. ఇంకొక చిన్న సహాయం చేయండి. మీ శ్రీమతి వారిజగారినోసారి ఇక్కడికి పంపించండి."

ఒక నిమిషం గడిచేక తలుపు దగ్గర అడుగుల చప్పుడు వినిపించింది. వచ్చింది వారిజకాదు. ఫింగర్‌ప్రింట్స్ ఎక్స్‌పర్ట్ పాపారావు. అతను చెప్పింది సుధాకర్ శ్రద్ధగా విన్నాడు. అతను చెప్పిన విషయాలు సంతోషమూ, ఆశ్చర్యమూ సుధాకర్‌కి ఒక్కసారే ఇచ్చేయి.

"వెరిగుడ్ పాపా. గుడ్‌వర్క్ ! నీగదిలోకి వెళ్లిపో. ఇంకేమన్నా టిట్‌బిట్స్ దొరుకుతాయేమో ప్రయత్నించు."

పాపారావు నిష్క్రమించిన కొద్దిక్షణాలికి వారిజ గదిలోకి అడుగెట్టింది.

## 12

"నన్ను రమ్మన్నారట..." అంది.

"అవును. అలా కూర్చోండి. మిమ్మల్ని ఎక్కువసేపు ప్రశ్నల్తో విసిగించన్లెండి."

ఇంతకు ముందు తన భర్త కూర్చున్న కుర్చీలోనే వారిజ ఆసీనురాలయింది. కూర్చున్నాక ఓసారి గదంతా కలయజూసింది.

"మీ భర్తగారు—ఇక్కడ మీరుచేసిన ఉద్యోగం గురించీ, అనుభవించిన కష్టాల గురించీ చెప్పేర్లెండి. బైదివే_మీకు బంధువు లెవరైనా వున్నారా ?"

"లేరు. ఎవరూ లేరు." అతనాప్రశ్న వేయడంలో గల అంతరార్థమేమిటా అని ఆలోచిస్తూ అంది వారిజ.

"మీ భర్తగారిలాగే మీరూ ఏకాకి అన్నమాట."

"అవును. అంచేతే నేను ఉద్యోగం చేయవలసిన పరిస్థితులు ఏర్పడ్డాయి."

"అలాగా. సాయం చేయడానికైనా స్నేహితులెవరూ లేరన్నమాట."

"ఉహూఁ."

"అయితే సింహాచలంగారు మిమ్మల్ని పెట్టేబాధల్ని ఒక్క వెంకటచలం గారికే చెప్పేరన్నమాట..."

అవునన్నట్టు వారిజ తలాడించింది.

"ఇంకెవ్వరికీ చెప్పలేదా ?"

"లేదు. ఎవరున్నారు గనుక ?"

"సలీమ్‌కి కూడా చెప్పలేదా ?"

ఇన్‌స్పెక్టర్ సుధాకర్ కళ్లు చురుగ్గా ఆమెనే గమనిస్తున్నాయి

హఠాత్తుగా ఆమె ముఖాన్ని భయం ఆవరించింది సుధాకర్ నవ్వేడు.

"నా ఉద్దేశ్యం సలీమ్ మీకు తెలుసా అని !"

"నాకు తెలీదు. ఇవాళ రాత్రివరకూ అతని పేరే వినలేదు.''

"సరెలెండి. మీరెప్పుడూ అతని పేరే వినలేదనుకుందాం. కాని ఒక్కసారి ప్రయత్నించండి...మీకు మంచి జ్ఞాపకశక్తి వుందా ?"

"అంతగా లేదు,"

"మంచి సెక్రటరీకి మంచి జ్ఞాపకశక్తి వుండాలే !"

"నేను మంచి సెక్రటరీనని మీకెప్పుడైనా చెప్పేనా ?"

"సరే. ఇది వినండి. అబ్దుల్‌సలీమ్, 'డియర్ మిస్టర్ సలీమ్'—'మైడియర్ సలీమ్'—'డియర్ అబ్దుల్'—అంటూ సింహాచలం ఎప్పుడేనా లెటర్స్ డిక్టేట్ చేశారా మీకు ?"

"లేదు."

"సరే—లైట్లారిపోయేక మీ చర్యల్ని మా సార్జెంట్ చదువుతాడు. విని—అవునో కాదో చెప్పండి. కమాన్ సార్జెంట్ ?"

"అలాగే సార్. శ్రీమతి వారిజ. సింహాచలంగారి పక్క కుర్చీలో కూర్చు

న్నారు. తర్వాత కుర్చీలో కృష్ణ భగవాన్లుగారు. వెంకటచలంగారు చీకట్లో భుజంమీద చెయ్యి వెయ్యగానే కెవ్వుమని కేక వేసేరు. సింహాచలంగారు కొవ్వొత్తితో లైబ్రరీ గదినుంచి వచ్చేవరకూ అలాగే కుర్చీలోకూర్చున్నారు." అన్నాడు సార్జంట్.

"అంతేనంటారా" అన్నాడు ఇన్‌స్పెక్టర్ సుధాకర్ వారిజను పరిశీలనగా చూస్తూ.

వారిజ యెందుకో సందేహించింది.

"మాకు చెప్పబడిన వివరాలన్నీ మేం నోట్ చేసుకున్నాం. ఇంకేమన్నా విశేషాలుంటే చెప్పండి చేరుస్తాం."

"అంతే. అది కరెక్ట్ ! మరింకేం లేదు"

వారిజను మరొకసారి నిశితంగా చూసేడు ఇన్‌స్పెక్టర్ సుధాకర్.

"మీరు కూర్చున్నప్పుడు మీ చేతులు ఎక్కడున్నాయి ?"

"అంటే——?"

"అంటే...టేబులు మీదా, ఒళ్లోనా ?"

"ఒళ్లో"

"సింహాచలంగారు వచ్చేదాకానా ?"

"మీరనేదేంవిటి ?"

"మీరు చెప్తేనే బాగుంటుంది. ఒక్కవిషయం మాత్రం నేను చెప్పగలను. మా వేలిముద్రల నిపుణుడు సింహాచలంగారి గ్లాసు గురించి ఓ విశేషాన్నిప్పుడే అందించేడు."

వారిజ ముఖం అకస్మాత్తుగా మారింది. కత్తివాటుకి నెత్తురు చుక్కయినా వుండదేమో ! కుడిచేయి పిడికిలి గట్టిగా బిగించింది.

"మీరనేది——నా వేలిముద్రలు దానిమీద వున్నాయనా ?...ఛ...ఛ...నేనెంత ఫూల్‌ని"

"చెప్పండి. ఏం చేశారు మీరు ?"

ఈసారి సుధాకర్ కంఠంలో కాఠిన్యం ధ్వనించింది.

"ఆ సంగతి మొదటే చెప్దామనుకున్నాను. కాని —ఎంచేతో చెప్పలేక పోయేను. ఇప్పుడు నేను నిజం చెప్పినా మీరు నమ్మరు !"

"మీరిప్పుడు చెప్పబోయేది నిజమే అయితే——మీరన్న అపనమ్మకానికి ఆస్కారమే లేదు. డోంట్ వర్రీ. చెప్పండి."

"నేను చెప్పేది నిజమే ఇన్‌స్పెక్టర్. విపరీతమైన భయానికి లోనయ్యేను. అంచేతే నేనా విషయం చెప్పలేకపోయేను. ఇప్పటికీ నన్నా భయం వదల్లేదు."

"మీరతని గ్లాసులో విషం కలిపేరా ?" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"లేదు !"

"ఆ పక్షంలో మీరు భయపడాల్సిన అవసరమే లేదు. ఇటువంటి సందర్భాలలో ఇలా జరగడం చాలా సహజం. అంతమాత్రంచేత పోలీసులు అమాయకుల్ని అనుమానిస్తారా చెప్పండి ?"

"నే చెప్పేది నిజం. అంతా చెప్పేస్తున్నా. దయచేసి నన్ను మాత్రం అపార్థం చేసుకోకండి. అలివేలు మంగగారి వాచ్‌వేపు చూసేనని చెప్పేనుగా."

"అవును."

"ఆ తర్వాత నాలుగు నిమిషాలకే అనుకుంటాను లైట్లుపోయేయి ... మీకు తెలుసు, మేం ఎలాంటి పరిస్థితిలో వున్నదీనూ. ఈ నరకంనుంచి ఎప్పుడు బయటపడ్తాంరా భగవంతుడా అన్పించింది. అలివేలుగారి వేళ్ళు వణకటం, చెయ్యి తొట్రుపడటం నేను గమనించేను—అప్పుడే. లైట్లుపోయేయి. సింహాచలంగారి గ్లాసు అలివేలుగారి చేతికి దగ్గరసా వుంది. ఒకవేళ ఆమె చెయ్యి తగిలి ద్రాక్షరసం ఒలికిపోతుందేమోనన్న భయంతో ఆ గ్లాసుని కొంచెం ఎడంగా పెట్టేను. అంతే. నాలో ఇంకే దురుద్దేశమూలేదు. నన్ను నమ్మండి." అంది వారిజ.

"మీ పరిస్థితుల్లో వున్న ఎవరైనా అలాగే చేస్తారు. అది చాలా సహజం." అన్నాడు సుధాకర్.

"నన్నర్థం చేసుకున్నందుకు చాలా థాంక్స్- ఇక నేను పోవచ్చునా ? కడుపులో తిప్పుతున్నట్టుగా వుంది..."

"ఒక్క క్షణంలో మీరు వెళ్ళొచ్చు. మరొక ప్రశ్నకి మాత్రం మీరు సమాధానమిస్తే చాలు. మీకిష్టమైతేనే— !" అన్నాడు సుధాకర్ తీక్ష్ణంగా ఆమెను పరికిస్తూ.

"ఏమిటది ?" కొంచెం విసుగు ధ్వనిస్తోన్న కంఠంతో అంది వారిజ.

"మీ భర్తగారు అగ్గిపుల్ల వెలిగించిన కొద్దిపాటికాలంలోనూ మీరేం చూశారో చెప్పండి. అలివేలుగార్ని గాని చూసేరా ?"

"చూసేను."

"ఏం చూసేరు ?"



"ఏం చూసేనో సరిగా చెప్పలేను."

"ఆవిడ చేతుల్ని గాని చూసేరా ?"

వారిజ మౌనం ఇన్‌స్పెక్టర్ సుధాకర్‌లో అనుమానం రేపింది. అయినా తమాయించుకున్నాడు. ఆమె నోటంటే నిజం బైటపెట్టించాలనుకున్నాడు.

"అయితే అది నిజమేనన్నమాట ! అలివేలుగారి చేతులు సింహాచలంగారి గ్లాసు దగ్గరున్నాయి, ఏం ?"

"లేదు." దాదాపు కోపంగానే అంది వారిజ—"ఎవరు చెప్పారు మీకు ?"

"ఎవరూ చెప్పలేదు. అలివేలుగారి చేతులెక్కడున్నాయి మరి, చెప్పండి !"

"నాకు గుర్తులేదు. ఆc ... ఆc ... వుంది. ఆమె చేతులు టేబులు మీదున్నాయి. కాదు టేబులు కొనల్ని పట్టుకుంటోంది. సింహాచలంగారి గ్లాసు దగ్గరగా అవి లేవు." అంది వారిజ తడబడ్తూ.

"సరే—ఇంకెవర్నయినా గమనించేరా ?"

"శిరీషను మాత్రం చూసేను."

"ఆమేం చేస్తున్నారు ?"

"లైబ్రరీ గదివేపు వెళ్తోంది. మావారు అగ్గిపుల్ల వెలిగించగానే ఆమె ఆగింది. అప్పుడామె మా వేపు తలతిప్పడం నాకు బాగా గుర్తుంది."

"ఆ తర్వాతే కదండీ, రివాల్వర్ పేలింది ?"

"అవును."

"ఎటువేపు పేలిందో మీరు చెప్పగలరా ?"

"శిరీష వేపునుంచి మాత్రం రివాల్వర్ పేలలేదని నిశ్చయంగా చెప్పగలను."

"థాంక్యూ మిసెస్ వారిజా. అంతే. ఇక మీరు వెళ్ళిపోవచ్చు. మీరు డ్రాయింగురూంలోకి వెళ్ళి కృష్ణభగవాన్లుగారిని నే రమ్మన్నానని చెప్పండి."

వారిజ నిశ్శబ్దంగా బయటికి నడిచింది.

కాసేపటికి ఎవరో బరువుగా నడుస్తున్న చప్పుడు నడవాలో విన్పించింది.

## 13

బరువుగా అడుగులేసుకుంటూ కృష్ణభగవాన్లు లైబ్రరీ గదిలోకి అడుగెట్టేడు. ముఖంనిండా ఓ రకమైన భయం, అసంతృప్తి స్పష్టంగా కన్పిస్తున్నాయి.

"ఇది నిజంగా చాలా భయంకరమైన సంఘటన. దీనిమీద మీ అభిప్రాయం ఏమిటో తెలుసుకోవాలని వుంది కృష్ణభగవాన్లు గారూ ?''

కృష్ణభగవాన్లు ఒక్కసారిగా ఆశ్చర్యపోయేడు. ఇన్‌స్పెక్టర్ సుధాకర్ యింత మృదువుగా మాట్లాడ్తాడని అతను కల్లోనేనా అనుకోలేదు.

"ఇన్‌స్పెక్టర్‌గారూ, ఈ విషయంలో ఏం చెప్పాలో ఏం చెప్పకూడదో నాకు తెలిసిరావడం లేదు..."

"ఏం చెప్పాలని తోస్తే అది చెప్పండి. అంతే !"

"మీరేమనుకున్నా సరే—ఒక విషయం చెప్పాలన్పిస్తూంది...ఆ వరహగిరి వున్నాడే వాణ్ణి మాత్రం తేలిగ్గా వదిలిపెట్టకండి..."

"నిజమే, అతని ప్రవర్తన చాలా అనుమానాస్పదంగా వుంది. అంతే గదండీ ?'' అన్నాడు ఇన్‌స్పెక్టర్ సుధాకర్.

కృష్ణభగవాన్లు పెదాల్ని తడుపుకొన్నాడు. పిలకని మరోసారి గట్టిగా ముడివేసేడు.

"నిజం చెప్పాలంటే సింహాచలం చాలా పెద్దమనిషి అతని కింద పనిచేసే వాళ్ల శ్రమని గుర్తించి డబ్బిచ్చేవాడు..."

ఇన్‌స్పెక్టర్ సుధాకర్ కాస్సేపు ఆలోచించేడు. అమాయకుడిలా ఏమీ తెలీనట్టు వున్న ఈ భగవాన్లు గారి దగ్గర ఏదో రహస్యం వుంది. అదేమిటి ?

"ఆయన మీకు బాగా తెలుసా ?"

"ఓ చాలా బాగా తెలుసు. మూడేళ్ల కిందట నేనూ మా ఆవిడా ఈ వూరొచ్చి ఇక్కడ స్థిరపడ్డాం. ఆ సందర్భంలో సింహాచలంగారు గొప్ప సహాయం చేసేరు. దగ్గిర దగ్గిర రెండువందల ఇళ్లు పౌరోహిత్యానికి ఇప్పించేరు. మహా వుదారుడు."

"ఆయన చాలా భగవద్భక్తి కలవారులా వుందే."

"కాదు. నిజం చెప్పాలంటే పరమ నాస్తికుడు."

"మరి, మీ స్నేహం చాలా చిత్రంగా వుంది : మీరేమో పరమ ఆస్తికులు. ఆయనేమో నాస్తికుడు." అంటూ నవ్వేడు సుధాకర్.

"అదంతే లెండి. అదెప్పుడూ కూడా మా స్నేహానికి అడ్డురాలేదు".

"ఆయన స్వభావం ఎటువంటిదో చెప్తారా ?"

"అది నేనేం చెప్పగలను. వ్యాపార రీత్యా ఆయనెలా ప్రవర్తించేవారో నాకు తెలీదు. నాతో మాత్రం చాలా సరళంగా మాటాడేవారు. అసహాయులకి సహాయం చెయ్యడంలో ఆయనకి ఆయనే సాటి... ఇక నేను చెప్పగలిగేది ఏమీ వుండదనుకుంటాను ఇన్‌స్పెక్టర్ గారూ !"

అతని ఆత్రుతకి సుధాకర్ నవ్వుకున్నాడు.

"ఎందుకు లేదు భగవాన్లుగారూ, వుంది. మీరు వింటుకొస్తూ వెయ్యి రూపాయిలు తీసుకొచ్చేరు. అంత డబ్బు సాధారణంగా అనవసరంగా ఎవరూ దగ్గరుంచుకోరు......"

సుధాకర్ ప్రశ్నకి సమాధానం రాలేదు.

"మీరు పేకాట ఆడతారా-డబ్బుకి ?"

"ఉఁహూఁ, ఆడను."

"మరైతే అంత డబ్బు జేబులో ఎందుకుంచుకున్నట్టు ?"

"ఏదో సంఘానికి చందాకావాలని సింహాచలంగారన్నారు. అందుకోసం తెచ్చేను."

"ఏ సంఘం చెప్పండి..."

కృష్ణభగవాన్లు ఆలోచిస్తున్నాడు.

"క్విక్. వెంటనే చెప్పండి."

అనుకున్నట్టే సుధాకర్ కంఠంలోని తీవ్రత భగవాన్లు మీద బాగానే ప్రభావం చూపింది. ముఖంలోని రంగు తగ్గింది. కొద్దిగా చెమట కూడా పడ్తోంది.

"వేదోద్ధరణ సంఘం." నిద్రలో పలవరిస్తున్నట్టు అన్నాడు భగవాన్లు.

"అయ్‌సీ. నాస్తికుడైన సింహాచలంగారు వేదోద్ధరణ సంఘం ప్రారంభించేరు. దానికి మధ్య తరగతికి చెందిన మీరు వెయ్యి రూపాయిలు విరాళంగా ఇవ్వదల్చుకున్నారు... బాగుంది."

కృష్ణభగవాన్లు ముఖంలో మరికొంచెం రంగు తగ్గింది.

"ఇన్‌స్పెక్టర్ గారూ! మీరు నమ్మితే నమ్మండి. లేకపోతే మానండి. సింహాచలం ఆస్తికుడైతేనేం? నాస్తికుడైతేనేం? ఓ మంచిపని తలపెట్టేడు. వేదాల్ని, వేద పండితుల్ని గౌరవించే ప్రయత్నం చేసేడు... నా వంతు చందా వెయ్యి అడిగేడు. నేనెవర్నయితే అవుగాక. ఈ గావంచా వేషంచూసి—నేనేం డబ్బులేని వాణ్ణనుకుంటున్నారా? నాకీ వూళ్లో నాలుగు ఇళ్లున్నాయి. వాటిమీద అద్దెలొస్తాయి. పెళ్లిళ్ల సీజనొస్తే అయిదువేల దాకా సంపాదిస్తాను నాకేంలోటు...!"

"సరే-ఇంతవరకూ బాగానే వుంది. మరొక్క అనుమానం. పిస్టల్‌తో బెదిరించి మరీ ఈ డబ్బు సింహాచలం గారికి యిద్దామనుకున్నారా?"

అవాక్కయి నోరు వెళ్ళబెట్టేడు కృష్ణభగవాన్లు.

"మీ విరాళం స్వీకరించకపోతే సింహాచలంగార్ని పిస్టల్తో కాల్చి చంపుదామనుకున్నారా?"

"మీరేం మాట్లాడ్తున్నారో నాకు అర్థం కావటం లేదు," అని మాత్రం క్రిష్ణ భగవాన్లు అనగల్గేడు.

"నేను డైనింగ్ రూంలో పేల్చబడిన రివాల్వర్ గురించి మాట్లాడ్తున్నాను."

"కాని ఆ రివాల్వర్ నేను కూర్చొన్న కుర్చీదగ్గర దొరకలేదే!"

"రివాల్వర్ శిరీష కుర్చీ దగ్గర దొరకొచ్చు. కాని అది అక్కడికి ఒక వ్యక్తిచేత చేరవేయబడింది...దానిమీద మీ వేలి ముద్రలున్నాయి..."

కృష్ణ భగవాన్లు ముఖం తెల్లగా పాలిపోయింది. అంతలోనే ధైర్యం తెచ్చుకున్నాడు.

అబ్బాయికి ఉద్యోగమా? అదెంతపని మామా!
ఓ పదివేలు ఇలా పడేయ్! నే చూసుకుంటా!



"ఎలా నమ్మేది? నా వేలిముద్రలు మీరెప్పుడేనా తీసుకున్నారా? రివాల్వర్ మీదున్నవి నావేనని మీరెలా చెప్పగలరు."

కృష్ణభగవాన్లు ఇన్‌స్పెక్టర్ సుధాకర్ వూహించినట్టు తెలివితక్కువ వాడేంకాదు.

"మీ వేలిముద్రలు తీసుకోవల్సిన అవసరం లేకపోయింది. మాకు బహుశాగా మీ గ్లాసు ఆ పని చేసింది. మీ గ్లాసు మీదున్నవీ రివాల్వర్ మీదున్నవీ ఒకే రకం వేలిముద్రలు ఇప్పుడేమంటారు?"

"అదా సంగతి. ఏమో–ఇదంతా అసంభవం. ఇదేదో ట్రిక్కులా వుంది. ఇది నిజం కాదు. అబద్ధం......మీరుగాని నన్ను అనుమానిస్తున్నారా?"

"రివాల్వర్ మీదేనా?"

"కాదు!"

"దాన్ని మీరు వుపయోగించేరా?"

"లేదు" చూడండి ఇన్‌స్పెక్టర్‌గారూ! నేను చెప్పేది సావధానంగా వినండి. సింహాచలం విషప్రయోగం వలన చనిపోయేడు. అంతేగాని కాల్చిచం పబడలేదు. విషప్రయోగం జరిగింది. పంచభూతాల సాక్షిగా చెప్తున్నా. నేనతనికి విషం ఇవ్వలేదు. పోనీ రివాల్వర్‌తో కాల్చి చంపాలని అనుకున్నానే అనుకోండి.

అతనప్పుడు డైనింగ్‌రూంలో లేడు. ఇదుగో ఈ లైబ్రరీ గదిలో వున్నాడు. అప్పుడెందుకు రివాల్వర్ పేలుస్తాను ? ఇందులో ఏమేనా అర్థంవుందా మీరే చెప్పండి !!'' అంటూ ఒక్కసారిగా రేచేడు.

"నేనిక్కడ ఒక్క క్షణంకూడా వుండను. వుండలేను, మీ ఇష్టం వచ్చినట్టు చెయ్యండి. నమస్కారం !'' అంటూ కృష్ణ భగవాన్లు చరచరా వెళ్ళిపోయేడు.

''అతన్ని వెంటాడు విశ్వం. ఏంచేస్తాడో గమనించు. కాన్‌స్టబుల్ రహీంకి ఆ పని అప్పచెప్పు. వచ్చేప్పుడు ఈయనగారి శ్రీమతి ఆలివేలుని పిలువ్.'' అన్నాడు సుధాకర్.

సార్జెంట్ విశ్వం చప్పున లేచేడు.

"ఇతన్ని మరి ప్రశ్నించరా సర్ ?''

"ఊఁహూఁ. ప్రస్తుతం అనవసరం. ఇతని భార్యమీదే నాకిప్పుడు ఇంటరెస్టు!''

## 14

అలివేలూ, సార్జెంటూ లైబ్రరీ రూంలోకి వెళ్లేసరికి ఇన్‌స్పెక్టర్ సుధాకర్ టేబిలు పక్కని నిలబడి వున్నాడు. టేబిలు మీదున్న ధూళి అతన్ని ఆశ్చర్య పరచడమేగాక—కలవరపెడ్తోంది.

''రండి అలివేలుగారూ. ఇలా కూర్చోండి'' అంటూ సోఫా చూపించేడు ఇన్‌స్పెక్టర్ సుధాకర్.

''మిమ్మల్నో ప్రశ్న వేద్దామనుకుంటున్నాను. మీ ఆయన ఇవాళ రాత్రి తనతోబాటు ఒక రివాల్వర్ తీసుకొచ్చేరు. ఎందుకో చెప్పగలరా ?''

ఇన్‌స్పెక్టర్ సుధాకర్ ఆశించిన మార్పు అలివేలు ముఖంలో రాలేదు. తన అంచనా తప్పయినందుకు ఆశాభంగం పొందేడు.

''రివాల్వరా, అదేఁమిటి ?''

''మీకు తెలీదా ?''

"వారేమీ నాకు చెప్పలేదే!...లేదు—మీరు పొరబడి వుంటారు.''

"లేదు. అలివేలుగారూ, ఇవాళ పేల్చబడిన రివాల్వర్ ఖచ్చితంగా ఆయనదే !''

''అసంభవం, ఆ రివాల్వర్ అతనిది అవడానికవకాశం లేదు. ఆయనిక్కడికి రివాల్వరెందుకు తీసుకొస్తారు ?...ఆ రివాల్వర్ తనదేనని ఆయన చెప్పేరా ?''

"నాదేనని ప్రమాణం చేసేరు...!'' ఈ మాట అనే ముందు ఇన్‌స్పెక్టర్ సుధాకర్ తీవ్రంగా ఆలోచించేడు.

''అలాగా...''

"అవును, అంతేగాదు, దాన్ని పేల్చేనని గూడా చెప్పేరు. రివాల్వర్‌మీద అతని వేలిముద్రలు వున్నాయని చెప్పేనుగా!"

"నిజమా?''

''అందులో సందేహం ఏమీలేదు.''

అలివేలు సమాధానం ఇవ్వలేదు. ఏమన్నా ఆలోచిద్దామనుకున్నా బుర్ర ఖాళీ అయికూర్చుంది. విపరీతమైన భయంతో కుంచించుకు పోసాగింది. నుదుటి మీది స్వేదం ముత్యాల్లా మెరుస్తున్నాయి. ఆమె పరిస్థితిని చూసి ఇన్‌స్పెక్టర్ సుధాకర్ జాలిపడ్డాడు. కాని ఇలా కఠుగ్గా ప్రశ్నించక తప్పదు. తవ్వితేగాని బంగారం దొరకదు.

''కృష్ణ భగవాన్లు గార్ని బ్లాక్‌మెయిల్‌చేసి ఎవరో డబ్బు గుంజుతున్నారన్న సంగతి మీకెప్పుడు తెలిసింది?"

''పది పదిహేను రోజులవుతుంది...'' యాంత్రికంగా సమాధానమిచ్చింది అలివేలు.

''ఎన్నాళ్ళనుంచీ అతన్నిలా బ్లాక్ మెయిల్ చేస్తున్నారు?''

"మేమిక్కడికి వచ్చిన దగ్గర్నుంచీ''

''అంటే-"

''దగ్గర దగ్గర మూడేళ్ళవుతుంది.''

"మీ వారి రహస్యం సింహాచలం గారికెలా తెలిసింది?''

"ఏమో నాకు తెలీదు.''

"ఆ రహస్యం నేను కొద్దిగా వూహించేననుకోండి...అయితే అదేమిటో మీరు చెప్తే వినాలనుంది..." అన్నాడు.

అలివేలు ఇబ్బందిగా ఇన్‌స్పెక్టర్నీ, సార్జెంట్‌నీ చూసింది.

"మీకు తెలుసన్నారుగా, మరింకెందుకు?"

''తెలుసనుకోండి. కాని వూహాగానంతో కేసు సాల్వ్ చెయ్యడంకూడా కష్టమే గదా. అదీగాక చట్టం అనుమతించే ప్రశ్నలే నేను వెయ్యగలను గాని దాన్ని అతిక్రమించలేను. ఏమంటారు? ఆఁ—సార్జెంట్! కిందవంటగదిలోకెళ్ళి కాన్‌స్టబుల్ అప్పలస్వామిని చూడు. ఏఁవైనా విశేషాలున్నా యేమో కనుక్కో?''

"అలాగే, సర్ !" అని నిశ్శబ్దంగా లైబ్రరీ గది బైటకి నడిచేడు.

"మీరు చాలా తెలివైన వారేగాక దయగలవారుకూడాను" అంది అలివేలు సార్జెంట్ వెళ్ళిపోగానే.

"నేను కృష్ణభగవాన్లుగారి భార్యని కానని మీకు తెలుసా ?''

"తెలీదు...చెప్పండి !"

''మాది కృష్ణాజిల్లా. మా ఆయన కంట్రాక్టులూ అవీ చేసి లక్షలు గడించేరు. పాపం కుడిచేత్తో, పుణ్యం ఎడంచేత్తోనీ ఒకేసారి చేయకల సమర్థుడాయన. మహారసికుడు. ఇద్దరు ముగ్గుర్ని వుంచుకోవడమేగాకుండా గౌరవ కుటుంబాల్లోని ఆడవాళ్ళనికూడా పాడుచేసేవాడు. మళ్ళీ భగవద్భక్తి. వారానికోసారి సత్యనారాయణవ్రతం చేయించేవాడు ... కృష్ణభగవాన్లుగారు మా యింటి పౌరోహితుడు...ఓ రోజు ఇద్దరంకలిసి ఇక్కడికి వచ్చేసేం...అంతే."

''ఈ విషయం సింహాచలంకి తెలిసింది. మీ భర్తగారికి మీ వునికిని చెప్తానని బెదిరించసాగేడు...''

''అవును."

"మళ్ళీ డబ్బు తెమ్మన్నారా ?"

''అవును. అందుకే ఆయన వెయ్యిరూపాయిలు తెచ్చేరు ... ఒక విషయం మాత్రం నిజం...సింహాచలంగారు విషప్రయోగంవల్లనే చంపబడ్డారు ! కాల్చి చంపబడలేదు !"

"నిజమే, నేనొప్పుకుంటున్నాను. నేననేదేమిటంటే సింహాచలంగారు కాల్చి చంపబడటానికికూడా అవకాశం వుందీ—అని !" అన్నాడు ఇన్‌స్పెక్టర్ సుధాకర్.

''ఫలానా వ్యక్తికి హత్య చెయ్యడానికి అవకాశం వుందని మీకు తోస్తే వాళ్ళని అరెస్టు చేస్తారా ఇన్‌స్పెక్టర్‌గారూ ?"

''హత్య చేయడం—ఎంత నేరమో, అది చెయ్యాలనుకోవడం—అనుమతి లేకుండా ఆయుధాలు దగ్గర వుంచుకోవడం కూడా అంత నేరమే !"

అలివేలు నివ్వెరబోయింది.

తర్వాత లైట్లారిపోయేక మీరేం చేసేరో చెప్తారా ?"

''ఏం చేసేను ? ఏమీలేదే. తీవ్రంగా భయపడ్డాను. గదిలోలాగే నా బుర్ర కూడా చీకటిమయం అయింది. కొంచెం తల తిరుగుతున్నట్టు అన్పించింది. అగ్గిపుల్ల వెలిగించిన శబ్దంకూడా నన్ను ఉలిక్కిపడేట్టు చేసింది. అదో పీడకలలా




తోచింది. అగ్గిపుల్ల వెలిగించిన వెంకటచలంగారి మీద తూలిపడ్డాను. అగ్గిపుల్ల ఆరిపోయింది...మళ్ళీ సింహాచలంగారు కొవ్వొత్తితో గదిలోకి ప్రవేశించేవరకూ ఏం జరిగిందో నాకు గుర్తులేదు."

"రివాల్వర్ ప్రేలడం మీరు విన్నారా ?"

"లేదు. నా చెవులు గింగుర్లెత్తిపోయేయి. మైకంలా కమ్మేసింది.''

"సరే —వెంకటచలంగారు అగ్గిపుల్లి వెలిగించేరన్నారుగదా... ఆ కొద్దిపాటి వెలుగులోనూ మీరేదేనా గమనించేరా ?"

"లేదు. ఏమీలేదు."

"అంతేనంటారా ?"

"అవునంతే. నేనేం చూళ్లేదు.''

"సింహాచలంగారికి అవతలపక్క ఎవరు కూర్చున్నారు ?"

అలివేలు కొంచెం చలించింది. పొడిగా దగ్గింది.

"మీకు తెలిసిన విషయాలే నన్నెందుకు అడుగుతారు ఇన్స్పెక్టర్ ?"

"వారిజ — సింహాచలంగారి గ్లాసుని ముట్టుకుందని నాకు తెలుసు. అంతేకాదు, దాని స్థానంకూడా మార్చేరు. మీకేమేనా దీనిగురించి తెలుసేమో అనడిగేను.''

"వారిజ ఎందుకలా చేసింది ?''

"మీరేమీ వూహించలేరా ?" ఎదురు ప్రశ్న వేసేడు ఇన్‌స్పెక్టర్ సుధాకర్.

తలుపు తీసిన చప్పుడు అలివేలు వాక్ప్రవాహాన్ని ఆపింది. గుమ్మందగ్గర సార్జెంట్ విశ్వం నిలబడి వున్నాడు. "గ్రౌండ్స్‌లో ఏదో గొడవగా వుంది. మీరొస్తారా సార్ ?"

అంతలో కింద వరండామీద ఎవరో పరుగెడ్తోన్న చప్పుడైంది. విశ్వం తలుపేసి కిందికి వెళ్ళిపోయేడు.

"దయచేసి వెంటనే డ్రాయింగ్‌రూంలోకి వెళ్ళిపోండి అలివేలుగారూ !" అని విశ్వం వెనకాల నడిచేడు ఇన్‌స్పెక్టర్ సుధాకర్.

## 15

డ్రాయింగ్‌రూంలో దక్షిణం వేపున్న పెద్ద కిటికీ ముందు లింగస్వామికూర్చున్నాడు. కిటికీ కున్న ఎర్రని నైలాన్ తెరలు గాలికి అటూయిటూ కదుల్తోన్నాయి. భవనం ముందున్న పూలతోట కిటికీలోంచి కన్పిస్తూంది. అస్పష్టమైన చంద్రకాంతిలో పల్చటిగాలులకు తలలూపుతూన్న పూలమొక్కల్ని తదేకంగా చూస్తున్నాడు లింగస్వామి.

చూస్తున్నవాడల్లా హఠాత్తుగా ఒక్కసారి లేచినిలబడ్డాడు. 'ఏయ్ః' అంటూ బిగ్గరగా కేకేసేడు.

డ్రాయింగ్‌రూంలో వున్న వాళ్ళందరి కళ్ళూ లింగస్వామి వేపు నిలిచేయి.

"అదుగో—ఆ పొదల మాటున ఎవరో వున్నారు. పట్టుకోండి. క్విక్. తొరగా—" అన్నాడు గట్టిగా కిటికీలోంచి అటే చూస్తూ.

ఆ గది గుమ్మం దగ్గర కాన్‌స్టబుల్ రహీం నిలబడి వున్నాడు. లింగస్వామి మాటలు విని రహీం చూద్దామని కిటికీ దగ్గరికి రాబోయేడు. "నో. అతన్ని పట్టుకో. అతన్దగ్గిర కత్తికూడా వున్నట్టుంది. కమాన్ మధుమూర్తీ — ఆ వెధవని పట్టుకుందాం..." అన్నాడు లింగమూర్తి వీరావేశంతో. కాన్‌స్టబుల్ రహీం ఒక్కక్షణం సందేహించేడు. అప్పటికే లింగస్వామీ, మధుమూర్తీ పందెపుగుర్రాల్లా గుమ్మంవేపు పరుగెత్తేరు. చేసేది లేక రహీం వాళ్ళ వెనకే నడిచేడు. మిగతా వాళ్ళుకూడా ఆ ముగ్గుర్నీ అనుసరించేరు. అనుసరించడమంటే ఆఖరిగంట కొట్టిన బడిపిల్లల్లా పరుగెత్తడం అన్నమాట !

అలివేలుమంగ గదిలోకి వచ్చేప్పటికి అందులో ఇద్దరే వున్నారు. వారిజ. వరహగిరి.

చిరువెలుగులో అందరూ అటూ ఇటూ గురితప్పిన బాణాల్లా పరుగెడ్తో వుంటే—కృష్ణభగవాన్లు వాళ్ళందర్నీ చూస్తూ ఓ పొద పక్కని సైన్యాధిపతిలా నిలబడ్డాడు. అదే సమయంలో డిటెక్టివ్ ఇన్‌స్పెక్టర్ సుధాకర్ అతని ముందు నిలబడ్డాడు.

"ఏఁవిటిదంతా ?" అన్నాడు సుధాకర్.

"అక్కడెవడో దాక్కున్నాడు—వాణ్ని పట్టుకుంటున్నాం..." అన్నాడు కృష్ణభగవాన్లు ఇంకా అటే చూస్తూ.

"అలాగా. యూ గో బేక్ ! ఈ ఇల్లు ఆఖరికో పిచ్చాసుపత్రిలా తయారవడం మాకిష్టంలేదు."

ఓ క్షణం ఇన్‌స్పెక్టర్ సుధాకర్ని నిర్వికారంగా చూసి లోపలికి జారుకున్నాడు కృష్ణభగవాన్లు.

ఇన్‌స్పెక్టర్ సుధాకర్ తన ముందున్న తోటని చూసేడు. చంద్రుని వల్చని కాంతిలో ఎంతో అందంగా కన్పిస్తున్నాయి పూలమొక్కలు. కొన్నిచోట్ల ఏవేవో పొదలు గూడా వున్నాయి. అతనికి ఫర్లాంగు దూరంలో మర్రిచెట్టు ఒకటుంది. అంతవరకూ హాయిగా నిద్రోతున్న పక్షిసంతతి ఒక్కసారిగా లేచి గోలగోల పెడ్తోంది. అటే చూస్తున్న సుధాకర్‌కి నురుగులు కక్కుకుంటూ వస్తూన్న రాజారావు కన్పించేడు.

"ఏం జరిగింది ? క్లుప్తంగా చెప్పండి. క్విక్."

"డ్రాయింగ్రూం కిటికీలోంచి లింగస్వామి ఎవర్నో చూసేడు. మేం అతని కోసం చూస్తున్నాం."

అంతలో ఎవరో పక్కపొదలోంచి పరుగెత్తినట్టయింది. మధుమూర్తి 'మర్రిచెట్టు మొదట్లో ఎవరో వున్నారు...' అంటూ పరుగెత్తిపోయేడు.

సుధాకర్, రాజారావు అతను వెళ్ళినవేపే నడవసాగేరు. దారి గతుకులు గతుకులుగా వుంది. రెండుసార్లు రాజారావు దాదాపు నేలమీద పడ్డంత పని చేసేడు. మర్రిచెట్టు ఇంకో మూడు గజాల దూరంలో వుంది. చిరుచీకట్లో తడుముకుంటూ నడుస్తూన్న రాజారావు బోర్లపడ్డాడు.

'అమ్మా' అనుకుంటూ లేచిన రాజారావు కిందికి చూసేడు. మధుమూర్తి ! నేలమీదపడి వున్నాడు.

"గుడ్‌గాడ్, ఇదేమిటి" అని అరిచేడు.

ఇన్‌స్పెక్టర్ సుధాకర్ మోకాళ్లమీద కూర్చుని మధుమూర్తిని చూసేడు.

తెలివి తప్పిపోయేడు. తలమీద జిగటగా వుంది. అదేమిటో చప్పున చూసేడు సుధాకర్.

"కొంపదీసి...?' అంటూ అర్థోక్తిలో ఆగిపోయేడు రాజారావు.

అదేమీలేదన్నట్టు తలని అడ్డంగాతిప్పేడు ఇన్‌స్పెక్టర్. 'ఎవరో తలమీద బలంగా దెబ్బకొట్టేరు...'

అంతలో 'ఏయ్...ఆగూ...' అన్న కేక విన్పించింది. లింగస్వామి లేడి పిల్లలా పొదలమధ్య గెంతుతూ భవనం ముఖద్వారంవేపు పరుగెడుతున్నాడు. కొన్ని క్షణాలు పోయేక ఓ కాన్‌స్టబుల్ అటువచ్చేడు. మధుమూర్తిని చూస్తూనే—'అయ్యబాబోయ్, నెంబర్ త్రీయా ?' అన్నాడు.

"షటప్." అన్నాడు సుధాకర్. రాజారావుని చూస్తూ "చూడండి మిస్టర్ రాజారావ్, ఈ పద్ధతి నాకు నచ్చలేదు. టూ మెనీ అమెచూర్స్ ! మీ అందర్నీ ఇలా బైటికెవరు రమ్మన్నారు !"

ఇన్‌స్పెక్టరు అలా అనడం రాజారావుకేం నచ్చలేదు. కాని కిక్కురు మన్లేదు.

"వినండి, రాజారావుగారూ. మీరందరూ తక్షణం డ్రాయింగ్ హాల్లోకి వెళ్ళిపోవాలి. ఏమైనా అభ్యంతరాలుంటే నాకు చెప్పుకోవచ్చు. నా చర్యలన్నింటికీ నేను పూర్తిబాధ్యత తీసుకుంటున్నాను. లింగస్వామిగారూ దయచేసి నడవండి. అందర్నీ లోపలికి తీసుకెళ్లండి."

ఇన్‌స్పెక్టరలా అనగానే లింగస్వామి, రాజారావు ఇంటివేపు నడవడం ప్రారంభించేరు.

"డాక్టర్ని వెంటనే రమ్మను. క్విక్." అన్నాడు సుధాకర్ కాన్‌స్టబుల్ని చూసి.

"యస్సర్" అంటూ పరుగెత్తేడు కాన్‌స్టబుల్.

రెండు నిమిషాల్లోనే డాక్టర్ వైద్యనాథం అక్కడికి చేరుకున్నాడు. డాక్టరూ కాన్‌స్టబులూ వచ్చేసరికి ఇన్‌స్పెక్టర్ సుధాకర్ మధుమూర్తికి 'ఫస్టెయిడ్' చేస్తూ కన్పించేడు.

"నాపని మీరా చేసేస్తున్నారూ..." అని ఆదోరకంగా గునిసేడు.

"ఎక్కువేం చేయలేదులెండి. నాకో విషయంచెప్తే చాలు...చావడానికి సిద్ధంగాలేడని చెప్తేచాలు...నే వెళ్లిపోతాను." అన్నాడు సుధాకర్.

ఆ రోజులో తనకెదురైన మూడో కేసుని చూస్తూ విచిత్రంగా కనుబొమలు చిట్లించేడు డాక్టర్ వైద్యనాథం.

''పేషెంట్ 'స్టేట్ ఆఫ్ స్టూపర్'లో వున్నాడు. కొన్ని నిమిషాల్లో తెలివి రానూవచ్చు. లేదా 'కోమా'లోకి ప్రమాదించనూవచ్చు. పేరు తెలియని ఒకానొక బలమైన వస్తువు తలమీద పడి—బ్రెయిన్ డిస్టర్బ్ అవడంతో ఇతనికీ స్థితి సంభవించింది. గాట్ దట్ ఇన్స్పెక్టర్ ?!''

## 16

యథాప్రకారం డిటెక్టివ్ ఇన్స్పెక్టర్ సుధాకర్, సార్జెంట్ విశ్వం ప్రైవేట్ రూంలో కూర్చున్నారు

తలుపు చప్పుడైంది.

'కమిన్' అని సుధాకర్ గొంతు విన్పించగానే రాజారావు లోపలికి వచ్చేడు.

"జరిగిన విషయాలన్నీ మీకు రిపోర్ట్ చేద్దామనొచ్చేను." అన్నాడు.

"ఏఁవిటా రిపోర్ట్ ? అందరూ డ్రాయింగ్ రూంలోకి వచ్చేరా ?"

"లింగస్వామి తప్ప—అందరూ !" అని సమాధానమిచ్చేడు రాజారావు.

"అతనెంచేత రాలేదు ? మీకు కనిపించలేదా ?"

"కన్పించకపోలేదు. కన్పించేడు. కాని అతని మనస్తత్వమెలాంటిదో మీకు తెలుసుగా ఇన్స్పెక్టర్. నామాట వినాల్సిన అవసరం లేదని కసిరికొట్టేడు. మిగతా అందర్నీ రూంలోకి పిల్చి—కాన్స్టబుల్కి చెప్పేను."

"ఆ కాన్స్టేబుల్కి లింగస్వామి గురించి చెప్పేరా ?"

''అఫ్కోర్స్. చెప్పాన్లెండి."

"సరే—ప్రస్తుతానికా విషయం అలావుంచి—దీనిమీద మీ అభిప్రాయం చెప్పండి..." అన్నాడు సుధాకర్ రాజారావుని సూటిగా చూస్తూ.

"దేనిమీద—ఇప్పటికి మూడయ్యేయి.''

"లేటెస్టు మిస్టరీ—మర్రిచెట్టు మొదట్లో జరిగిన సంఘటన గురించి.''

"దానిగురించి నాకేమీ తెలీదు.''

''రైట్. 'సలీమ్' గురించో ?"

"అసలా సలీమెవరో నాకు తెలీదు."

"ఏమీ తెలీదా ?"

"పెరట్లో ఇటుక కుప్పల మధ్య అతను పడివుండడం తప్ప—ఇంకేమీ తెలీదు."

"మర్రిచెట్టు మొదట్లో పడివున్న మనిషి—సలీమ్ ఆస్థితిలో పడివుండటానికి బాధ్యుడేమో—మీరూహించగలరా ?"

"మధుమూర్తెవరో—సలీమ్ ఎవరో నాకుతెలీదు. అస్సలు తెలీదు. మరలా ఇప్పుడు వారిద్దరిమధ్యా ఏఁవిఁటేవిఁటి వున్నాయో నాకెలా తెలుస్తుంది ?"

సుధాకర్ చిన్నగా నవ్వేడు. "ఆల్‌రైట్. అసలు పాయింట్‌కి వద్దాం. సార్జెంట్, లైట్లారిపోయేక చీకట్లో రాజారావుగారి మూవ్‌మెంట్సు చదువు. అది రైటో కాదో వారిప్పుడు మనకి చెప్తారు."

రెడీగా వున్న సార్జెంట్ శివం చప్పున పేజీలు తిరగేసి ఓచోట ఆగేడు. ఆగి గబగబ చదవడం ప్రారంభించేడు.

"మిస్టర్ రాజారావు. అగ్గిపుల్ల ఆరిపోయేవరకూ ఏఁవీఁ చెయ్యలేదు. అంతలో కుర్చీలు కదిలినట్లయింది. అప్పుడే పిస్టల్ పేలింది. అంతలో సింహాచలంగారు లైబ్రరీ రూంలోంచి కొవ్వొత్తితో వచ్చేరు...కరెక్ట్ సర్ ?"

"ఎస్. అంతే : కాదు. కాదు. పొరబాటను కుంటా. శివకోటి అతని సీట్లోనే వున్నాడు. తర్వాత వెంకటచలం, శిరీష. వరహగిరి టేబుల్ కింద వున్నారు."

"ఎస్." అన్నాడు సార్జెంట్ విశ్వం.

"శివకోటి సీట్లో లేడని మొదట ఎందుకనుకున్నారు ?

ఇన్‌స్పెక్టర్ సుధాకర్ ఆ ప్రశ్న వెయ్యగానే రాజారావు కొంచెం గాభరా పడ్డట్టు కన్పించేడు.

"ఎంచేతో—అలా అన్పించింది."

"కారణం లేకుండా ఏదీ అన్పించదు. ఒక్కసారి ఆలోచించండి... సరిగ్గా గుర్తుకి తెచ్చుకోండి. ఓ క్షణంపాటు శివకోటి కుర్చీలో వుండివుండడు. వెంటనే అతను కూర్చుని వుంటాడు."

"ఏమో అయివుండొచ్చు."

"అతని కుర్చీ సరిగ్గానే వుందా ?"

"ఓ యెస్."

"అతనెలా కూర్చుని వున్నాడు ? సరిగా కూర్చుని వున్నాడా... లేక అడ్డ దిడ్డంగా కూర్చుని వున్నాడా ?"

"సరిగానే కూర్చుని వున్నాడనుకుంటా. నిర్ఘాంతపోతూ లైబ్రరీరూం వేపు చూస్తూ కూర్చున్నాడు."




"సర్లెండి. సింహాచలంగారి పక్క సీటే గదా మీది? అతని ద్రాక్షరసం గ్లాసు మీ చేతికి ఎంతదూరంలో వుంది?"

సుధాకర్ ప్రశ్నలోని అంతరార్థం రాజారావుకి అర్థమైంది.

"మిస్టర్ ఇన్‌స్పెక్టర్. నేనా పని చెయ్యలేననీ—చెయ్యలేదనీ కూడా మీకు తెలుసు. ఇలాంటి ప్రశ్నల్తో కాలం ఎందుకు వృధా చేస్తారు?"

"మీరు సింహాచలంగార్ని అసహ్యించుకునేవారు గదా?"

"మీకెలా తెలుసు?"

"నా పొరబాట్లని మీరు దిద్దాలి."

"ఆ ఛండాలుడంటే నాకు మహా ద్వేషం. అసహ్యం కాదు కారణం చెప్పమంటే చెప్తాను. రైల్వేలో పని చేసి రిటైరయ్యేక, వచ్చిన డబ్బుతో—నేనూ, రమా ఈ వూరు చేరేం. చిన్న ఇల్లు కొనుక్కొని సెటిలయ్యేం. రమ బి.కాం. పాసైంది. ఖాళీగా వుండటమెందుకని టైప్‌రైటింగూ, షార్టుహేండూ నేర్చుకుంది. సరిగ్గా అప్పుడే సెక్రటరీ కావాలంటూ సింహాచలం పేపర్లో అడ్వర్టయిజ్ చేసేట్ట. రమ నాకు తెలీకుండా ఆ పోస్టుకి అప్లయ్ చేసింది...ఇంటర్వ్యూకి రమ్మని లెటరొచ్చినపుడు రమ చెప్పింది. సరే—కానిమ్మనుకుని పంపించేను. నెల రోజుల ప్రొబేషన్ మీద సింహాచలం చేర్చుకున్నాడు. కాని మూడోరోజు మధ్యాహ్నం-అస్తవ్యస్తంగా వున్న బట్టల్తో రమ ఇంటికొచ్చింది.

నాలుగోరోజు పొద్దున్నే నేను కొరడా పట్టుకొని సింహాచలం ఇంటికి వెళ్లేను. సింహాచలంలాగే నాకూ క్షమించే స్వభావం లేదు. కొరడాతో ఇష్టం ఒచ్చినట్టు బాదేను. 'దీని ఫలితం అనుభవిస్తావ్‌లే అన్నాడు.' నీ తరంగాదు అన్నాను. 'చేసి చూపిస్తాను.' అన్నాడు. అంతే—నేనింకా అతనేమంటాడో అని ఎదురు చూస్తున్నాను;''

"ఇలాంటి పరిస్థితుల్లో-ఈ విందుకు మీరెందు కొచ్చినట్టు?''

"చెప్పానుగా. నన్నేదో చేస్తానని బెదిరించేడుగా. అతను విందుకి ఆహ్వానించిన తీరు చూస్తే మీరు ఆశ్చర్యపోతారు. అది ఆహ్వానం కాదు. సవాలు. ఇదేదో తేల్చుకుందామనీ-మదమూ—పొగరూ బాగా ఎక్కిన సింహాచలంకి బుద్ధి చెప్దామనీ ఇక్కడికి వచ్చేను. అంతేగాని, అతన్ని చంపడానికి గాదు. అంతే ఇన్‌స్పెక్టర్, నేను చెప్పగలిగిందింకేమీ లేదు."

డిటెక్టివ్ ఇన్‌స్పెక్టర్ సుధాకర్ గుమ్మం వరకూ వెళ్లి ఒక తలుపు తీసి,రాజారావుని చూసేడు. "ఇక, మీరు వెళ్లొచ్చు రాజారావుగారూ, దయచేసి లింగ స్వామిగార్ని ఇక్కడికి పంపించండి. ఒక వేళ అతను లేకపోతే—వరహగిరి" అన్నాడు.

"థేంక్స్" అంటూ రాజారావు బయటికి నడిచేడు. రాజారావలా నడవగానే సుధాకర్ దక్షిణం వేపున్న గోడకేసి నడిచేడు. అక్కడో పెద్ద టేబిలుంది. పరీక్షగా ఒంగిచూసేడు.

సార్జెంట్ విశ్వం కూడా అటే వెళ్లేడు. సుధాకర్ పక్కనే నిలబడి టేబుల్ని చూసేడు.

"కొద్ది కాలం కిందట ఈ టేబిల్‌మీద ఏదో పెట్టేరు. కాని అదిప్పుడు లేదు..."

"పుస్తకమా...?"

"అవడానికి అవకాశంలేదు. మరేదేనా అయివుండాలి..."

ఇంతలో తలుపు ఎవరో తట్టేరు.

## 17

"మీరు లింగస్వామి దగ్గరా, సింహాచలంగారి దగ్గరా కూడా మేనేజర్‌గా పని చేసేరు కదండీ వరహగిరిగారూ?'' సూటిగా రంగంలోకి దిగేడు ఇన్‌స్పెక్టర్ సుధాకర్.

"ఆ సంగతి మీకు తెలుసన్నమాటే"

"అవును. మొదట లింగస్వామి దగ్గర వుండేవారు. కొంతకాలం పోయేక అతను మిమ్మల్ని వెళ్లిపొమ్మన్నాడు. అపుడు సింహాచలంగారు మిమ్మల్ని ఆదరించేరు. అవునా ?"

"ఆదరించడమా ? నన్నా ? నాన్సెన్స్ !"

"మరి ?"

"మీకు చెప్పాలా ?" భయసందేహాలు ఉట్టిపడుతున్న గొంతుకతో అన్నాడు వరహగిరి.

"సింహాచలం ఇప్పుడు మిమ్మల్నేం చెయ్యలేదు. ఏంవైనా చేస్తాడేమోననే భయంతో మీరుగాని అతనికి విషమిచ్చేరా ?"

"బాబూ. ఆపండి అలాంటి మాటలు ఆడకండి."

"మరేం అనాలో చెప్పండి..."

"నరే—మీ ఇష్టం. అనండనండి. ధామ్మని ఓ పిస్తోలు పేలిందే! అదికూడా నేనే పేల్చేనంటారా ?"

"పేల్చలేదా ?"

"సలీమో గిలీమో ఎవడో వాడు. వాణ్ణి కూడా నేనే చంపి-ఆ ఇటుక దిబ్బల మీద తోసీసేనంటారా ?"

"మీరు కాదా??"

"నేను డ్రాయింగ్ రూంలో కూర్చునే, అక్కడెక్కడో మర్రిచెట్టు కింద మధుమూర్తిగారి బుర్రమీద దెబ్బవేసేనంటారా ? ఇపుడు ఎవడేనా బట్లర్ దూలానికి వేలాడ్తే వాణ్ని చంపిందీ నేనే అనేస్తారా ?" అంతవరకూ ఇన్స్పెక్టర్ సుధాకర్‌కి కొద్దిదూరంలో నిలబడ్డ వరహగిరి గబగబ ముందుకినడిచి సుధాకర్ చెయ్యి గట్టిగా పట్టుకున్నాడు "మిస్టర్ ఇన్స్పెక్టర్ మళ్లీ చెప్తున్నాను,నేను హంతకుణ్ని గాను. నేను హత్య చెయ్యలేను గాక చెయ్యలేను...!" అన్నాడు.

"నన్ను నమ్మించాలంటే ఈ కేకలు లాభం లేదు మిస్టర్ వరహగిరీ. అడిగిన వాటికల్లా వివరంగా సమాధానాలు కావాలి."

"నరే—అడగండి."

"మీకూ—సింహాచలంగారికీ వుండే సంబంధ బాంధవ్యాలెలాంటివి ? పూస గుచ్చినట్టు వివరంగా చెప్పాలి."

"నరే చెప్తా వినండి. మొదట్లో లింగస్వామిగారూ—సింహాచలంగారూ కలిసి కంట్రాక్టు వ్యాపారం చేసేవారు. మీకు తెలుసనుకుంటాను..."

"తెలిసింది...మీరు చెప్తున్నారుగా."

''ఇద్దరూ దెబ్బలాడుకుని వేరు అయ్యేరు. అప్పుడు నేను లింగస్వామి దగ్గర చేరేను. కొన్నాళ్ల పనిచేసి మానేసేను. అప్పుడు సింహాచలంగారు నన్ను పిలిచి తన దగ్గర పని చెయ్యమన్నారు. వూళ్లోవున్న కంట్రాక్టులన్నీ సింహాచలం గారివే అయ్యేయి. అందరికన్నా తక్కువ కొటేషన్లు ఇచ్చి—బిజినెస్ ఇంకె వరికీ పోకుండా చేసేవారు. ఇది లింగస్వామికి గొప్ప దెబ్బ. అతని వ్యాపార మంతా మూలపడింది. లింగస్వామిగారి దగ్గర నేర్చుకొన్న కిటుకులన్నీ సింహా చలంగారి వ్యాపారంలో చూపించేవాణ్ణి. అప్పుడప్పుడు సింహాచలంగారికి నా మీద అనుమానం..."

వరహగిరి వాక్ప్రవాహం ఒక్కసారి ఆగిపోయింది. ముఖం తెల్లగా పాలి పోయి వుంది. తన తెలివి తక్కువకి తనే చింతించుకుంటున్నవాడిలా తల దించి నేలమీదున్న తివాసీని చూడసాగేడు.

''ఆఁ- ఆగిపోయారేం—లింగస్వామి......"అని ప్రశ్నించేడు సుధాకర్.

వరహగిరి మౌనం వహించేడు.

"''కమెలాంగ్. చెప్పండి." అంటూ ప్రెస్‌చేసేడు.

అప్పటికీ వరహగిరి మాటాళ్లేదు.

''సరే— ఆ విషయం ప్రస్తుతానికి వదిలేద్దాం. మీ దగ్గర ఓ కాగితం వుంది. దానిమీద ఏదో డిజైన్ వుంది. అది ఫర్నిచర్ డిజైన్ అని మీరు అబద్ధం ఆడేరు. అయితే ఆ అబద్ధం మీకు సహాయం చెయ్యదనీ— పైగా మీకు అపకారం తల పెడ్తుందనీ చెప్పడానికి చింతిస్తున్నాను." అన్నాడు ఇన్‌స్పెక్టర్ సుధాకర్ గంభీరంగా.

''ఏ డిజైను ?''

"మీరబద్ధాలు ఆడుతున్నారని స్పష్టంగా తెలుస్తోంది : ఇంతకుముందే—ఆ డిజైన్ మీరు చేసిందేననీ — ఏదో ఫర్నిచర్ డిజైననీ ఒప్పుకున్నారు మీరు. అవునా ? మీరు గాభరా పడ్తున్నారు. లేదా భయపడ్తున్నారు. ఆ భయంలో— ఆందోళనలో ఏదో 'ఇడియటిక్ స్టోరీ' చెప్పి నన్ను ఫూల్నిచేద్దామనుకుంటు న్నారు. ఆ డిజైన్ మీరు తయారు చెయ్యకపోతే మరెవరు చేశారు?"

వరహగిరి మళ్ళీ మౌనం వహించేడు.

"అదే డిజైన్లో ఓ చోట × మార్కువేసి వుంది. మీకు తెలుసనే అను కుంటాను. అక్కడే సలీమ్ శవం మనకి కన్పించింది."




అప్పటికీ వరహాగిరి మాటాడ్లేదు.

"సింహాచలంగారి హత్యతో మీకు సంబంధం వుందని అనుకోలేదు. గాని—సలీమ్ హత్యతో మీకు బాగా సంబంధంవుందని మేమనుకోవడం మీకిష్టమేనా ?"

ఆ ప్రశ్న వరహాగిరి సమాధిని భగ్నం చేసింది.

''నో. నో. సలీమ్‌ని నేనెన్నడూ చూడలేదు. అతని గురించి ఎప్పుడూ విన్లేదు. నేనతన్ని హత్య చెయ్యలేదు.'' దాదాపు ఏడుస్తున్నట్టు అన్నాడు వరహాగిరి.

"మరి 'ప్లాను' మీకెవరిచ్చేరు ?"

"నాకేం తెలీదని చెప్పేను కదండీ."

"ఎవరిచ్చేరో మీకు తెలుసు !"

"నాకెవరూ ఇవ్వలేదు.''

''మరి మీదగ్గరికెలా వచ్చింది?"

''ఏమో నాకు తెలీదు."

''ఏంవిటీ, తెలీదూ ? ఈ ఇంటి ప్లాను మీ జేబులో వుంది. అదక్కడికెలా వచ్చిందో మీకు తెలీదు. వాట్ నాన్సెన్స్."

''అవున్నిజంగా నాకు తెలీదు.''

"మరా కాగితం నాకు దొరికినప్పుడు అడిగితే—మీకు తెలిసినట్టెందుకు నటించేరు ?"

"నేనా ?"

"అవును. మీరే: అది ఫర్నిచర్ డిజైనని కూడా చెప్పేరు..."

"అవునవును."

"ఎందుకలా చెప్పేరని ప్రశ్నిస్తున్నా" అనరిచేడు సుధాకర్.

"భయపడ్డాను...ఏం చెయ్యాలో తోచక అలా అనేశాను..."

"అలాగా. అంత పిరికివారా మీరు? ?"

"అవున్నిజం. అందుకే పిస్తోలు ఢామ్మనగానే టేబులుకింద దాక్కున్నాను. నా స్థితిలో వుంటే ఎవరైనా అలాగే చేసేవారు..."

"రివాల్వర్ మీద మీ వేలిముద్రలున్నాయి. దీనికి మీ సమాధానం ?" అంటూ సుధాకర్ కటువుగా ప్రశ్నించేడు.

"నిజంగానా ?"

"అవును. ఎందుకున్నాయి ?"

"అది కూడా టేబులు కిందే వుంది. ఏఁవిటా అని పట్టుకున్నాను. కాని, వెంటనే వొదిలీసేను."

"ఆ రివాల్వర్ మీ మీదికి పేల్చబడటానికి కారణం ఏమైనా వుందా ?"

"ఏమో. వూహించలేను."

"అంతేనా ?"

"అఁహాఁ. కాదు రెండోసారి మాత్రం ఎవరో నావేపే గురిచూసి కాల్చేరని నా నమ్మకం. కొద్దిగా తప్పిపోయిందిగాని ఈ పాటికి ఈ కట్టె మిగిలుండేది..."

"అవును. తర్వాత సిగరెట్లో మత్తుమందు కలిపి మీకెవరో యిచ్చేరు. ఎవరు ? గుర్తుందా ?"

"ఏమో...ఆఁ...అఁహాఁ..." అంటూ కళ్ళు తేలవేసేడు వరహాగిరి.

ఓసారతన్ని తీక్షణంగాచూసి ఇన్స్పెక్టర్ సుధాకర్ సార్జెంట్ వేపు తిరిగేడు.

"ఇతన్ని డ్రాయింగ్రూంలోకి తీసుకెళ్ళు సార్జెంట్. వుయ్ విల్ హేవ్ మిస్టర్ రంగస్వామీ నెక్స్ట్ !"

# 18

సుధాకర్ అనుకున్నట్టు లింగస్వామి రాలేదు. వచ్చింది శివకోటి. నాటకాల మనిషి. సుధాకర్ని చూస్తూ వికృతమైన నవ్వుని ముఖంమీదికి తెచ్చుకున్నాడు. ఇన్‌స్పెక్టర్ అతని కళ్ళల్లోకి వాడిగాచూస్తూ 'లింగస్వామి రాలేదా ?' అన్నాడు.

"లింగస్వామిగారు అలా గాల్లో షికారుకని వెళ్ళినట్టుంది. అతనికి బదులుగా నేను వచ్చాను," అన్నాడు శివకోటి.

సుధాకర్ ఒక్కక్షణం పాటు ఆలోచించేడు. "సరే. చాలా మంచిది. శివకోటి గారూ, మీరు మొదట్నించీ మాకెంతో సహాయంచేస్తూ వచ్చేరు...ఇకముందూ ఇలాగే మీ సహకారం దొరుకుతుందని ఆశిస్తాను ... అది సరే—ప్రస్తుత నాటకంలో మీరు ఎవర్ని విలన్‌గా చిత్రీకరిస్తారు?"

"నేను స్వర్గీయ శ్రీసింహాచలంగార్ని విషం ఇచ్చి చంపేనా అని మీరడుగుతున్నారు. కాని అతన్నిచంపే అదృష్టం నాకు లేకపోయింది. ఆ అవకాశం మరెవరో కొట్టేశారు."

"ఆయన్ని చంపడం మీకు సంతోషం అన్నమాట. సరే—అయితే అతన్నెవరు చంపివుంటారని మీ అభిప్రాయం ?"

"నా అభిప్రాయమా ? ఓ చిన్నమాట !''

"చెప్పండి."

"మరేం లేదు. నా అభిప్రాయాన్ని మీరు చాలా విలువైనదిగా తీసుకుంటారా ?"

"అందరి అభిప్రాయాలకీ సాధారణంగా నా చెవులిస్తాను. మీఅభిప్రాయానికి మాత్రం నా హృదయం తెరుస్తాను."

"నేను ఈ నాటకంలోవిలన్ని ఎంతమాత్రంకాదు. నేనుటేబుల్‌కి—సింహాచలంగారికి చాలాదూరంలోవున్నాను. అంతమాత్రానా అతనికి దగ్గరగా కూర్చున్నవారి నీచప్పని చేశారనీఅనను. నేనితరులగురించి సాధారణంగా మాట్లాణ్ణు అది నా నియమం."

"అలాగా. అయితే ఇప్పుడు మనం మీ గురించే మాట్లాడుకుందాం. కరెంటు పోయేక ఏర్పడిన 'బ్లాకవుట్'లో మీరేం చేశారో చెప్తారా ?" అన్నాడు సుధాకర్.

"నేనేం చేసేను ?"

"మీ కుర్చీపక్కనే ఏదోగలభా జరిగింది. చీకటి. అలాంటప్పుడు

మీలో ఏ ఆత్రుతా ఎందుకు కలగలేదు ? వరహగిరిగారు భయపడి టేబులు కింద దాక్కున్నారే! మీరూ అలా ఎందుకు దాక్కోలేదని నా వుద్దేశ్యంగాదు. కాని మీరు కుర్చీలోనే నిశ్చలంగా ఎలా కూర్చోగలిగేరు ? ఎందుకలా కూర్చున్నారు ? కారణం ??"

శివకోటి ముఖం తెల్లగా పాలిపోసాగింది. 'మీరన్నది నాకేం అర్థంకావటం లేదు' అన్నాడు.

"ఈ ప్రశ్నకి సమాధానం చెప్పండి" కరుగ్గా అన్నాడు సుధాకర్ "సింహాచలంగార్ని చంపడం ఓ అదృష్టం అని మీరెందుకు అనుకుంటున్నారు!"

"అదృష్టమా ?"

"ఔను. మీరు వాడినమాటే. మీ ముఖంమీది ఆ వికృతమయిన మచ్చకి కారణం సింహాచలంగారేగదూ ?"

ఏదో నిశ్చయం చేసుకున్నవాడిలా శివకోటి గట్టిగా పిడికిళ్లు బిగించాడు. ఇప్పుడు అసలురంగు బయటపడుతుంది అనుకున్నాడు సుధాకర్.

"మీకానంగతి తెలుసా ?"

"నిజమేనా ?"

"మీకెలా తెలుసు ?"

"నిజం నాకు తెలీదు. కాని వూహించేను. మీకూ—సింహాచలంగారికీ మధ్య వున్న శత్రుత్వంకూడా అందుకేననుకున్నాను. ఆ మచ్చవల్ల మీ జీవితమంతా నాశనమైంది. అవునా ?"

"అవును. సర్వనాశనమైంది. నేనుచేసిన చిన్న తప్పుకోసం నా జీవితాన్నే బలి తీసుకున్నాడు ఛండాలుడు. డబ్బులేక నానా యిబ్బందీ పడ్డాను. అడ్డమైన గడ్డీ కరిచేను. ఆ వెధవ ఆసిడ్ సీసా నా ముఖంమీదే ఎందుకు పడాలి—నా దురదృష్టం కాకపోతే—! నిజం చెప్పాలంటే వాడిమీది పగ తీర్చుకోవాలనే—వాణ్ణి చంపాలనే—"

హఠాత్తుగా ఆగిపోయేడు శివకోటి. లైబ్రరీ గదికవతల పెద్దపెద్ద అడుగుల చప్పుళ్ళు విన్పించేయి. ఎవరిదో కుపిత కంఠస్వరం కూడా బిగ్గరగా వినిపించింది.

"వాటీజ్ దిస్ నాన్సెన్స్ సార్జెంట్ ! మేం మనుషుల మనుకుంటున్నాడా,



బందిలిదొడ్డి పశువులమనుకుంటున్నాడా మీ ఇన్‌స్పెక్టరు ? ఎవరోచేసిన నేరానికి మమ్మల్నందర్నీ ఇలా ఎందుకు వేధించడం? వేస్టు. షీర్ వేస్టు !!"

అంతే. వెంటనే గదితలుపు తెరుచుకుంది. రుసరుసలాడుతోన్న లింగస్వామి గదిలోకి ప్రవేశించేడు.

## 19

నిప్పులు కక్కుతున్నట్టున్న లింగస్వామిని చూడగానే గాలి తీసేసిన రబ్బరు బెలూన్లా చప్పగా చల్లారిపోయేడు శివకోటి. గదిలోకి రాకుండా ఆపలేకపోయి నందుకు విచారిస్తూ లింగస్వామి పక్కనే నిలబడ్డాడు సార్జెంట్ విశ్వం.

"ఎస్. ఇన్‌స్పెక్టర్. మీతో మాటలాడ్డానికి సిద్ధంగా వున్నాను."

"నేనూ సిద్ధంగానే వున్నాను. శివకోటిగారిక్కడ వుండడం మీకు అభ్యంతరం లేదనుకుంటాను." అంటూ సమాధానమిచ్చేడు ఇన్‌స్పెక్టర్ సుధాకర్.

నీళ్ళు నములుతూ నిలబడున్న శివకోటిని కళ్ళెర్రచేసి చూసేడు లింగస్వామి.

"నాన్సెన్స్. నాకేం అభ్యంతరం లేదు. ఇంకో లక్షమందిక్కడున్నా నాకు ఇష్టమే! బై దిబై—నా గురించేమన్నా ఇన్స్పెక్టరుగారికి చెప్పేవేమిటి శివకోటీ? జాగ్రత్త, తోలు ఒలిచేస్తాను...!"

"అంత చెప్పకూడని విషయాలు ఏమన్నావున్నాయా లింగస్వామిగారూ!"

"ఏమీ లేవు. వున్నా నాకేం భయం? నేనేం కాని పని చెయ్యలేదు నన్ను మీరు ట్రీట్ చేసిన విధానం బాగులేదు. ఇంతవరకూ ఎలాగో సహించేను. ఇక సహించనుగాక సహించను. ఇప్పుడు వినండి. అంతా చెప్పేస్తున్నాను. సార్జెంట్ నీ నోట్ బుక్ తీసుకో. అంతా రాసుకో. దాచుకోవల్సిన రహస్యాలేవీ నాకు లేవు. సింహాచలం డిన్నర్ పార్టీకి రమ్మని ఇన్విటేషన్ పంపేడు. అంతే వొచ్చేను. అందులో తప్పేమీ లేదు గద! నేనివాళ ఇక్కడికొస్తానని అసలను కోలేదు. ఇవాళ మధ్యాహ్నం దాకా విజయనగరంలో వున్నాను. ఎన్ని అర్జంటు పనులున్నా ఎలాగో ఓలాగ వీలు చూసుకొని—సాయంకాలం ఏడుగంటల బండిలో ఇక్కడి కొచ్చేను. ఎంతో ప్రయాసమీద విందు ప్రారంభం టైముకి వచ్చేను. ఆ తర్వాత ఏమయిందో అందరికీ తెలుసు...దెయ్యాలమీదా భూతాల మీదా సింహాచలం వుపన్యాసం, తర్వాత లైబ్రరీ రూంలోకి వెళ్ళడం, లైట్లు ఆరిపోవడం, ఎవరో సింహాచలం గదికి బైట తాళం వెయ్యడం—రివాల్వర్ ఢామ్మనడం, అంతా మీకు తెలుసు. వాటి గురించి నాకేం తెలీదు చీకట్లో వరహగిరి టేబులు కింద దాక్కున్నాడు. టేబిలుకి అవతల వరుసలో ఏదో గొడవ. అందులో నేన్లేను...ఆ తర్వాత సింహాచలం లైబ్రరీరూంలోంచి తిరిగొచ్చి ద్రాక్షరసం తాగేడు. చచ్చిపోయేడు. అందుక్కూడా నేను కారణం కాదు. అతన్ని నేను చంపలేదు. ఇప్పుడు చెప్పండి ఇన్స్పెక్టర్. నావేపు ఎందు కలా చూస్తున్నారు?"

"ఎలా చూస్తున్నాను?"

"ఎలాగా, నాకు తెలుసు ఇన్స్పెక్టర్. నాకూ సింహాచలంకీ వున్న బిజినెస్ రిలేషన్స్ గురించి మీకెవరో చెప్పి వుంటారు. ఎవరో ఏమిటి, వరహగిరిగాడే చెప్పి వుంటాడు. ఆ వెధవ ఓ అబద్ధాలకోరు. నాదగ్గర పని చేస్తున్నపుడు—నా సంతకం ఫోర్జ్ చేసి డబ్బు చేసుకుందామనుకున్నాడు. అప్పుడే వాణ్ని పోలీసులకి పట్టిద్దామనుకున్నాను..."

"వరహగిరిగారి గురించి మీరేం చెప్పనఖ్ఖర్లేదు. మాకంతా తెలుసు." అన్నాడు ఇన్‌స్పెక్టర్ సుధాకర్.

"తెలుసూ ? వెరిగుడ్ ఇంకేం ? నేనూ సింహాచలం పార్టనర్స్‌గా జీవితం ప్రారంభించేం. బద్ధశత్రువులుగా విడిపోయేం. బిజినెస్‌లోనే అదంతా. బైట ఇద్దరం ఫస్టు క్లాసైన స్నేహితులం. అంతే. ఆ సలీమెవరో—అక్కడెందుకు చచ్చిపడివున్నాడో—మధుమూర్తెవరో—నాకేఁవీఁ తెలీదుగాక తెలీదు—"

"మధుమూర్తిగారి గురించి మీకేం తెలీదా ?"

"నాకే గాదు ఇక్కడున్న ఎవరికీ అతనెవడో ఏమిటో తెలీదు."

"ఎవరికో ఒకరికి తెల్సివుండాలి. లేకపోతే అతని తలమీద ఎందుకు గాయం చేస్తారు. ఆ 'ఎవరో' మీకు తెలుసా ?"

"నాకు తెలీదు. నాకు తెలిసిందల్లా ఒకటే. కిటికీలోంచి బైటికి చూస్తున్నాను. మర్రిచెట్టు దగ్గిర పొదల్లో ఎవరో వున్నట్టు అనుమానం వేసింది. అనుమాన మేమిటి, స్పష్టంగా చూసేను. అందుకే వాణ్ణి పట్టుకుని ఈ హత్యారహస్యం ఛేదిద్దామని పరుగెత్తేను. ఎంతో శ్రమపడ్డాను...కాని పట్టుకోలేకపోయేను..."

" మీశ్రమకి థాంక్స్ లింగస్వామీ ! అతన్ని మీరిక పట్టుకోనవసరం లేదు. ఆ పని మేమే చేసేం !"

"ఆఁ."

"అవును. అసలక్కడెవరూలేరు. బైటివాళ్ళు లోపలికి రాకుండా, లోపలి వాళ్ళు బైటికి వెళ్ళకుండా నేను కట్టుదిట్టం చేసేను. అందుకు ఏమాత్రం అవ కాశం లేదు. మధుమూర్తి నెందుకలా గాయపర్చేరు? అతను మీ గురించి చెప్ప కూడని రహస్యం ఏమిటి ?"

లింగస్వామి నోరు వెళ్ళబెట్టి ఇన్‌స్పెక్టర్ కేసి చూడసాగేడు. అతని ముఖ కవళికల్ని పరీక్ష చేయడానికని మరింత ముందుకి వంగేడు సార్జెంట్ విశ్వం.

"చెప్పండి ?" అన్నాడు ఇన్‌స్పెక్టర్ మళ్ళీ.

లింగస్వామి ఇంకా అలాగే నిర్ఘాంతపోయి నిలబడి వున్నాడు. నోట్లో ఓ సిగరెట్ పెట్టుకున్నాడు. మూర్ఖంగా చిన్న నవ్వునవ్వేడు. సిగరెట్ వెల్గించి గుప్పుమని పొగ వదిలేడు. అంతలోనే సిగరెట్ నేలమీద జారిపడింది.

"ఆల్‌రైట్. సార్జంట్, మనవాళ్ళందరూ సరిగ్గా వున్నారా ?"

"యస్సర్. రహీం డ్రాయింగ్‌రూంలో వున్నాడు. మిగతా అందరూ బైట వున్నారు."

"లింగస్వామిగార్నీ, శివకోటిగార్నీ డ్రాయింగ్‌రూంలోకి తీసుకెళ్ళు. బైట వున్న వాళ్ళదగ్గరికి రహీంని పంపి అందర్నీ లోపలికి రమ్మను ... అందర్నీ ఓకంట చూస్తూండు. ఈజ్ దట్ క్లియర్ ?"

"క్వయిట్ క్లియర్, సర్ !"

"రైట్ కేరీ ఆన్ !"

ఇన్‌స్పెక్టర్ సుధాకర్ లింగస్వామినీ, శివకోటినీ చూసేడు. ఇద్దరూ మేకల్లా తలలొంచుకుని సార్జెంట్ వెనక నడిచేరు. వాళ్ళలా వెళ్ళగానే ఒంగుని నేలమీద పడున్న సిగరెట్ పీకని అందుకున్నాడు సుధాకర్. ముక్కుకి దగ్గరగా తెచ్చి వాసన చూసేడు. 'సందేహం లేదు. ఆ సిగరెట్టే. వరహాగిరికి లింగస్వామి ఈ సిగరెట్టు ఎందుకిచ్చాడు చెప్మా!' అనుకుంటూ ఆలోచనలో పడ్డాడు సుధాకర్.

## 20

కళ్ళు తెరిచి చూసింది శిరీష. బద్ధకంగా ఒళ్ళు విరుచుకుంది. ఆమె కదిలి నప్పుడల్లా చెవికున్న రింగులు జిగజిగమని మెరుస్తున్నాయి. అంతలో తలుపు దగ్గర చప్పుడయింది. ఒళ్ళు విరుచుకోడంలో జాకెట్ గుండీలన్నీ వూడి పోయేయి. ముడివేసుకుంటూ 'కమిన్' అంది శిరీష.

వచ్చింది రఘు కాదు. డిటెక్టివ్ ఇన్‌స్పెక్టర్ సుధాకర్ ! చప్పున గుండెల మీదికి పైట లాక్కుంది.

"క్షమించండి శిరీషగారూ, మీతో కొన్ని ముఖ్యమైన విషయాలు మాట్లా డాలి. పోనీ, తర్వాత రమ్మన్నారా ?" అన్నాడు సుధాకర్.

శిరీష అందుకోసమే ప్రాణాలు వుగ్గబెట్టుకుని మరీ చూస్తోంది. అతని ప్రశ్నలకి ఎంత వేగిరం సమాధానాలు చెప్పి గుండెలమీది కుంపటి దింపు కుందామా అని చూస్తోంది. ఎంత వేగిరం అయితే అంత మంచిది.

"అఖ్ఖర్లేదు. ఇప్పుడే మాట్లాడుకుందాం. అలా కూర్చోండి" అంటూ ఓ కుర్చీ చూపించింది.

సుధాకర్ కుర్చీలో కూర్చోగానే— పడుకున్నదల్లా తనూ లేచి కూర్చుంది. చీర సరిగా సర్దుకుంది.

"చెప్పండి. ఏం మాట్లాడమంటారు ?" అంది.

"మీ యిష్టం."




శిరీష క్షణంపాటు ఆలోచిస్తూ సుధాకర్ని చూసింది. ఆ ఒక్క క్షణంలోనే అతని ముఖంలోని భావాల్ని చదవడానికి ప్రయత్నించింది.

"అంటే—?" మళ్ళీ ప్రశ్నించింది.

"అంటేనా?—చెప్తా వినండి. చట్టప్రకారంగా మీరు నాకనలేమీ చెప్పాల్సిన అవసరం లేదు..."

"ఈ మాట ఇంతకు ముందోసారి మీరన్నారు..."

"అవును. నేను మిమ్మల్ని అరెస్టు చెయ్యలేదు. సత్యప్రమాణపూర్వకంగా మీరు అన్నీ నిజాలే చెప్పడానికి ఇది కోర్టుకూడా కాదు. ఏవేనా అబద్ధాలు చెప్పినా నేను మిమ్మల్నేమీ చెయ్యలేను ... ఏమేనా చెయ్యగలిగి వుంటే ఈ పాటికి ఈ ఇంట్లో వున్న అందర్నీ అరెస్ట్‌చేసి వుండేవాడిని..."

"ఆగండి. నేను అంతానిజమే చెప్తాను. అబద్ధం ఆడాల్సిన అవసరం నాకేమీ లేదు. కాని—ఏం చెప్పాలో—ఎలా చెప్పాలో నాకేమీ తోచి చావటం లేదు."

"మనసులో ఏదుంటే అది చెప్పండి. అంతే."

మరో రెండు క్షణాలు శిరీష ఆలోచన్లో పడింది

"అందర్లాగే మీరూ—నన్ను సింహాచలంగారు వుంచుకున్నారనుకుంటున్నారా?" అంది శిరీష అప్రయత్నంగా.

"అలా అనుకుని నేనేమయినా పొరబాటుచేస్తే మీరు క్షమించాలి నా తప్పుడు అంచనాల్ని సరిదిద్దాలి..." అన్నాడు సుధాకర్.

తన పాచిక పారినందుకు సుధాకర్ లోలోపల సంతోషించేడు. శిరీష బరువైన ఆలోచనల్తో సతమతమైపోతోంది.

"అవును. నేనతని ఉంపుడుగత్తెనే. అయితే గత రెండేళ్ళనుంచీ 'కానేమో' అనుకుంటున్నాను. రెండేళ్ళుగా అతను నాతో వుండటం మానేసారు. నా మీద అతనికి ఇంటరెస్ట్ తగ్గిందనిపించింది..."

"నిజం ఎలాంటిదైనా దాచకుండా చెప్తూన్న మిమ్మల్ని మనస్ఫూర్తిగా అభినందిస్తున్నా శిరీషగారూ! అందుకే సార్జెంట్‌నీ, నోట్‌బుక్‌నీ కిందే వదిలేశాను...చెప్పండి—"

"నాతో సరిగా మాట్లాడకపోయినా, నా దగ్గరికి రాకపోయినా నేను కిక్కురుమన్లేదు. కారణం: పేదవాడి కోపం పెదవికి చేటన్నారు. తెలుసుగా!"

ఇన్‌స్పెక్టర్ సుధాకర్ బుర్రలో మెరుపులాంటి ఆలోచన వచ్చింది.

"తగినంత ఆర్థికస్తోమత లేకపోవడంవల్ల సలీమ్ సింహాచలంగార్ని ఎదిరించలేక పోయేడనుకుంటాను..." అన్నాడు.

"మైగాడ్, ఇన్‌స్పెక్టర్లందరూ మీలాంటి వాళ్లేనా?" అంది శిరీష ఆశ్చర్యంగా.

ఇన్‌స్పెక్టర్ సుధాకర్ నవ్వేడు.

"కొందరు నాకన్నా తెలివైన వాళ్ళున్నారు. మరికొందరు తెలివితక్కువ వాళ్ళూ వున్నారు. నేనేమైనా తప్పుడు అంచనాలు వేస్తే నన్ను సరిదిద్దమని మీకింతకుముందే మనవి చేసేను.

"మీరే తప్పుడంచనా వెయ్యలేదు."

"ఏమో చెప్పలేను. నా మనస్సులో వున్న అనుమానం చెప్తే మీకు నా ప్రతిభ మీద వున్న నమ్మకం పోవచ్చేమో!"

"అదేమిటి?"

"వెంకటచలంగార్నీ, వారిజనీ, గదిలో కూర్చోబెట్టేక—ఆరుగంటల ప్రాంతంలో మీరేం చేసేరు?"

అప్పటివరకూ అమాయికంగావున్న ఆమె నీలికనుల్లో హఠాత్తుగా భీతావహం ప్రవేశించింది.

"నేనింకా ఈ విషయం మీకు చెప్పగూడదనుకున్నాను. కాని అదెంత

మూర్ఖత్వమో ఇప్పుడు తెలుస్తోంది... మీ దగ్గర్నుంచి ఏం దాచినా లాభంలేదు. మీకంతా తెలుసు !"

"నాకు చాలా విషయాలు తెలుసు. కాని అన్నీ తెలీవు. ఈ భవనం విడిచి వెళ్ళేలోగా అన్నీ తెలుసుకోగలననుకుంటున్నాను." అన్నాడు సుధాకర్ చిన్నగా నవ్వుతూ.

"సింహాచలంగార్నెవరు చంపేరో మీకు తెలుసా ?" అంది శిరీష హఠాత్తుగా.

"మీరు చంపేరా ?"

"హాం...లేదు !"

"పోనీ—సలీమ్‌ని చంపేరా ? అరుగంటల తర్వాత—పెరట్లో—ఇటుక దిబ్బలపక్క—సలీమ్‌తో ఏం చేసేరు... ?"

వెంటనే శిరీష ముఖం పక్కకి తిప్పుకుంది. చప్పున ముఖాన్ని తలగడలో దాచేసుకుంది.

"నేనే—చంపేనేమో..." అంది వెక్కిళ్ళ మధ్య.

కాసేపు ఆమెని ఏడపనిచ్చేడు సుధాకర్. "మరో అరగంటలో వస్తాను..." అంటూ ఏదో అనబోయేడు

"ఒద్దు" అంటూ తలెత్తింది శిరీష. "ఇప్పుడే చెప్తాను. ఇప్పుడే ! ఒక్క నిమిషం టైమివ్వండి'' అంది. విశాలమైన కళ్ళల్లోని కన్నీరు స్పష్టంగా కన్పిస్తోంది.

సుధాకర్ లేచి నిలబడ్డాడు. తనున్నగది సరిగ్గా లైబ్రరీరూం మీద వుందని తెలుసుకున్నాడు. నెమ్మదిగా కిటికీ వేపు నడిచేడు. ఆ కిటికీలోంచి పెరడంతా అస్పష్టమైన చంద్రకాంతిలో లీలామాత్రంగా కన్పిస్తోంది. దొంతర్లుగా పేర్చిన ఇటుకలు, పాడుపడ్డ స్విమ్మింగ్‌పూల్, పశువులశాలా—అన్నీ కన్పిస్తున్నాయి. సుధాకర్ దృష్టి హఠాత్తుగా స్విమ్మింగ్ పూల్‌మీద పడింది. స్విమ్మింగ్‌పూల్లో నీళ్ళుట్టే లేవు...అంతలో శిరీష మాటలు విన్పించేయి.

"నన్ను తనతో వచ్చెయ్యమన్నాడు. ఎక్కడికేనా పారిపోదామని కూడా అన్నాడు. మొదట్లో నాకూ అలాగే అన్పించింది. సలీమ్ ఎవరో నాకు తెలీదని, ఇంతకుముందు అబద్ధం చెప్పేను. కాని ఇప్పుడు చెపుతూన్నది నూటికి నూరు పాళ్ళూ నిజం. టౌన్లో సింహాచలంగారి బిజినెస్ అఫీసుంది. ఓసారి సెక్రటరీ సెలవు పెడితే—నేను రెండుమూడు రోజులు అక్కడ పనిచేసేను. సలీమ్‌ని మొట్ట మొదటిసారి అక్కడే చూసేను. అదే మా పరిచయం. ఇక్కడికికూడా సలీమ్

ఏదో నెపంమీద వచ్చేవాడు. ఆ పరిచయం శాఖోపశాఖలుగా పెరిగి తెగని బంధమై కూర్చుంది. సింహాచలంగారు అసాధ్యుడు. ఆవులిస్తే పేగులెక్కబెట్టే మనిషి. ఒక విషయంమాత్రం గుర్తుంచుకోండి. అతను నా శరీరంమీదేకాదు—జీవితంమీదకూడా ఆధిపత్యం గల మనిషి. అప్పటికీ, ఎన్నోసార్లు రహస్యంగా ఇద్దరం పెరట్లో స్విమ్మింగ్‌పూల్ దగ్గర ఇటుకలచాటున కలుసుకునేవాళ్ళం. ఈ సంగతి సింహాచలంకి తెలిసిపోయిందనే అనుకుంటాను. అందుకే తన శత్రువులు అందరితోబాటు సలీమ్‌నికూడా డిన్నరుకి ఆహ్వానించేడు. నాకోసమే—నేనేమై పోతానో అన్న బెంగతోనే సలీమ్ ఆ ఆహ్వానాన్ని అంగీకరించి వుంటాడు. ఆ వూహతోనే ఇక్కడకి వచ్చేడు. తీరావచ్చేక నన్ను తనతో వచ్చెయ్యమన్నాడు. ఎక్కడికేనా పారిపోదాం అన్నాడు. అది అసంభవం. కాని సలీమ్ పట్టువదల్లేదు. నన్నెలాగైనా తనతో తీసుకుపోవాలన్న దృఢనిశ్చయంతో వున్నాడు. అలా రాలేనని నా అశక్తత వెళ్ళబోసుకున్నాను. రమ్మనమని ఎన్ని రకాలుగానో బ్రతిమిలాడేడు. కోపగించేడు. అయినా నేను నా మనస్సు మార్చుకోలేదు. ఇదే ఆఖరి కలయిక. మరింకెప్పుడూ నా దగ్గరికి రాకు అన్నాను. మర్చి పొమ్మన్నాను. దానివల్ల ఇద్దరి జీవితాలూ నాశనం అవడం తప్ప ప్రయోజనం శూన్యం అన్నాను. 'ఎందుకిలా మారిపోయేవని' నన్ను దూషించేడు. తప్పించు కుని ఇంట్లోకి పోదామనుకుంటే—నన్ను గట్టిగా కౌగలించుకుని వున్నాడు. అతని దృఢ హస్తాలనుంచి తప్పించుకోడానికి గత్యంతరం లేక బలంగా అతన్ని వెనక్కి తోసేను. ఆ సమయంలో నేనేం చేసేనో ఆలోచించడానిక్కూడా వ్యవధి లేదు. ఆ తోపుకి సలీమ్ రాళ్ళ గుట్టలమీద పడ్డాడని నా అనుమానం. అంతే. గబగబ కిచెన్ రూంలోంచి హాల్లోకి పరుగెత్తేను. అప్పటికప్పుడే డిన్నర్ ఏర్పాట్లు ప్రారంభం అయ్యేయి. అతిధులు రావడంకూడా ప్రారంభం అయింది... సలీమ్ గురించిన ఆలోచనా, అతనేమయ్యాడో అనే ఆదుర్దాకూడా నాలో సమసి పోయింది...ఈ దృశ్యం ఎవరేనా నౌకర్లు చూసేరేమోననే అనుమానం మొద లయింది ... నేను తోసిన త్రోపుకి సలీమ్ అలా పడ్తాడని ఎన్నడూ అను కోలేదు..."

కిటికీనుంచి తన చూపులు వెనక్కి మళ్ళించేడు సుధాకర్.

"అతని తలమీద గాయం తగిలిందన్న సంగతి మీకు తెలుసా? ఆ కారణం గానే అతను చనిపోయేడు..."

"అవును."




"అంతేనా ? మీరు చెప్పవలసింది ఇంకేమీ లేదా ?"

"ఏముంది? "

"సలీం విషం యిచ్చి సింహాచలంగారిని చంపడం అనేది అసంభవం. కారణ మేమంటే - సింహాచలంగారికన్నా దాదాపు మూడు గంటలముందు సలీమ్ చని పోయేడు...మీరు...గాని..."

"ఇన్ స్పెక్టర్ ! నన్ను నమ్మరా ? సింహాచలంగారికి నేను విషంయివ్వలేదు. లేదు ,"

"మర్చిపోయేను—ఈ మధుమూర్తెవరండీ ? ఇక్కడికెందుకొచ్చాడు ? అతని గురించి ఇక్కడ ఎవరికీ తెలీదా ?"

"నా మట్టుకు నాకు అతనెవరో తెలీదు." అంది శిరీష.

"సింహాచలంగారికి మాత్రం మధుమూర్తి ఎవరో బాగా తెలిసి వుండాలి. ఏమంటారు ?" అంటూ శిరీషవేపు తిరిగేడు సుధాకర్.

"ఏమో ! అతనిని మాత్రం ఈ డిన్నర్ కి ఆహ్వానించలేదు. సింహాచలం గారు అతన్నెందుకు విందారగించమని బలవంతం చేసేరో—అంతా అయో మయం !"

"ఆల్ రైట్. ఇక ఎక్కువసేపు మిమ్మలిని విసిగించను. ఇంకొక ప్రశ్న

మాత్రం మిగిలిపోయింది. సింహాచలంగారి తండ్రి వేదాచలంగారి గూర్చి మీ అభిప్రాయం ?"

"అతనో చిక్కు సమస్య. అతను అప్పటికీ—ఇప్పటికీ ఒకేలా వున్నాడు. నేనిక్కడికి రాకముందునుంచీ అతనలాగే పక్షవాతంతో పడివుండేవాడు... అంతే!—ఇంకో విషయం, గుణగణాల్లో తండ్రీ కొడుకులు ఒకరికొకరు మించి పోతారు. అంతమటుకు తెలుసు." అంది.

## 21

గది తలుపులు దగ్గరగా వేసి మెట్లవేపు నడిచేడు సుధాకర్. నెమ్మదిగా మెట్లు దిగుతోంటే రమ ఎదురైంది.

"శిరీషకిప్పుడెలా వుంది ఇన్‌స్పెక్టర్ జీ !"

"షి ఈజ్ ఓకే. అందుకేనా అలా గాభరాపడుతున్నారు ?"

"అబ్బే. ఆమెగురించి కాదండి. మధుమూర్తిగారు..."

"ఆఁ. ఆయనకెలా వుంది ?"

"ఒంట్లో బావుందిగాని—మనస్సులోని ఉద్రిక్తత తగ్గలేదు—"

"ఏం చేసేడాయన ?"

"లైబ్రరీ రూంవేపు మీకోసం పరుగెత్తేరు. అంతదెబ్బతిన్న మనిషి—అలా ప్రవర్తించవచ్చా చెప్పండి...?"

ఇన్‌స్పెక్టర్ చిన్నగా నవ్వేడు.

"అతనికి మనసులో ఏదో బరువున్నట్టుంది. అది దించుకోడానికి అటువెళ్లి వుంటారులెండి...మీరాఖరికి హాస్పిటల్ నర్సు అవతారం ఎత్తేరేమిటి ? రోగులతో బాటు నేనూ మీకు కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను...నరే—వైద్యనాధం గారక్కడే వున్నారా ?"

"డాక్టరుగారా ? సింహాచలంగారి గదిలో వున్నట్టుంది. అయిదు నిమిషాల కింద అతన్ని చూశాను." అంది రమ.

అప్పుడే వచ్చిన సార్జెంట్ విశ్వాన్ని చూసి కనుబొమలు ఎగరేసేడు సుధాకర్.

"డాక్టరు వైద్యనాధంగారు ఇప్పుడక్కడ లేరు సార్. అర్జంటుగా బైటికి వెళ్లితీరాలని టౌన్‌వేపు వెళ్లేరు."

"ఎలా ?"

"మన జీపులో వెళ్దామనుకున్నారండి. కాని నేను వీలుపడదని చెప్పేను. సలీమ్ మోటారుబైక్ మీద వెళ్ళిపోయేరు."

"ఆల్ రైట్. ఇంకా——?"

"లైబ్రరీలో మీకోసం మధుమూర్తిగారు ఎదురు చూస్తున్నారు. ఆయన చాలా ఆవేశంలో వున్నట్టు కనిపించింది. అందుకే ఇలా వచ్చేను. అంతేగాదు సర్——"

ఏదో చెప్పబోయినవాడల్లా సుధాకర్ మొహంలోని 'ఆర్డర్'ని చూసి చప్పున ఆగిపోయేడు సార్జెంట్ విశ్వం.

"సరే——మీరు వెళ్ళండి రమగారూ!" అంటూ కిందికి దిగేడు సుధాకర్. లైబ్రరీవేపు వెళ్ళేముందు క్లోక్‌రూం, డ్రాయింగ్‌రూంలని పరీక్ష చేసేడు.

లైబ్రరీ గదిలోకి వెళ్ళేసరికి తలంతా కట్లతోవున్న మధుమూర్తి కన్పించేడు. అంతవరకూ కూర్చున్నవాడల్లా ఇన్‌స్పెక్టర్ని చూసి నిలబడ్డాడు. అతనేముందు మాట్లాడేడు.

"ఇలా ఈ పైశాచిక చర్యలు ఎంతకాలం కొనసాగుతాయి ఇన్‌స్పెక్టర్? తర్వాత ఏమవుతుంది? ఎవరికీ సరైన రక్షణలేదు. మిగతావాళ్ళ గురించి నాకనవసరం. నాకేం జరిగిందో ఒక్కసారి ఆలోచించండి నా జేబులో ఏదో దొరికింది. అది మీరే కనిపెట్టేరు. విందుకి ముందు నిక్షేపంగా నాకోటు జేబులో వున్న ఫొటో రెండు ముక్కలైంది. ఎవరుచేసేరు. మర్రిచెట్టు దగ్గర తువ్వల్లో నా బుర్రమీద బలంగా ఎవరో మోదేరు. ఎవరు? ఎందుకు? ఈ మూడింటికీ నాకు సమాధానం కావాలి——ఇన్‌స్పెక్టర్. ఈ ఘోరాలకి ఇక అంతంటూ లేదా?"

"మిస్టర్ మధుమూర్తీ——మరి కొద్ది క్షణాల్లో ఈ మిస్టరీ అంతా మంచు కరిగినట్లు క్లియరవుతుంది. అంతవరకూ మీరు కాస్త ఓపిగ్గా మాకు సహకరించాలి. ముందా సోఫాలో విశ్రాంతిగా కూర్చోండి."

"నో——థాంక్స్"

"డాక్టరుగారు మిమ్మల్ని హఠాత్తుగా నిర్లక్ష్యం చేసేరు. మీరూ హాస్పిటల్ నర్సుని నిర్లక్ష్యం చేసేరు——"

"నర్సా?"

"మిస్. రమ" నవ్వుతూ అన్నాడు సుధాకర్ "ఆమె మీ గురించి చాలా

కంగారు పడుతున్నారు. నేనూను. అదీగాక ఆమెగారి బాధ్యత నాపైన వేసుకున్నాను. ప్లీజ్ సిడౌన్!"

ఇన్‌స్పెక్టర్ సుధాకర్ మాటల్లోని మృదుత్వమూ, ఆప్యాయతా మధుమూర్తి మీద బాగానే పనిచేశాయి. నెమ్మదిగా సోఫాలో చేరగిలబడ్డాడు.

రమ తన మీద అంత శ్రద్ధ ఎందుకు చూపిస్తోంది? 'ఎందుకేమిటి-ఛ-నేను వట్టి మూర్ఖుణ్ని' అనుకున్నాడు.

"మీరు రైటే!" అన్నాడు.

"అన్ని విషయాల్లోనూ నేను రైట్ కాకపోవచ్చుగా! సరే, ఇప్పుడు మీరు చెప్పిన మూడు పాయింట్లగురించీ మనం మాటాడుకుందాం. మొదటిది: మీ తల మీది దెబ్బ. దాని గురించి నాకు తెలుసును. ఎవరు దానికి కారకులో నాకు తెలును!"

"ఎవరు?"

"చెప్తాను. నిజానికి బైట ఎవరూ లేరు. లింగస్వామి అసలెవర్నీ చూడలేదు. మిమ్మల్నెలాగైనా మర్రిచెట్టు దగ్గరికి తీసుకెళ్లి—అక్కడ మీకు అపకారం తల పెడదామనుకున్నాడు. డ్రాయింగ్‌రూంలో ఓ మూల కంచుతో చేసిన బుద్ధ విగ్రహాన్ని మీరు చూసేరా?"

"లేదు."

"లింగస్వామి డ్రాయింగ్‌రూంలో వున్నంతవరకూ అది టేబిలు మీదే వుంది. ఎవర్నో పొదలమాటున చూశానని మిమ్మల్నందర్నీ కంగారెత్తించేశాడు. అందరూ బైటికివరుగెత్తగానే ఆబుద్ధ విగ్రహాన్ని తను చేజిక్కించుకున్నాడు. లింగస్వామి ముందుచూపు లేని మనిషి. తెలివైనవాడే కాని ఏం లాభం? మిమ్మల్నెలా తల మీద కొట్టేక ఆ విగ్రహాన్ని జాగ్రత్తగా మళ్లీ డ్రాయింగ్‌రూంలో పెట్టేద్దామనుకుని వుంటాడు. కాని కుదర్లేదు. మర్రిచెట్టు దగ్గరే పొదలమధ్య పడేశాడు. మా సార్జెంట్ ఈ విషయం యిప్పుడే తెలియజేశాడు. ప్రస్తుతం దాని మీద ఏవైనా వేలిముద్రలున్నాయేమో పరీక్షచేయడం జరుగుతూంది. లింగస్వామి వేలిముద్రలు దాని మీద వుంటే మనం ఆశ్చర్యపోనక్కర్లేదు. ఏమంటారిప్పుడు— అలా జరిగి వుండడానికి అవకాశం వుందంటారా?"

అంగీకార సూచకంగా తలాడించేడు మధుమూర్తి.

"ఇప్పుడు మనం తెలుసుకోవల్సిన విషయం ఒకటుంది. దేనికైనా కారణం అంటూ ఒకటుందిగా! మీకా అపకారం లింగస్వామి ఎందుకు తలపెట్టేడు? మీ




నోరు తాత్కాలికంగా గాని, శాశ్వతంగాగాని మూయడానికి ఎందుకు ప్రయత్నించేడు?"

"బహుశః ఇదే కారణం అయివుంటుంది. లింగస్వామి తను చెప్పినట్టు 7 గంటల బండిలో ఇక్కడికి రాలేదు. 4.30 గంటల బండిలో నాతోబాటు ఇక్కడికి వచ్చేడు..."

"గుడ్. నాకప్పుడే అనుమానం వచ్చిందిలెండి...అయితే అబద్ధం ఆడడానికి కారణం?"

"కారణం ఏమో చెప్పలేను. గాని ఒక విషయం నాకు తెలుసు. లింగస్వామి వరహగిరిని స్టేషన్ దగ్గర కలుసుకున్నాడు..."

"వెరీ ఇంటరెస్టింగ్. గో ఆన్——"

"నాతో బాటే స్టేషన్ హోటల్లో టీ తాగేరు. చాలా సేపు ఏదో రహస్యంగా, ప్రేయసీ ప్రియుల్లా మాటాడుకున్నారు. ఇంకోవిషయంకూడా గమనించేను. ఏదో కాగితం మీద లింగస్వామి కాసేపు ఏదో రాసి వరహగిరికి యిచ్చేడు. ఇద్దరూ కలిసి దాన్ని చాలా సేపు పరీక్షగా చూసేరు. అంతే!"

"చాలు మిస్టర్ మధూ, ఈ వివరాలు చాలు" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"అన్నట్టు, ఇక్కడికి వాళ్ళిద్దరూ కలిసి రాలేదు."

"అఫ్‌కోర్స్. రాకూడదు కూడా! వరహగిరికి లింగస్వామిచ్చిన కాగితం ఏమిటో చెప్పమన్నారా? అదీ యింటి ప్లాన్. అందులో × గుర్తు ఓ చోట పెట్టబడి వుంది. అక్కడే సరిగ్గా సలీమ్ శవం మనకి లభించింది" అన్నాడు ఇన్‌స్పెక్టర్ సుధాకర్.

"అన్నట్టు నేను సలీం గురించి పూర్తిగా మర్చేపోయేను. ఒకవేళ సలీంని గాని వరహగిరి..."

"కాదు. సలీం మరణం నేను కేవలం యాదృచ్ఛికం అనే అనుకుంటున్నాను. ఆ మేప్‌లో × గుర్తు పెట్టబడినచోటు చాలా ప్రమాదకరమైనది. కత్తి, విషం, గిషం ఏమీ చేతలేకుండానే ఓ మనిషి నిండుప్రాణాలు తీయవచ్చు. అయితే సలీమ్ ప్రమాదవశాత్తూ మరణించేడని—నేను భావిస్తున్నాను. నా ఆలోచనలన్నీ ఎవరితోనేనా చర్చించుకుందామనిపించింది. అందుకే మీకివన్నీ చెప్పేస్తున్నాను..." అంటూ ఆ గది కిటికీవేపు నడిచేడు ఇన్‌స్పెక్టర్ సుధాకర్. తీక్షణమైన కళ్ళతో గదంతా కలియజూసేడు. గదిలో అక్కడక్కడ దుమ్మూ ధూళీ పేరుకుని వుంది. "గత రెండు రోజులుగా ఈ గదినెవరూ తుడిచినట్టు లేదు" అంటూ గోడకి అమర్చబడిన బుక్‌షెల్ఫు దగ్గర ఆగేడు. ఆ షెల్ఫు నిలువెత్తున వుంది. దాన్నిండా ఖాళీలేకుండా ఏవేవో పుస్తకాలున్నాయి. అందులోని ఓ పుస్తకం ఎందుకో సుధాకర్ దృష్టిని ఆకర్షించింది. దాన్ని చేతుల్లోకి తీసుకుని అట్టమీది పేరు చూసేడు. 'రహస్య ప్రదేశాలు'— అని వుంది. మళ్ళీ దాన్నక్కడే పెట్టేస్తూ వెనుదిరిగి మధుమూర్తిని చూసేడు.

"తర్వాత ఇంకోవిషయం మధుమూర్తిగారూ. ఇక్కడికి వచ్చిన ప్రతి వ్యక్తికీ సింహాచలంగారితో శత్రుత్వం వుంది. లేదా తీవ్రమైన అభిప్రాయ భేదాలున్నాయి. మీకూ ఈ విషయం వర్తిస్తుందని నా దృఢవిశ్వాసం... లింగస్వామీ, వరహగిరీ మత్తుమందుకలిపిన సిగరెట్లిక్కడికి తీసుకొచ్చేరు. ఎవరికోసమో ఉద్దేశింపబడిన ఆ సిగరెట్లని మతిమరుపుతో తామే తాగేరు..."

"అంటే అవి సింహాచలంగారికి ఇద్దామనుకున్నారా?"

"అవును. వాళ్ళ అసలు ప్లానేమిటో మనకి తెలీదు. బహుశః ఈ సిగరెట్ వల్ల తెలివి తప్పిపోతే మేడమీది కిటికీలోంచి ఇటుక దిబ్బలమీదికి విసిరేద్దామనుకున్నారేమో...సరే—ఇక మీరు చెప్పిన మూడు పాయింట్లదగ్గరికి వద్దాం. మీ కోటుజేబులో విషపదార్థంగల ట్యూబ్ దొరికింది. అది అక్కడికెలా వచ్చింది?"

సంజాయిషీ చెప్పుకుంటున్నట్టు ఇన్‌స్పెక్టర్ని చూసేడు మధుమూర్తి.

"ఇక్కడికొచ్చినపుడు అది నా జేబులో లేదు'"

"నేనూ అలాగే అయివుంటుందనుకుంటున్నా"

"మరా ట్యూబ్ నా జేబులోకి ఎలా వచ్చింది ?"

"మీరేమైనా వూహించగలరా ?" ఎదురుప్రశ్న వేసేడు ఇన్‌స్పెక్టర్.

"వూహించడానికేముంది? ఎవరో నా జేబులో పడవేసి వుండొచ్చు."

"ఎవరు :"

"ఆ చీకట్లో రమ ముఖంలోని ఆందోళన కనిపించింది. ఎవరో మా కుర్చీల వెనకాల తిరుగుతున్నట్టనిపించి—ఒకర్ని పట్టుకున్నాను. గాని అతను తప్పించుకున్నాడు. తర్వాత మరొకర్ని పట్టుకున్నాను ... ఈలోగా సింహాచలంగారు కొవ్వొత్తితో వచ్చేరు. నేను పట్టుకున్నది రాజారావుగార్ని. మొట్టమొదట నేను పట్టుకున్నది వరహగిరిని అనుకుంటాను. అతను టేబిలు కింద దాక్కున్నాడు."

"మీ సీటుకి ఎవరు బాగా దగ్గరగా వున్నారు ? రాజారావు, లింగస్వామి, వరహగిరి వీళ్ళుకాక ?"

"శివకోటి."

"అవును, శివకోటి. అతసీవని చేయడానికి కారణమూ, అవకాశమూ రెండూ వున్నాయి. సింహాచలంగారు లైబ్రరీరూంనుంచి తిరిగివచ్చేసరికి అతను నిశ్చలంగా కూర్చుని వున్నాడు. రివాల్వర్ ప్రేలుడుగాని, సింహాచలంగారి కేకలుగాని, కుర్చీల వెనక ముష్టియుద్ధాలుగాని అతన్ని కదిలించలేదు. కారణం : అతను వచ్చినపని నెరవేరింది. సింహాచలంగారి గాను అతనికి అందుబాటులో లేదు. ఎలాగోలా ఆ విషం సీసాని డిస్పోజ్ ఆఫ్ చేద్దామనుకున్నాడు. చీకట్లో గుట్టుచప్పుడు కాకుండా దాన్ని మీ జేబులో పడేసి ఏమీ ఎరగనట్టు కూర్చున్నాడు. సింహాచలంగార్ని చంపే వుద్దేశ్యంతోనే 'ఇది' శివకోటి తెచ్చివుంటాడు. ఎంచేతో మధ్యలో మనస్సు మార్చుకుని—దీన్నెలాగైనా ఒదుల్చుకుందామనుకునివుంటాడు... మరొక విషయం—ఈ ట్యూబు మీద శివకోటి వేలిముద్రలు వున్నాయి. మీవి లేవు."

"సింహాచలం గారికొచ్చిన ఆకాశరామన్న వుత్తరం సంగతో ? అది కూడా శివకోటే రాసివుంటాడా ?" మధుమూర్తి ప్రశ్నించాడు.

ఇన్‌స్పెక్టర్ సుధాకర్ ఆలోచనాపూర్వకంగా తలాడించేడు.

"ఈ విషయం తెలుసుకోవాలంటే— మీరు నాకు కొంత సమాచారం చెప్ప గలగాలి. హాలుకి చివరున్న క్లోక్‌రూంలో కదండీ ఓవర్‌కోట్లు వున్నాయి? అక్కడికి వెళ్లే అవకాశం శివకోటికి వుందా? కృష్ణభగవాన్లుగారి తర్వాతేనా శివకోటి వచ్చేడు?"

"లేదు. అందరికన్నా ముందు శివకోటి వచ్చేడు. ఆ తర్వాతే అందరం వచ్చేము. కూర్చున్న చోటునుంచి శివకోటి అస్సలు కదల్లేదు."

"అయితే కృష్ణభగవాన్లుగారి కోటుజేబులో 'వుత్తరం' శివకోటి పనికాదు. లింగస్వామిగారి కోట్లోంచి జేబురుమాలు తీయడంకూడా అతని పనికాదు. మరోసంగతి—మీ జేబులోని ఫొటో ఒకటి రెండు ముక్కలై పడుంది ... ఇదీ అతని పని కాకపోవచ్చు..."

"ఇక్కడున్న ఎవరికీ ఆ ఫొటో గురించి ఏమీ తెలియదు. ఇక్కడికొచ్చి నప్పుడు ఫొటో మామూలుగానే వుంది. ఎవరో దాన్ని ఇక్కడే చింపివుంటారని నా నమ్మకం!"

"ఎవరై వుంటారు?"

"సింహాచలంగారు!"

"అంటే—ఆ ఫొటో గురించి సింహాచలంగారికి బాగా తెలుసన్నమాట!"

"ఇన్‌స్పెక్టర్‌గారూ! మీరిన్ని ప్రశ్నలు వేసేరు. అన్నిటికీ సమాధానాలు చెప్పేను. నాదో ప్రశ్నవుంది. దానికి మీ సమాధానం కావాలి! సింహాచలంగారి జీవితం గూర్చి మీకేమేనా తెలుసా?"

"అంతగా తెలీదు..."

"ఆ వివరాలన్నీ నేను చెప్తాను. సింహాచలం బెంగాల్లో దాదాపు పదేళ్లు న్నాడు. కలకత్తాలో ఓ హోటలుంది. దాని యజమాని తెలుగువాడే. ఆ హోటల్లో సర్వర్‌గా జీవితం ప్రారంభించేడు. యజమాని, సాటి తెలుగువాడని ఆదరణ చూపించడంతో హోటల్ మేనేజర్‌గా మరో మెట్టు ఎక్కేడు. మేక తోలు కప్పుకున్న పులి తన సహజగుణం మానుతుందా? అందినంతవరకూ డబ్బు అపహరించి మరోసారి—ఎక్కడికో పారిపోయేడు... ఆ హోటల్ యజమాని పేరు సహజానందమూర్తి!"

"అలాగా!" అన్నాడు సుధాకర్.

"నేను చెప్పకపోయినా మరో విషయం మీరు గ్రహించేవుంటారు. నా




జేబులో వున్న ఆ ఫొటో సహజానందమూర్తిగారి కూతురు చిన్నప్పుడు—అంటే పద్దెనిమిదేళ్ళ వయసులో తీయించుకున్నది. ఇటీవలే ఆమె మరణించింది. చనిపోయేముందు సింహాచలంగారికి సంబంధించిన కొన్ని విషయాలు చెప్పింది. అవి కనుక్కోడానికీ—నా తండ్రిని చూడటానికీ వచ్చేను. ఇప్పుడు మీరు గ్రహించే వుంటారు. సింహాచలంగారు కలకత్తానుంచి పారిపోవడానికి నేను నా తల్లి గర్భంలో పడడమే కారణం అన్పిస్తుంది ... నా తల్లిని వంచించిన ఆ నీచుణ్ణి చూడడానికే ఇంతదూరం ప్రయాణంచేసి వచ్చేను ఇన్‌స్పెక్టర్! మీరన్నట్టు అతన్ని చంపే ఉద్దేశ్యం నాకూ వుంది. కనీసం పగ వుంది. నేనూ అనుమానితుణ్ణే!"

"ఆల్‌రైట్. ఇంకొక్క ప్రశ్నవుంది మధుమూర్తీ. నిన్న సాయంకాలం మీరిక్కడికి వచ్చినప్పుడు—మీరెవరో—సింహాచలంగారికి తెలుసా?"

"తెలుసనుకుంటాను. నా పేరు చెప్పేను. తర్వాత ఫొటో చూశాడుగా.. నేనెవరయిందీ వెంటనే తెలిసివుంటుంది."

"భయంకరమైన చీకటి. భూతాల కబుర్లు. ఎర్రగులాబీలు. ఇవన్నీ అందరి మనస్సుల్లోనీ భయం రేకెత్తించేయి. ఒకరు భయపడ్డ కుందేల్లా టేబిలు కింద దాక్కున్నారు. అది ఇంకొకరికి భయం కల్గించివుంటుంది.

దాంతో అతను మరో పిచ్చిపని చేశాడు. రివాల్వర్ అంటే ఏమిటో తెలీని కృష్ణ భగవాన్లు దాన్నెక్కడో సంపాదించేడు. సింహాచలంగార్ని చంపడానికో భయ పెట్టడానికో, లేక ఆత్మరక్షణకో తెచ్చుకున్నాడు. దాన్ని బైటికి తీసే తొందర్లో అది పేలిపోయింది. దాంతో భయపడి టేబులు కింద పడేశాడు. అది సరిగా వరహగిరి దగ్గర పడింది. ఏమిటో అనుకుని దాన్ని పట్టుకున్నాడు. అదీ మళ్ళీ పేలింది. భయపడి తనూ కింద పడేశాడు. ఇదీ జరిగిన కథ! థాంక్యూ మిస్టర్ మధుమూర్తీ. చాలా విషయాలు చెప్పేరు. ఇఖ మీరు వెళ్ళవచ్చు."

''ఇంతకీ మానాన్నగారిని చంపిందెవరో మీకు తెలుసా ?''

''తెలుసనే అనుకుంటున్నాను. కాని కొన్ని సందేహాలున్నాయి. అవి తీరగానే హంతకుడెవరైందీ మీకు చెప్తాను.''

''మిమ్మల్ని ఇబ్బంది పెడుతున్నందుకు చాలా విచారిస్తున్నాను వేదాచలం గారూ ! మిమ్మల్ని ఒకే ఒక ప్రశ్న అడగడానికి వచ్చేను. అవును అంటే కుడికన్ను మూయండి. లేదు అంటే ఎడమకన్ను మూయండి ... ఏం ? మీ అబ్బాయి సింహాచలంగార్ని ఎవరో హత్యచేసేరు. ఎవరో మీకు తెలుసా ?''

వేదాచలం సూటిగా ఇన్‌స్పెక్టర్ని చూసేడు. హఠాత్తుగా కుడికన్ను మూసేడు. అంటే—హంతకుడెవరో తెలుసన్నమాట ?

''సరే. నేనిక్కడికొచ్చిన అందరిపేర్లూ చదువుతాను. హంతకుడి పేరు రాగానే నన్ను ఆపండి.'' అంటూ ఇన్‌స్పెక్టర్ విందుకొచ్చిన 13 గురి పేర్లూ చదివేడు. నౌఖర్లపేర్లూ చదివేడు. వేదాచలం చెక్కుచెదరకుండా కూర్చొని వున్నాడు. అంటే ఎవరూ అతన్ని చంపలేదా ?

ఇన్‌స్పెక్టర్ సుధాకర్ ముఖంలో ఆశ్చర్యంకన్నా నిరాశే ఎక్కువగా ప్రతిబింబించింది.

## 22

"అతిథులందర్నీ డైనింగ్‌హాల్లో సమావేశపర్చేదా, సార్ ?" అన్నాడు సార్జెంట్.

"ఎస్."

మరుక్షణంలో అతిథులందరూ గబగబ మేడమెట్లెక్కిన చప్పుడు. సందడిగా

ఎవరి సీట్లలో వారు కూర్చున్నారు. శిరీష, శివకోటి, వేదాచలం మాత్రం సీట్లలో లేరు. సింహాచలం ఎలాగూ లేడు.

"డియర్ ఫ్రెండ్స్, మళ్ళీ మీకు మరోసారి శ్రమ యిస్తున్నందుకు మన్నించండి. ఈ హత్యారహస్యం భేదించడంలో మీరు నాకెన్నో విధాల సహకారం అందజేశారు. అందుకు ఎంతయినా కృతజ్ఞుణ్ని" అన్నాడు సుధాకర్.

ఎవరూ మాట్లాడలేదు. అందరూ ఇన్‌స్పెక్టర్ సుధాకర్‌నే చూస్తున్నారు.

"ఇప్పుడు నా ఎదురుగా నాలుగు ముఖ్యమైన సమస్యలున్నాయి. సింహాచలంగారిచావు, సలీమ్ మరణం, మధుమూర్తిగారిపై అఘాయిత్యం, రివాల్వర్ ప్రేలుళ్ళు..."

హఠాత్తుగా కృష్ణభగవాన్లు లేచేడు. "అయ్యా, అది నా పనే—నేనే పేల్చేను..." అన్నాడు అలివేలుమంగ ఆశ్చర్యపోతూ భర్తని చూడసాగింది.

"ఎందుకలా చేసేరో చెప్తారా, కృష్ణభగవాన్లుగారూ ?"

"చూడండి అదేమిటి, ఎర్రని రంగు. ఎర్రని వెలుగు చావు గురించి కబుర్లు. భయపడ్డాను. ఆత్మరక్షణకి పిస్తోలు తీసేను. ఆ గాభరాలో పేలిపోయింది. భయంగా కింద పడేసాను...అంతేగాని కావాలని పేల్చలేదు. నా మాట నమ్మండి."

"తర్వాత—మధుమూర్తిగారిపై బలప్రయోగం : మీకెవరిమీదన్నా అనుమానం వుందా మధుమూర్తిగారూ ?" అన్నాడు సుధాకర్ చిన్నగా నవ్వుతూ.

నిప్పులు కక్కుతూ లింగస్వామిని చూసేడు మధుమూర్తి "అనుమానమేమిటి ? నన్నెవరు కొట్టేరో—నాకు బాగా తెలుసు. అయితే ఆ సంగతి ఇప్పుడప్పుడే చెప్పను." అన్నాడు.

"సరే—ఇఖ సలీమ్ సంగతి. అతను హత్యచేయబడడానికి అవకాశంలేదు. కేవలం యాదృచ్ఛికంగా ఇటుకలపై తలపడి మరణించేడు. డాక్టర్ వైద్యనాథంగారుకూడా ఈ విషయాన్ని సమర్థించేరు. ఇంక మిగిలింది—సింహాచలంగారి మరణరహస్యం...సింహాచలంగారు లైబ్రరీ రూంలోకి వెళ్ళిన క్షణాలు గుర్తుకి తెచ్చుకోండి..."

"మళ్ళీ మరో నాటకం ప్రారంభించాలా?" అన్నాడు లింగస్వామి తీవ్రంగా.

"అఖర్లేదు. సింహాచలంగారే ఆ పనిచేస్తారు..." అంటూ లైబ్రరీరూంలోకి నడిచేడు ఇన్‌స్పెక్టర్ సుధాకర్.

అతిధులందరూ మూసుకున్న లైబ్రరీ రూం తలుపుని తదేకంగా చూడ సాగేరు.

మరుక్షణంలో సింహాచలం గొంతు అందరికీ వినిపించింది.

"వెధవన్నర వెధవలు. పుస్తకాలు సరిగా పేర్చడంకూడా రాదు. ఇదేమిటి రామాయణం. ఇది బైబిలు...ఉమర్ ఖయాం 'మృత్యువుకథ' ఎక్కడ పెట్టేను చెప్మా ?"

సందేహం లేదు, సింహాచలం గొంతే! అతిధులందరూ నిర్విణ్ణులయ్యేరు- ఇదెలా సంభవం ?! ఎలా ?

"పెట్టిన పుస్తకం. పెట్టినచోట వుండదు......ఛ...ఛ...!"

వరహాగిరి గజగజ వణకనారంభించేడు. కృష్ణభగవాన్లు అర్థనిమీలిత నేత్రాల్తో ఆంజనేయ దండకం మనస్సులో చదువుకుంటున్నాడు.

"గదిలో శవం. మిస్టరీలోని హిస్టరీ. చచ్చిన శవం, శవంచేసిన హత్య, శవానికో సవాలు, వురితాడు, పలకల వెండిగ్లాసు..."

లింగస్వామి కోపం పట్టలేకపోయేడు. రెండు చేతుల్తోనీ తలుపులు బాదేడు. "ఆ గొంతుక సింహాచలంది కాదు. ఇదంతా శివకోటి నాటకం. అంతే! శివకోటీ కమౌట్ !!!" అన్నాడు.

అంతలో గడియారం చప్పుడు వినిపించింది. సరిగా 9 గంటలు కొట్టింది. ఇంకా కొడుతుందనుకున్నాడు. లేదు. వెంటనే లైట్లారిపోయేయి. నిశ్శబ్దం

"ఏమైంది ? లైట్లెవరు ఆర్పేరు ? ఎవరూ ?"

"ఓగాడ్ !" అన్నాడు లింగస్వామి భయంగా.

"ఎవరూ మాట్లాడరేం ? నాన్సెన్స్! ఈ తలుపుకి తాళం వేసిందెవరు ? ఎవరు ?? ఎవరూ ???" కంచులా మోగింది సింహాచలం గొంతు.

మరుక్షణంలో లైబ్రరీరూం తలుపు తెరుచుకుంది. గుమ్మంలో కొవ్వొత్తి పట్టుకుని నిలబడ్డాడు సుధాకర్. కొంచెందూరం ముందుకి నడిచి నేలమీద పడున్న తాళం చెవి అందుకున్నాడు. సార్జెంట్ విశ్వాన్ని చూసి ఏదో సైగ చేశాడు......మరి కొన్ని క్షణాల్లో సింహనిలయంలో లైట్లు వెలిగాయ్!




## 23

ఇన్‌స్పెక్టర్ దారి చూపగా అందరూ ఒక్కుమ్మడిని లైబ్రరీరూంలోకి వెళ్లేరు. అక్కడ టేబిలు మీద టేప్‌రికార్డర్ రూపంలో వున్న సింహాచలాన్ని చూసి

"ఈ కేసు నన్ను ముప్పతిప్పలూ పెట్టి మూడు చెరువులనీళ్లు తాగించింది. అసలు జరిగినదేమిటో చెప్తాను వినండి. మొట్టమొదట ఈ గదిలోకి రాగానే ఈ టేబిలు నన్నాకర్షించింది. ఏదో వస్తువు ఇటీవలే ఇక్కడ పెట్టబడినట్టూ మళ్ళీ తొలగించబడినట్టూ కనుక్కున్నాను. అదేమిటి...పైన శిరీషగారి గదిలో వుండగా ఈ టేప్ రికార్డరుని చూశాను. అంతే! అన్నీ మంచు విడినట్టు విడిపోయేయి.

"సింహాచలంగారు ఈ గదిలోకి రాగానే లోపల గడియ వేసుకున్నారు. టేప్ రికార్డర్‌ని ఆన్ చేశారు. ఆ పుస్తకాల బీరువా పక్కని బటన్‌వుంది. అది నొక్కితే హాల్లోకి మార్గంవుంది. మీరందరూ ఆయన గొంతువిని ఆయనే ఇక్కడే వుంటారనుకుంటారు. అవునా, కాని ఆయన తిన్నగా క్లోక్‌రూంలోకి వెళ్లి మధుమూర్తిగారి జేబులోని ఫొటో రెండుముక్కలు చేశారు. శిరీషగారు వాడే సెంటు మెయిన్ స్విచ్ తెరకి పూశారు. లింగస్వామిగారి రుమాలుతో మెయిన్ స్విచ్ ఆఫ్ చేశారు. దాన్నక్కడే పడేశారు. గబగబ మళ్ళీ ఈ గదిలోకి వచ్చి ద్వారం

మూశారు. క్రౌర్యాత్రితో తలుపు తీసుకుని మీముందు నిలబడ్డారు నేలమీదతాళం చెవి దొరికినట్టు నటించేరు. నిజానికది అతని చేతుల్లోనే వుంది. యథాప్రకారంగా తన కుర్చీలో కూర్చుని అంతకుముందే విషం కలపబడిన ద్రాక్షరసం తాగేరు అంతే! ఇలా జరిగి వుండొచ్చని నేను అనేక కారణాలవల్ల భావించేను. ప్రయోగాత్మకంగా అమలుచేసి నిజం అని నిర్ధారణ చేసుకున్నాను..."

"అది సరే—క్రూరుడు! ఎందుకిలా చేశాడు?" అన్నాడు రాజారావు మధ్యలో.

"చెప్తా. ఇంతకు ముందే డాక్టర్ వైద్యనాధం నాకు టెలిఫోన్‌చేసి కొన్ని ముఖ్యమైన విషయాలు చెప్పారు సింహాచలం జీవితంతో చాలా విసుగెత్తిపోయేరు. రెండుమూడు సార్లు ఆత్మహత్యకి ప్రయత్నించేర్టకూడా. అయితే మీ అందరూ అతనికి శత్రువులు...మిమ్మల్ని బాధిస్తే అతనికి ఆనందం. సాధారణంగా మూడోకంటి మనిషి లేకుండా ఎవరయినా ఆత్మహత్య చేసుకుంటారు... సింహాచలంగారు మీఅందరిముందూ ఆత్మహత్య చేసుకున్నారు...ఆయనన్నట్టు—చచ్చి సాధించేరు..." అని ముగించేడు డిటెక్టివ్ ఇన్‌స్పెక్టర్ సుధాకర్.

"మరి ఆయన వీలునామా సంగతి...?" అన్నాడు వెంకటాచలం పిల్లిలా ఇన్‌స్పెక్టర్ని చూస్తూ.

"ఆ విషయంకూడా ఇప్పుడే తెలిసింది. సరిగ్గా తన మరణానికి ఓగంట ముందు ఆయన తన వీలునామా మళ్ళీ మార్చేరట! దాదాపు 20 లక్షలు ఖరీదు చేసే అతని ఆస్తి అంతటికీ వారసుడు మిస్టర్ మధుమూర్తి! సింహాచలంగారి కుమారుడు!!"

అందరికళ్లూ మధుమూర్తివేపు తిరిగేయి. మధుమూర్తి రమ కళ్లకోసం చుట్టూ వెదికేడు.

మధుమూర్తి నరనరాల్లోనీ విద్యుత్తుప్రాకినట్టయింది. గత స్మృతులు అతన్ని ఒక్కసారిగా ముప్పిరిగొన్నాయి. అత్యంత క్లిష్ట పరిస్థితులలో తనకి జన్మిచ్చిన మాతృమూర్తి, ఒకపూట తింటే మరొకపూట తిండిలేని గడ్డురోజులూ, వీధి దీపాల కింద పరీక్షలకని చదువుకున్న చెడ్డరోజులూ గుర్తుకి వచ్చేయి. 'అమ్మ బ్రతికి వుంటే, ఎంత బాగుండును!' అనుకున్నాడు.

వేడి నిట్టూర్పు వదుల్తూ రమని చూశాడు మధుమూర్తి.






## 1

నా మొదటి ఢిల్లీ యాత్రలో అది డిసెంబర్ చివరిరోజు.

"అర్ధరాత్రి పన్నెండు కొట్టగానే అందరంకలిసి కొత్తసంవత్సరానికి స్వాగతం చెప్పాలి." క్లబ్బులో డిన్నర్ తీసుంకొటూ అన్నాడు కుమార్ ఆ సాయింత్రం.

వందల ఎకరాల ప్రాంగణం. ముందు పెద్ద షామియానా. వెలిగిపోతున్న దీపాల తోరణాల కాంతుల్లో చిత్రవిచిత్రమైన దుస్తులతో, సోయగాలతో, అలంకారాలతో, సగం సగం కనిపించే వంపుల శరీరాలతో వేయి సెలయేళ్ళ కిలకిల

లను మరపించే నవ్వుల పొంగులతో నవనాగరికతను కరగించి వంటికి పూసుకున్న స్త్రీలోకం ఎదురుగుండా కనిపిస్తూ చేతికందక కవ్వించే అన్ని అందాలను భరించటం కష్టమనిపించింది.

ఒక మూలగా కనిపించింది మా టేబిల్. వందగజాల దూరంలో కొన్ని జంటలు డాన్స్ చేస్తున్నాయి. పరామర్శలు-పలకరింపులు-మందహాసాలు-ఛలోక్తులు-శిరఃకంపనలు-పరవళ్లుతొక్కుతూ విరిగిపడుతున్న నయాగారాలాంటి జీవితం!

"మా ఫ్రెండ్ హేమంత్. ఆయన అర్ధాంగి మిసెస్ మాలిని" అంటూ ఓ జంటను పరిచయం చేశాడు కుమార్ తెలుగులో.

అతను బెంగాలీలా వున్నాడు. ఆమె ఏ ప్రాంతానికి చెందిందో అర్థంకాలేదు.

ఆమె తెలుగులో మాట్లాడింది స్పష్టంగా.

"మీకు తెలుగు వచ్చా?'' అన్నాను.

"అక్షరాలా తెలుగు ఇల్లాలు. అసలు వూరు బాపట్ల. ఇక్కడ తెలుగు లెక్చరర్‌గా వుంటున్నది" అన్నాడు కుమార్.

భార్యాభర్తలిద్దరూ చూడటానికి ముచ్చటగా వున్నారు.

మూడవ ప్రపంచయుద్ధం దగ్గరనుంచి నగరంలో ఆడుతున్న సినిమాలదాకా అనేక విషయాలగురించి దొర్లుతున్నాయి సంభాషణలు.

"అరుణ యింకా రాలేదు," అన్నాడు హేమంత్.

"ఆవిడగారికోసం అలా కలవరించి పోతున్నారేం బాబూ" అంది విసుగ్గా మాలిని అదొకరకం కోపంతో...

"నీకు డాన్స్ వచ్చా?" అన్నాడు హేమంత్.

"రా"దన్నాను.

"మీ అరుణను నేర్పమనండి" అంది మాలిని.

కిలకిల నవ్వినట్లు కలుసుకుంటున్న గ్లాసులు-గలగలమంటూ కబుర్లు.

సమయం గడుస్తున్నకొద్దీ చెప్పేవారి సంఖ్య పెరిగి, వినేవారి సంఖ్య తగ్గుతోంది.

"ఏపిల్ జ్యూస్" అంది మాలిని.

"బ్లాక్ డాగ్‌తో గుడ్‌బై చెప్పు మాలినీ ఈ సంవత్సరానికి" అన్నాడు కుమార్.

"ఇందులో మొహమాటం లేదు. కావాలంటే తీసుకో" అన్నాడు హేమంత్.

"సరే—జస్ట్ టూ డ్రాప్స్" అంది నవ్వుతూ మాలిని.

గ్లాసులు కిలకిల నవ్వినట్లు కలుసుకున్నాయి. మళ్ళీ కబుర్లు.

"అరుణ నన్నెప్పుడూ ముద్దుగా 'మురారీ' అని పిలుస్తుంది తెలుసా" అన్నాడు హేమంత్ అసందర్భంగా.

"అరుణ డైవర్స్ చేస్తూందిట?"

"అన్నారెవరో. నిజమేనంటావా?"

"నృత్యప్రదర్శన లివ్వటానికి అమెరికా వెళ్తూందిట"

"నన్ను సెక్రటరీగా వెంట తీసికెళ్తే బావుణ్ణు–నిజం బ్రదర్! అటువంటి ఏంజల్ చీరలు మడతపెట్టటంలోకూడా ఆనందముంది. ఏమంటావ్?" అంటూ నా భుజంమీద చరిచాడు హేమంత్ బిగ్గరగా నవ్వుతూ తెరలుతెరలుగా దగ్గినట్లు.

"ఛీ! ఛీ! సిగ్గు లేకపోతే సరి!" మాలిని కళ్ళు ఇంకా ఎర్రబడ్డాయి.

అందరూ మాట్లాడుతున్నారు. ఎవరు వింటున్నారో తెలియదు.

మరో పెద్దమనిషి కళ్ళజోడు సర్దుకుంటూ వచ్చి "బ్రహ్మాండమైన వార్త. నార్త్ అవెన్యూనుంచి వస్తూంటే దోవలో ఒకానొక విచిత్రమైన స్థలంలో కనిపించింది అరుణ – నా కళ్ళను నేనే నమ్మలేకపోయాను" అంటూ ప్రకటించాడు బిగ్గరగా.

"ఎక్కడ?" అన్నాయి పదిగొంతులు.

"శంకరమఠంలోకి వెళ్తూంది. నేనూ వెనకాలే వెళ్లాను. స్వామివారికి నమస్కరించి అక్కడే కూర్చుండిపోయింది. భగవద్గీతా రహస్యాన్ని స్వామివారు చెబుతున్నారు–ఈవిడగారు వింటూంది! మూడో ప్రపంచయుద్ధం రాక తప్పదు."

"మరి ఈవేళ ఈ క్లబ్బులో ఆవిడ డాన్సుందిగా!"

"రాదేమో"

"అదుగో అరుణ!"

ఆమె రాక విపరీతమైన సంచలనాన్ని కలిగించింది. ఆ హాలులో అప్పుడు చూశాను అరుణను. నీలిరంగు నైలానుచీర కట్టుకుంది. వీపుమీద సగభాగానికి పైగా 'V' ఆకారంలో కత్తిరించిన చోళీలోంచి మెరుస్తూంది శరీరం.

సరాసరి వేదికదగ్గరకు వెళ్తూ మా బృందాన్నిచూసి కొంటెగా నవ్వుతూ చెయ్యి వూపింది.

రమ్మని సైగచేశాడు కుమార్. కేకపెట్టాడు హేమంత్. ఆమె వినిపించుకో లేదు.

ఆమె రాకతో అంతకుముందు వెలుగుతున్న దీపాలు వెలవెలపోయాయి. ఎదురైన వారందరూ పలకరిస్తున్నారు. ఆమె భంగిమలు మార్చిన చిరునవ్వు లతో బదులు చెబుతోంది.

నేను అరుణను గుర్తుపట్టాను.

* * *

## 2

"అరుణ నాకు ఇంచుమించు ఇరవై సంవత్సరాలుగా తెలుసు. మా వూరి జిల్లాబోర్డు హాస్పిటల్‌కు వాళ్ల నాన్న-డాక్టర్ నాయుడుగారు-ట్రాన్స్ఫరై వచ్చే సరికి అరుణ ఏడెనిమిదేళ్ల పిల్ల. మా ఇంట్లోనే సగభాగంలో వాళ్లు అద్దెకుండే వారు. ఆ వయసులో, ఆ పల్లెటూళ్లో ఎప్పుడూ తెల్లని ఇస్త్రీబట్టలు కట్టుకునేది అరుణ ఒక్కతే. "దొరసానుల అమ్మాయిలా వుంది," అనుకునేవాళ్ళు ఆమె క్రాపింగ్ చూసినవాళ్ళంతా. డాక్టరుగారికి సహజంగా ఊళ్లో గౌరవముంది. దాన్నిబట్టి వాళ్లమ్మాయికీను. నాకు గుర్తున్నంతవరకూ, కలెక్టరు మాదిరిగా, పోలీసు యిన్‌స్పెక్టరు మాదిరిగా, కాకీరంగు దొరటోపీ పెట్టుకొని కనిపించేది డాక్టరుగారొక్కరే.

"వాళ్లు నిజానికి నాయుళ్లు కాదు-మరేదో కులం'' అన్నాడు కాంపౌండర్ శర్మ. డాక్టరుగారు ఈ మాట విని శర్మను డిస్‌మిస్ చేశారు. ఏ కులమైనా డాక్టరు గారు డాక్టరుగారే.

ఈ పరిస్థితుల్లో 'అందరిలాంటి పిల్లను కాదు' అనే అభిప్రాయం సహజంగా కలిగింది, అరుణకు. అప్పటికే అందరూ 'చక్కటి పిల్ల' అంటూండేవారు.

కొనతేలిన గడ్డం-పల్చటి బుగ్గలు-చురుకైన పెద్దకళ్లు-గడ్డంమీద కనిపించే మిరియపు గింజంత అందమైన నల్లటి పుట్టుమచ్చ-పచ్చటి నున్నటి శరీరం పౌడర్ పరిమళం-అన్నీ గుర్తుకువచ్చాయి.

ఆ డాక్టరుగారి రాకతో మా కుటుంబానికి నాకూ కూడా ఆ వూళ్ళో కొంత ప్రత్యేకత ఏర్పడింది. మా నాన్నగారితో మాత్రమే ఆయన కాస్త చనువుగా మాట్లాడేవారు. అలాగే అరుణకూడా నాతోనే ఎక్కువ ఆడుకుంటూ వుండేది.

మొదటినుంచీ ఆమెలో అహంభావంపాలు ఎక్కువనుకుంటా. ఆమె మాటకు ఎవరు ఎదురు చెప్పినా-"యింక నీతో మాట్లాడను'' అంటూ బెదిరించేది. చిత్ర మేమిటంటే ఆ బెదిరింపు రామబాణంలా పనిచేసేది.



డాక్టరుగారికికూడా అరుణ ఒక్కగానొక్క కూతురు. భార్యాభర్తలిద్దరికీ పంచప్రాణాలు బిడ్డంటే. తండ్రిమీద కోపంవస్తేకూడా బిగదీసుకుపోయేది అంతటి మనిషీ హడిలిపోయేవాడు. తండ్రిచేత గుంజీలు తీయించేది. లెంపలు వేసుకోమనేది.

అయిదోక్లాసు చదువుకున్నాం ఇద్దరం కలిసి. తెలుగులోనూ లెక్కల్లోనూ, నాకంటే తక్కువొచ్చాయి మార్కులు. అంతటితో వారంరోజులు నాతో మాట్లాడటం మానేసింది. నేను పలకరించిచూచి అటు వెళ్ళటం మానుకున్నాను.

ఒకరోజు రుసరుసలాడుతూ వచ్చి "నాతోపాటు ఇంగ్లీషు చదువు, చూద్దాం" అంది.

"నాకు రాదు" అన్నాను. "మరి ఆ గొప్పలెందుకు? సిగ్గులేకపోతే సరి?" అంటూ వెళ్ళిపోయింది.

అరుణ బాల్యం గురించి నాకు బాగా గుర్తున్న విషయాలలో మరొకటి— ఆమె ఎక్కువగా మగపిల్లలతో కలిసి ఆటలాడేది. మాతోపాటు పరిగెత్తేది. చెర్లోపడి ఈతలు కొట్టేది. "మా పిన్ని కారు నడుపుతుంది తెలుసా? పిన్ని మా నాన్నకంటే పెద్ద డాక్టరు. నేనూ నడుపుతా కారు పెద్దయ్యాక" అంటూండేది.

ఆమె తెలుగులో తప్పినప్పుడు డాక్టరుగారు మాస్టార్ని పిలిపించి "మా అమ్మాయి చదవాలేకాని, మీ పిల్లలందరికంటే తెలివికలది తెలుసా?" అంటూ కన్నెర్రచేయటం జరిగింది.

"అయ్యో! డాక్టరుగారూ, ఎంతమాట! వెధవ మార్కుల దేముందండీ? పెద్ద పరీక్షలకు పేపరు ఎలా రాసినా, అమ్మాయిగారికి ఫస్టుమార్కు వేయించకపోతే

నా తల తీయించండి," అంటూ మాస్టారు క్షమార్పణ చెప్పుకుని, లెంపలేసుకుని, నిద్రలేమికి మందు పుచ్చుకుని వెళ్ళిపోవటం అరుణ కళ్ళారాచూసి, మా అందరికీ చెప్పి, "మా నాన్నంటే ఎంత గొప్పవాడో అర్థమయిందా! మాస్టారికికూడా హడల్! నన్ను పెద్ద డాక్టరు పరీక్ష చదివిస్తాడట. మా పిన్నిలా నేనూ కారు నేర్చుకుంటా" అంది చక్రాల్లాంటి కళ్లు గిరగిరా త్రిప్పుతూ.

మా నోటివెంట మాట రాలేదు.

అరుణ తల్లిపేరు కోటీశ్వరమ్మ. ఎంతవరకూ చదువుకుందో తెలియదుకాని సగానికి సగం ఇంగ్లీషుమాటలు జోడించి మాట్లాడేది, పొట్టపొడిచినా ఇంగ్లీషు ముక్కలు రాని తోటి యిల్లాండ్రతోకూడా. ఒక స్వరూపంలేని ఆ వూరి మహిళా సమాజానికి ఆమె అధ్యక్షురాలు. మకుటంలేని మహారాణి. అంతకుముందు ఆ పీఠాన్ని అలంకరించి, తిరుగులేకుండా, కాపరానికి వచ్చినప్పటినుంచీ పరిపాలిస్తున్న మునసబుగారి భార్య రాఘవమ్మ కూడా డాక్టరుగారి భార్యనుచూసి, ఆమె ఇంగ్లీషు మాటలు విని బేషరతుగా లొంగి కుర్చీ ఖాళీచేసింది.

డాక్టరుగారి భార్య చౌకబారు చీరలే కడుతుందని రాఘవమ్మ ఎవరితోనో అన్నట్లు—ఆ ఎవరో మరెవరితోనో చెప్పగా తాను విన్నట్లు, ఎలిమెంటరీస్కూలు హెడ్‌మాస్టారి భార్య రహస్యంగా డాక్టరుగారి భార్య చెవుల్లో ఊదినప్పుడు మాత్రం రవ్వంత రభస జరిగినమాట నిజం. ఆ మాటవిని, మరొక సందర్భంలో రాఘవమ్మను నాలుగు చీవాట్లుపెట్టి "కావాలంటే మూడు బీరువాల పట్టుచీరలు తెప్పిస్తా రేపీపాటికి" అందట డాక్టరుగారి భార్య. మొత్తంమీద రాజీపడింది రాఘవమ్మ. అనతికాలంలోనే ఆ వూరికి కేంద్రమయింది డాక్టరుగారి కుటుంబం. మొట్టమొదటిసారి బ్యాటరీ రేడియో కొన్నది కోటీశ్వరమ్మ. అమ్మలక్కలంతా చేరేవారు వింటానికి. అటువంటి వాతావరణంలో పెరిగింది అరుణ!

అరుణా వాళ్ళ పిన్ని మద్రాసు గవర్నమెంటు హాస్పిటల్‌లో అసిస్టెంట్ సర్జన్‌గా పనిచేస్తూవుండటంతో వేసవి సెలవులలో అక్కడకు వెళ్ళి వచ్చే అవకాశం కలిగింది. ఒకసారి మద్రాసులో మూడునెలలుండి తిరిగివచ్చి "నాకు డాన్సు వచ్చు తెలుసా?" అంది.

ఆ ఏడు ఎలిమెంటరీస్కూలు హెడ్‌మాస్టారు బదిలీ అయిన సందర్భంలో డాక్టరుగారు ఊరిపెద్దలకు టీపార్టీ ఇచ్చి గ్రాంఫోను రికార్డుమీద అరుణచేత డాన్సు చేయించారు. మున్సబుగారి దగ్గరనుంచి గొల్లముత్తయ్యదాకా ఎవరి ముక్కులమీద వాళ్ళు వేళ్ళేసుకున్నారు.

"మా అబ్బాయి కివ్వండి మీ అరుణను—చేసుకుంటాం" అన్నారు మునసబు గారు.

డాక్టరుగారు నవ్వి ఊరుకున్నారు.

"నేను తెల్లదొరను తప్ప యింకెవరినీ చేసుకోను - వీళ్ళంతా బ్రూట్స్" అంది అరుణ.

"బ్రూట్స్" అనే మాటకు మర్నాడు అర్థం తెలుసుకొన్న మునసబుగారు ఎంతో బాధపడి "పిల్ల తెలివయిందేకాని ఇది మొగుడితో కాపరం చెయ్యదండీ" అంటూ జోస్యం చెప్పారు రహస్యంగా కరణంగారి చెవిలో.

మున్సబుగారి భార్య రాఘవమ్మ తన కూతురు వెంకటలక్ష్మిని పట్నం తీసుకుపోయి, డాక్టరుగారమ్మాయికి మాదిరిగా క్రాపుచేయించి, గౌను తొడిగించి తీసుకురావడం గురించి అంతా వింతగా చెప్పుకున్నారు. క్రాపుచేయించుకు వచ్చిం తర్వాత వెంకటలక్ష్మితో మాట్లాడటం మానేసింది అరుణ. మర్నాడు బళ్లో క్రాపు నచ్చక, ఆ కత్తిరించిన జుట్టుతోనే బెత్తెడు పొడుగున పిలకలాంటి జడవేసుకొచ్చిన వెంకటలక్ష్మికి "ఎలకతోక" అని పేరు పెట్టింది అరుణ.

ఒక నెలరోజుల తర్వాత రాఘవమ్మకూడా భర్తతో సంకుల సమరంసాగించి బ్యాటరీ రేడియో కొనిపించింది. కోటీశ్వరమ్మమీద ఇష్టంలేనివాళ్లు మునసబు గారింటికి వెళ్ళేవారు రేడియో వింటానికి.

ఆ తర్వాత పదిరోజులకు మునసబుగారికి అజీర్తి, విరోచనాలు పట్టుకుని,కలరా అనే అనుమానం కలిగి, ప్రాణంమీది కొస్తే "మందివ్వ" నంటూ-భార్య సలహా మీద-భీష్మించుకు కూర్చున్నాడట డాక్టరుగారు. మునసబుగారు నాటువైద్యంతో బ్రతికి, జిల్లాబోర్డు ప్రెసిడెంటును పట్టుకొని డాక్టరుగారికి ట్రాన్స్ఫరు చేయించారు. అంతటితో అరుణావాళ్ళు వెళ్ళిపోయారు ఆ వూరినుంచి. మందివ్వకపోవటం అసలు కారణం కాదనీ, డాక్టరు పలుకుబడి పెరగటం, తన గొప్పతనం తగ్గటం సహించలేక మున్సబుగారు యిలా చేయించాడని, తరువాత కరణంగారు రహస్యంగా మా నాన్నగారితో చెప్పగా నేను విన్నట్లు గుర్తు.

"మేం ఈ ఊరినుంచి వెళ్ళగానే మునసబును పోలీసులు తీసుకెళ్ళి జైల్లో పెడతారు తెలుసా?" అంది అరుణ వెళ్ళిపోతున్న రోజున, పనిగట్టుకు మా యింటికి వచ్చి. వెళ్ళిపోయే రోజున అరుణ మరొక్కరితో మాట్లాడలేదు. నాతో మాట్లాడటం ఒక గొప్పగా భావించి పొంగిపోయాను ఆనాడు."

## 3

"ఆ తర్వాత ఎప్పుడు కనిపించింది మళ్ళీ అరుణ నీకు?" అన్నాడు కుమార్ నేను చెప్పిన కథంతా విని.

"ఎనిమిదేళ్ళ తర్వాత. ఈ లోపుగా అప్పుడప్పుడు ఆ కుటుంబం గురించి చెదురుమదురుగా మా వూరిదాకా వచ్చిన వార్తలు నా చెవిన పడుతూండేవి.

మా వూరు వదిలిపోయిన రెండు సంవత్సరాలకు డాక్టరు నాయుడు చచ్చిపోవడంతో ఆ కుటుంబం మద్రాసు లేచిపోయిందట. తర్వాత ఆర్థికంగానూ ఇబ్బందులు పడ్డారట. మద్రాసులో డాక్టరుగా వుంటున్న పిన్నమ్మ వాళ్ళని సరిగ్గా చూసేదికాదు. మునసబుగారు కోర్టుపనిమీద (అప్పుడు ఉమ్మడి రాష్ట్రం హైకోర్టు మద్రాసులో ఉండేది) భార్య రాఘవమ్మతో కలిసి మద్రాసు పోయినప్పుడు, ఎలాగో కోటీశ్వరమ్మగారి ఇల్లు వెతికి పట్టుకున్నాడట. ఒకే చిన్న గదిలో ఐక్కిచిక్కిన కోటీశ్వరమ్మ చాటలో అవాలుపోసి బాగుచేసుకుంటూ కనిపించిందట. రాఘవమ్మను కౌగలించుకుని ఏడ్చి "మా కుటుంబం ఇలా చితికిపోయింది వదినా" అంటూ బావురుమందిట. ఓ వందరూపాయలు సహాయం చేసినట్లు మద్రాసునుంచి రాగానే అందరికీ చెప్పింది రాఘవమ్మ. మా ఇంటికి వచ్చి ఆ మాట చెపుతున్న రాఘవమ్మ ముఖం నా కింకా గుర్తు. కొంత రిలీఫ్–రవ్వంత విముక్తి–ఏదో కనిపించింది ఆమె నిట్టూర్పులో.

ఆ తర్వాత నేను చదవటానికి విశాఖపట్టణం వెళ్ళి, అంతర్విశ్వవిద్యాలయ నాటకపోటీలకు హైద్రాబాదు వచ్చాను. మా ఐట్టంతా సాలార్‌జంగ్ మ్యూజియం చూట్టానికి బయలుదేరాం. మాతోపాటు ఓ పాతికమంది ఆడపిల్లలు – మరొక కాలేజీకి చెందినవాళ్లు వచ్చారు. వారిలో కనిపించింది అరుణ. అరుణ కళ్ళ ముందు ఆకస్మికంగా కనిపించగానే త్రుళ్ళిపడ్డాను. అందులోనూ దూరదేశంలో —చాలాకాలం తర్వాత–చిన్ననాటి స్నేహితురాలు కనిపించటంతో ఒక అద్భుతమైన సంచలనం కలిగింది.

'అరుణా!' పిలిచాను.

పిలుపువిని ఒక్క-క్షణం ఆగి చూసి నవ్వుతూ దగ్గరకు వచ్చింది. చాలా చలాకీగా వుంది. మా జనంలోంచి నేనూ, ఆడపిల్లల బృందంలోంచి అరుణా వెనకపడిపోయాం.

"ఎందుకొచ్చావ్ ఈ వూరు?" అంది పాలరాతిబొమ్మల దగ్గరవున్న సిమెంట్ బెంచీమీద కూర్చొంటూ.



"నిన్ను చూద్దామని" అన్నాను.
"కౌయ్-ఎప్పుడు నేర్చుకున్నావ్ కోతలు?" అంది. నవ్వాను.
"నువ్వేం చేస్తున్నావు?"
"యం. బి. బి. యస్."
"మీ అమ్మగారు బాగుందా?"
"చనిపోయింది."
"ఎక్కడుంటున్నావ్?"
"హాస్టల్లో."
చిన్ననాటి కబుర్లు చాలా మాట్లాడుకున్నాం.

అరుణ బాగా మారింది. ఆమె గొప్ప అందగత్తె అనే విషయం మొదటిసారి గుర్తించాను. సన్నగా, పొడుగ్గా, పల్చగావుంది. ప్రపంచంలో ఏ శక్తినీ లెక్క-చెయ్యని నిర్లక్ష్యం ఆమె కళ్ళల్లో స్పష్టంగా కనిపిస్తూంది. మేం కబుర్లలో పడ్డాం. మా నేస్తాలు వెళ్ళిపోయారు. ఆ తర్వాత మ్యూజియంలో ఇంకేం చూడలేదు.

నెమ్మదిగా నడుస్తూ బయటకు వస్తున్నాం. ఎవరో మమ్మల్ని వెంటాడు తున్నట్లు అనిపించింది. వెనక్కు తిరిగి చూశాను. రోడ్డుప్రక్క రోమియోలా ఓ కుర్రాడు టైటుపాంటుతో, నల్లకళ్ళజోడుతో యికిలిస్తూ కనిపించాడు.

"రేపుంటావుగా?" అంది అరుణ.

"ఉంటాను."

"ఎక్కడ దిగావ్?"

"బృందావన్‌లో."

"రేపు మధ్యాహ్నం కలిసి భోంచేద్దాం. పదింటికి పబ్లిక్‌గార్డెన్‌కి రా" అంటూ ఆ రోమియోతో కారెక్కి, నా జవాబుకోసం ఎదురుచూడకుండా అదృశ్య మైపోయింది అరుణ. నేను కాళ్ళీడ్చుకుంటూ బస్సుస్టాండుదాకా నడిచి తిరుగు ప్రయాణం ప్రారంభించాను."

"మర్నాడు వెళ్ళావా?"

"ముందు వెళ్ళకూడదనుకున్నాను. ఆకస్మికంగా, అంత నిర్లక్ష్యంగా ఆమె కారెక్కిపోవడం-అందులోనూ ఆ రౌడీలాంటి కుర్రాడితో—నాకు బాధనిపించింది."

"కాని వెళ్ళకుండా ఉండలేకపోయావుకదూ?" అన్నాడు కుమార్ వ్యంగ్యంగా.

"ఔను. నాకు తెలియకుండానే కాళ్ళు అక్కడికి లాక్కెళ్ళాయి. వెళ్ళాను."

"ఆ తర్వాత ఏం జరిగింది?"

"ఏమీ జరగలేదు. డాక్టరు చదువుకు కావలసిన డబ్బంతా వాళ్ళ పిన్ని పంపిస్తూందట. మద్రాసులో డాన్సు నేర్చుకొందట. తర్వాత చదువులో పడి పోయిందట- 'చదువు అవగానే యిద్దరం అమెరికా వెళ్ళిపోతాం. అక్కడే సెటి లవ్వాలంటున్నాడు'" అంది అరుణ. ఇద్దరిలో ఆ రెండోవ్యక్తి ఎవరో అర్థంకాక అడిగాను.

'మా వుడ్‌బి—' అంది.

అర్థంకాక చూశాను

"నిన్న నన్ను కారులో ఎక్కించుకెళ్లాడు చూడు. అతనే" అంది గర్వంగా, నవ్వుతూ. ఆ వివరణ నాకు సంతోషం కలిగించలేదు. ఎందుకో మనస్సు చివుక్కుమంది. "మగవాళ్లకు కూడా జెలసీ వుంటుందన్నమాట" అంది కాలు

తొక్కుతూ. నవ్వేశాను మళ్ళీ. హోటల్లో భోంచేశాం—బైబై చెప్పి వెళ్ళి పోయింది.''

"మళ్ళీ కనిపించలేదా?'' అన్నాడు కుమార్ మరొక సిగరెట్ అంటిస్తూ.

"ఆ సాయంత్రమే కనిపించింది. నాకు మతిపోయింది. ఆమె చెప్పినవన్నీ

"అంటే?"

"యూత్ ఫెస్టివల్‌లో డాన్స్ చేసి ఫస్ట్‌ప్రైజ్ గెలుచుకుంది. అద్భుతంగా చేసింది డాన్సు. ఎముకలు లేనట్లు-పాములా మెలికలు తిరుగుతూ జనాన్ని హడలుగొట్టింది. కాని ఆమె చదువుతున్నది నర్సింగ్. నాకు అబద్ధం చెప్పి ఏం సాధించాలనుకుందో ఇప్పటికీ అర్థంకాదు. బహుమతి పుచ్చుకొని వేదిక దిగి వస్తున్నప్పుడు ఎదురువెళ్ళి అభినందనలు చెప్పాను. తెల్లబోయింది. రెండు క్షణాల తర్వాత తేరుకుని నవ్వింది. "అబద్ధం ఎందుకు చెప్పావ్?" అన్నాను. "నిన్ను ఉడికించటానికిలే" అంటూ వెళ్ళిపోయింది చిలిపిగా నవ్వుతూ.''

"ఆ తర్వాత ఎప్పుడు కనిపించింది మళ్ళీ?"

"రెండు సంవత్సరాల తర్వాత-మద్రాసులో. ఆఫ్రికా వెడుతున్నదట. ఇండియా అంటే విసుగెత్తిపోయిందట. ఆవిడగారి 'వుడ్‌బి' అక్కడ డాక్టరుగా వుంటూ నెలకు మూడువేలు సంపాదిస్తున్నాడట. అంతా సెటిలైపోయిందట. ఇలాగే చాలా చెప్పింది. ఆశ్చర్యంగా విన్నాను."

"ఏం, నమ్మకం కలగటం లేదా?'' అంది.

"నిజం చెబితే ఎందుకు నమ్మను?" అన్నాను.

"నువ్వు నమ్మకపోయినా నీకుగాని, నాకుగాని వచ్చిన నష్టంలేదు. కాని నమ్ముతున్నట్టు నటిస్తే వచ్చిన ప్రమాదంకూడా ఏమీలేదు. ఆఫ్రికానుంచి నీకు మంచి ప్రెజంటు పంపిస్తా. అప్పుడు నీకే తెలుస్తుంది," అంటూ బుగ్గమీద చిటిక వేసి కిలకిలా నవ్వుతూ మహాజనంలో మాయమైపోయింది.

"పంపించిందా ప్రెజంట్?"

"పెళ్ళికి శుభలేఖ పంపించింది."

"పెళ్ళికొడుకు పేరు డాక్టర్ ఆనంద్ కదూ?''

"ఔను.''

"ఇవాళ వస్తున్నాడు అతనుకూడా...అరె-ఎనిమిదిన్నర దాటింది; యింకా రాలేదే'' అంటూ ఫోను దగ్గరకు వెళ్లాడు కుమార్.

అతను ఫోను అందుకునేలోపునే అది మ్రోగింది.

## 4

"ఇవేళ డిన్నర్ పార్టీ అంతా పాడయింది బ్రదర్. అరుణ రానంటూ ఫోన్ చేసింది" అన్నాడు కుమార్.

ఆశాభంగమనిపించింది.

"ఎందుకుట?" అన్నాను కొంచెంసేపాగి

"ఎవరో వాళ్ళ పిన్ని కూతురట. భర్తతోసహా తరలి వచ్చిందట." పల్చగా నవ్వుతూ అన్నాడు కుమార్.

"మరి హేమంతూ వాళ్ళూ?"

"వాళ్ళు ఎప్పుడూ టైముకు రారు."

ఆ పూట సాదాగా భోజనం చేశాం ఇద్దరం. మేడమీద బాల్కనీలో రెండు కుర్చీలు లాక్కొని కబుర్లలో పడ్డాం.

కుమార్ అన్నాడు "డాక్టర్ ఆనంద్-అంటే అరుణ భర్త-నాకు పది సంవత్సరాలుగా తెలుసు. చాలా బీదకుటుంబంలోంచి వచ్చాడు. అమలాపురం దగ్గర ఏదో పల్లెటూరనుకుంటా. ఏడెనిమిదిమంది అన్నదమ్ములూ, అక్కచెల్లెళ్ళూవున్న పెద్ద కుటుంబం. ఆ ఇంటికి అతనే పెద్ద. పెద్ద చదువులు చదవగలననే ఆశ పెట్టుకోకుండా స్కూల్ఫైనల్దాకా చదివాడు. ఆ తర్వాత ఏదో స్కాలర్షిప్ వచ్చిందట. బెజవాడలో ఇంటర్ చదివాడు. సాధారణంగా తిండి లేనివాళ్ళకు చదువుమీద వుండే శ్రద్ధ శ్రీమంతుల కుండదు. మంచి మార్కు లొచ్చాయి. లెక్చరర్లు కొందరు ప్రోత్సహించి కొద్దిపాటి సహాయంచేశారు. మెడిసిన్లో చేరాడు. మేనమామ అప్పటికి కళ్ళు తెరిచాడు. "నీ చదువుకు కావలసిన సహాయమంతా నే చేస్తాను" అన్నాడు. ఆయనకొక శూర్పణఖలాంటి కూతురుందట. వేపకాయంత వెర్రిపిల్లట. తనకు ఆమెను కట్టబెట్టాలనే ఔదార్యంతో ఆయన సహాయం చేస్తున్నాడని సంవత్సరం తిరగకముందే ఆనందే గ్రహించాడట. ఆ సమయానికి అతనికి యింకా స్కాలర్షిప్లు రావటం, చదువు సుఖంగా సాగే మార్గం కనిపించటం జరిగింది. ఇందులో ఎవరు ఎవరిని మోసం చేశారూ అంటే ఆ ప్రశ్నకు సమాధానం రాదు. చివరకు ఒకనాడు "మీ అమ్మాయిని మాత్రం నేను చేసుకోను మామయ్యా! మీరు సహాయంచేశారు కొంత. ఆ ఋణం మాత్రం సాధ్యమైనంత త్వరలో తీర్చుకుంటాను" అంటూ ఖండితంగా చెప్పాడు ఆనంద్. ఆ రోజుల్లో పరిచయమయ్యాడు ఆనంద్ నాకు హైదరాబాదులో.




ఎలాగైతేనేం పట్టుదలతో చదివి స్వయంకృషితో డాక్టరయ్యాడు. అందరూ అదృష్టవంతుడనుకున్నారు అతన్ని. కాని..."

"ఏం జరిగింది?"

"అరుణతో అతని స్నేహం శృతిమించింది."

"అంటే?"

"వివాహందాకా వచ్చింది. జీవితంలో అందరూ పుట్టుకతోనే అదృష్టవంతులు కారు. షేక్స్పియర్ చెప్పినట్లు కొందరు స్వయంకృషివల్ల అదృష్టాన్ని నిర్మించుకుంటారు. కొందరిని అదృష్టదేవత తనంతట తాను వచ్చి వరిస్తుంది. స్వయంగా అదృష్టసౌధాన్ని నిర్మించుకున్న మనిషి అరుణ. కాని దాన్ని నిలుపుకోలేకపోయింది. తలకు మత్తెక్కింది. చిన్ననాటి ఆశలూ, అనుభవాలూ ఆ మత్తుకు పదును పెట్టాయి. మెరుపుతీగలాంటి మనిషి అరుణ. అందులో అనుమానంలేదు. ఆమెతో క్షణకాలం మాట్లాడితే, ఎదుటివాళ్ళమీద ఆ ప్రభావం పూర్తిగా పడుతుంది. ఆనంద్ విషయంలోనూ అంతే జరిగింది. తన జీవితానికి ఆమెను చుక్కానిగా ఏరుకున్నాడు. ఆమె సలహా ప్రకారం బ్రతుకును తీర్చిదిద్దుకోవాలనుకున్నాడు. ఎక్కడో ఆఫ్రికాలో ఉద్యోగం వస్తుందంటే వెళ్ళమని సలహా ఇచ్చింది అరుణ. ఇండియాలోకంటే డాక్టరుకు అక్కడ ఏడెనిమిదిరెట్ల జీతం వస్తుంది. 'అయిదారేళ్ళు అక్కడ పనిచేస్తే కావలసినంత డబ్బు. ఈలోగా నేనూ డాక్టరీ చదువుతాను. ఇద్దరం కలిసి ఏ ఢిల్లీలోనో నర్సింగ్‌హోమ్ పెట్టుకొని దర్జాగా బ్రతకొచ్చు' అంటూ సలహా చెప్పిందట. ఆనంద్ అంగీకరించి ఉద్యోగం కాగానే ఆఫ్రికా వెళ్ళిపోయాడు. ఈ అయిదేళ్ళూ నర్సింగ్ మానేసి ఢిల్లీలో డాక్టరు పరీక్షకు చదివింది అరుణ. మధ్య మధ్య వస్తూండేవాడు ఆనంద్.

ఈలోగా నేను ఢిల్లీకి బదిలీకావటం జరిగింది. ఆనంద్ వచ్చినప్పుడు మాత్రం అరుణను మా ఇంటికి తీసుకొచ్చేవాడు. చాలా సరదాగా గడిచేవి ఆ నాలుగు రోజులూ. ఆ తర్వాత ఆమెను గురించి రకరకాల కథలు చెవిన పడుతూం డేవి. మిత్రునిపట్లగల బాధ్యతకొద్దీ ఒకసారి చూచాయిగా హెచ్చరించాను అరుణను. అప్పటినుంచీ మా యింటికి రావడం మానేసింది.

అరుణ పరీక్షలైపోయాయి. డాక్టరయింది. హౌస్ సర్జనుగా మరొక సంవత్సరం పనిచేసింది. "ఆఫ్రికాలోనే స్థిరపడిపోదాం. నువ్వూ రావలసింది" అంటూ ఉత్తరం రాశాడు ఆనంద్. ఢిల్లీ వదిలిపోవడం అరుణకు ఇష్టంలేకపోయింది. దానికి అనేకమంది అనేక కారణాలు చెప్పేవారు. "ఏ సంగతీ చివరిసారిగా నిర్ణయం తెలియజేయవలసింది. ఇంత కాలం ఒక ఆలోచనలో బ్రతికిన తర్వాత విడిపోవడం మనిద్దరికీ క్షేమంకాదు.'' అంటూ హెచ్చరించాడట ఆనంద్.

''ఇక్కడ నువ్వూ నేనూ సుఖంగా బ్రతకటానికి కావలసిన సదుపాయాలన్నీ వున్నాయి. అంతకుమించి, డాక్టరు వృత్తిలో అద్భుతమైన ఆత్మసంతృప్తి కలిగించే విధంగా మన కర్తవ్యం నిర్వహించటానికి సౌకర్యాలు కూడా వున్నాయి. ఇక్కడకొచ్చి జీవితం ఎలా ఉంటుందో చూసి, అప్పటికీ తృప్తి కలగకపోతే అప్పుడు నీ సలహా తప్పక పాటిస్తాను. వెంటనే బయలుదేరి రావలసిందిగా చివరిసారి అర్థిస్తున్నాను!" అంటూ పి.యస్. వ్రాశాడట.

ఎన్నడూ ఒంటరిగా రాని అరుణ మా యింటికి వచ్చి ఈ సంగతులన్నీ చెప్పి "రేపు వెళ్ళిపోతున్నాను కుమార్. అందరూ, ఎన్ని అనుకున్నా నేనూ మనిషినే. అతను చేసిన సహాయం ఈ జన్మలో మరిచిపోయేటంత కృతఘ్నురాలిని కాదని గుర్తుంచుకో" అంది తృప్తిగా నవ్వుతూ.

నా మనస్సు తేలికపడింది బ్రదర్. మా ఆవిడా, పిల్లలూ అందరం కలిసి ఆమెకు వీడ్కోలు చెప్పాం. బొంబాయివెళ్ళి రెండురోజులు ఒక స్నేహితురాలితో గడిపి ఓడలో ఆఫ్రికా వెళ్ళాలని ఆమె ప్రయత్నం.

''బహుశా ఇంక ఇండియాకు తిరిగిరావడం పడదేమో" అంది వెళ్ళేముందు.

"కాని వచ్చింది!''

''ఔను. అక్కడే జరిగింది వాళ్ళ వివాహం. వస్తూ కావలసినంత డబ్బు వెంటబెట్టుకొచ్చారు. విదేశాలనుంచి దిగుమతి అయిన కారుకూడా వచ్చింది. మంచి బంగళాకొని నర్సింగ్ హోమ్ పెట్టారు. అంతటితో ఆ ప్రేమికులిద్దరూ సుఖంగా నూరేళ్ళు జీవించారు, చల్లగా సంసారం చేసుకుంటూ – అంటూ కథ ముగించవలసిన పరిస్థితులే కనిపించాయి. కాని అలా జరగటంలేదు.''

"నీకెలా తెలుసు?"

"భార్యాభర్తలిద్దరికీ పడటంలేదు. ఎవరన్నా ఎదురుగా వున్నప్పుడే వాళ్ళు భార్యాభర్తల్లా నటిస్తారు. విడిగా వున్నప్పుడు వాళ్లు మాట్లాడుకోరు. ఎవరి బెడ్ రూమ్ వారిది. ఎవరి వ్యక్తిగతజీవితం వారిది. ఎంత రహస్యంగా దాచినా ఇటువంటి రహస్యాలు బయటపడకుండా వుండవు. అడవి మంటలై చిలవలు పల వలై వ్యాపిస్తాయి. అతిసాధారణంగా బ్రతికే మనుష్యులగురించి ఎవరూ పట్టించు కోరు. పదిమందినీఆకర్షించగల గొప్పతనమో, చెడ్డతనమో మనిషిలో వున్నప్పుడే ఆ వ్యక్తిని గురించి లోకం ఆలోచిస్తుంది. మాట్లాడుతుంది. అపవాదులు అల్లుకొని సంతృప్తి పడుతుంది."

ఆలోచనల్లో మునిగిపోయాను.

"మరో చిత్రంచూడు బ్రదర్! ఒక వస్తువుకోసం ప్రయత్నించటంలో వున్న ఆనందం, దాన్ని పొంది అనుభవించటంలో వుండదు. కొద్ది క్షణాలున్నా, దాని తృప్తి త్వరితంగా—అనుకున్న దానికంటే త్వరితంగా ఆవిరైపోతుంది. చూడుమరి! డాక్టర్ కావాలనుకుంది అరుణ. అయిదారేళ్ల ఎంత విచ్చలవిడిగా తిరిగినా శ్రద్ధగా చదవబట్టే సాధించింది. కాని బోర్డు పెట్టాక ఒక్క కేసుకూడా ట్రీట్ చేసిన పాపాన పోలా. వైద్యంకాక అన్ని విషయాలమీదనూ ఆవిడకు ఆసక్తి వుంది."

రాత్రి పదకొండు గంటలయింది.

మర్నాడు అరుణను చూడాలనే నిర్ణయంతో హోటల్‌కు బయలుదేరాను.

చిన్ననాడు, ఆ కుగ్రామంలో పాకబళ్ళో నాతోబాటు చదువుకున్న అరుణ—ఈ మహానగరంలో ఇన్ని ఆకర్షణలతో, అపవాదులతో వెలిగిపోతున్న (నలిగిపోతున్న?) అరుణ——

ఎంత మారింది!

## 5

అనుకున్న విధంగా అరుణ యింటికి మర్నాడు వెళ్ళలేకపోయాను. కుటుంబ విషయాలు కొన్ని పరిష్కరించటానికి రావలసిందని మా వూరునుంచి కబురు రావడంతో నేను ఢిల్లీ వదిలిపోవలసి వచ్చింది. తిరిగివచ్చేసరికి విన్న దుర్వార్త మూలాన అన్నిరకాల చైతన్యం కోల్పోయి నివ్వెరపోయాను చాలాసేపు. 'అరుణ మీద, విషంపెట్టి భర్తను చంపిన నేరానికి, కోర్టులో విచారణ జరుగుతోంది.'

వెంటనే జైలుకువెళ్ళి అరుణను చూశాను. గుర్తుపట్టింది చూడగానే. ఆ స్థితిలో

ఆమెను చూసినప్పుడు గుండె తరుక్కుపోయింది. నన్ను చూడగానే ఏడుస్తుం దనుకున్నాను. నవ్వింది!

ఎంత నిర్లిప్తమయిన నవ్వు?

హత్యచేయటానికా భగవంతుడు అంతటి అందమైన చేతులు సృష్టించింది! విషాలపేర్లు కనుక్కోటానికా డాక్టరు పరీక్ష ప్యాసయింది అరుణ! ఏం మాట్లా డాలో తెలియలేదు. ఆమే పలకరించింది. "యింత పాపం చేసినా నన్ను వెతు క్కుంటూ చూడటానికి వచ్చావా బాబూ" అంది జాలిగా.

చిన్ననాటినుంచీ నన్ను 'బాబూ' అని పిలిచేది అరుణ.

"ఎంత పని చేశావు అరుణా" అన్నాను పగిలిన గొంతుతో.

"అయిపోయినదాన్ని గురించి విచారించి ఏం లాభం బాబూ."

"ఇంకేం చేయగలం అంతకంటె?"

"జరగబోయేదాన్ని అయ్యేవున్నంతకాలం చూడటమే. ఊరు వెళ్ళావట?"

"ఔను."

"అంతా బావున్నారా? మన సొరకాయ మాస్టారింకా పిల్లల్ని కంటున్నారా? నేనే ఒకసారి వెళ్ళి మాస్టారికి వాసెక్టమీ చేసివద్దామనుకున్నా. ఈ లోపున జైల్లో పారేశారు. అన్నట్లు 'ఎలకతోక'కు ఎంతమంది పిల్లలు? నన్ను చూసి దానికి వాళ్ళమ్మ క్రాపింగ్ చేయించింది గుర్తుందా? తలుచుకుంటే యిప్పటికీ పొట్ట చెక్కలయ్యేలా నవ్వు వస్తుంది."

కిలకిల నవ్వింది అరుణ.

"కేసు ఏమౌతుందిట?"

"ఆ గొడవెందుకు లెద్దూ—బ్రతికి ఎవరి నుద్ధరించాలి కనుక?"

"ప్లీడరేమంటాడు?"

"ఆశ లేదన్నాడు ఏడుపు మొహంపెట్టి. నేనే కళ్ళతుడిచి పంపించా."

అక్కడ కూర్చున్నంతసేపూ ఇలాగే మాట్లాడింది. ఏదో విముక్తి లభించిన ప్రాణిలా తేలికగా నిట్టూర్చింది. వచ్చేముందు "పెళ్ళిచేసుకుంటే—యింత అన్నం వండిపెట్టి నీకూ నీ పిల్లలకూ పెట్టి యింటిపట్టునవుండే ఆడపిల్లను మాత్రమే చేసుకో బాబూ. నాలాటిదాన్ని చేసుకున్నావా, నీపాట్లు ఆ భగవంతుడికే తెలియాలి," అంటూ హితవు చెప్పింది.

హోటలుకు తిరిగి వస్తుంటే హేమంత్ కనిపించాడు. కంటతడిపెట్టాడు. "నేను నమ్మను బ్రదర్! అరుణ అంతపని చేసిందంటే ఇందులో ఏదో రహస్య




ముంది. ఆమె ఇంతవరకూ ఆత్మరక్షణకు ఒక్కమాటా చెప్పలేదు కోర్టులో. ప్లీడరు ఎంత ప్రయత్నించినా లాభం లేకపోయింది. ప్రాసిక్యూషన్ చెప్పిందంతా నిజమంది ఒకసారి. వెంటనే విచారణ ముగించి శిక్ష వేయమంది. అసలు జీవితం మీదే లక్ష్యం లేనట్లు ప్రవర్తిస్తూంది."

"ఎందువల్లనంటావు?"

"ఏమో! ఎందుకో తనమీద తనే పగబట్టి కసితీర్చుకుంటున్న మనిషిలా కనబడింది. ఇన్నాళ్లూ గుండెల్లో దాచుకున్న అగ్నిగుండాలను, పెనుతుఫానులను భరించలేక బ్రతుకునుండి పారిపోవటానికి ప్రయత్నిస్తున్న బేలలా కనిపించింది."

"అరుణలో బేలతనం వుందంటావా?''

"పైకి కనిపించే రూపాలు వేరు బ్రదర్. ప్రతి మనిషికీ రెండు జీవితాలుంటాయి. పైకి కనిపించే మనిషితో సంబంధంలేని మరొక మనిషి లోపల వుండొచ్చు. ఈ రహస్యం సాధారణంగా గుర్తించలేం మనం."

"ఎలా రక్షించగలం మనం అరుణను?"

"భగవంతుడే రక్షించాలి. అన్ని సాక్ష్యాలూ ఆమెకు వ్యతిరేకంగా వున్నాయి. నిద్రమందు మోతాదు మించి యివ్వడంవల్ల ప్రాణం పోయిందని శవపరీక్షలో తేలింది. ఆ మందు తానే స్వయంగా ఇచ్చినట్లు అరుణ అంగీకరించింది. అజ్ఞానం వల్ల అలా ప్రమాదం జరిగిందనడానికి వీలులేదు. ఆమె మెడిసిన్ చదివింది.

డాక్టరు వృత్తిలో వుంది. కాబట్టి బుద్ధిపూర్వకంగానే చేసిందని ప్రాసిక్యూషన్ వారి కదనం. డిఫెన్స్ బలహీనంగా వుంది. శిక్ష తప్పదు."

నిట్టూర్చాడు హేమంత్.

మర్నాడు తీర్పు వినటానికి కోర్టుకు వెళ్ళాను. హేమంత్, అతని భార్య మాలిని, కుమార్-అందరం, జరగబోయేది తెలిసికూడా, ఇంకా ఏదో జరుగుతుందనే వెర్రి ఆశతో కూర్చున్నాం, తక్కిన ప్రేక్షకులతో పాటు.

మూర్తీభవించిన న్యాయదేవతలా కూర్చున్న న్యాయమూర్తి తీర్పు చదివేముందు "ఇంతకాలం నువ్వు ఎవ్వరికీ అర్థంకాని మౌనాన్ని పాటించావు. డిఫెన్సు నిరుపయోగమైపోయింది. కాని తీర్పు చదివేముందు-చివరిసారిగా అడుగుతున్నాను. నువ్వు చెప్పుకోవలసింది ఏమైనా వుందా?'' అన్నాడు.

ఒక్కక్షణం ఆగి అరుణ తలెత్తి "చెప్తాను. నిజం చెప్తాను జరిగినదంతా చెబుతాను. ఈ చివరి ఘడియల్లో యింకా అసత్యం చెప్పాలనే కోరికగాని, చెప్పవలసిన అవసరంకాని నాకు లేదు. నామీద దయచూపించి ప్రాణభిక్షపెట్టమని కోర్టువారిని అభ్యర్థించి ప్రాధేయపడటానికి నా జీవితగాథను వెల్లడించటంలేదు. నాలాగా ఏ అభాగినీ శలభంలా దీపశిఖకోసం పరుగులుతీసి భస్మమైపోకుండా కాపాడటానికి, ఈ కథ ఉపకరించగలదనే ఆశతో చెబుతున్నాను."

ఇసుక వేసినా నేలరాలని జనం కోర్టు ఆవరణలో నిండినా, ఊపిరిగాక మరొక సవ్వడి వినరాని శవంలాంటి నిశ్శబ్దం ఆవరించింది.

అరుణ తన కథ చెప్పటం మొదలుపెట్టింది.

## 6

''అందరూ చిన్నప్పటినుంచీ 'రంభలా చక్కటి పిల్ల' అనేవారేకాని, 'సీతమ్మలా బుద్ధిమంతురాలు' అని ఎవరూ అనటం నేను వినలా. ప్రపంచాన్ని పట్టి పీడిస్తున్న దురదృష్టాలు రెండు రకాలనుకుంటా నేను. ప్రతీదాన్నీ నమ్మే దురదృష్టం కొందరిది. దేన్నీ నమ్మలేని దురదృష్టం మరికొందరిది. ఈ రెండవ తరగతికి చెందిన సౌభాగ్యం నాది. నామీద-అంటే నా సౌందర్యంమీద—నా తెలివితేటలమీద-నాకున్న నమ్మకంకాక, మరో విషయంమీద ఆవగింజంత నమ్మకంకూడా ఎన్నడూ నేను నిలుపుకోలేదు. చిన్ననాటినుంచీ నా జీవితం, దాన్ని తీర్చిదిద్దిన పరిస్థితులుకూడా ఈ విశ్వాసరాహిత్యానికి దోహదం చేశాయి. నా పాపాలకూ, పొరపాట్లకూ పరిస్థితులను నిందించాలనే ప్రయత్నంకాదిది.

జరిగింది చెప్తున్నాను.

చిన్ననాటినుండీ 'అందగత్తె' అని ఎవరయినా అంటే నా గుండె పొంగి పోయేది. బుద్ధి తెలిసినప్పటినుంచీ ఆ మాట వెలువడి నా చెవిన పడుతూవుండేది. 'అమ్మాయి చిక్కిపోయిందెందుకు? నల్లబడిందేమిటి?' అని అమ్మతో ఎవరన్నా అన్నక్షణంలో అప్రయత్నంగా ఏడుపొచ్చేది. తలుపులేసుకుని అద్దంముందు నిలబడి, ముఖాన్నీ, శరీరంలోని అణువణువునూ పరీక్షచేసుకునేదాన్ని. 'నే పదేళ్ళముందు పుట్టుంటే నాతో నీకు పెళ్ళయ్యేదికదా?' అన్నాడు వేలువిడిచిన మేనమామ, అరచెయ్యి గిల్లుతూ. అతి చిన్న వయస్సులోనే మగవాడి మాటల్లోని వెచ్చదనం అర్థం అయింది నాకు. ఫ్రాకులు వేసుకునే రోజుల్లో పిన్నిని చూడ టానికి మద్రాసువెళ్ళి క్లబ్బులో డాన్సుచేశాక, ఎంతమంది ఎన్ని రకాలుగా గిల్లారో నా బుగ్గలను! ఆ పొగడ్తలతో మనసు మత్తెక్కి, శరీరం వెచ్చబడి ఆవిరై మబ్బుల్లోకి ఎగిరిపోయినట్లుండేది!! ఆనాడు గవర్నర్ స్వయంగా కారులో యింటిదగ్గర దించిపోవడం, ఆ పసితనం జీర్ణం చేసుకోలేని గౌరవం కాదం టారా? మద్రాసు క్లబ్బులో డాన్స్ చేశాక వందమంది పెద్దలు షేక్‌హేండ్లిచ్చి, వీపు నిమిరి, బుగ్గలుగిల్లి, కళ్ళు చిట్లించి, కేకులు కొనిపెట్టి గౌరవించటం పదేళ్ళ పసిగుండె భరించగలదంటారా వశం తప్పకుండా?

నా పరిస్థితిని చెప్తున్నాను. నాన్న డాక్టరని మీకు తెలుసు. కాని ఏం డాక్టరు? ఎంత జీతం? ఆ పల్లెటూళ్ళేటువంటివి? మద్రాసునుంచి అమ్మా వాళ్ళ దగ్గర కెళ్ళాలంటే ఏడుపొచ్చేది. ఆ పిచ్చిబడిని చూసినా మోటు మనుషుల్నిచూసినా వెగటు కలిగేది.

ఒప్పుకుంటాను—

ఆయనతో నాకు జరిగిన వివాహకాండలో నా స్వార్థం ప్రధానపాత్ర వహిం చింది. అమ్మా నాన్న పోవడం-పిన్ని అమెరికా వెళ్ళిపోవడంతో శ్రీమంతుడు కాని మామయ్య నాకు గార్డియన్ అయ్యాడు. పెద్ద చదువులు చదివి పిన్నిలా బ్రతకాలని నేను కంటున్న కలలన్నీ పేకమేడల మాదిరి కూలిపోయాయి. డాక్టరుని కాగలిగితే యింక జీవితంలో సమస్యలుండవనుకున్నాను.

ఇది మనుష్యులు తరచు ఎదుర్కొనే ఆత్మవంచనలలో మొదటిది. ఎదురు గుండా వర్తమానంలో కనిపిస్తున్న సమస్యను భూతద్దంలోంచి పదింతలుగా చూసి, అది పరిష్కారమైతే, యింక లోటులేదనిపిస్తుంది. జీవితపథమే సమస్యల తోరణమనే విషయం ఎప్పుడోగాని అనుభవంలోకి రాదు.

సరే అసలు కథలోకి వస్తాను.

ఆ నర్సింగ్‌లో చేరటంతో అనుకున్న ఆశలన్నీ పేకమేడలై పోయాయి. రోగాలతో, రోగులతో, మూల్గులతో, నెత్తురూ చీమూ విరజిమ్మే దుర్గంధంలో ఓడిపోతున్న నా జీవితంమీద నాకే జాలికలిగేది. పడుకుని అర్ధరాత్రి హాస్టల్‌లో చివాలునలేచి ఏడ్చేదాన్ని. ఏడ్చి ఏడ్చి అలసటతో నిద్రపోయి ప్రొద్దెక్కి లేచి మత్తుకళ్ళతో నవ్వుకుంటూ ఛలోక్తులు విసురుకుంటూ, లేని గొప్పలు చెప్పు కుంటూ, చెప్పుకుంటున్న గొప్పలు ఎదుటివారు నమ్ముతున్నారని ఆత్మవంచన చేసుకుంటూ, మధ్య మధ్య ఏ అవకాశం దొరికినా గజ్జెకట్టి నాట్యంచేసేదాన్ని. హాస్పిటల్‌లోనూ, కాలేజీలోనూ అందరూ నన్ను గుర్తుపడుతున్నారనీ, నడుస్తు న్నప్పుడు నేను ఎదురుపడితే ఆగి వెనుకకు తిరిగి చూస్తున్నారనీ గమనించ టంలో ఒక తృప్తి మిగిలేది.

'ఎలిజబెత్ టేలర్' అని పేరుపెట్టాడు ఒక్కముక్క అర్థంకాకపోయినా, రోజూ ఇంగ్లీషు సినిమాలుచూసే ఒక రోమియో. పైకి తిట్టాను. లోపల పొంగి పోయాను. పేర్లు పెట్టకుండా కొందరూ, తండ్రితాతల వంశగోత్ర వివరాలతో, మరికొందరూ ప్రేమలేఖలు వ్రాసేవారు. జవాబులు రాయకపోయినా వచ్చిన ప్రతీ ఉత్తరాన్నీ, అందులోని ప్రతీ అక్షరాన్నీ ఏకాంతంగా చదువుకుంటూ, రహస్యంగా నా నేస్తం మేరీకి చదివి వినిపిస్తూ ఆనందించేదాన్ని. పదిరోజులు ఏ ఉత్తరమూ రాకపోతే ఎందుకో దిగులనిపించేది. మా నాన్న వయసులోఉన్న డాక్టరొకడు పెళ్లాం పుట్టింటికి పోయిందంటూ టీకి పిలిచి చెయ్యి పట్టుకు లాగాడు.

"ఇప్పుడుకాదు" అంటూ నవ్వేసి బయటపడ్డాను.

అప్పుడు నవ్వటానికిగల కారణం, అంతర్యం ఇప్పుడర్థమౌతోంది.

భయంకరమైన వ్యాధులన్నింటిలోకీ భయంకరమైంది స్త్రీవ్యామోహం అతిశయం–

ఈ జబ్బు ఆడవాళ్ళకు అసలు రాకూడదు. నా మాట నమ్మండి.

ఇలాటి స్వల్ప పరిచయాలూ సరాగాలూ వదిలిపెడితే మొదటిసారి నా గుండెల్ని కదిలించి, ఆశల్ని పెకలించి మనస్సుకు రెక్కలుకట్టిన వ్యక్తి ఒక అవారా. అతనిపేరు మురారి. అలా చెప్పేవాడు చెవిలో. అది అతని అసలు పేరనే నమ్మకం నాకు లేదు. చూడటానికి బెంగాలీ హీరోలా వుండేవాడు. అయితే చురుకు పాలెక్కువ. వారంలో ఒకరోజు సెలవుండేది నాకు. ఆనాడు సాయంత్రం ఏ సినిమాకో పోవచ్చు ఎవరైనా. నేను వచ్చిపోయేవాళ్ళను చూస్తూ హాస్టల్ బాల్కనీలో ఓ పుస్తకం చేతపట్టుకుని కూర్చునేదాన్ని. అతను ముస్తాబై




క్రాపు ఎగదువ్వి టీషర్ట్ క్రింద టైట్‌పాంటు బిగించి కనిపించే దూరంలో టాపు లేని కారాపి నాకేసిచూస్తూ నిలబడేవాడు. చాలారోజులు చూశాను. అతని నిరీక్షణకు అర్థం తెలిసిపోయింది. ఒకసారి మేరీ, నేనూ సినిమానుంచి వస్తుంటే వెంటపడ్డాడు. సరదాకి తిట్టాను. నవ్వి "లిఫ్ట్ కావాలా?" అన్నాడు.

"నీకు అక్కచెల్లెళ్లు లేరా?" అన్నాను.

"అయ్యో—పెద్ద కుటుంబం మాది. అక్కలూ వున్నారు. చెల్లెళ్ళూ వున్నారు. అన్నదమ్ములూ వున్నారు. మేనమామలూ వున్నారు. కాని మేనమామలకు ఆడపిల్లలు లేరు. బ్రహ్మచారి ముదరకూడదట రాణీగారూ. అందుకే ఈ పడిగాపులు దేవీ," అన్నాడు చిత్రంగా.

మంచి చొరవవున్న మనిషిలా కనిపించాడు.

ఆ రాత్రి మేరీ నేనూ అతనిగురించే చాలాసేపు మాట్లాడుకున్నాం.

"సినిమాల్లోనూ నవలల్లోనూ ఇలా ఎంతమంది కలిసి పెళ్ళిచేసుకోవటంలా?" అంది మేరీ.

"అయితే చేసుకో, ఆ రోడ్డుపక్క రోమియోను," అన్నాను.

"అతను లిఫ్ట్ ఇస్తానంది నా ముఖానికికాదు. నీకు తెలుసా," అంది.

"అటువంటి రౌడీవెధవలు, ఎంత డబ్బుంటే మాత్రం? లిఫ్ట్ యిస్తామనగానే ఎవరన్నా ఎక్కికూర్చుంటారా కారు?" అన్నాను లోపల మరొకలా అనుకుంటూ.

"నేనయితే ఎక్కేదాన్ని. రెండుమైళ్ళు నడకన్నా తప్పేది—'' అంది మేరీ.

"నేను చచ్చినా ఎక్కను—నిలువెత్తు ధనం పోసినా మాట్లాడను అలాటి

వాళ్ళతో'' అంటూ వెచ్చటి రగ్గు గుండెలపైకి కప్పుకుని, గోడవైపుకు తిరిగి పడుకున్నాను. నిద్రపట్టలేదు. సగం సగం నిద్ర. తియ్యతియ్యటి ఊహాలు- అస్పష్టమైన కలల్లాంటి అలల పొంగులు-లేచి చన్నీళ్ళతో ముఖం కడుక్కొని లైటువేసి పుస్తకం తెరిచాను. అక్షరాలు అర్థంకాక ఆవలించి కళ్లుమూసుకుని, వళ్ళు విరుచుకుంటూ మంచంమీద వాలిపోయాను మళ్ళీ.

మళ్ళీ వారం వచ్చింది.

బాల్కనీలో కూర్చున్నాను.

నాకు తెలియకుండా నా కళ్ల అతనికోసమే వెతుకుతున్నాయి!

చూసి చూసి విసుగుపుట్టింది.

బరువుగా చీకటి జారింది.

మరొకవారం-మరొకవారం-అతను కనిపించలేదు-చేతికందిన అవకాశం జారినట్లు, తెరుచుకున్న స్వర్గద్వారం ఒక్కసారి మూసుకుపోయినట్లు, విచ్చుకొన్న బొండుమల్లె క్షణకాలంలో వాడి ముడుచుకుపోయినట్లు, విరుస్తున్న పాల వెన్నెలను మ్రింగిన కారుమబ్బులు చిమ్మచీకట్లను కురిపించినట్లు జలదరించింది శరీరం. ఆ తర్వాత సారాంశం చెప్పాలంటే, నెలరోజుల తర్వాత అతని కారులో ఎక్కి, ప్రక్కన కూర్చొని గండిపేట చెరువుచుట్టూ ప్రదక్షిణంచేసి రావటం జరిగింది. అలా పదివారాలు గడిచింతర్వాత అతని చుట్టూ భవిష్యత్తును అల్లుకోవటం ప్రారంభించాను. ఒక వారం తెచ్చినకారు మరొక వారం తెచ్చే వాడుకాదు...అతనితో పదిరకాల కార్లలో వూరేగాను. ఎంతటి జమీందారో అర్థం కాలేదు. అడిగాను ఒకసారి.

"నీకు కావలసింది నేనా? నా డబ్బా? " అన్నాడు మురారి సినిమా హీరోలా.

"నీవే మురారీ'' అన్నాను కాలరు సర్దుతూ అదే వక్కీలో.

మురారికీ, నాకూ ఒక విషయంలో పోలిక వుంది. ఉన్నదానికంటె జీవితం నుండి ఎక్కువగానే ఆశించాం. సెవాయ్ సినిమాహాలు ప్రక్కన ఒక మోటార్లు బాగుచేసే కార్ఖానా వుంది. అందులో నెలకు నూటయాభై రూపాయలకి పని చేస్తున్న పనిరాని, —పనిమీద శ్రద్ధలేని మెకానిక్ మురారి.

"రేపు నా పుట్టినరోజు. యిద్దరం కలిసి గడపాలి" అన్నాడు. నాకు సెలవు దొరుకుతుందనే నమ్మకంలేక, అతని ఫోను నంబరడిగాను. ఫోనుచేసి చెప్తానని చెప్పాను. ఆనాడు అతని కథ తెలిసిపోవలసింది. కాని ఫోనుచేసే అవసరం కలగలేదు. నా అజ్ఞానామృతాన్ని నేనే జుర్రుకుంటూ ఆ మైకంలో జరగబోయే

జీవితాన్ని అనుభవించే ఆత్మవంచనలోంచి వెంటనే బయటపడలేకపోయాను. అతని బక్కపల్చటి వళ్ళు, నవ్వుతున్నట్లుండే కళ్ళు, నల్లకళ్ళజోడూ, బెర్లిను స్లాకూ, నల్లపాంటూ, రకరకాల కార్ల పక్కన నవ్వుతూ నుంచోడం-అతని మూర్తి యింకా ఎదురుగా కనబడుతున్నట్లువుంది. గట్టిపడని హృదయంమీద మొదటిసారి గట్టిగా పడిన ముద్ర అది.

ఒకసారి ఒక ఇంపోర్టెడ్ కారులో కిద్వాయ్ గార్డెనుకు షికారుకువెళ్ళి మా గొడవలో మేం మునిగితెలుతున్న సమయంలో ఇద్దరు వస్తాదులు మరొకకారులో వచ్చి మురారిని జుట్టుపట్టుకు గుంజి, నాలుగు బాది ఆ కారు తీసుకుపోయారు. అంత మొండిమనిషిని నే చూడలేదు. వాళ్ళు వెళ్ళిపోయాక చాటునుంచి చూస్తున్న నేను బయటకొచ్చి 'ఏమిటిది?' అని అడిగాను. ఏదో మంచి హరికథ చెప్పాడు.

ఆ వస్తాదుల తిట్లు కొన్ని చెవిన పడటంతో అనుమానం కలిగింది. మాట్లాడకుండా అరమైలు నడిచి, నలభై పైసలిచ్చి (నా పర్సులోవున్న మొత్తం అదే) సిటీ బస్సెక్కి హాస్టలుకు చేరాను.

ఆ తర్వాత కొన్నాళ్ళకు హాస్పిటల్‌నుంచి యింటికి వస్తుంటే ఒకసందు మలుపులో మాసిన గడ్డంతో నలిగిన గుడ్డలతో కనిపించి 'అరుణా' అని పిలిచాడు మురారి.

ఆగాను.

"నా జీవితగాథ నీ దగ్గర దాచాను" అంటూ కవిత్వం మొదలుపెట్టాడు. జాలివేసింది. "నాకు తెలుసులే మురారీ" అన్నాను.

"చాలా పొరపాటు జరిగింది" అన్నాడు తల వంచుకుని.

"ఇద్దరం కలిసే వేళాంగా-గుడ్‌బై-" అంటూ వచ్చేశాను.

ఆ తర్వాత చాలాకాలం కనిపించలేదు మురారి. కనిపించలేదని విచారమూ రాలేదు నాకు.

చాలా సంవత్సరాల తర్వాత అతి విచిత్రమైన పరిస్థితుల్లో కనిపించాడు. ఈ లోగా అనేక అనుభవాలూ—ఆశలూ—విఘాతాలూ శరవేగంతో నన్ను వెంటాడాయి. మురారి స్థానంలో మరొకరు ప్రవేశించారు. అతను నాకు భర్త కాగలడనికానీ, తర్వాత నా జీవితంమీద అతని ప్రభావం ఉంటుందనికానీ ఆ రోజుల్లో ఎన్నడూ అనుకోలేదు నేను.

అతనే డాక్టర్ ఆనంద్!

ఆనంద్ అప్పుడు హౌస్‌సర్జన్‌గా పనిచేస్తూండేవాడు స్వభావసిద్ధంగా మితభాషి. ఎక్కువమంది స్నేహితులతో కలిసి తిరగడంకాని, కబుర్లు చెప్పుకుంటూ కాలక్షేపం చేయటంగానీ అతని కలవాటులేదు. అతనితో ప్రవర్తించేటప్పుడు తోటి డాక్టర్లూ, నర్సులూ కూడా చాలా జాగ్రత్తగా వుండేవారు. అటువంటి వ్యక్తితో నాకు పరిచయం కావటం, అది నా జీవితంమీద యింతటి ప్రభావం ప్రసరించటం చిత్రమనే చెప్పాలి.

నన్ను హాస్టల్‌నుంచి వెళ్ళగొట్టారు. ఆడపిల్లల హాస్టలులో ఎటువంటి నియమ నిబంధన లుంటాయో మీకందరికీ తెలుసు. ఎంతోమంది యువకులను విశేషంగా ఆకర్షించే పవిత్రస్థలాలలో అదొకటి. ఆ రోడ్డుమీద ఆకలిచూపులతో రోజూ సాయింత్రం పదిసార్లు ప్రదక్షిణంచేసే కుర్రకారు మానసికంగా నాకు ఆత్మీయులయారనిపించేది. ఈ ఢిల్లీ వచ్చాక – ఇంత దూరంగా బ్రతుకుతున్నా ఆ చదువుకున్నరోజులూ, ఆ మొహాలూ, ఆ చిలిపిచేష్టలూ తలుచుకుంటే మనస్సుకు చక్కిలిగింతలు పెట్టినట్లుండేది. వీలు ఏమాత్రం చిక్కినా బయట ఎక్కడో భోజనం చేయటం, ఏదో సినిమాచూస్తూ గడిపేయటం, సిటీ దాటి పది మైళ్ళు పాతికమైళ్లూ షికారుచేయటం–ఇదంతా అలవాటయింది.

ఒక మహాప్రవాహంలో అనేక తృణాలు కొట్టుకుపోతున్నప్పుడు, ఏ రెండు గడ్డిపరకలు ఒకదాన్ని ఒకటి అంటిపెట్టుకుని ఎంత దూరం ప్రయాణం చేస్తాయో ఎలా చెప్పగలం? ఏ చిన్న కెరటం చాలదు ఆ అల్పబంధాన్ని విడదీయటానికి? పేరు చెప్పటమనవసరం. అతను ఐ. ఏ. ఎస్. పాసయి సుఖంగా ఉద్యోగం చేసుకుంటూన్నాడు. "నీతో రోజూ ఓ గంట గడిపితే టానిక్ త్రాగినట్లుండేది!" అనేవాడు.

"నే వద్దన్నానా?" అనేదాన్ని నవ్వుతూ.

అతనూ నవ్వేవాడు.

ఒకరోజు సుఖంకాదు గదా? బ్రతికినంతకాలం ఈ టానిక్ త్రాగే మార్గం ఆలోచించుకో" అన్నానొకసారి సీరియస్‌గా.

అతను చాలా తెలివైనవాడు. (అతని తెలివితేటలకూ, పరీక్ష పాసై ఉద్యోగం సంపాదించటానికీ ఏదో సంబంధముందని కాదు నే చెప్పేది. తెలివితేటలే ప్రధానమనుకుంటే మురారికంటే శక్తిగలమనిషి ఇంతవరకూ నాకు కనిపించలా.) ఏమయితేనేం–నేను ఆ మాట అనగానే ఎటువంటి భ్రమలూ పెట్టుకోవద్దనీ,



వివాహం విషయంలో తనకు వేరే అభిప్రాయాలున్నాయనీ చెప్పేడు, ఆంతకంటే సీరియస్‌గా.

"మరి నాతో తిరగటంలో నీ అభిప్రాయం?" అన్నాను.

"కాలక్షేపానికి."

''అంటే ఆడపిల్ల నీ దృష్టిలో ఆటవస్తువన్నమాట?"

"నువ్వలా అనుకుంటే మనం మళ్ళీ కలుసుకోవలసిన అవసరంలేదు."

"నీతో తిరుగుతున్న కారణంగా నాకు హాస్టల్‌లోంచి వెళ్ళిపొమ్మని నోటీసిచ్చారు తెలుసా? ఇందులో నీ బాధ్యత లేదంటావా?"

అతను క్షణకాలం నివ్వెరపోయాడు.

''అరుణా నిన్నెన్నడూ మభ్యపెట్టలేదు నేను అసలటువంటి అభిప్రాయమే లేదు. జీవితాన్ని గురించి నాకెన్నో ఆశలున్నాయి. స్వల్పమైన వ్యామోహాలూ, నిలకడలేని క్షణికమైన సుఖాలూ వాటికి అడ్డం రాకూడదనుకున్నాను," అంటూ లేచాడు, ఆ బ్రతకటం తెలిసిన యువకుడు.

నా కళ్ళలో నీరు తిరగటంచూసి ఆగి "నన్ను అర్థంచేసుకో అరుణా. జీవితాన్ని రెండు భాగాలు చేసుకోవాలనుకున్నాను. సగం కష్టపడి చదవటం. కావలసినవన్నీ సాధించటం-మిగిలిన సగం అనుభవించడం ముందే-జీవిత సౌధాన్ని నిర్మించుకునే కాలంలో జీవన సారాన్ని పిండుకోవాలని ప్రయత్నిస్తే రసంపీల్చిన పిప్పిగాక యింకేం మిగలదు. అపార్థంచేసుకోకు. ఇప్పటికే శక్తికి మించి చాలా దూరం నడిచాను, నీతో. యింక ఓపికాలేదు. ధైర్యమూలేదు. గుడ్‌బై" అంటూ వెళ్ళిపోయాడు.

ఆ తర్వాత మళ్ళీ కనిపించలేదు. అర్హత లేకుండా ఆశలను పెంచుకోవడంలో ఎంత విషాదముందో తెలియలేదు ఆనాటికి. ఇలాగే చాలా సంఘటనలు జరిగేయి. అంతకు ముందొకసారి భార్య పుట్టింటికెళ్ళిందంటూ టీకి పిలిచిన డాక్టరుగారు నాకు ఒకగది చూపించారు వాళ్ళ మేడమీద. విధిలేక అక్కడ చేరాను. కాని ఆయన ఒక రౌదగా తయారయ్యాడు. 'అరూ' అంటూ పిలిచేవాడు. అతి ఆప్యాయంగా గదిలోకివచ్చి మంచంమీద కూర్చొని తాను మెడిసిన్ చదివే రోజుల్లో రంభలూ ఊర్వసులూ ఎలా క్యూలో నిలబడి తనకోసం తపస్సు చేసేవారో చెప్పేవాడు. వయసులో వున్నప్పుడైనా అతడు అందగాడనే మాట నాకు ఇప్పటికీ నమ్మకంలేదు. ఆ డాక్టరుగారి ఆప్త శిష్యుల్లో మా ఆనంద్ ఒకడు. ఆ రూంలో చేరటంతో ఆనంద్‌తో పరిచయం బలపడింది. 'అతి సాదా మనిషి' అనిపించింది. ఎంత విచిత్రమైన విడ్డూరం విన్నా అతని ముఖంలో రవ్వంత ఆశ్చర్యమూ తొంగిచూసేదికాదు. వాగ్వివాదాలకు దిగేవాడుకాదు. ఎదుటివాళ్ళు చెప్పినదంతా విని 'ఔను' అనేవాడు. తన కిష్టంలేకపోతే 'కావచ్చు' అనేవాడు. అసలు పూర్తిగా ఖండించవలసిన మాటవింటే 'నేనలా అనుకోవటం లేదు' అనేవాడు. పెళ్ళి కావలసిన వయస్సుదాటి చాలా సంవత్సరాలు గడిచినా ఆనంద్ ఎందుకు బ్రహ్మచారిగా వున్నాడో తెలిసేదికాదు. ఒకటి రెండుసార్లు అడిగితే చూచాయిగా, నవ్వి ఊరుకున్నాడు.

ఆ తర్వాత జరిగింది కొంత కుదించి చెప్తాను. "నీకు అభ్యంతరం లేకపోతే నిన్ను వివాహం చేసుకుంటాను" అన్నాడు ఆనంద్ అతి సాదాగా.

నేనేదో మాట్లాడబోగా "తొందరలేదు అరుణా! నువ్వు వెంటనే జవాబు చెప్పవలసిన అవసరంలేదు. అన్నీ ఆలోచించుకుని చెప్పు పదిరోజుల్లో" అంటూ అతని జీవితగాథ చెప్పాడు.

అతనిది పెద్ద మధ్యతరగతి కుటుంబం. అమలాపురం దగ్గర ఒక పల్లె

టూరు. నలుగురు చెల్లెళ్లూ, ఇద్దరు తమ్ముళ్లూ, ఒక విధవతల్లీ—వీరందరి చదువు లకూ, పెళ్ళిళ్లకూ తానే బాధ్యుడట. ముగ్గురు చెల్లెళ్లకూ-ఉన్న నాలుగెకరాలూ అమ్మి-పెళ్ళిళ్లు చేశాడట. తమ్ముళ్లు తరగతుల వారీగా చదువుతున్నారట. మరొక చెల్లెలికి తానే పెళ్ళిచేయాలట. అతని పరిస్థితి విన్నతర్వాత నామీద అతనికి గాఢంగా ఇష్టమయిందని అర్థమయింది. ఈ రెండు మూడు నెలల్లో నా కోసం చాలా ఖర్చుపెట్టాడు.

"కష్టాలూ, సుఖాలూ ఇద్దరం కలిసి పంచుకుందాం" అని చెప్పాను, అతని ముఖంచూసి. ఆ మాట చెబుతున్నప్పుడు మనస్ఫూర్తిగానే చెప్పాను. నమ్మండి. ఇది అక్షరాలా నిజం.

కృతజ్ఞతతో బరువెక్కిన కన్నీరు అతని చెంపలమీదుగా కారింది.

ఒకనాడు ఆనంద్ నా రూంకి వచ్చి "ఆఫ్రికాలో డాక్టర్లకి మంచి జీతాలిస్తా రట—నెలకు నాలుగువేలు. వెళ్ళమంటావా?" అంటూ ఒక పేపర్లో ప్రకటన చూపించాడు. వెంటనే వెళ్ళమని సలహా చెప్పాను. నర్సుగాచేరి బ్రతికినంత కాలం ఆ జీవితంతో తృప్తిపడే శక్తి నాకు లేదనిపించింది. "నీ భార్య నర్స్ అంటే నీకు మాత్రం గౌరవమా ఆనంద్?" అన్నాను.

ఆనంద్ కూడా ఆలోచించాడు. చివరకు నన్ను మెడిసిన్ చదివించటానికి ఒప్పుకున్నాడు.

రెండు నెలల తర్వాత ఆనంద్ ఇండియా వదిలిపోయాడు.

నేను హైదరాబాదు వదిలి ఢిల్లీలో మెడిసిన్‌లో చేరాను.

ఇది జీవితంలో మరొక మలుపు!

ఎక్కువగా మాట్లాడటం నాకు మొదటినుంచీ అలవాటు. ఈ అలవాటు అంత సుఖమైందికాదు. అంతేగాదు. ఇదొక వ్యసనంగా, జబ్బుగా మారే ప్రమాద ముంది. అందమయిన ఆడది వలకబోసే పొగడ్తలు ఎటువంటి యోగి హృద యంలోనైనా రాగోదయాన్ని కలిగించకలవు.

ఎక్కువ మాట్లాడటం గురించి మరోమాట. ఈ వ్యసనం ఆరోగ్యానికి లక్షణం కాదంటే నమ్మండి. దీని ఫలితాలు ఎలా వుంటాయని? ఎక్కువ మాట్లాడే మనిషి తన గొప్పలు చెప్పుకునే ప్రమాదముంది. ఉన్న గొప్పలు అయిపోయింతర్వాత లేని గొప్పలు చెప్పుకునే ప్రమాదముంది. యింకా టైముంటే అనవసరంగా యిత రులను గురించిన నిందలు మాట్లాడటం జరుగుతుంది. ఒకరన్న మాటలు మరొ కరి దగ్గర చెప్పటం జరుగుతుంది. ఈ వ్యసనమున్న మనుషులకు సుఖమో

యువ 

దుఃఖమో వరదలై వచ్చి మీదపడితే, ఆ వాగుడు మరీ ఎక్కువయిపోతుంది. మెడికల్ కాలేజీలో ఒక స్టార్‌గా మారటానికి ఎంతో కాలం పట్టలేదు నాకు. నేను అంతకుముందు నర్సింగ్ చదువుతున్న విషయం ఒక జీవితరహస్యంలా దాచిపెట్టి, తెలుగుదేశంలో మాకున్న ఎస్టేట్లను గురించీ, కార్లగురించీ బంగళాలను గురించీ పదిమందికీ—వీలుదొరికినప్పుడల్లా చెపుతూండేదాన్ని. ఆనంద్ నెలకు అయిదువందలు పంపించేవాడు.

ఏవో కలల్లో అలల్లో చేరిపోతున్నట్లు జీవితం సుఖంగా ఒక చిత్రమైన ఉద్రిక్త వాతావరణంలో నడుస్తూంది. చిన్నప్పటి మాదిరి నా చుట్టూ ఒక పది మంది నేస్తాలు, సూర్యునిచుట్టూ గ్రహాలు తిరుగుతున్నట్లు ప్రదక్షిణాలు చేసే వారు.

ఒకసారి—అప్పుడు అంతర్జాతీయ పారిశ్రామిక ప్రదర్శనం జరుగుతోంది. ఆ ఎగ్జిబిషన్ చూడటానికి వెళ్లాం పదిమందికలిసి. ఒకటే అల్లరి. గంగిగోవు లాంటి – పల్లెటూరిబైతులా కనిపించే ఒక కుర్రాణ్ణి పట్టుకున్నాం. మేం మిల్క్ బారులో రోజ్‌మిల్క్ తాగుతూంటే ఎదురుగా నిలబడి గుటకలు మింగుతూ మాకేసి చెదిరిన కళ్ళతో రెప్పలార్పకుండా చూస్తూ నిలబడ్డాడు. అతనికేసిచూసి అందరం విరగబడినవ్వి తర్వాత అమెరికన్ స్టాల్‌కి పోయాం. అక్కడా కని పించాడు దొంగచూపులు చూస్తూ. నాకు తమాషా చేయాలనిపించి నవ్వాను—క్రిందిపెదిమ కొరుకుతూ, కావలసిన అర్థంవచ్చేలా. "ఏమిటేవ్! వాణ్ణి వెంట బెట్టుకుని ఏ చంద్రమండలానికో, అశోకా హోటలుకో లేచిపోయేటట్టున్నావ్?" అంటూ బుగ్గలు పొడిచింది తార, జారిపోతున్న పమిట వయ్యారంగా పైకి లాక్కుంటున్నట్టు నటిస్తూ.

ఆ హీరో యింకా మాకేసే చూస్తూ మెలికలు తిరిగిపోతున్నాడు. ఎగ్జిబిషన్‌లో అంతా అర్ధరూపాయి టిక్కెట్టుతో చూసిరావటానికి రైలుపట్టాలు వేశారు. కాళ్ళు నెప్పులుపుట్టి అందరం రైలెక్కుదామని, టిక్కెట్లకోసం క్యూలో నిలబడ్డాం. వెనక్కి తిరిగిచూస్తే ఆ హీరోకూడా కనిపించాడు. అతన్ని ఏడిపించాలనిపించింది. కావాలనే మరొకసీటు ఖాళీ వుండేలా జాగా వదిలిపెట్టాం. మేమందరం కూర్చొని, మా మధ్య కూర్చొనే ధైర్యం అతగాడికుందో లేదో కనిపెట్టటానికి నిరీక్షిస్తున్నాం. రైలు బయలుదేరేముందు అతను అటూ ఇటూ పదిసార్లుచూసి, సిగ్గు నమిలి చివరకు తెగించి మా మధ్యనే కూర్చున్నాడు ఒక్క దూకులో.

"ఏ వూరు మీది?" అంది తార.

"నెల్లూరు" అన్నాడు హీరో.

"మీ ఫ్రెండోయ్!" అంటూ నాకు తొడపాశం వడ్డించింది తార. అందరూ నవ్వారు విరగబడి. తెలుగువాడని గ్రహించారన్నమాట. చెవికోసుకున్నా తెలుగు మాట వినిపించని ఆ ఎడారిలో ఆంధ్రపౌరుషాన్ని చూడగలిగాననే తృప్తితో కళ్ళు మెరిసినా అతగాడి ఆట కట్టించాలనే కోరిక కలిగింది నాకు. ఆ కోరిక చాటున దాగిన ఉద్వేగాలను వెంటనే గుర్తుపట్టలేకపోయాను. రైలు నడుస్తున్నంత సేపూ ఒకటేగోల. అందరూ అతణ్ణి ఏడిపిస్తున్నారు. నాకు జాలివేసింది. రైలు ఆగింది. నేను ఆ అల్లరికి చివరి మెరుగుగా "మా ఆంధ్రపౌరుషాన్ని నేను ప్రేమించానండోయ్! ఇద్దరం వెళ్ళిపోతాం-చెట్టాపట్టాలేసుకుని, ఏ కాశ్మీరో, ఏ హిమాలయాలకో, ఏ రెపీరాకో" అంటూ కేకపెట్టి చప్పట్లు చరిచాను.

" మా నేస్తాన్ని నీ చేతుల్లో పెడుతున్నాం చిట్టితండ్రీ, ఎలా చూసుకుంటావో" అంటూ బోరున ఏడ్చి విరగబడినవ్వి నేస్తాలందరినీ వెంటబెట్టుకుని వెళ్ళిపోయింది తార.

ఇద్దరం మిగిలాం.

ఆ జనంలో తప్పిపోయిన పాపలా బిక్కమొహం పెట్టాడు మా హీరో. అతని చెయ్యి పట్టుకున్నాను. పెనుతుఫానుకు కదిలిన తీగెలా కంపించాడా అర్భకుడు. అటూ ఇటూ తిరిగి 'హనీమూన్‌కి ఎక్కడికి పోదాం ప్రియా!' అన్నా అరచెయ్యి గిల్లుతూ. ఎగిరిపడ్డాడు.

"నేనుంటున్నది జనపథ్‌లో" అన్నాడు.

నాకు నమ్మకం కలగక "సరే పద" అన్నాను.

నిజమే, అతనుంటున్నది అదే హోటల్లో.

రూంలోకి వెళ్ళిన తర్వాత భోజనం తెప్పించాడు. అది డిసెంబర్, చలికాలం. కోల్డ్‌వేవ్ కాకపోయినా ఢిల్లీ చలి నరాల్ని కొరుకుతూంది. చీకటిపడినకొద్దీ వెచ్చటి అవసరాలు ఎదరపడుతున్నాయి. 'చాందినీ చౌక్‌లో కొన్న రగ్గిది' అన్నాడు. దాని పేరు రజాయి. సన్నటి పరుపులా వుంటుంది, ఎన్ని రగ్గులూ జయించని చలిని, ఆ రజాయి జయించగలదు.

కొంతమందిని చూస్తే నిష్కారణంగా జాలివేస్తుంది. ఏదో బేలతనం-దైన్యం -దిగులు వాళ్ళ ముఖాలమీద కనిపిస్తుంది.

"ఆరునెల్లకుముందు మా నాన్న పోయాక అంతా అమ్మించాడు మురారి. లక్షరూపాయలు చేతపుచ్చుకు బయలుదేరాం. ఇది మిగిలింది," అంటూ బాంకు

పుస్తకం నా ముందు గిరవాటు పెట్టాడు. అతని కథ అక్షరాలా నిజం. నా అభిప్రాయం మారింది. 'బాంక్‌లో మిగిలిన డబ్బు రెండు వందలా చిల్లర!'

"ఏం చేశారింతడబ్బు?" అన్నాను.

"మురారికి తెలియాలి. ఏదో బిజినెస్ అంటాడు" అన్నాడు.

"ఏం బిజినెస్?" అన్నాను.

"అది రహస్యం. ఎవరితోనూ చెప్పకూడదు. తెలిస్తే జైలులో పెడతారట," అన్నాడు.

మురారి పేరు నేను మరిచిపోవటానికి వీలులేనిది.

"ఎవరా మురారి?" అన్నాను.

"మా వూరే! హైద్రాబాద్‌లో ఏదో బిజినెస్ చేసేవాడట. ఫోర్త్‌ఫారం మూడుసార్లు తప్పి ఇల్లు వదిలి పారిపోయాడు. నాలుగు సంవత్సరాల తర్వాత ఒకోసారి ఒకోకారులో దిగేవాడు దొరబాబులా. ఏదో విదేశాలతో కమీషన్ బిజినెస్ చేస్తున్నాననేవాడు. మేమిద్దరం చిన్నప్పుడు కలిసి చదువుకున్నాం. చదువుమీద శ్రద్ధలేదుకాని బ్రహ్మాండమైన తెలివివున్నవాడు. ఊళ్లో అందరూ గౌరవించటం మొదలుపెట్టారతన్ని. మా వూళ్ళో డబ్బుగలవారందరూ ఆ బిజినెస్ చూపెట్టమనీ, భాగమిస్తామనీ అతని చుట్టూ తిరిగేవారు. "ఒకరితో కలిసి బిజినెస్ చేయటం నా తత్త్వంకాదు," అనేవాడు. ఒకసారి నా చెవిలో చెప్పాడు. ''బాల్యస్నేహితుడివి గనక చెపుతున్నాను. రెండు లక్షలు పెడితే సంవత్సరం తిరిగేలోగా పదిలక్షలు చేసుకోవచ్చు. భాగం కలిస్తే ఇద్దరం చెరొక లక్షా పెట్టుకోవచ్చు. ఇదంతా రహస్యంగా జరగాలి. లేకపోతే చాలామందికి కోపాలు రావచ్చు," అన్నాడు. అతని మాటలు నమ్మకుండావుండే ధైర్యం నాకు లేకపోయింది. నాన్న పోవటంతో నేను యింటికీ, ఆస్తికీ సర్వాధికారి నయాను. అంతా అమ్మి లక్షరూపాయలు చేతపుచ్చుకొని ఢిల్లీకి బయలుదేరాం. అతని లక్షసంగతి నాకు తెలియదు. నాది హరించుకుపోయింది," అంటూ కంట తడిపెట్టాడు రెడ్డి.

అతని పేరు బాలముకుందరెడ్డి.

కళ్ళుతుడిచాను. మళ్ళీ అన్నాడు.

"ఎవరితో చెప్పుకోను నా బాధ! అతగాడు ఎక్కడ మునుగుతాడో, ఎక్కడ తేలి బయటపడతాడో తెలియదు. 'ఏం బిజినెస్ మనది?' అని అడిగాను చాలాసార్లు. 'అది రహస్యం. తెలిస్తే జైలుకెళ్తాం, యిద్దరం. నీ దగ్గర మాట దాగదు




తమ్ముడూ! అందుకని ఆ ప్రశ్న నువ్వు అడక్కూడదు నేను చెప్పగూడదు." అనేవాడు. పోయింది ఎలాగో పోయింది అని నోరు మూసుకు పూరుకున్నాను." అంటూ ఏడ్చాడు రెడ్డి.

ఆ మురారి ఎవరోకాదు.

ఒకనాటి 'నా మురారి!'

రెడ్డి చూపించిన ఫోటోలో కనిపించాడు. కొంచెం లావయాడు. అవే కళ్ళు. అదే జుట్టు. అదే నిర్లక్ష్యం. అదే చావ.

"నిన్నూ మోసంచేశాడన్నమాట ఈ రోగ్" అన్నాను.

"నీకు తెలుసా మురారి?'' అన్నాడు త్రుళ్ళిపడి.

ఏం చెప్పను సమాధానం?

"అనాటికి గట్టిపడని హృదయంమీద మొదటిసారిగా గట్టి ముద్రవేసిన మొదటి పురుషుడు మురారి" అని ఎలా చెప్పను?

రెడ్డీ దురదృష్టాలు నీ ఒక్కడివే అనుకోకు. ఎవరి దౌర్భాగ్యాలు వారివి. మురారి కథ చాలా చెప్పాలి. కాని కథలతో కబుర్లతో సమస్యలు పరిష్కారం కావు. అతడికి బుద్ధిచెప్పే మార్గం ఆలోచించు. అతడు హరించిన ఐశ్వర్యాన్ని తిరిగి చేజిక్కించుకునే ఉపాయం తెలుసుకో. అవసరమొస్తే అతనిని జైలుకు పంపించు" అంటూ సలహా చెప్పాను.

బెల్ మ్రోగింది.

ఎవరో వచ్చారు.

తలుపు తీశాడు రెడ్డి
లోపలకు వచ్చాడు మురారి!

## 8

"ఏమిటీ అకాలవసంతం ?" అన్నాడు మురారి నవ్వుతూ.

"మళ్ళీ నిన్ను చూస్తాననుకోలేదు" అన్నాను.

"నేను యిక్కడికి రావటం కాకతాళీయం. కాకపోతే ఏం చేసేవాడివి?"

"ఏడులోకాలూ గాలించి పట్టుకునేవాణ్ని. అందులో ఇప్పుడు మనం నెలకు పదిసార్లు ఈ గ్లోబు చుట్టూ విమానాల్లో ఎగురుతున్నాం. ఇప్పుడు హాంకాంగ్ నించి వస్తున్నా. రేపు కెన్యా వెళ్ళాల. పారిస్‌చూశావ్? నీలాంటిది పారిస్‌లో ఉండా లసలు. హోనాలూలూలో ఓ బ్యూటీని చూశా. సడెన్‌గా నువ్వు గుర్తుకొచ్చా వనుకో. డిన్నర్‌కి కంపెనీ యిస్తానంది. టైం లేకపోయింది. హాంకాంగ్ వస్తా వేమిటి? భూతల స్వర్గంలే. పగలు ముసుగేసుకు నిద్రపోయి రాత్రి ప్రతికేజనం సగంమంది అక్కడ. తెలుగు మాష్టారు చెప్పారు 'రాత్రించరులు' అనేమాటకు అర్థం. అది శుద్ధ తప్పని హాంకాంగ్ నైట్‌క్లబ్‌లో తెలిసింది, మరొకసారి," అన్నాడు మురారి.

జానపదగాథల్లో కనిపించే ఇంద్రజాలంలాంటి మాటలు. అంతవరకూ మురారిని తిడుతున్న రెడ్డి అతను రాగానే సోఫాలో పిల్లికూనలా నక్కి కూర్చు న్నాడు. నాకు మురారి తెలియడం అతనికి మరీ వింతగా కనిపించింది.

"ఎలా వచ్చావిక్కడికి?" అన్నాడు మురారి.

జరిగిన కథంతా చూచాయిగా చెప్పాను. అక్కడే వుండిపొమ్మన్నాడు ఆ రోజుకు. రాత్రి ఎనిమిదిగంటలకు హాస్టలుకు చేరకపోతే గొడవ జరుగుతుందని చెప్పాను.

"ఎలాగూ ఎనిమిది దాటింది. యింక వెళ్ళకపోయినా-వెళ్ళినా ఫలితం ఒక్కటే. అసలు నువ్వీ ఊళ్లో ఉన్నట్లు నాకు తెలియదు. తెలిస్తే ఉండనిచ్చే వాడినా ఆ పాడు హాస్టల్లో" అంటూ నాకు కూడా భోజనానికి ఆర్డరిచ్చాడు.

జెంటిల్‌మెన్ ఆఫ్ ది జ్యూరీ!

ఆ రాత్రి ఆ హోటల్లో భోజనంచేసి, మురారితో అర్ధరాత్రి రెండుగంటల దాకా కబుర్లు చెప్పి అక్కడే నిద్రపోయాను నేను. ఆ చీకట్లో ఏం జరిగిందనే సందేహం (కథ చదువుతున్న పాఠకుడికే కలుగుతుంది, ఆ ఘట్టం ఇంతవరకు చెప్పి ఆపితే) మీకు కలగటంలో ఆశ్చర్యం లేదు. కాని కొన్ని పరిస్థితుల్లో,

అందులోనూ హత్యా నేరాన్ని నెత్తిమీద మోస్తున్న నాలాంటి వ్యక్తి నిజంలా కని పించని నిజం చెపితే ఎవరు నమ్ముతారు? అందుకని ఆ విషయం అక్కడే వదిలి పెడుతున్నాను.

మురారి మళ్ళీ నా జీవితంలో ప్రవేశించాడు. అతనిమీద పోయిన గౌరవం తిరిగి పదింతలు కావటానికి తగిన కారణం కనిపించింది.

అందుకే అనిపిస్తుంది. బ్రతికివున్న ఏ వ్యక్తిమీదగాని నీకున్న ఏ అభిప్రాయమూ చివరిది కాదని. ఏ క్షణంలో ఏ తెర తొలగి, ఏ అద్భుతం ఎదుటపడి నీ అభిప్రాయాన్ని మార్చుకోవలసిన అవసరం వస్తుందో చెప్పలేమేమో!

రెడ్డిని అలా ఎందుకు మోసం చేశావని అడిగాను మురారిని. అతను నవ్వి ఒక పెద్ద లెదర్ సూట్‌కేస్ తెరిచాడు. దానినిండా వందరూపాయల నోట్ల కట్టలున్నాయి!

"ఈ డబ్బు ఎంత ఉంటుందో తెలుసా?" అన్నాడు.

అంత డబ్బును ఒకేసారి అంతకు ముందెన్నడూ చూడలేదు నేను.

"నేను మోసంచేశానని రెడ్డి నీకు చెప్పాడా?" అన్నాడు.

వారి మధ్య తగువు పెట్టిన పుణ్యం నా వెంట పడుతుందనే భయంకొద్దీ లేదన్నాను. కాని మురారి గట్టివాడు. శరీరం ఎంత గట్టిదో మనస్సంత గట్టిది. ఆ గట్టితనాన్ని మించిన పదునుంది మెదడుకు.

నేను అనుకున్నంతపనీ జరిగింది. రెడ్డిమీద కోపం వచ్చింది మురారికి. రెడ్డిని పిలిచాడు బిగ్గరగా. వరండాలో పడుకున్న రెడ్డి ఎంతసేపటికీ జవాబు చెప్పలేదు. "ఇంత రాత్రివేళ అతన్ని లేపకపోతే ఏమౌతుంది?" అంటూ వారించాను మురారిని.

"కాదు అరుణా? ఈ వెన్నెముకలేని చచ్చు ఏనుగుల సంగతి నీకు తెలియదు. అన్నీ కావాలి వీళ్ళకు. మనకంటే వెయ్యిరెట్లు ఆబ ప్రతిదానిమీదాను. కాని ఏ పని చేయటానికీ చావలేదు. గట్టిగా టెలిఫోను మ్రోగుతే ఎగిరిపడే వాజమ్మలు! నీతోనేకాదు—ఎవరితోనూ చెప్పొద్దంటూ, దోవనపోయే ప్రతీవాడికీ తానెలా మోసపోయిందీ చెప్పి ఏడుస్తున్నాడట. వీడి వ్యవహారం ఫైసలు చేసుకోవాలి" అంటూ నిద్ర నటిస్తున్న రెడ్డిని జుట్టుపట్టుకొని ఈడ్చుకువచ్చి పెట్టె ముందు కూర్చోపెట్టి "నీకు రావలసిందీ, వడ్డీ, వడ్డీకి వడ్డీ, మార్వాడీ లెక్కల ప్రకారం ఎంత రావాలో అంత తీసుకుపో" అంటూ కేకలుపెట్టి తిట్టి, దబ్బిచ్చి అర్ధరాత్రి అతగాణ్ని సాగనంపాడు!

ఈ దిక్కుమాలిన ప్రపంచంలో మనుష్యులనూ, మనస్సులనూ, అర్థంచేసు కోవటం ఎంత కష్టం!

యువర్ ఆనర్!

మురారి నాకోసం వేరొక యిల్లు తీసుకున్నాడు. అతను ఢిల్లీ వచ్చినప్పు డల్లా ఏదో హోటల్లో దిగేవాడు. అప్పుడప్పుడు వచ్చి చూసి మాత్రం వెళ్తూండే వాడు.

"ఏం వ్యాపారం నువ్వు చేస్తున్నది?" అనడిగాను ఒకసారి.

"దొంగతనం" అన్నాడు నవ్వుతూ.

"దొంగతనమా? నిజం చెప్పు మురారీ!"

"నిజం చెపితే నీ గుండె ఇప్పుడే ఆగిపోతుంది." అంటూ మాట మార్చాడు.

రెండు నెలల కాలంలో నా ఆలోచనల స్వరూపం మారింది. ఆనంద్ వ్రాసిన ఉత్తరాలు చదివే సహనం కూడా నీరసించింది. మురారి చుట్టూ నా భవిష్యత్తు ఆశల పందిరి అల్లుకోవటం మొదలయింది మళ్ళీ.

కాని——

మురారి పరిస్థితి విచిత్ర మనిపించేది. హైదరాబాదు పరిచయంలో ఎప్పుడూ నాకు దగ్గరకు, యింకా దగ్గరకు రావాలని ప్రయత్నించేవాడు. ఇప్పుడు ఆ సాహసం పోయింది. నేను దగ్గరకు జరిగినా ఇంకా దూరం జరుగుతూ, నా కోసం ఆరాటపడేమనిషిని గురించి ఎలా నిర్ణయాలు తీసుకోవడం?

ఒకనాడు నా కథంతా చెప్పాను. ఆనంద్ చేస్తున్న సహాయం సంగతికూడా.

"అదృష్టవంతురాలివి" అన్నాడు తలవంచుకొని, మెరుస్తున్న బూట్లమీద తన నీడను చూసుకుంటానికి ప్రయత్నిస్తున్నట్లు చూస్తూ.

"అంటే" అన్నాను.

మాట్లాడలేదు. మౌనంగా అలాగే కూర్చున్నాడు చాలాసేపు అప్పటి అతని ముఖం నాకు యిప్పటికీ బాగా గుర్తు. ఏదో రోదన – మూలుగు – వేదన అతని ఊపిరిలోంచి బయటపడటానికి ప్రయత్నిస్తున్నది-బిగ్గరగా అతను నవ్వి నప్పుడు కూడా.

"పట్టాలు తప్పిన రైలుబండి-నాటకం చూశావా?" అన్నాడు కొంతసేపటికి.

"మాట మార్చకు. నీ సమస్య నాకర్థంకావటం లేదు" అన్నాను.

"నీకేకాదు అరుణా! నా జీవితం నాకే అర్థం కావటంలా. ఎక్కడో ఒక రాకుమారి వుందట. ఆమెను నాలాటి దౌర్భాగ్యుడు ప్రేమించాడట. ఆమె ఎత్తు

ధనం నువ్వు సంపాదించుకువస్తే బిడ్డనిస్తానన్నారట రాజు. అతడు నెత్తురు ధార పోసి సంపాదించుకు వచ్చాడట, చివరకు—అప్పటికి ఎంత జరిగిందో తెలుసా ? రాజుగారి కోటలో పందిరి వేశారట. పెళ్ళి జరగబోతోందట. తన ప్రేయసికి పెళ్ళి చేస్తున్నారనే భయంతో అతడు పరుగు పరుగున వెళ్ళి 'ఆపండి' అంటూ కేకపెట్టాడట. కాని ఆ పెళ్ళి జరుగుతూంది ఎవరికో తెలుసా? అతని ప్రేయసికి కాదు. ఆమె మనుమరాలికి! అంటే అతగాడు అంత ధనం సంపాదించుకు రావటానికి యాభై సంవత్సరాలు పట్టిందన్నమాట. ఈ లోగా ఆ రాకుమారికి పెళ్ళై సలక్షణంగా కాపరంచేసి అరడజనుమంది పిల్లల్ని కన్నదన్నమాట! ఆ అరడజనుమందీ వంతుల వారీగా, వరసక్రమంలో తలొక అరడజను మందినీ ఈ భూమండలానికి ప్రసాదించారన్నమాట! ఏమిటి, కథ బాగుందా?" అంటూ సిగరెట్ అంటించి నా ముఖంలోకి చూశాడు మురారి.

"కథ బావుంది కాని—నేనింకా ముసలిదాన్ని కాలేదన్న సంగతి నాకంటె నీకే బాగా తెలుసేమో" అన్నాను.

"నీ కర్థం కాలా ! ఏ రాయి అయితేనేం, పళ్ళూడకొట్టుకుంటానికి? మనిషికీ మనిషికీ ఉన్న అడ్డుగోడలు సవాలక్ష చచ్చాయి." అంటూ లేచాడు వెళ్ళటానికి.

కూర్చోమన్నాను. అర్జంటుగా మద్రాసు వెళ్ళాలన్నాడు" నా చేతి భోజనం తినిపోవాలి యివాళ," అంటూ పట్టుకు కూర్చోపెట్టాను.

"నీ చేతి భోజనమంటే ఆ మద్రాసు హోటల్లో అయ్యరొండిన చప్పిడి కూడేనా?"

"నాకు వంట చేతకాదుగా?''

"మరి నీ చేతి భోజన మంటే అర్థం?"

"నే వడ్డించిన భోజనం—అని. తెలిసిందా స్వామీ?"

"తెలిసింది రాణీగారూ. గండిపేటలో తిన్నాం గుర్తుందా ఒకసారి? అయ్యో! డాక్టరు చదువుతున్నా సిగ్గు మరిచిపోలేదే నువ్వు?"

"డాక్టర్లకు అటువంటివి వుండవంటావా ?"

"నీకే తెలియాలి."

హోటల్‌నుంచి వచ్చిన క్యారియర్ భోజనంతోపాటు, ఎవరో ఇచ్చిన ఆవకాయ జోడించి ఇద్దరం తిన్నాం తృప్తిగా.

ఆనాడు మురారి వెళ్ళిపోతూ "నీకో సలహా చెప్పాలనుకుంటున్నాను. 'పెద్ద వడు సలహా చెప్పటానికి అనే సాహసం నీకు లేదని నమ్మకం. నీకి చదువు

అనవసరం. హాయిగా ఆనంద్ దగ్గరకు వెళ్ళిపో. ఇద్దరూ సుఖంగా వుండండి స్వార్థం లేకుండా యింతవరకూ జీవితంలో నేను ఏ పనీ చేయలేదు. అసలు నిస్వార్థంగా ఏ మనిషీ ఒక పని చేస్తాడనే నమ్మకముండేదికాదు. కాని నామీద నాకే, ఆ విశ్వాసం కలిగిందీనాడు. ఒక్క విషయం గుర్తుంచుకో. అసలే తెలుగు వాళ్ళం. అందులోనూ తాటాకు మంటల్లాంటి మనస్సులు. ఏ చిరుగాలికీ తట్టుకో లేని దుర్బలత్వముంది నీలో. నేను చాలామందిని చూశాను. పై పై మెరు గుల్నీ, నవ్వుల్నీ చూసి తృప్తినటిస్తూ చెప్పే మాటలు విని మోసపోకు. అటువంటి చలాకీ పిల్లలు కప్పుకున్న పొగచూరిన గాజుపొర రవ్వంత తొలగించి చూడు. ఎంత కుళ్ళు, ఎంత నిరాశ, ఎంత జుగుప్స, ఎంత నైరాశ్యం బయటపడు తుందో మురికి వరదల్లో" అన్నాడు.

అంతా విని "పాతికేళ్ళకే ఇంత విజ్ఞానామృతాన్ని, కుండలకొద్దీ వర్షించే అనుభవం ఎలా సంపాదించావు మురారీ?" అన్నాను హేళనగా.

"వయస్సుకూ అనుభవానికీ సంబంధ ముందనుకుంటే, అదుగో ఆ రాతి బండ పక్కనే రోజూ ఒక అరగంట కూర్చో. ఏమన్నా జ్ఞానోదయమౌతుం దేమో చూద్దాం" అంటూ విసురుగా వెళ్ళిపోయాడు.

"పాపం అతని హృదయం ఎక్కడో దెబ్బతింది. అతన్ని పోగొట్టుకో కూడదు. పోగొట్టుకుంటే నాకు జీవితం లేదు." అనుకున్నాను రెప్ప లార్ప కుండా చూస్తూ.

కాని దెబ్బ తిన్నది అతని హృదయంకాదు.

## 10

అలా వెళ్ళిపోయిన మురారి మళ్ళీ చాలాకాలందాకా కనిపించలేదు. పరి గెత్తుతున్న రైలుబండి లాంటిది, ప్రపంచం! ఎవరు ఏ స్టేషనులో ఎక్కి ఎంత దూరం మనతో ప్రయాణంచేసి, ఏ స్టేషనులో దిగిపోతారో చెప్పలేం. మళ్ళీ ఏ కూడలిలో ఎదురుపడతారో అది కూడా చెప్పలేం.

నాకు తెలియకుండానే నా మనస్సు అతనికోసం ఆరాటపడేది. ఎంత సమాధానం చెప్పుకుందామన్నా మొరాయించి ఎదురు తిరిగేది.

ఒక వస్తువుకోసం-ఒక అనుభవంకోసం-ఆరాటపడటంలో, ప్రయత్నించ టంలో వున్న ఆనందం, దాన్ని అనుభవించటంలో లేదేమో! అందుకనే సాధిం చిన ఏ విజయంలోనూ అంతర్వాహినిగా వుంటుంది విషాదం ఎప్పుడూ. చదువు కుంటున్నంతకాలం అదొక వ్యాపకంగా వుండేది. చదువై పేరుకు ముందు




'డాక్టర్' అనే బిరుదు అతుక్కుపోయిం తర్వాత ఏదో పోగొట్టుకున్నట్లు అని పించింది.

ఆఫ్రికా రమ్మంటూ ఉత్తరాలమీద ఉత్తరాలు రాస్తున్నాడు ఆనంద్. ఫ్రాన్సో, అమెరికానో అయితే వెంటనే వెళ్ళేదాన్నేమో! కాని ఆఫ్రికా అంటే ఎందుకో వెళ్ళటానికి బెంగనిపించింది.

ఢిల్లీ మహానగరం, అక్కడి స్నేహితులూ బాగా అలవాటైపోవడం మరొక కారణం కావచ్చు.

"ఇక్కడే ఇద్దరం కలిసి నర్సింగ్ హోమ్ పెట్టుకుందాం. నువ్వే ఇండియా రావలసింది," అంటూ జవాబు వ్రాశాను.

ఆనంద్ దగ్గరికి వెళ్ళటానికి సంకోచించటంలో కేవలం ఆఫ్రికా మీదున్న చులకనభావం మాత్రమే కారణం కాదనిపిస్తుంది. మనకు తెలియకుండానే మన అంతరాంతరాళాల్లో విస్పష్ట స్వరూపం లేని ఆశలూ, కోర్కెలూ, రాగద్వేషాలు బలహీనమైన అంతర్వాహినులై వుంటాయేమో. దానికి కారణం, బహుశా ఆనంద్ స్థానంలో మురారిని నిలుపుకుంటానికి, స్వార్థమాలిన్యాన్ని సంపూర్తిగా క్షాళనం చేసుకోలేని ఈ మనస్సు చేసిన ప్రయత్నం కావచ్చు. ఈనాడు తలుచుకుంటే ఆ అనుమానం నిజమనిపిస్తుంది.

మురారిని గురించిన వివరాలు తెలుసుకుంటానికి ప్రయత్నించాను. అతను చాలామందికి పరిచయం. పరిచయాలను గాఢ స్నేహాలుగా మారకుండా పది కాలాలపాటు చక్కగా నిలుపుకోవటం అందరికీ తెలిసిన విద్య కాదు. అది మురారికే తెలుసు.

ఆనాడు సాయంత్రం షాపింగ్‌కిపోయి తిరిగి వస్తుంటే కనిపించాడు 'అతను.'
"మురారీ" అంటూ పిలిచాను అతను కదలలేదు. వెనుకకు తిరగలేదు.
దగ్గరకు వెళ్ళి చూశాను. అతను మురారి కాదు
చిత్ర మనిపిస్తుంది.

ఈ ప్రపంచంలో ఇన్ని కోట్లమంది మనుష్యులున్నారు. కాని ముమ్మూర్తులా ఒక మనిషిని పోలిన మరొక మనిషి ఉండటం ఎన్నడూ జరగదు, ఒకే హీరో రెండు వేషాలు వేసి ద్విపాత్రాభినయనం చేయవలసిన సినిమాలలో తప్ప. ఆనాడు నేను చూసిన వ్యక్తి పేరు చెప్పటానికి కొన్ని ఇబ్బందులున్నాయి. నాకు కాదు. అతనికి; అతనికి కావలసినవాళ్ళకి.

అతనితో మాట్లాడాలనిపించింది.

ఎలా మాట్లాడను?

'వనిత తానంత తా వలచిన' అంటూ ఎక్కడో చదివిన పద్యం జ్ఞాపకం వచ్చింది. సాధారణంగా ఏ స్త్రీ అటువంటి సాహసానికి ఒడికట్టదు. సాహసిస్తే ఆమెలోని స్త్రీత్వం సగమూ, వ్యక్తిత్వం పూర్తిగానూ అదృశ్యమైపోవడం జరుగుతుంది.

అతన్ని మళ్ళీ కలుసుకోకపోతే ఈ కథ మరొకరకంగా వుండేది. కాని కలుసుకోవటం జరిగింది నాతోపాటు చదువుకున్న మరొక డాక్టరుతోకలిసి అతను ఆ జనవరి 26 న రిపబ్లిక్‌డే పెరేడ్‌లో కనిపించాడు. చదువుకున్న రోజుల్లో అతన్ని ఎన్నడూ లక్ష్యం చేయనిదాన్ని ఆప్యాయంగా 'హలో' అంటూ పలకరించి, క్షేమ సమాచారాలు విచారించాను: అతను మెలికలు తిరిగి రవ్వంత సిగ్గుపడి, కళ్ళు చిట్లించి, తన స్నేహితుణ్ని పరిచయం చేశాడు. ఇద్దరినీ మర్నాడు టీకి ఇంటికి పిలిచి అడ్రస్ యిచ్చాను. లా కమీషన్‌లో పనిచేస్తున్న 'రూప' అనే అమ్మాయితోకలిసి నార్త్ అవెన్యూలో వుంటున్న రోజులవి. ఆనంద్ పుష్కలంగా డబ్బు పంపుతున్నా, 'రూప' దగ్గర అప్పులు చేయవలసి వచ్చేది. ఇచ్చేది కాని ఎన్నడూ అడిగేదికాదు. ఇంకా కొంత అప్పు మిగిలిపోయింది ఆమె దగ్గర్నుంచి వెళ్ళిపోయేనాటికి.

అప్పటికే మిలటరీలోకి డాక్టర్లు కావాలంటే అప్లికేషన్ పెట్టానుగాని వెళ్ళలేదు. వైద్యవృత్తిమీద అనురక్తి రోజు రోజుకూ సన్నగిల్లుతూ వచ్చింది. ఈలోగా నాలుగైదు చోట్ల డాన్సుప్రోగ్రాము లిచ్చాను. అభిమానుల సంఖ్య, ఆరాధించే యువకుల సంఖ్య పెరుగుతూ వచ్చింది.

ఆ మర్నాడు సాయంత్రం వాళ్ళిద్దరికోసం నిరీక్షిస్తూ కూర్చున్నాను. నాకు తెలియకుండానే మనసు తొందరించసాగింది. ఏదో తొందరపాటు-త్రొట్రుపాటు సంరంభం-సంచలనం మనస్సును సుడులు సుడులుగా త్రిప్పుతోంది. రోజూ చూస్తున్న సాయంత్రమే కొత్తగా కనిపించింది. తీయటి విషాలవంటి అనుభవాలు కూడా వుంటాయి జీవితంలో. ఆద్యంతాలు లేని అనంతవిశ్వంలో అవల్లీలగా రెక్కలు కట్టుకొని ఎగిరిపోతున్నట్లనిపించింది.

అస్పష్టమైన భ్రమః అందమైన ఆత్మవంచనః ఎదుట సన్నగా వయ్యారంగా కదిలి చిరుగాలుల చక్కిలిగింతలు విసురుకున్న సరుగుడు చెట్లను చూస్తూ పునాదిలేని భవిష్యత్ జీవితసౌధాన్ని మనోఫలకంమీద చిత్రించుకుంటున్నాను.

అయిదు గంటలు కొట్టింది. రారనే దిగులుతో కదిలానొకసారి.

'ఎందుకీ నిరీక్షణః' అనుకున్నాను.

జీవితం నిజానికి సుఖంగానే నడుస్తూంది. అనుకున్నదానికంటె ఎక్కువగానే దొరికింది అదృష్టంః స్నేహితులు, షికార్లు భయాలకవసరం లేని భవిష్యత్తు, పరిపూర్ణంగా వికసించి కళ్ళముందు విరియబూసిన మల్లెపందిరిలా కనిపిస్తున్న జీవితం.

కాని...

కాని...

కాని ఏదోలోటు—ఏదో అసంతృప్తి-అస్పష్టంగా నిండి గుండెలను పొంగిస్తున్న శూన్యం. ఎందులో వుందీ రహస్యం?

నేను ప్రేమించాను గాఢంగా.

ఎవరిని?

ఎవరినీకాదు.

కనీసం నా జీవితాన్ని కూడాకాదు.

నన్ను నేనే.

కష్టంకంటె, సుఖంకంటె జీవితం గొప్పదే. కాని జీవితాన్ని తొంగదీసేశక్తి కాలదన్నగల నిర్లక్ష్యం వ్యక్తిలో వుండదంటారా?

లేకపోతే ఏమిటి చెప్పండి? దిగంతాలదాకా విస్తరించిన సముద్రంలో దప్పిక తీర్చుకుంటానికి చుక్క మంచినీరు దొరకనట్లు - సంతలాంటి ప్రపంచంలో ఎప్పుడూ పదిమంది మధ్య మసలుతున్న నేను ఒంటరిదాన్ని మానసికంగా. ఆ విషాదాన్ని కప్పుతున్న చిరునవ్వుల దొంతరలను చూసి ఎంతమంది మోస

పోయారు? బుగ్గమీద వయ్యారంగా, చిరునవ్వుల నీడలో పుడుతున్న చిన్ని సొట్టలో సుడులుతిప్పుతున్న సుడిగుండాలను అద్దంలో చూసికూడా నేనుమాత్రం పోల్చుకోగలిగా నంటారా?

సత్యాన్ని సౌందర్యంతో పోల్చాడో కవి.

కాని——

పాపంలో మాత్రం సౌందర్యం లేదంటారా?

స్వార్థం అందంగా కనిపించే లక్షణాలు, భరించలేని మనిషి దైవం కాదంటారా?

ఎంత కళ్ళుమూసుకున్నా నిప్పులాంటి నిజం ఎదురుగా మండుతున్నప్పుడు కొంత వెలుగు లోపలికి దూసుకు వస్తుంది, రక్త నాళాలను ఛేదించుకుంటూ.

'ఆనంద్‌కు ద్రోహం చేస్తున్నావ్' అనే మూలుగు ఎక్కడో హృదయాంతరాళాలనుండి నాకు అస్పష్టంగా వినిపిస్తూనే వుంది.

ఆనాడు వారిద్దరూ వచ్చేసరికి ఆరుగంటలయింది. మనిషిని మళ్ళీ పరీక్షగా చూశాను. అవే కళ్ళు. అదే నుదురు. అవే చెక్కిళ్ళు. కాని మురారిలో లేని హుందాతనం అతనిలో ఉంది.

"ఇతను బెంగాలీ. తెలుగువాళ్ళంటే ఆకస్మికంగా అభిమానం పుట్టుకొచ్చి ఒక తెలుగు అమ్మాయిని వివాహం చేసుకున్నాడు" అంటూ నా మిత్రుడు వ్యాఖ్యానం చేసినప్పుడు నే తెస్తున్న ట్రే కింద పడవలసింది. మనస్సు వణికి శరీరాన్ని కంపింపచేసింది. అంతటితో ఆ పరిచయం ముగిసివుంటే బాగుండేది.

అతను పనిచేసే చోటనే నాకు మెడికల్ ఆఫీసర్‌గా ఉద్యోగం దొరికింది. రెండు మూడు నెలలు సాదాగా, ఎటువంటి సంఘటనలూ లేకుండా గడిచిపోయాయి. అతను చాలా ముభావం మనిషి. ఏదో మర్యాదకోసం తప్పనట్లు మాట్లాడేవాడు. ఉద్యోగం మానేసి ఆఫ్రికా వెళ్ళిపోదామనుకున్నాను. ఆనంద్ వ్రాసి వ్రాసి ఉత్తరాలు విసుగెత్తి వ్రాయడం మానేశాడు. డబ్బుమాత్రం ఎప్పటి మాదిరీ పంపించేవాడు.

ఒకనాడు 'అతను' డిస్పెన్సరీ ముందునుంచి వెళ్తూ కారు ఆపి "కలిసి వెళ్దామా?" అన్నాడు.

"ఎక్కడికి?"

"ఎక్కడికైనా సరే" అన్నాడు నా భాష అర్థమైనట్లు.

"ఎంతదూరం రాగలరు, నాతో?" అన్నాను.

"కనీసం గేటుదాకా" అన్నాడు.

"నాకు తెలుసు అది మీ లిమిట్. అంతకుమించిన దూరం నాతో రాలేరని తెలుసులెండి" అనేశాను.

నవ్వి వెళ్ళిపోయాడు.

వెళ్ళిపోయాడనే బాధపడ్డాను.

కావాలనుకున్న వస్తువు అందనప్పుడు వ్యామోహం మరీ ఎక్కువయిపోతుం దేమో! ప్రమాదవశాన ఆ వస్తువు ఒక క్షణం చేతికందినట్లే అంది జారిపోతే ఆ వెర్రి బాధకు జీవనాడలు తెగిపోయినంత బాధ కలగదంటారా? మరొకసారి అతను కనిపించినప్పుడు "మీ మిసెస్‌ను ఎప్పుడు చూపెడతారు?" అని అడిగాను.

"అదొక బ్రూట్. మూగది, పైగా" అన్నాడు చిరాగ్గా.

"నిజంగానా?" అన్నాను.

"నిజమైనా బావుండేది. ఎవరినీ మీలాంటివాళ్ళను యింటికి పిలిచే యోగ్యత లేదు. ఒకరింటికి పోయే యోగ్యత అంతకంటే లేదు. చదువుకునేరోజుల్లో పుస్తకం పురుగులా వుండేది. పెళ్ళయాక వంటింటి పురుగై కూర్చుంది. సినిమాలు వంటికి పడవు. పిక్నిక్‌లంటే విసుగు. స్నేహితులంటే చిరాకు. యుద్ధానికి బయలుదేరుతున్నట్లు వంటింట్లోకి బయలుదేరుతుంది. అదొక సర్కస్ కంపెనీ. వంటవాళ్ళంటే అసహ్యంట. ఆ సర్కస్ అయ్యాక యజ్ఞం చేస్తున్నంత సీరియస్‌గా డైనింగ్ టేబిల్ ముందు కూర్చుంటుంది. బావిలో కప్ప-అంటారు చూడు, అదీ వరస. ఛీ-ఛీ-ప్రాణం విసుగెత్తిపోతోంది. అందరూ జంటగా వస్తారు క్లబ్బులకి. దాని వంటికి ఆ వాతావరణం పడదు.

ఈవిధంగా దుర్భరమైన నరకాన్ని జీవితంలో అనుభవిస్తున్నట్లు చెప్పి జాలిగా చూశాడు. సానుభూతిని అర్థిస్తున్న కళ్ళవి.

ఒత్తిడి ఎక్కువై కిక్కిరిసినగాలి, శూన్యంలోకి, ఏమాత్రం రంధ్రంచిక్కినా అవలీలగా చొచ్చుకుపోతుంది.

ఆనాడు అతనితో కలిసి తిరిగాను. కలిసి భోంచేశాను. కలిసి సినిమాకు వెళ్ళాము. ఇంటిదగ్గర దిగబెడుతూ అరచేయి నొక్కాడు గట్టిగా.

ఆవిధంగా మొదలయింది జీవితంలో మరొక ఘట్టం!"

మర్నాటికి కేసు వాయిదా పడింది. అరుణను వెంటబెట్టుకుని తీసుకుపోయారు పోలీసులు.

హేమంత్ నిట్టూరుస్తూ, నా భుజంతట్టి, 'పద బ్రదర్, దిగపెడతా'అన్నాడు. కారులో చాలా సేపు ఇద్దరం మాట్లాడుకోలేదు. హేమంత్ నుదుటిమీద పట్టిన చెమటను తుడుచుకుంటూ "అరుణ కథలో ఆ 'అతను' ఎవరో తెలుసా ?" అన్నాడు మా హోటల్ దగ్గర కారు ఆపి.

"తెలుసు" అన్నాను బరువుగా.

## 11

మర్నాడు మళ్ళీ కోర్టులో అరుణ తన కథ చెప్పటం ప్రారంభించింది — నన్ను చూసి, గుర్తించినట్లు దీనంగా పల్చగా నవ్వి

"నా భర్త ఆనంద్ ఈ పరిస్థితుల్లో ఆఫ్రికానుంచి తిరిగివచ్చాడు. కొంత డబ్బు నిలవచేసి తీసుకొచ్చాడు. సుఖంగా బ్రతకటానికి కావలసిన వసతులన్నీ దొరికాయి. చిన్న నర్సింగ్‌హోం పెట్టుకున్నాం. ఆనంద్‌కు జీవితంలో మరొక ఆసక్తి లేదు. హాస్పిటల్ అతని దేవాలయం. రోగులు అతని ఆరాధ్య దైవాలు. ఇరవైనాలుగు గంటలూ అతనికి వైద్యం చేయడంతోనూ, ఆ పెద్ద పెద్ద పుస్తకాలు చదవడంతోనూ సరిపోయేది.

అతని వ్యక్తిత్వం పట్ల గౌరవముంది నాకు.

కాని—

నాకు కావలసిన మనిషి అతను కాదనిపించేది.

స్నేహితులన్నా, క్లబ్బులన్నా, పార్టీలన్నా అతనికి వ్యామోహం లేదు. కాని నన్ను వారించేవాడు కాదు. వైద్యవృత్తి చేపట్టిన ప్రతివారికీ సహనం కావాలి" అది నాలో లేకపోయింది.

ఒకసారి ఒక సంఘటన జరిగింది.

వివాహమైన తర్వాత అతను నాతో గట్టిగా మాట్లాడటం అదే మొదటి సారి.

మా కాపరం మేడమీద.

మా నర్సింగ్‌హోం క్రింద వుండేది

ఒకావిడ ప్రసవించింది. ప్రమాదస్థితిలో వుంది. అర్ధరాత్రి లేపి ఆక్సిజన్ ఇవ్వమని చెప్పి, ఎవరో స్నేహితుడు విదేశాలనుంచి వస్తున్నాడంటూ అతను ఎయిర్‌పోర్టుకు వెళ్ళిపోయాడు. అలాగే ఆవలించి నిద్రపోయాను. అతను మర్నా




టికి కాని తిరిగిరాలేదు. వస్తూనే కోపంతో "మనం వైద్యం చేస్తున్నది మనుష్యుల్ని బ్రతికించటానికా? ప్రాణాలు తీయటానికా?" అంటూ మందలించాడు.

మాటమీద మాట పెరిగింది.

"మిస్టర్ ఆనంద్! మీరు సహాయంచేశారు. పెళ్ళి చేసుకున్నారు. అంత మాత్రాన నన్ను ఒక కీటకంగా జమకట్టి ఈ విధంగా కేకలుపెట్టటం నేను భరించలేను" అన్నాను చివరకు తీవ్రంగా.

అతను మౌనంగా నిలబడి నాకేసి చిత్రంగా చూసి వెళ్ళిపోయాడు. డాక్టరు డాక్టరుగా బ్రతికినంతకాలం చుట్టూ వుంటారు రోగులు. వారికి ఎంత సేవచేసినా ఇంకా చేయవలసింది చాలా వుంటుంది. కాని డాక్టరు మాత్రం మనిషికాదా? డాక్టరుకు మాత్రం జీవితం లేదా? ఆ జీవితానికి మాత్రం ఆశలూ, సుఖాలూ, ఉండకూడదా?—ఇవీ నా ప్రశ్నలు. ఆ ప్రశ్నలకు సమాధానాలు చెప్పకుండానే మరో గదిలోకి వెళ్ళిపోయాడు ఆనంద్.

ఆ సంఘటన తర్వాత ఆనంద్ నాతో కొంత ముఖావంగా ఉంటున్నాడని అర్థంచేసుకున్నాను

రంగస్థలంమీద గజ్జెకట్టి నాట్యం చేసేటప్పుడు నాకు లభించే తృప్తి, థియేటర్‌లో ఆపరేషన్ చేస్తున్నప్పుడు అతనికి లభించేది. క్లబ్బులో కావలసిన స్నేహితులతో చక్కటి సాయం సమయాల్లో కాలక్షేపం చేస్తున్నప్పుడు నాకు

లభించే ఆనందం, రోగుల కష్టసుఖాలు విచారిస్తున్నప్పుడు అతని కళ్ళలో చూసేదాన్ని.

పదిమందితో కలిసే తత్వంకాదు అతనిది.

పదిమంది చుట్టూలేకుండా బ్రతికే స్వభావం కాదు నాది.

ఎప్పుడన్నా విశ్రాంతికి శలవు తీసుకున్నా ఎక్కడో ఏకాంత ప్రదేశానికి పోయి ఒంటరిగా గడిపేవాడు. మేం పదిమంది కలిసి బయలుదేరేవాళ్ళం, విహార యాత్రలకు...అన్నిరకాల సరంజామాలతో. ఇంత చదువూ, సంస్కారమూ కలిగిన మనిషి ఆ విధంగా ఎలా బ్రతకగలుగుతున్నాడా అని ఆశ్చర్యపడే దానిని."

"అంటే భార్య ఆశించే సుఖశాంతులు నీ భర్తనుండి నీకు లభించలేదని నీ అభిప్రాయమన్న మాట?" అని ప్రశ్నించాడు న్యాయమూర్తి.

"పొరపాటు పడకండి యువరానర్! ఆ ప్రశ్న అడిగేముందు సుఖానికీ, శాంతికీ నిర్వచనమేమిటో ముందు కాస్త శలవియ్యండి. (ఆగి) ఎవరు చెప్ప గలరు ఆ మాటలకు అర్థం? ద్వేషించే అనుభవాలకోసం గూడా మనస్సు ఆరాట పడుతుందని నాకు తెలుసు. అలాగే ప్రేమించే అనుభవాలకు దూరంగా పరిగెత్తే వాళ్ళు ఎంతమంది లేరీలోకంలో? పోనీండి జరిగింది చెప్తున్నాను. ఎందుకలా జరిగిందో, ఎవరి నేరమేమిటో నిర్ణయించవలసింది మీరు. నేను అనుకునే దాన్ని—భర్తను ప్రేమించాలనీ, పూజించాలనీ. కాని చేయలేకపోయాను. మనిషి అనుభవించే సుఖాలకూ, ఆచరించే పనులకూ సాధారణంగా అనుకునే టంత సంబంధముండ దనుకుంటా. నేనేకాదు. సర్వప్రపంచమూ గౌరవించి పూజింపదగ్గ మనిషి ఆనంద్. కాని భర్తను కేవలం గౌరవించి పూజించటంతో తృప్తిపడగలిగిన జీవితం కాకపోయింది నాది. ఏదో అసంతృప్తి, ఏదో లోటు కడుపంతా నిండిన శూన్యం—నన్ను ఆవరించినట్లనిపించేది, ఏకాంతంగా గడిపి నప్పుడల్లా. ఆనంద్ సమక్షంలో నా ఏకాంతానికి విముక్తి లభించేదికాదు.

ఈ సమయంలో—ఇంతకు ముందు చెప్పిన మరొక మనిషిని—మురారిని ముమ్మూర్తులా పోలిన మనిషిని మళ్ళీ నేను కలుసుకోవటం జరిగింది. పోగొట్టు కున్న వస్తువు మళ్ళీ చేతికందినట్లనిపించింది. అతని పేరు చెప్పటంకంటె 'ముకేష్' అనే పేరుతో ఈ కథ చెప్తాను.

ముకేష్‌ను యింటికి టీకి పిలిచాను.

కృతజ్ఞతతో మెరుస్తున్న కళ్ళతో నా ఆహ్వానాన్ని అందుకున్నాడు. వచ్చాడు.

ఆ సమయంలో ఆనంద్‌కూడా యింట్లోనే వున్నాడు. ఇద్దరినీ ఒకరి కొకరికి పరిచయం చేశాను. ఆ సన్నివేశాన్ని అతి నిర్లిప్తంగా భరించాడు ఆనంద్. ముభావంగా కాసేపు కూర్చుని పనివుందంటూ వెళ్ళిపోయాడు.

అతను అలా వెళ్ళిపోవటం బాధనిపించింది.

'ముకేష్'ను కూర్చోమని చెప్పి అతన్ని అనుసరించాను. అలికిడి విని వెనక్కి తిరిగిచూసి మళ్ళీ పట్టించుకోకుండా ముందుకు నడిచి కారెక్కి కూర్చున్నాడు. అతని కళ్ళను పులుముకున్న నీటిపొర స్పష్టంగా కనిపించింది నాకు.

"ఎక్కడికి వెళ్తున్నావ్?" అన్నాను ఇంకేమనాలో తోచక.

"తెలియదు" అన్నాడు.

"నీకు పరిచయం చేద్దామని ఒక పెద్దమనిషిని యింటికి పిలిచాను. ఆ విధంగా వెళ్ళిపోతే ఏమనుకుంటాడు?"

"నాకు తెలియదు."

"నీవు అతిధులను పిలిచినప్పుడు నేనూ అలా చేస్తే?"

"నాకు అతిధులంటూ ఉండరు.''

"నీకు లేని ఫ్రెండ్స్ నాకు ఉన్నారని బాధపడుతున్నావా?"

ఆ ప్రశ్నకు జవాబు చెప్పకుండా కారు స్టార్టు చేసుకుని వెళ్ళిపోయాడు ఆనంద్.

ఆ తర్వాత నేను లేని నవ్వు తెచ్చుకుని, జరిగింది మరిచిపోయి, డ్రాయింగ్ రూములో కూర్చొని ముకేష్‌తో కబుర్లలో పడ్డాను. ఒక చిత్రమైన ఆకర్షణ కనిపించింది అతనిలో నాకు. ఆ ఆకర్షణ ఆనంద్ పడుతున్న బాధను విస్మరింపచేసింది. అలాగే మాట్లాడుతూ చాలాసేపు కూర్చున్నాం. ప్రొద్దుపోయిం తర్వాత ముకేష్ వెళ్ళిపోయాడు. అతను వ్రాసుకున్న డైరీ మా గదిలో వదిలి వెళ్ళిపోయాడని తర్వాత తెలిసింది. ఒకరి డైరీలు చదవడం ఆరోగ్యకరమైన ఆసక్తి కాదని తెలిసికూడా మంచంమీద పడుకుని అది చదవకుండా వుండలేకపోయాను. చాలావరకూ స్వంత విషయాలు. అందులో అధికభాగం భార్యను గురించి. చివరి పేజీలో నాపేరు చాలాసార్లు కనిపించింది. నా ఆసక్తి పెరిగింది.

'నా అవసరాలనూ, ఆశలనూ అర్థంచేసుకున్న మనిషి ఈ ప్రపంచంలో అరుణకాక మరెవ్వరూ లేరనిపిస్తూంది.'

—ఒకచోట ఈ వాక్యం కనిపించింది.

ఇది ఎంత నిజమో నాకు తెలియదు. అతని అవసరాలెటువంటివో ఆశల రూపమేమిటో నాకు రవ్వంతకూడా తెలియదు.

మరొకచోట—

"చాలామంది స్త్రీలతో నాకు పరిచయముంది. ఇంత స్వల్పపరిచయంతో నాకు ఈ విధంగా ఆత్మీయురాలనిపించిన వ్యక్తి మరొకరు లేరు. ఆమెతో మాట్లాడుతున్నప్పుడు మొదటిసారిగూడా-జన్మజన్మల బాంధవ్యమున్నట్లు అనిపించింది-"

'అరుణ ఆకర్షణలలో అతి బలీయమైంది ఆమె నవ్వు. అది అయస్కాంతంలా మనిషినీ, మనసునూ దగ్గరకు లాక్కొని కట్టివేయగలదు.'

'క్లబ్బులో కనిపించింది అరుణ. దిగబెడతానన్నాను. కారెక్కి కూర్చుంది. స్త్రీ స్పర్శలో వున్న వెచ్చదనం మొదటిసారి అనుభవించాననిపించింది. మధ్యలో ఒక స్నేహితురాలిని చూడాలంటూ దిగిపోయింది. రేపు టీకి రమ్మంటూ ఆహ్వానమిచ్చింది. సెలయేరులా -ఒకోసారి జలపాతంలా మరొకసారి చిరుపవనంలా కనిపించి కదిలించేది అరుణ. మనిషి కదలికలో, మాటలధోరణిలో, నవ్వుల విరుపులలో ఏదో సౌలభ్యముంది. భూమండలాన్ని పరిపాలించవలసిన మహారాణిలా కనిపించింది.'

ఇలాగే సాగింది డైరీ.

ఈ డైరీ వ్రాయడం అనేది ఒక కళగా నేర్చుకున్నారు తెల్లవాళ్ళు. చాలా గొప్పవాళ్లు. వాళ్ళల్లో-వ్రాసుకున్న డైరీలు అచ్చై సర్వప్రపంచం చేతనూ గౌరవించబడుతున్నాయి. తెల్లవాళ్ళు పోయారు. వారు అందించిన అనేక వారసత్వాలు మనకు మిగిలాయి. అందులో డైరీ వ్రాయడం ఒకటి.

కాని-

వారు వ్రాసింది వేరు. మనం వ్రాసుకునేది వేరు.

మన డైరీల్లో అంతా మన వ్యక్తిగతమైన బాధలు-సుఖాలూ-ఇష్టాలూ-అయిష్టాలూ-ఇవీ కనిపించేవి. అసలు డైరీ వ్రాయడం ఒక జబ్బుగా మారి బాధపడేవారున్నారు. అందులో నేనొకదాన్ని. మనం సుఖపడితే ప్రపంచం స్వర్గం; మనం బాధపడితే ప్రపంచం నరకం. మన ఆయువు మూడితే భూమండలం పగిలి రాలిపోతుంది-ఇదీ మనలో చాలామంది డైరీలు వ్రాసేపద్ధతి. మనమీద -మన జీవితంలో మనకున్న వల్లమాలిన వ్యామోహం ఈ ధోరణికి మాతృక.

మన డైరీలలో కేవలం ఆత్మగతమైన అనుభవాలకుకాక మరో విషయానికి ఆస్కారముండదు. అది మరొకరి కంటపడదనే ధైర్యంతో రాస్తాం. ఎప్పుడో పడుతుంది. పడినప్పుడు ఫలితాలు ఎంత దారుణంగా వుంటాయో వ్రాస్తున్నప్పుడు మనం ఆలోచించం. ఎంత గుండెల్లో దాచుకునే పరమరహస్యాలుగూడా ఏ దుర్బ లక్షణంలోనో, ఆవుకోలేని ఏ ఉద్రేకపు వరదల్లోనో బయటపడతాయి. ఇంక డైరీలు—మనస్సులకూ—ఆ లోపల లోపల దాచుకున్న నిగూఢమైన భావాలకూ రక్షణ కల్పించగలవా?

ఏమైనా ముకేష్ డైరీ చదువుతున్నప్పుడు నా మనస్సు పరవశించింది. మనని ముఖ్యులని భావించిన మనిషిని అభిమానించటం మానవ స్వభావం. మనను ద్వేషించిన మనిషిని అతడు దైవమైనా ప్రేమించలేము

డైరీ పూర్తిచేసి పడుకున్నాను. భోజనం చేయాలనిపించలేదు. గాజు పాత్రలో చేపలమాదిరి రంగు రంగుల ఆలోచనలు మనస్సును కదిలించి, కవ్వించి, ఆశలు రువ్వించి, అల్లకల్లోలం చేస్తున్నాయి.

అప్పుడొక చిత్రమైన కోరిక కలిగింది నాకు.

ఆనంద్‌కూడా డైరీ రాస్తాడు. అందులోకూడా నా పేరు తప్పకుండా చాలా సార్లు వస్తుందని తెలుసు. ఏం వ్రాశాడో నాగురించి. ఎటువంటి అభిప్రాయాన్ని నిలుపుకున్నాడో నామీద చూడాలనిపించింది. అదొక వెర్రికోరిక. కోరిక కాదు; తపన. లేచాను ఉవ్వెత్తున పొంగుతున్న గుండెలను అదిమిపట్టుకుంటూ. తప్పు చేస్తున్నాననే భయంతో చెదిరిపోయిన ధైర్యాన్ని కూడగట్టుకుంటూ.

ఆనంద్‌కు దేనికీ తాళాలు వేయటం అలవాటు లేదు.

తేలికగానే డ్రాయరులో దొరికింది డైరీ—

'నా గురించి ఏం వ్రాశాడు?'—ఇదే నన్ను వెన్నాడుతున్న ప్రశ్న.

ఒక మనిషిని మనం లక్ష్యం చేయకపోయినా అతనికి మనమీదగల అభిప్రాయాన్ని చాలా లక్ష్యం చేస్తాం...

పేజీలు తిరగేస్తున్నాను.

ఆఫ్రికానుండి బయలుదేరుతూ ఓడలో అతను వ్రాసిన మాటలు.

'దిగంతాలదాకా విస్తరించిన ఈ మహాసముద్ర తరంగాలపై వయ్యారంగా తేలిపోతున్న ఈ ఓడలో కూర్చొని ఆకాశంలోకి చూస్తూ అరుణనూ — ఆమె రూపాన్ని పోల్చుకుంటానికి ప్రయత్నిస్తున్నాను. ఆఫ్రికా వదిలిరావటం బాధగానే వుంది. ఇక్కడి మనుషులూ, వాతావరణమూ, అలవాటైపోయింది

పూర్తిగా. వారికి సేవలు చేయటంలో అనిర్వచనీయమైన ఆత్మ సంతృప్తి దొరికింది. నాకు తెలియకుండానే చెంపలవెంట నీళ్ళు కారుతున్నాయి. ఇది బాధో, సుఖమో చెప్పలేను. కాని ఆకాశమంత—ఎదుట విస్తరించిన మహా సముద్రమంత భవిష్యత్తు, కళ్ళముందు కదులుతూ వుంది. ఆ కదలికకు ఆధారం నా అరుణ.

—ఈ వాక్యాలు చదువుతుంటే నా కళ్ళుకూడా చెమ్మగిల్లాయి. అనుకున్నాను ఆ క్షణంలో 'ఎందుకు పెంచుకున్నావ్ ఆనంద్, ఇంతటి మమకారాన్ని, ఈ పాపిష్టిదానిమీద' అని

మరో పుట తిప్పాను—ప్రయాణ వివరాలు రాశాడు. 'ఒకొక్క ఓడ ఒక వింతప్రపంచం— ఇలాగే—'

తర్వాత—

తర్వాత—

'నేను ఉత్తరం వ్రాసినట్లు నా మిత్రుడు మంచి ఇల్లు కుదిర్చాడు. అరుణా నేనూ కాపురం పెట్టాం. ఆమె చాలా మారింది. ఆమెలో అంత అందముందని అంతకుముందు గుర్తించలేదు. అంతకు మించిన తెగువ—ఉద్రేకం—సాహసం కనిపించాయి. వేషభాషల్లో యింకా మార్పు కనిపించింది.

'స్వర్గం కరిగి రాలినట్లనిపించింది. జీవితంలో ఇన్ని ఒయాసిస్సు లున్నా యని అంతకుముందు గుర్తించలేదు నేను.'

'ప్రాక్టీసు బావుంది. కానీ...'

ఆ పేజీ అంతటితో ఆగిపోయింది.

ఎందుకాగిందో ఆ తర్వాత పేజీ చదివినప్పుడు తెలిసింది.

'నేను అరుణ విషయంలో భ్రమపడుతున్నానేమో అనిపిస్తూంది.'

'డాక్టరు వృత్తి యివ్వగలిగిన ఆత్మ సంతృప్తిని అరుణ అర్థంచేసుకోలేక పోతున్నది'.

'ఆమె నిర్లక్ష్యంవల్ల—ఇవ్వవలసిన సమయంలో ఆక్సిజన్ ఇవ్వనికారణంగా ఒక యిల్లాలు బిడ్డనికని మరణించింది. పోయిన మనిషి పోయింది. తల్లిలేని లోటును ఆ బిడ్డ జీవితంలో ఎంతవరకూ తీర్చగలదు?'

తలుపు కిర్రుమంది.




అడుగుల చప్పుడు వినిపించింది.

ఆనంద్!!!

నన్ను చూశాడు. నేను చదువుతున్న అతని డైరీని చూశాడు. ఆ క్షణంలో నా నీచత్వం పిశాచంలా జీవితమంతా నిండి వికటాట్టహాసం చేసినట్టని పించింది.

"నా డైరీ రహస్యంగా చదివితే నీకు ఏమి ఉపయోగం?" అన్నాడు.

ఏం సమాధానం చెప్పను? కళ్ళముందే పలుకుబడి కరిగిపోయిన వ్యక్తిత్వాన్ని ఎలా భరించగలను? ఎలా చూపగలను నా ముఖం అతనికి.

నివ్వెరపోయి చూశాను అతని కళ్ళలోకి.

ఆ చూపును చూడలేక తలవంచుకున్నాను.

అతను తనగదిలోకి వెళ్ళిపోయాడు ఏమీ జరగనట్లు."

## 12

"ఆనంద్ నాతో పోట్లాడివుంటే అంత బాధపడి వుండేదాన్నికాదు. కాని మౌనంగా నిలబడి, హేయమైన వస్తువును చూసినట్లు చూసి వెళ్ళిపోవడంతో కడుపుదేవినట్లయింది. కిటికీలోంచి బయటికి చూశాను. ఆకాశం నిండా కారు మబ్బులు. అంతలో మెరుపు. ఆనంద్ భోజనానికి రమ్మంటూ కబురుచేశాడు. వెళ్ళలేకపోయాను. మరికొన్ని రోజులు అలాగ ఒకరితో ఒకరు సాధ్యమైనంత తక్కువ మాట్లాడుకుంటూ గడిపాం.

ఒకరోజున ముకేష్ ఫోను చేశాడు "మా ఇంటికి మీరిద్దరూ భోజనానికి రండి" అంటూ.

ఎలాగైనా ఆనంద్‌తో మాట్లాడాలని తొందరపడుతున్న మనస్సు—అడ్డం వస్తున్న అభిమానాన్ని పక్కకు తోయలేని మనస్సు— నా మనస్సు—ఎలా సాహసించిందో చూడండి.

"ముకేష్ భోజనానికి రమ్మన్నాడు మనిద్దరినీ ఈ రాత్రికి" అన్నాను.

దీర్ఘంగా చదువుతున్న పుస్తకంనుంచి చూపు మరల్చకుండానే 'ఊ' అన్నాడు.

ఆ ధ్వనికి అర్థం కనిపించలేదు.

కొన్ని క్షణాలు అలాగే నిలబడ్డాను.

"నామాటకు సమాధానం చెప్పటానికి కూడా మీకు ప్రాణం ఒప్పటం లేదన్నమాట?" అన్నాను తీవ్రంగా.

"ఏమిటి?" అన్నట్లు చూశాడు.

"ముకేష్ డిన్నరుకి పిలిచాడు" అన్నాను మళ్ళీ.

"మంచిది" అన్నాడు తలవంచుకుంటూ.

"నువ్వు వస్తున్నావా?"

"నువ్వు వెళ్తున్నావా?"

"వెళ్ళాలి—మరి నువ్వు?"

"నా కిష్టంలేదు".

"ఎందుకని?"

"ఎందుకైనా గానీ యిటువంటి గొడవలు నాకిష్టముండవు."

"పోనీ, నన్ను వెళ్ళమంటావా?"

"నిజంగానే అడుగుతున్నావా?"

"ఔను"

"నా కిష్టంలేదు."

"ఎందుకని?"

"అది నా స్వభావం. నేను చదువుకోవాలి." అంటూ మళ్ళీ పుస్తకంలో తల దాచుకున్నాడు.

ఆ నిర్లక్ష్యంలోని అవమానాన్ని భరించలేకపోయాను.

"నేనన్నా—నా స్నేహితులన్నా నీకు ఇంత అసూయా ద్వేషాలెందుకు?" అన్నాను తీవ్రంగా.

"దయయుంచి నన్ను విసిగించకు" అన్నాడు తలెత్తకుండా.

నా కాళ్ళకింద భూమి క్రుంగిపోతున్నట్లనిపించింది. డిన్నర్‌కు వెళ్ళి పోయాను విసురుగా. ఆ రాత్రి భార్యను పరిచయంచేశాడు ముకేష్. ఆమె మర్యాదలు లోపంలేకుండా చేసింది. కానీ ఆ మర్యాదలలో ఆత్మీయతగానీ, ఆపేక్షగానీ, కనిపించలేదు. మేం చాలామందికంటె ఉన్నవాళ్ళమే, అప్పటి పరిస్థితుల్లో. కాని ముకేష్ బంగళానూ, అక్కడున్న వైభవాన్నీ చూచాక చాలా దురదృష్టవంతురాల ననిపించింది. నేను అక్కడున్న కొద్దిగంటల్లో నాఅదృష్టం చాలా అల్పమైనదనిపించింది. మొత్తంమీద డిన్నర్ కులాసాగానే గడిచి పోయింది. మా యింటిదగ్గర దిగబెట్టి వెళ్ళాడు ముకేష్. తర్వాత ఎన్నడూ ఆ డిన్నర్ పార్టీనిగురించి ఆనంద్ ప్రశ్నించలేదు.

ఒకనాటి ఉదయం ఆనంద్ అన్నాడు ఆ బిడ్డను మనం పెంచుకోవడం మంచిది'' అని.

''ఏ బిడ్డను?''

"నీ అశ్రద్ధవల్ల తల్లిని పోగొట్టుకున్న బిడ్డను" అన్నాడు ఆనంద్.

"నీకేమన్నా మతిపోయిందా ఆనంద్?"

"ఆ పాపకు అన్యాయం జరిగితే పోతుంది. ఆమె తల్లి నీవల్ల ప్రాణాలు పోగొట్టుకుంది. ఆ బాధ్యతల్ని నువ్వు స్వీకరించటం ధర్మం."

''అంత బరువు నేను నెత్తిన పెట్టుకోలేను."

"నా మాట విను అరుణా! ఆ బిడ్డకోసం మాత్రమే కాదు. నీ క్షేమానికి కూడా అది అవసరం."

"అంటే?"

''ఏ బరువూ బాధ్యతలూ లేకుండా దారం తెగిన గాలిపటంలా బ్రతకటం నీకలవాటైపోయింది. ఇలాగే బ్రతికితే ఏనాటికైనా నీకు పతనం తప్పదు."

''నేను పతితనైపోతాననా నీ అభిప్రాయం?''

"నా అభిప్రాయమేమయినా అటువంటి మాటలు నేననలేను."

"నేను సుఖంగా బ్రతుకుతున్నాననేగా నీ బాధ?"

''నిన్ను పెళ్ళిచేసుకుంది బాధపెట్టటానికి కాదు."

''మరి నీ మాటలకూ, చేష్టలకూ అర్థం ఏమిటి? కన్నబిడ్డలనే చూసుకొనే శక్తిలేక అందరూ దాయీలను పెట్టుకుని బ్రతుకుతున్నారు. ఎవరికో పుట్టిన బిడ్డను మనం పెంచుకుని ఈ సంసారాన్ని నరకం చేసుకోవలసిన అవసర మేమిటి?''

"అవసరమేమిటో నీ కిప్పుడర్థంకాదు.''
"ఎప్పుడూ అర్థంకానవసరంలేదు.''
''ఆ బిడ్డను పెంచుకుందామనే నిశ్చయించుకున్నాను.''
''నాకిష్టం లేకపోయినా సరేనా?''
''నీ కిష్టంలేకపోతే నేనే పెంచగలను.''
"నీ యిష్టం.''

మాట అన్నతర్వాత ఎటువంటి పరిస్థితులలోనూ నిలబెట్టుకొనే స్వభావం ఆనంద్‌ది. అంతపనీ అతను చేయగలడనటంలో నాకు అనుమానం కలగ లేదు.

ఈవిధంగా మా దాంపత్యం మరొక ఘట్టం చేరుకుంది. ఆ బిడ్డకోసం ఒక దాయిని ప్రత్యేకంగా యింట్లో ఏర్పాటుచేశాడు నా భర్త. సాధారణంగా భార్యా భర్తలను దగ్గరకు తీసుకువచ్చే బంధంగా బిడ్డ ఉపకరిస్తుంది. కాని ఆ పెంపుడుబిడ్డ మా మధ్యగల దూరాన్ని ఎక్కువచేశాడు.

ఆనంద్ నాకు దూరమైనకొద్దీ-నేను ముకేష్‌కు దగ్గరగా జరుగుతూ వచ్చాను.

## 13

ఆ విధంగా నా జీవితగాధలో ముకేష్‌కు ఒక ప్రధాన భూమిక లభించింది. ఆ పాపను నేను ప్రేమించలేకపోయాను. నిజానికి ద్వేషంపుట్టి క్రమక్రమంగా పెరుగుతున్నదన్నా తప్పులేదు. ఒకనాడు ఇంట్లో దాయీ లేదు. ఎక్కడికో వెళ్ళి రాలేకపోయింది. అంతవరకూ బిడ్డలను పెంచిన తల్లులకు నేను సలహాలిచ్చాను. కాని స్వయంగా బిడ్డలను పెంచిన అనుభవం నాకు లేదు. పాప ఏడవటం మొదలుపెట్టింది. ఆనంద్ కింద నర్సింగ్‌హోమ్‌లో వున్నాడు. నర్సింగ్ హోమ్‌లోకి వెళ్ళటం నేను చాలా తగ్గించాను. ఆనంద్ శ్రద్ధకూడా సన్నగిల్లింది ఆదాయం తగ్గుతున్నది. నాకు కావలసిన డబ్బు దొరుకుతూనే వుంది. 'నర్సింగ్ హోమ్‌కు ఎందుకు రావటంలేదు?' అని అతడు అంతవరకూ అడగలేదు. ఆ నిర్లక్ష్యవైఖరి నా కోపాన్ని ఎక్కువచేస్తున్నది. మనస్సు చికాకై పోయింది. బాంక్‌లో డబ్బు తరిగిపోతున్నదని అర్థంచేసుకున్నాను. దారిద్ర్యం ఎంత భయంకరమైందో దాన్ని అర్థంచేసుకున్నవాళ్ళకే తెలుస్తుంది. భవిష్యత్తు కళ్ళ ముందు మెదిలింది. కంపించింది మనస్సు. ఈ చీకాకులో పాప ఏడుపు మరీ గోలగా వినిపించింది. ముందు రెండు బిస్కట్లు చితిపి నోట్లో పెట్టాను. పలమా

రింది. ఏడుపు ఎక్కువయింది. ఎవరూ లేరనే ధైర్యంతో ఎత్తుకున్నాను. సిల్కు చీరను పాడుచేసింది. వళ్ళు మండిపోయింది. ఉయ్యాలలో కుదేసి నాలుగు బాదాను. ఆ సమయంలో—అది నా దురదృష్టం—ఆనంద్ అడుగుపెట్టాడుగదిలో. ఆ దృశ్యాన్ని చూశాడు. కోపంతో అతని శరీరం వణికింది.

"నువ్వు మనిషివనుకున్నాను," అన్నాడు.

"కాదు పశువును."

"అర్థమయింది" అంటూ బిడ్డనెత్తుకుని కిందకు దిగిపోయి, ఒక నర్సుకు అప్పగించాడు. నేను ఆ ఇంట్లో నిలవలేకపోయాను. ముకేష్‌కి ఫోనుచేసి రమ్మన్నాను. వెంటనే వచ్చాడు. అతని కారులోఎక్కి పోనిమ్మన్నాను. 'ఎక్కడికి?' అన్నాడు. 'తర్వాత చెప్తాను' అంటూ తొందరపెట్టాను. కారు బయలుదేరింది. గేటు దాటుతూ వెనుకకు తిరిగి చూశాను. కిటికీ లోపలినుంచి తదేకంగా నివ్వెరపోయి చూస్తున్న ఆనంద్ ముఖం లీలగా కనిపించింది."

గమ్యం లేకుండా కారు ఆవిధంగా చాలాదూరం పరిగెత్తింది. ఏదో పోగొట్టుకున్నాననే భయం నా మనస్సులో లీలగా మెదిలింది. ఎదురుగుండా క్లబ్ స్నేహితులెవరో కనబడి ముకేష్ కారును గుర్తుపట్టి ఆపుచేశారు. నాకూ పరిచయమున్న ముఖాలే అవి. నన్నూ పలకరించారు.

"సర్కార్ మాజిక్ షో క్లబ్బులో... వెనక్కు తిప్పండి కారు" అన్నారు.

"వెళ్దామా?" అన్నాడు.

"పద, అన్నాను.

కారు వెనకకు తిరిగింది. క్లబ్‌లో షో మొదలుకాగానే లైట్లు ఆర్పివేశారు. ఆడిటోరియం అంతా చీకటి. ఎదురుగుండా ఏం జరుగుతున్నదీ నాకు కనిపించలేదు. ముకేష్ వెచ్చటిచెయ్యి నా చేతిని నొక్కింది. నేను గమనించనట్లు అట్లాగే కూర్చున్నాను. నా అరచేతికి తన అరచేతిని జోడించాడు గట్టిగా. నేను అభ్యంతరం చెప్పలేదు. అలాగే రెండుగంటలకాలం గడిచిపోయింది. వెనుకకు బయలుదేరాం.

"ఎక్కడికి వెళ్దాం?" అన్నాడు ముకేష్.

"మీ యింటికి పోదాంపద" అన్నాను.

"ఎందుకు?"

"ఆనంద్‌తో పోట్లాడివచ్చాను. మా యింటికి పోవడం నాకిష్టంలేదు."

అతను మాట్లాడలేదు.

కారు మరొకదిశగా నడుస్తున్నదని గ్రహించాను.

"ఇటు ఎక్కడికి?'' అన్నాను.

అతను మాట్లాడలేదు. మళ్ళీ అడిగాను గట్టిగా.

"ఈ రాత్రికి హోటల్లో వుందాం. రేపు ఆలోచిద్దాం'' అన్నాడు.

"హోటల్‌లోనా?''

"మా ఆవిడ బ్రూటు. మన స్నేహాన్ని అర్థంచేసుకోలేదు.''

''ఇందులో ఏముంది అర్థం చేసుకోవటానికి?''

''ఏమైనా, పెద్ద సీన్ క్రియేట్ చేస్తుంది. అదీ భయం.''

"అంత భయమా?"

''భయం కాదు.''

"మరి?"

ఆ ప్రశ్నకు అతను సమాధానం చెప్పలేకపోయాడు. నేను హోటల్‌కి రాననీ, తిరిగి మా ఇంటిదగ్గరే దించవలసిందనీ అన్నాను. ఆ మాట అతనికి రుచించలేదు. ఏదో చెప్పబోయాడు. చివరకు అతి బలవంతంమీద మా ఇంటి దగ్గర దిగబెట్టి వెళ్ళిపోయాడు. పరాయికొంపలో జొరబడుతున్న మనిషిలా నా ఇంట్లో నేను అడుగుబెట్టాను.

పడకగదిలోకి తొంగిచూశాను.

భయంవేసింది.

పసిబిడ్డను గుండెలమీద పడుకోబెట్టుకొని నిద్రపోతున్నాడు ఆనంద్.

దీపశిఖపై మోజుపడే శలభంలా మారింది నా మనస్సు.

భోజనం చేయకుండా పడుకున్నాను. మెలకువ వస్తుందనే భయంతో రాని నిద్ర. నిద్రలేమితో ఎర్రబడిన కళ్ళు. తెల్లవారి అద్దంలో నా ముఖం చూసుకున్నప్పుడు నా మనస్సు ఎగిరిపడింది. ఆనంద్ స్నానంచేసి కాఫీత్రాగి నర్సింగ్ హోమ్‌కు వెళ్ళబోతున్నాడు. పిలిచాను. ఆగాడు.

''నీతో మాట్లాడాలి'' అన్నాను.

"చెప్పు" అన్నాడు.

చెప్పలేకపోయాను, అతని చూపు తగిలింతర్వాత. మనిషి చూపులోని ఆంతర్యాన్ని పశువులు కూడా అర్థంచేసుకుంటాయేమో? ఏ భాషకుంది శక్తి ఆ భావాన్ని చెప్పటానికి?

పది క్షణాల తర్వాత "మన సమస్యల గురించి" అన్నాను.



"చర్చలతో జీవిత సమస్యలు తీరిపోతాయంటావా అరుణా?"

"మరి ఎలా తీరగలవో చెప్పు?"

"ఎలా తీరగలవో తెలిస్తే ఏ మనిషీ ఈ విధంగా నరకం అనుభవించడు."

"నువ్వు నరకం అనుభవిస్తున్నావా?"

"ఇంకేమనాలి? మరో మాటలేదు నాకు తెలిసినంతలో."

"ఇదంతా నా వల్లనేనా?"

"నీకే తెలియాలి."

"మరి దీనికి పరిష్కారమేమిటి?"

"అదీ నీకే తెలియాలి" అంటూ నా మాటకు ఎదురు చూడకుండా క్రిందకు వెళ్ళిపోయాడు. భగ్గున మండింది నా మనస్సు. క్రిందకు వెళ్ళలేకపోయాను. పైన నిలవలేకపోయాను. సాయంత్రం దాకా ఎలాగో గడిపి క్లబ్బుకు వెళ్ళిపోయాను. కారుతో అతనికి సాధారణంగా అవసరముండదు. గేటు దాకా వెళ్ళి ఆగి

వెనుకకు తిరిగి చూశాను. అతను వద్దంటే ఆగిపోదామనుకున్నాను. అతని జాడ కనిపించలేదు. ముందుకు నడిచింది కారు అచేతనంగా.

యువరానర్!

పతనమైపోతున్న మనిషి జీవితం కొండశిఖరం మీదనుండి విరిగి క్రిందకు దొర్లుతున్న రాతిబండలాంటిది. నా బ్రతుకూ అలానే అయింది. నే ద్వేషించిన అనుభవంకోసమే నా మనస్సు ఆరాటపడసాగింది. క్లబ్బులోకి వెళుతూ నే ప్రదర్శించిన హావభావాలూ, ప్రకటించిన భంగిమలూ, తలుచుకుంటే, ఈనాడు నాకే ఆశ్చర్యం వేస్తుంది.

"అలా నవ్వే అదృష్టం అందరికీ వుండదు అరుణా! నీ గొప్పతనం అదే" అన్నాడు ఒక మిత్రుడు.

"సుఖపడటం అందరికీ తెలియదు. అదొక ఆర్ట్ బ్రదర్" అన్నాడొక ఇంగ్లీషు వేదాంతి.

"అమెరికానుండి ఒక డెలిగేషన్ వస్తూంది ఎల్లుండి. నువ్వు డాన్స్‌చేయాలి. ఇంకా చాలా వున్నాయి అయిటమ్స్. కాని నీది ఫస్ట్." అన్నాడు క్లబ్ సెక్రటరీ.

ఆనాడు మళ్ళీ గజ్జె కట్టాను. వళ్ళుతెలియని ఉద్రేకంతో ఎగిరి విరిగిన జలపాతంలా కదిలింది శరీరం. మత్తెక్కిన ఆడిటోరియం కూడా శివమెక్కినట్లు కంపించింది కరతాళ ధ్వనులూ-ప్రశంసలూ-షేక్‌హాండ్లూ-కళ్ళుచిట్లింపులూ-కొరుక్కుంటున్న పెదిమలూ - రెండర్థాలొచ్చే అతితెలివి మాటలు - విందుల పేరుతో ప్రత్యేకించి యిళ్ళకు ఆహ్వానాలూ—

కరిగిపోయిన కల మళ్ళీ నిజమై వచ్చి కళ్ళముందు నిలిచినట్లనిపించింది. చచ్చి బ్రతికిన నెమలి మళ్ళీ పురివిప్పి కళ్ళముందు రంగుపొంగులతో నాట్యం చేసినట్లు భ్రమకలిగింది. పోగొట్టుకున్న జీవితం తిరిగి చేతికంది ఆశలపందిరి అల్లుకుంటున్నది.

''అమెరికాకు మా ఆహ్వానం. మీలాటి కళాకారులు ప్రపంచానికే గర్వకారణం,'' అన్నాడు వంకరచూపులు నిలుపుతున్న ఓ అమెరికన్. నా అదృష్టాన్ని అందరూ పొగిడారు. అందరికీ అటువంటి అవకాశం రాదని ఆకాశాని కెత్తారు.

"నన్నూ తీసుకెళ్లండి మీ సెక్రటరీగా" అన్నాడొక అల్ట్రామోడరన్.

"నేను మీ పి. ఏ. ను" అన్నాడు మరొక హీరో.

ముకేష్ కారులో ఇంటికి బయలుదేరాను. నాట్యంతో నలిగిన శరీరంలోని మనస్సు ఒరిగి రవ్వంత కన్నుమూశాను. కారు సరాసరి తన యింటికే తీసుకు పోయాడు ముకేష్. ఆగింతర్వాత కాని ఆ సంగతి తెలియలేదు నాకు. ''ఎందుకు మీ యింటికి యింత రాత్రి,'' అనడిగాను.

"ఒకనాడు మా యింటికి వస్తానన్నావు. తీసుకు వెళ్ళలేకపోయాను. ఇహ్వాళ్ళ ఆ అవకాశం వచ్చింది. అన్నాడు, రవ్వంత ఉద్రేకాన్ని దాచుకుంటూ.

"మీ ఆవిడంటే భయమన్నావ్?"

"ఇప్పుడు భయంలేదు. రా! భోంచేద్దాం! ఇప్పటికే పొద్దుపోయింది."

గూర్ఖా వంగి శాల్యూట్ చేశాడు.

ఇద్దరం లాన్స్‌దాటి బంగళాలో అడుగుపెట్టాం. బట్లర్ వచ్చి ఆహ్వానించాడు. మేడమీదకు నడిచాం. ముకేష్ ప్రవర్తనలో కొంత మార్పు కనిపించింది. తొట్రుపాటు, తొందర కనిపించాయి. కూర్చోపెట్టి బట్టలు మార్చుకువచ్చాడు. నన్నూ మార్చుకోమన్నాడు. అవసరంలేదనీ, భోజనంచేసి యింటికిపోతాననీ చెప్పాను.

"ఇంత రాత్రివేళ?" అన్నాడు ఆర్ద్రోక్తిలో.

"ఫర్వాలేదు'' అన్నాను.

మరికొంత మర్యాదగా బలవంతపెట్టాడు. "మీ ఆవిడ ఏదీ? కనిపించదేం?" అన్నాను సందర్భాన్ని మార్చాలని.

"కలకత్తా వెళ్ళింది ప్లైయిన్‌లో'' అన్నాడు.

నా నెత్తిన పిడుగు పడినట్లయింది.

## 14

"వింత జంతువులా చూశాను. అతని కళ్ళలోకి. ఎర్రబడి జ్యోతుల్లా వెలుగుతున్న అగ్నిగుండాలవి. 'నీకోసం కాలి మండి ఆవిరైపోతాను అరుణా' అంటూ దగ్గరకొచ్చాడు. అతని నాలిక మెలికబడుతున్నది. పెదిమలు వణుకుతున్నాయి. నేను ఎటువంటి ప్రమాదంలో చిక్కుకున్నానో అర్థమయింది. అర్ధరాత్రివేళ విశాలమైన ప్రాంగణంలో ఒంటరిగా నిలిచిన ఆ బంగళానుండి అతని సహాయం లేకుండా బయటపడటం అసంభవమనిపించింది. అంతలో పక్కగదిలోకి వెళ్ళి పదిక్షణాల తర్వాత తిరిగివచ్చాడు. అంతలో కిటికీతెరిచి బయటికి చూశాను. పాపంలా, శాపంలా కురుస్తున్న చీకటికి పావి కన్నీటిలాంటి వానజల్లు తోడైంది. ఆ పరిస్థితిలోని-నిజం చెప్పినా-జరిగిన యదార్థాన్ని ఉన్నదున్నట్లు చెప్పినా

మీరు నమ్మరు. ఎవ్వరూ నమ్మరు. మనిషిమీద లేని నమ్మకం ఆ మనిషి చెప్పే మాటలమీద ఎలా వుంటుంది?

అతని ధోరణి క్షణక్షణానికీ మారిపోతున్నది. కావాలని, అజ్ఞానంతో పులి బోనులో జొరబడిన మేకనై పోయాను. నామీద నాకే జాలివేసింది. ఆనంద్ గుర్తుకువచ్చాడు. 'పాపం! గుండెలమీద ఆ పసిపాపను పెట్టుకుని నిద్రపోతున్నాడేమో' అనుకున్నాను ఆడపిల్ల జీవితం అరిటాకువంటిదనే సూక్తిలోని అర్థం కళ్ళముందు నిలిచింది. సర్కస్ సింహాలను ఆడిస్తూ, కవ్విస్తూ బెదిరించే మనిషి వాటి నోళ్లల్లో నిర్భయంగా తలపెట్టి గర్జించగల మనిషి ఎన్నడో ఒక నాడు ఆ సింహాలనోళ్ళల్లోనే నలిగిపోతాడంటారు. ఈ ఆలోచనలు చుట్టు ముట్టిన కొద్దీ, నా శరీరం వణికింది, దుర్భరమైన భయంతో.

"ఎందుకలా భయపడతావ్ డియర్" అన్నాడు లేచి తూలుతూ.

"నిన్ను చూస్తే భయంగావుంది" అన్నాను.

"నిన్ను భయపెట్టటానికికాదు డియర్ ఇక్కడకు తెచ్చింది" అంటూ సోఫా మీద పడ్డాడు విరిగినకొండలా.

"మరెందుకు?" పెదిమల్లోంచి ఎలాగో వూడిపడ్డాయి మాటలు.

"బాధపెట్టటానికికాదు. సుఖపెట్టటానికి" అంటూ లేచి మళ్ళీ సోఫాలో కూలబడ్డాడు. సిగరెట్టు ముట్టించాడు. శూన్యంలోకి చూస్తున్నట్లు, పైన తిరుగుతున్న ఫాన్‌కేసి కాసేపు చూశాడు.

"మనిషి ఎందుకు బ్రతుకుతున్నాడో తెలుసా?" అన్నాడు వేదాంతిలా.

లేచాను.

కూర్చోమంటూ జ్ఞానోపదేశం మొదలుపెట్టాడు.

"నాకూ అర్థంకాలేదు అరుణా, ఇన్నాళ్ళూ. ఇందాక క్లబ్బులో నీ డాన్స్ చూస్తున్నప్పుడు విరిగి, విరిగి, ఎగిరి ఎగిరి, సుడులుతిరిగి, విద్యుచ్ఛక్తిని చుట్టూ విసురుతున్న నీ సౌందర్య శక్తిని చూస్తున్నప్పుడు, అప్పుడర్థమయింది. జీవిత రహస్యం అప్పుడు తలకెక్కింది. ఆ రహస్యం చెప్తున్నా విను. మనిషి ఎందుకు బ్రతుకుతాడో తెలుసా? జీవించటానికి. జీవితాన్ని అనుభవించటానికి. ఆ అనుభవాన్ని ప్రేమించడానికి. ఆ ప్రేమోద్వేగంలో కాగి కాలి చల్లబడటానికి. అర్థమయిందా? తలకెక్కిందా? నాకు బాగా తలకెక్కిందిలే. పాపం చేస్తున్నానని నువ్వు భయపడవలసిన అవసరంలేదు. ఏది పాపం? ఏది పుణ్యం? ఏది నీతి? ఏది అవినీతి? ఎవరు నిర్ణయించేది. కాలం కరిగిపోతుంది. సౌందర్యం విరిగి

పోతుంది. యౌవనం తరిగిపోతుంది. మనముందే కళ్ళకు కనిపించకుండా కరిగి పోతున్న కాలం తిరిగిరాదని తెలిసీ కళ్ళు తెరవకపోతే ఎలా చెప్పు?" అంటూ నా ప్రక్కనే కూర్చుంటానికి ప్రయత్నించాడు.

ఎంతఅందమైన ఆత్మవంచన? సౌందర్యం భగవంతునికి మారురూపమంటారు ఉన్మాదులైన కవులు. నే చెప్తున్నా నమ్మండి. పాపానికికూడా అందంగా కనిపించే శక్తివుంది. పాపంలో ఆకర్షణవుంది. ఆ ఆకర్షణకు లొంగనివాడే మనిషి. లొంగిన మనిషికి పతనం తప్పదు. నేను కళ్లుతెరిచాను. ఆనంద్ దగ్గరకు వెళ్ళి అతని పాదాలకు నా తల బ్రద్దలుకొట్టుకుని క్షమించమని వేడు కుందామనుకున్నాను.

"అరుణా! యింకా ఏం చెప్పాలి నీకు?" అన్నాడు.

"నన్ను ఇంటికి పంపించు" అన్నాను.

"యింటికి పంపటానికి యింత దూరం తీసుకురావాలా?"

"నాకు తెలియదు. నిన్ను వేడుకుంటాను నన్ను మోసంచేయకు. ఈ పాపం నేను చేయలేను. చేసి భరించలేను. భరించి బ్రతకలేను."

''ఎవరు మోసంచేసింది? నువ్వా? నేనా?" అన్నాడు కోపంగా.

"నేను నిన్ను మోసంచేశానా?"

''నిస్సందేహంగా! నన్ను కవ్వించావు. కదిలించావు.చావలేక ఏ వ్యామోహాన్నీ సృష్టించుకోలేక గానుగెద్దులా తిరుగుతున్న నాకు జీవితంమీద వ్యామోహంకలిగేలా గారడీ చేశావు. నాతో పార్టీలకొచ్చావు. క్లబ్బులచుట్టూ తిరిగావు. నా భార్యతో నాకు వచ్చిన మనస్పర్థలకి నీవు కారణం. ఇంతచేసి ఇప్పుడు నీతులు చెప్తున్నావు. అరుణా! ఇంత నష్టపోయింతర్వాత నిన్ను పోగొట్టుకోలేను," అంటూ దగ్గర కొచ్చాడు.

నేను వెనకకు జరిగి "ఇంత జరుగుతుందనుకోలేదు. దైవంలాంటి భర్త. ఎన్నో తప్పులనూ ఎంతగానో బాధపెడుతున్న నా అజ్ఞానాన్నీ క్షమించాడు. కాని ఈ పాపం జరిగితే దేవుడుకూడా నన్ను క్షమించలేడని నాకు తెలును" అన్నాను.

"అంత తెలిసినదానివి ఇంతవరకూ ఎందుకు రానిచ్చావ్ మన కథ?''

"ఏమో! ఆడుకున్నానేమో జీవితంతో! నా చుట్టూ తిరుగుతున్న జీవితాలతో. అర్థంలేని సుఖాలను ఆశించానేమో! సరదాకి వచ్చాను పార్టీలకు. కాలక్షేపానికి వచ్చాను క్లబ్బులకు. ఇంత పాపంచేసే ధైర్యం నాకిప్పుడు లేదు. నన్ను

క్షమించు" అంటూ విసురుగా బయటకొచ్చి పరుగు పరుగున రోడ్డుమీదపడి, కొంతదూరం నడిచి, కొన్ని అనుమానాలకు లొంగి, ఒక పోలీసుస్టేషనులో చిక్కుకున్నాను."

## 15

"యువర్ ఆనర్!

నిప్పుకు దహించే గుణముంది. అలాగే పాపానికి కూడా. ఆ అర్ధరాత్రి— కాళరాత్రి చీకటిలో, పాపం కరిగి కన్నీరై కురుస్తున్నవర్షంలో, నిర్మానుష్యమైన రోడ్డుమీదపడి ఒంటరిగా పరుగులు తీస్తున్న ఆడదాన్ని ఎవరు అనుమానించరు? 'అరుణా' అంటూ కేకలుపెడుతూ వెంటపడిన ముకేష్ దుర్బలత్వం ఆవరించి బంగళా మెట్లమీదనే కూలబడిపోయాడు. శరీరంలోని శక్తినంతా కూడకట్టుకుని పరుగులుతీశాను. ముకేష్‌చేతికి లొంగితే, అతనికి చిక్కితే, ఎంతవరకూ సాహసించగలడో అర్థంచేసుకున్నాను. ఎంతదూరం పరిగెత్తానో నాకు తెలియదు. విజిల్స్ వినిపించాయి. ఒక పోలీస్‌వాన్ నా ముందు ఆగింది.

"ఎవరు నీవు?" అతి కఠోరమైన ప్రశ్న!

ఏం సమాధానం చెప్పాలి? ఏం చెప్పినా ఆ పరిస్థితుల్లో ఎవరు నే చెప్పే నిజాన్ని గుర్తించగలరు? ఏదో చెప్పటానికి ప్రయత్నించాను. పెదిమలు కదిలినా వాళ్ళకు స్పష్టంగా మాట వినిపించలేదు. వాన్‌లో ఎక్కించుకొని తీసుకొని పోయారు. ఆ రాత్రి, ఒక పతితమాదిరి, పాపంచేసి పట్టుబడిన నేరస్తుని మాదిరి ఆ నరకకూపంలో ఎలా గడిపానో, చేయరాని పాపానికి బలికాకుండా నన్ను నేను ఎలా రక్షించుకున్నానో ఎలా చెప్పను. తెల్లవారింది. ఒక యుగంకరిగింది. ముకేష్‌కి ఫోన్ చేయించాను అతడే పోలీసు అధికారితో మాట్లాడి కారులో ఎక్కించుకుని వాళ్ళ యింటికి తీసుకువెళ్ళాడు. ఆ బట్టలతో, ఆ ముఖంతో యింటికిపోయి ఆనంద్‌ను చూడలేకపోయాను.

"క్షమించు" అన్నాడు ముకేష్.

"ఇద్దరం చేశాం పాపం ఒకరినొకరు క్షమించే అధికారం ఇద్దరికీ లేదు."

"ఇంత జరుగుతుందనుకోలేదు."

"నిప్పుతో ఆడనేకూడదు. ఆనక కాలిందని బాధపడి ప్రయోజనమేమిటి?"

మర్నాడు ముకేష్ ఎంతో మర్యాదగా ప్రవర్తించాడు. క్షణికమైన ఉద్రేకానికి లొంగి చేయరాని సాహసం చేశానంటూ కళ్ళుతుడుచుకున్నాడు. నిజమే! ఉద్రేకం ఎటువంటిది? మనిషి వివేకాన్ని, విచక్షణా జ్ఞానాన్ని హరిస్తుంది.



జరిగిందంతా మరిచిపోయినట్లు అసలేమీ జరగనట్లు కబుర్లు చెప్పుకున్నాం. సాయంత్రం బట్టలు మార్చుకుని, విశ్రాంతి తీసుకుని, మళ్ళీ యింటికి బయలు దేరి వెళ్ళాను. ముకేష్ దిగబెట్టి వెళ్లాడు. మేడమీద బాల్కనీలోంచి ఆనంద్ మమ్మల్ని నిర్లిప్తంగా చూశాడు. అప్పటికి సరిగ్గా ఇరవైనాలుగు గంటల తర్వాత ఇల్లు చేరాను 'ఎక్కడకు వెళ్లావు' అని అడగలేదు ఆనంద్. అడగకుండా ఎలా చెప్పటం? అడిగినా ఏం చెప్పాలి?

అతని బెడ్‌రూంలోకి తొంగిచూశాను ఒక రాత్రివేళ. (నేను మరొక గదిలో పడుకున్నాను, మనసొప్పక.) లైట్లు వెలుగుతూనే వున్నాయి. తెలుగు 'ని' ఆకారంలో ముడుచుకుని పడుకున్నాడు. ఎండిపోయి ముడుచుకుపోయిన జీవితమది. నీరు అందక ఎండిపోతున్న తన జీవనలతను ఎన్నడో గుర్తించాడు ఆనంద్. ఆ ప్రాణ జలాన్ని అందించవలసింది నేను. నా బాధ్యతను నేను విస్మరించాను. ఆ పసిపాపను గుండెమీద పడుకోబెట్టుకొని ఆ పసిగుడ్డు చిరునవ్వుల్లో దప్పిక తీర్చుకుందామనుకున్నాడు. కాని ప్రయోజనం లేకపోయింది. కొద్ది నెలల్లో కొన్ని సంవత్సరాల వయోభారం అతని నెత్తిన కూర్చొని ముఖంపై ముడతలుగా మారి

నిలిచిపోయింది. అలాగే అతనిముందు నిలబడి ఆ దీపపు వెలుగులో అతని ముఖాన్ని చూస్తూ నిలబడినప్పుడు నా శరీరమంతా మనస్సై, పశ్చాత్తాపమై కరిగి కన్నీరయిపొంగింది. శోకభారాన్ని నిలుపుకోలేక పెద్దపెట్టున ఏడ్చాను. అతనికి నిద్రాభంగం కలిగి, కదిలి, కళ్ళుతెరిచి, నన్ను చూశాడు.

"ఎందుకు ఏడుస్తున్నావ్?" అన్నాడు.

"పాపం చేశాను."

"వంటికి పూసుకున్న బురదను కన్నీటితో కడుక్కోలేవు అరుణా! ఇంకా నీ కళ్ళల్లో నీరుందంటే ఆశ్చర్యంగా వుంది! ఖర్చుపెట్టుకోకు, మిగిలిన ఆకాసిని కన్నీటిబొట్లనూ. నాలాగే నువ్వూ మోడైపోతావు ఎండిపోయి. ఆనక కావాలను కున్నప్పుడు ఒక్క చుక్కకూడా వుండదు, ఎంత వెదికినా కన్నుల్లో.

"నన్ను క్షమించండి" అంటూ కాళ్ళకు తల బద్దలుకొట్టుకున్నాను.

చల్లటికాళ్ళు! రాతిబండలా చైతన్యం కోల్పోయిన శరీరం!! గాజుకుప్పెల్లా కాంతితప్పిన కళ్ళు!!!

ఆగిపోయింది కాలం.

"వెళ్ళు. రేపు మాట్లాడతా" అన్నాడు చివరికి.

"కాదు ఇప్పుడు చెప్పు. నన్ను చిత్రవధ చెయ్యి. నా పాపాన్ని, ఈ జీవితాన్ని నేనే భరించలేకపోతున్నాను. ఆనంద్! ఆనంద్!! నిన్ను అడగక ఇంక ఎవరిని అడగగలను? ఈ నరకాన్ని ఎవరికి పంచిపెట్టను? నన్ను బ్రతికించు. బ్రతికించుకో. నీకోసం బ్రతుకుతాను. నిన్ను పూజిస్తాను. నువ్వు ఎలా వుండ మంటే అలా వుంటాను. విసిగిపోయాను ఆనంద్, ఈ విలాసాలతో. నేను పొందింది ఏమిటో పోగొట్టుకున్నది ఏమిటో అర్థంచేసుకున్నాను. ఒక్క అవకాశం—ఈ ఒక్క అవకాశం ఇప్పించు నాకు. ఏ భార్యా భర్తకు చేయని సేవలు చేస్తాను. అలా ప్రేమిస్తాను. నా భర్తవు మాత్రమే కాదు నువ్వు. నా జీవితానివి. నా దైవానివి. నిజం చెప్తున్నా ఆనంద్! నువ్వనుకున్నంత పాపాత్మురాలిని కాదు నేను. అంతటి పాపం చేయలేదు నేను," అంటూ కలవరించాను. పలవరించాను. వాదించాను. రోదించాను.

చివరికి అతనన్నాడు.

"పాపం చేయలేదు నువ్వు. చేసింది నేను."

"నువ్వు పాపం చేస్తావా ఆనంద్? ఆఖరిక్షణంలో కూడా ఆ మాట అనలేను నిన్ను."

"నీకు తెలియదు నేను చేసిన పాపం."

''చెప్పండి! నేను తట్టుకోగలను."

"నువ్వు తట్టుకోగలవని నాకు తెలుసు. కాని క్షమించగలవా?"

''అంతటి శక్తి నాకుందని భయపడటంలేదు. ఏమిటి నీ పాపం?"

"నిన్ను ప్రేమించడం." అంటూ తలవంచుకున్నాడు.

"ఆ పాపం! ఎంత చిత్రమైంది? అందుకు నన్ను క్షమించమంటాడు! ఎలా క్షమించగలను? అలాగే భయంకరమైన నిశ్శబ్దంలో ఒకరికొకరు కావలసి వచ్చినా-ఒకరినొకరు భరించలేక కూర్చున్నాం శూన్యంలో.

"నాకు నిద్ర వస్తున్నది, ఇన్నాళ్ళుగా రానిది. కనీసం ఆ అదృష్టానికైనా అడ్డంరాకు." అన్నాడు తల పట్టుకుని.

"ఇప్పుడు నన్నేం చేయమంటావ్?"

"ఇప్పుడు నేనేం చెప్పలేను. నన్ను కాస్త ఆలోచించుకోనీ. రేపు చెప్తాను. కాసేపు పడుకోనీ దయుంచి. ఇటువంటి నిద్రకోసం చాలా రోజులుగా ఎదురు చూస్తున్నాను."

లేచి ఆవలిగదిలోకి వెళ్ళిపోయాను.

అతని ప్రక్కన పడుకునే ధైర్యం లేకపోయింది.

హోరుగాలి మూలిగింది.

ఆ మూలుగులో వినిపించిన మాటలు.

"నమయం మించిపోయింది."

తెల్లవారుతున్నదంటే భయంవేసింది.

కాని—తెల్లవారింది.'

## 16

ఉదయం నిదురలేవగానే అయ్యగారు రమ్మన్నారని దాది చెప్పింది. తత్తర పాటుతో అలాగే వెళ్ళాను. కూర్చోమన్నాడు. కాఫీ తెప్పించి స్వయంగా తన చేతులతో ఇచ్చాడు. మౌనంగా కాఫీ తాగాం. నా శరీరాన్నీ ముఖాన్నీ, కొత్త మనిషిని పరికించి చూసినట్లు చూశాడు. మౌనానికీ, నిశ్శబ్దానికీ ఎంతటి శక్తి వుందో అర్థమయింది. నా కళ్ళలోకి సూటిగా చూశాడు. ఆ చూపు భరించలేక తలవంచుకున్నాను.

మరికొంత నిశ్శబ్దం.

"నేను ఒకసారి మా వూరు వెళ్ళిరావాలనుకుంటున్నాను," అన్నాడు అతి నిర్లిప్తంగా.

"ఎందుకు?" అన్నాను తలవంచుకునే.

"ఎందుకు, ఎక్కడికి వెళ్తున్నావని నిన్ను ఎన్నడూ అడగలేదు నేను. కేవలం నీకు సమాచారం తెలియాలి గనక చెప్తున్నాను."

"అధికారముందని అడగలేదు ఆ ప్రశ్న నిన్ను. పోవద్దని ప్రాధేయపడ టానికి అడిగాను."

"ప్రాధేయపడటం నీ తత్వం కాదని నాకు తెలుసు."

"అబద్ధం చెప్పటంలేదు. కాని మనిషితత్వం ఎల్లకాలం ఒకేమాదిరిగా ఉంటుందా? ఎంతమంది మనుషుల్లో ఎన్ని రకాలమార్పులు చూడటంలేదు మనం?"

"మనిషి మారగలిగిన విషయం ప్రవర్తనలో, తత్వంలో కాదు. మనిషిలో మనిషి ఉంటాడు. ఆ లోపలి మనిషి పుట్టిననాటినుంచి చచ్చేదాకా మారటం జరగదు. బయటమనిషికే ఎన్ని మార్పులు వచ్చినా ఆ లోపలి మనిషిని గుర్తు పట్టటం కష్టం. నిజానికి ఆ లోపలి మనిషితో ప్రపంచానికి సంబంధముండదు. కాని గుర్తుపట్టి పోల్చుకోగలిగినప్పుడు ఏం జరుగుతుందో, ఆ సంఘటన ఎటు వంటి ఫలితాలకు దారితీస్తుందో చెప్పలేం. అందుకే ఆత్మీయుల మనస్సుల నిజ స్వరూపాన్ని తెలుసుకుంటానికి ప్రయత్నించటంలో చాలా ప్రమాదముంది. నా విషయంలో—నీ విషయంలో అంతే జరిగింది."

"అయితే నా నిజాన్ని నువ్వు తెలుసుకున్నానంటావు?"

"అనుకుంటున్నాను."

"నీకు తెలిసింది నిజంకాదు."

"ఈ అనుభవం నిజంకాకపోతే మరి ఏది నిజమో నాకు తెలియదు."

"నన్ను నమ్మ. తప్పులుంటే దిద్దుకుంటాను. వెళ్ళకోకు."

"నా మనస్సుకు కొంత విశ్రాంతి కావాలి."

"నా మనస్సు ఎలా వుందో నీకు తెలియదు. ఈ బాధ—ఈ జీవితం—ఈ వైకల్యం నువ్వు లేకుండా నే భరించలేను. ప్లీజ్! వెళ్ళకు."

"నేనూ భరించలేకనే వెళ్తున్నాను."

"నువ్వు వెళ్తే నేను ప్రపంచంనుండి శాశ్వతంగా వెళ్ళిపోతాను."

ఆ మాట చెప్పి ఏడ్చాను.




అతడు కళ్ళుతుడిచి "మరీ వెర్రిదానివి కావటానికి ప్రయత్నించకు. నువ్వు బేలవుకావు. ధైర్యముంది. సాహసం, తెగింపూ అన్నీ వున్నాయి. కావలసిన దాన్ని అడిగి తీసుకోగలవు అధికారంతో. అవసరంలేనిదాన్ని తన్నివేయగలవు" అన్నాడు.

'నువ్వు వెళ్తే నేను బ్రతకలేను. మళ్ళీ నీ కంటికి కనిపించను.''

"అరుణా! ఎందుకలా బెదిరిస్తావ్? నిన్నేం బాధపెట్టాను నేను? ఎన్నడు చెల్లలేదు నీ మాట ఈ ఇంట్లో? నేనేమడుగుతున్నాను నిన్ను? నా బ్రతుకు నన్ను బ్రతకనిమ్మంటున్నాను."

''నే అడ్డుపడ్డానా నీ సుఖానికి?"

"ఇది అడ్డుకాక మరేమిటి? కొన్నాళ్ళు విశ్రాంతి తీసుకునే అధికారంకూడా నాకు లేదంటావా? అంతా నీ మాటప్రకారమే చెల్లాలంటావా? నువ్వు కొందరినే ప్రేమించగలవు. మరెందరినో ద్వేషించగలవు? ఉన్నంతలో అందరినీ సుఖ పెట్టవలసిన బాధ్యతుంది నాకు. నీ విషయం తప్ప మరొక విషయం ఆలో చించవు నువ్వు. నీ స్నేహితులు...నిన్ను పొగిడే భక్తులు...నీ పార్టీలు...నీకు వచ్చే రకరకాల ఆహ్వానాలు...నాట్యంలో నీకున్న ప్రతిభ...నీ డాన్సు.. పది మందీ చూసి చేసే కరతాళధ్వనులూ...నీవు గడించిన ఖ్యాతి– అపఖ్యాతులూ... ఇవన్నీ నాకు ఏం సుఖాన్నిచ్చాయంటావు? లోకంలో అందరూ నీగురించి చెప్పుకుంటు న్నారు...మంచీ చెడ్డా, అవి ఎందుకు నాకు? నాకుకావలసిన అరుణ ఎటువంటిది? నామీద, నా జీవితంమీద, నా ఆశలమీద, కోరికలమీద, నా బాధలపట్ల రవ్వంత సానుభూతి చూపించగలిగిన అరుణ...నాకోసం బ్రతుకుతున్నట్లు కనీసం భ్రమ

పెట్టగలిగిన అరుణ ... అటువంటి మనిషి కావాలనుకున్నాను. భగవంతుడు ఇద్దరినీ ఒకచోట చేర్చాడు. ఇద్దరం కలిసి బ్రతకాలనుకున్నాను. డబ్బుమీద... పేరుమీద ... అధికారంమీద నాకు వ్యామోహంలేదు. నా దుర్బలత్వం కావచ్చు అది. దౌర్భాగ్యం కావచ్చు దురదృష్టం కావచ్చు. కావలసింది అడగ లేను. దొరికిందాంతో సంతృప్తి పడటం నాకలవాటైపోయింది. దూసుకుపోయే మనస్సు నీది. పరుగులుతీసే మనిషివి నీవు. నాశక్తి పరిమితం. శక్తి లేదనే బాధకూడా లేదు. కాని ఎంతదూరం పరిగెత్తగలను నీతో? నిజమే! ఈనాటికీ అనిపిస్తుంది నువ్వు కావాలని. కాని ఇంత విశృంఖలంగా, వేగంగా, పరిగెత్తే మనిషిని నేను భరించగలనా? అర్థంచేసుకో అరుణా! తప్పు జరిగిందని తెలిసి నప్పుడు చేయవలసింది ఏడవటంకాదు. దాన్ని దిద్దుకొనే శక్తి మనలో ఎంత వుందో పరీక్షించుకోవాలి. ఉంటే దిద్దుకోవడానికి ప్రయత్నించాలి. లేనినాడు ఫలితాన్ని తృప్తిగా అనుభవించాలి. పాపం చేసిన మనిషికి శిక్ష అనుభవించ కుండా విముక్తిరాదు. ఏమో! నాకేం తెలుసు; ఏ జన్మలో ఏ మహాపాపం చేశానో!"

ఆనంద్ కళ్ళవెంట నీళ్ళు!

ఎన్నడూ చూడని దృశ్యం!!

నా నోట మాట రాలేదు.

మనసులేని మట్టిబొమ్మలా నివ్వెరపోయాను.

"కాస్త ప్రశాంతంగా ఆలోచించు ఆనంద్" అన్నాను మరో మాట రాక.

"ప్రశాంతంగా ఆలోచించవలసింది నువ్వు. ఎంతవరకూ ఈ జీవితాలను సరిదిద్దుకోగలమో ముందు నువ్వే...నువ్వే ఆలోచించాలి అరుణా."

"వెళ్ళక తప్పదా?"

"తప్పదు. బాధపడకు. తప్పకుండా వస్తాను."

"ఎప్పుడు?"

"పదిరోజుల్లో రావడానికి ప్రయత్నిస్తాను. కాకపోతే నెలరోజులు పట్టొ వచ్చు.

"ఆనంద్!"

"కళ్ళు తుడుచుకో. కన్నీళ్ళు...నావైనా మరొకరివైనా నే భరించలేను. నీకు మాటయిస్తున్నాను. తప్పకుండా తిరిగి వస్తాను నా మాట నమ్ము."

"నీ మీదనే ఆశలు పెట్టుకున్నాను ఆనంద్."

"నేనూ అదే అనుకుంటున్నాను. నీ విషయంలో, అరుణా."

కానీ, ఒక మాటివ్వాలి! నే తిరిగి వచ్చేసరికి నువ్వు మారాలి. నా అరుణవు కావాలి. కనీసం నాకు అటువంటి భ్రమ కలిగించాలి. ఇన్నాళ్ళూ నిన్ను భరించాను. ఎలా భరించగలిగానో నాకు తెలియదు సహనం నా రక్తంలో వుంది కణాలుగా కరిగి. కానీ, అవీ నీరసించాయి. వాటి ఓపికకూడా తగ్గిపోయింది. ఆ సంగతి గుర్తుంచుకో. నువ్వు సుఖంగా బ్రతుకు. నన్ను బ్రతకనీ ... సుఖం అవసరంలేదు. తలవంచవలసిన అవసరంలేని మనిషిగా కనీసం" అంటూ చేయి వుచ్చుకుని క్రిందకు తీసుకువెళ్ళి ఉయ్యాలలో పడుకుని కేరింతలు కొడుతున్న పాపాయిని ఎత్తుకుని నా చేతులకందించాడు.

"ఈ పాప నీ బిడ్డ. సముద్రం మదనంలోంచి అమృతం పుట్టినట్లు...ఈ దుర్భరమైన సంఘర్షణలో ... పాపంలోంచి పోయిన ప్రాణం బలికాగా...ఈ రత్నం నాకు దొరికింది. నీవు లేని ఒంటరితనాన్ని ఈ పాప గుండెల్లో కరిగించి లేని తృప్తి ఉందని భ్రమపడగలిగిన శక్తిని సంపాదించాను. ఎలా చూసుకుంటావో ఈ బిడ్డను!" అంటూ వెళ్ళిపోయాడు ఆనంద్!

విమానాశ్రయందాకా వెళ్ళి సాగనంపుదామనుకున్నా. రావద్దన్నాడు.

"మళ్ళీ?"

"తప్పకుండా వస్తా."

వెళ్ళిపోయాడు ఆనంద్.

పాప కేరున ఏడ్చింది. గుండెలకు హత్తుకున్నాను. ఇంటిమీద వ్యామోహం కలిగింది. ఎంతో చేయవలసింది—సంసారాన్ని దిద్దుకోవలసింది, చాలా కనిపించింది. తత్తరపాటుతో పాపను అలాగే పట్టుకుని పైకి నడుస్తున్నాను.

"అరుణా?" పిలుపు వినిపించింది.

వెనకకు తిరిగి చూశాను.

ముకేష్! కాదు! కాదు!!

మురారి!"

## 17

"ఆ సమయంలో, ఆ సందర్భంలో! మురారినిచూసి నివ్వెరపోయాను. ఏం మాట్లాడాలో తెలియక, ఎలా ఆహ్వానించాలో తెలియక, ఏవిధంగా తిరస్కరించాలో అర్థంకాక మనస్సు పెనుతుఫానై పెద్దపెట్టున రోదించింది.

"మరిచిపోయావా అరుణా?"

"ఏం ప్రశ్న? ఆ ప్రశ్నకు ఎక్కడుంది నాలో సమాధానం?"

"లోపలికి రా—పైకి" మూలిగినమాటలు.

ముందు నేనే-వెనుకనే అతను అనుసరించాడు.

అంతకుముందు ఎందరో అతిథులూ, స్నేహితులూ, రకరకాల పరిచయాలతో సాఫీగా సరాసరి కూర్చొని సిగరెట్ పొగలతో గదిలోని వాతావరణాన్ని కలుషితంచేస్తూ కబుర్లాడుకుంటూ కాలక్షేపం చేసిన ఆ డ్రాయింగ్‌రూం ఒక రైల్వే ప్లాట్‌ఫారంలా ఉండేది. ఆనాడు మురారిని చూడగానే అదీ మూగపోయింది. కూర్చోమన్నాను కూర్చున్నాడు. మా పెళ్ళినాటి ఫోటోను రెప్పలార్పకుండా చూశాడు. తర్వాత నా గుండెలను బల్లిలా కరుచుకున్న బిడ్డను చూశాడు. దగ్గరకు తీసుకుని ఎత్తుకున్నాడు. ఏడ్చింది పాప. నేను ఏడవలేకపోయాను. అనుకున్నప్పుడల్లా మనసారా నవ్వుతూ, అనిపించినప్పుడల్లా కడుపారా ఏడ్చే అదృష్టం పసిపాపను దేవతగా తీర్చిదిద్దుతుంది. ఆ పసితనాన్ని ఆవిరిచేసుకున్న నేను ఏంచేయగలను? బిడ్డను ముద్దాడి నా చేతుకందించాడు. అతని స్పర్శతో భగ్గున మండాయి నా చేతులు. ఈ చేతులతోనే అంతకుముందు ఎందరెందరికో ఎన్నెన్నో రకాల షేక్‌హాండ్లిచ్చాను. ఆనాడు లేని అధైర్యం మురారి చేయి తగిలినప్పుడు కలిగింది?

యువరానర్!

పాపానికీ, పుణ్యానికీ సరిహద్దులు మనమే నిర్ణయించుకోవాలేమో? ఆ నిర్ణయం మన దృక్పథంమీద ఆధారపడి వుంటుంది. అందుకే మురారిని ఆహ్వానించలేకపోయాను. ఆపేక్షను చూపెట్టలేకపోయాను, నా వైఖరి మురారికి అర్థంకాలేదు.

"నన్నుచూసి సంతోషపడతావనుకున్నాను అరుణా!" అన్నాడు దీనంగా.

జాలివేసింది.

ఒకనాడు నా మంచినికోరి, నా భవిష్యత్తునుకోరి సలహాచెప్పి శూన్యంలోకి అదృశ్యమైన మురారి రాక నాకు సంతోషం కలిగించలేదని ఎలా చెప్పగలను?

"అలా ఎందుకనుకున్నావు మురారీ?" అన్నాను లేనినవ్వు తెచ్చుకుంటూ.

"నాకు భగవంతుడు ఎన్ని దురదృష్టాలిచ్చినా ఒక అదృష్టంకూడా ఇచ్చాడు.

"ఏమిటది?''

"నువ్వు నా రాకకి ఎంత సంతోషించావో—కనీసం ఆ మాత్రం తెలుసుకొనే శక్తి."

"ఛా! అదేంలేదు. ఏవో సంసారపు గొడవలతో కాస్త మనస్సు చికాకు పడింది. అంతే!''

''మీ ఆయన్ను చూపించవ్?''

"ఊరు వెళ్ళాడు."

''ఎప్పుడు రాక?''

"పదిరోజులు పట్టొచ్చు.''

"చంపావ్ పో! పదిరోజులే! అంత వ్యవధిలేదే మనకు!"

''ఎందుకని?"

''నిజం చెప్పమంటావా అరుణా! అబద్ధాలాడటం మన సెకండ్ నేచర్ై పోయింది "

"నిజమే చెప్పు.''

"లోగడ మనం కలుసుకున్నప్పుడు ఒక మాటడిగావు. గుర్తుందా? ఏం చేస్తున్నావని? దానికి నేనేం సమాధానం చెప్పాను?"

"దొంగనన్నావు నవ్వుతూ."

"నవ్వుతూ అన్నా ఆ మాట నిజం."

''అక్షరాలా."

"ఏమిటా వేళాకోళం మురారీ?"

"నిజం అరుణా! అంత చదువుకున్నదానివీ, ప్రపంచం తెలిసినదానివీ ఎందుకంత ఆశ్చర్యపడతావు? జానపద గాథల్లోలా దొంగలు భయంకరంగా, రాక్షసులమాదిరి వుంటారనుకుంటున్నావా? ఇది ఇరవయ్యో శతాబ్దం. సమర్థుడైన దొంగ-దొరకంటె దొరబాబులా వుండొచ్చు. ఈ నాగరికత మేలిముసుగులో పాపం ఎంత అందంగా దాక్కుంటుందో గ్రహించలేకపోయావా? నువ్వే చెప్పు దొరకూ దొంగకూ గల తేడా ఈ మహానగరాల్లో, ఈ సంతల్లో, ఈ రైళ్లల్లో, ఈక్లబ్‌లలోఎవరైనా ఎంతవరకూ గుర్తుపట్టగలరు? నువ్వుఏమిటి? అన్నదిప్రశ్న కానేకాదు. నువ్వు ఎలా కనిపిస్తున్నావ్? అదీ ప్రశ్న దాన్నిబట్టి నీకు ఏపద్ధతిలో ఆతిథ్యమివ్వాలో అవలిమనిషి నిర్ణయించుకుంటాడు. అది గ్రహించాం మనం చాలా పెందరాళే. అందుకే ఈ వేషం తప్పలేదు. "మరో రహస్యం ఈ వేషంతో దొంగతనాలు చేయటం చాలా తేలిక.

"ఏమిటి నువ్వుచేస్తున్న దొంగతనం?"

"రత్నాల వ్యాపారం. మర్యాదకు ఆ పేరు పెట్టాననుకో. ఒక దేశంనుండి మరొక దేశానికి దొంగతనంగా రత్నాలను చేరవేయడం. పట్టుబడితే దొంగ. తప్పించుకు తిరిగినంతకాలం దొర. మనంచాలాకాలం తప్పించుకుతిరిగాం. దొరలకు దొరగా చెలామణీ అయ్యాం. హాంకాంగ్‌లో నేనొక ప్రిన్స్‌ని. బాంకాక్‌లో పెద్ద రత్నాల వ్యాపారిని. రకరకాల పేర్లు రంగురంగుల వేషాలు బ్రతికినంతకాలం భవిష్యత్తును ఓవర్‌డ్రాఫ్ట్ చేసుకోవటం అలవాటైపోయింది. ఈ విధంగా సంపాదించి కావలసినంత నిలవచేసికొని ఒక మారుమూల ప్రదేశంలో స్థిరపడి భార్యాబిడ్డలతో సుఖంగా బ్రతకాలనుకున్నాను. ఎవరికీ పట్టుబడకుండా ఎంతోకాలం తప్పించుకు తిరిగాను. డబ్బు సంపాదించానుగాని దాచుకోలేకపోయాను. ఏదో బ్రతికానన్న తృప్తి మిగిలింది—దాన్ని తృప్తి అనుకోగలిగితే. పోలీసులు నామీద నిఘా వేశారు. నీడలా వెంటతిరుగుతున్నారు. ఇవాళ ఎయిర్‌పోర్టులో ప్లేన్ దిగగానే నా పరిస్థితి నాకు అర్థమయింది. బేడీల గలగలలు వినిపించాయి. జైలు తప్పదని గ్రహించాను. పోయేముందు నిన్నూ నీ సంసారాన్నీ ఒక్కసారి చూడాలనిపించింది. వీలుంటే తప్పించుకుందామనేవుంది. కాని ఆ వీలు ఇంతవరకూ కళ్ళముందు కనిపించటంలేదు. ఈ ఇంట్లోకి రావటం చూస్తే—నీ ఇంటి చుట్టూ మారువేషాలతో పోలీసులున్నారని గుర్తుంచుకో ఇది నా పరిస్థితి. కొంతమందికి అబద్ధం చెప్పలేం. అందుకే నిజం చెప్పాను. ఒకరోజు ఇక్కడ తలదాచుకోవాలని ప్రయత్నం. అదైనా నీకు అభ్యంతరం లేకపోతేనే, ఏమంటావ్?"

మురారి పరిస్థితి అర్థమయింది నాకు. కాని నా పరిస్థితి మురారికి తెలియదు. ఉన్నదున్నట్లు చెప్పి "మురారీ! నాకే నీడలేని పరిస్థితి ఏర్పడింది. నీకేం చేయగలను? నాకే మనశ్శాంతిలేదు. నీకు ఎక్కడనుంచి ఇవ్వగలను ఆ శాంతి? నువ్వు చెప్పింది నిజం. కాని ఏం చేసుకోను ఆ నిజాన్ని? నీ రహస్యాన్ని? వెళ్ళు మురారీ! నిన్ను నేను భరించలేను. నడుమువిరిగిన మనిషి బరువెత్తలేడు. మన్నించు. ఆ శక్తి లేకపోతే మరిచిపో" అని చెప్పాలనుకున్నాను.

కాని—

యువరానర్! నే చెపింపదేమిటి?

"మురారీ! ఉండిపో! ఎన్నిరోజులు యిక్కడ ఉండాలనిపిస్తే అన్నిరోజులు" అన్నాను; నాకు తెలియకుండానే ఈ మాటలు!

"ఒక్కరోజు చాలు!"



"నీ యిష్టం! నేనూ మనిషినే మురారీ! నీ ఆపదనుచూసి నిన్ను పొమ్మన లేను. నీ అభిమానానికి కృతజ్ఞత చూపెట్టగల శక్తి ఇంకా రవ్వంత మిగిలింది నాలో"

అన్నాను యువరానర్!

"మమ్మాటికీ,"

చెప్పండి! మీరే చెప్పండి. నాలోని మానవత్వం ఎంతవరకూ దిగజారిందో ఈ మాటలవలన? నా ధర్మాన్ని ఎంతవరకూ అధిగమింతోనో ఆ చేతలవల్ల? మురారి కళ్ళు కృతజ్ఞతతో మెరిసినై.

"ఈ పాప—ఎన్నాళ్ళయింది?"

"రెండు నెలలు."

"నువ్వు చాలా ఆరోగ్యవంతురాలివి. తండ్రిపోలికనుకుంటాను."

నవ్వాను.

"మళ్ళీ నవ్వు" అన్నాడు మురారి.

గలగలా నవ్వాను.

"అలా అందరూ నవ్వలేరు అరుణా" అన్నాడు.

ఆ మాట అంతకుముందు చాలామంది అన్నారు!

కాని—

మనిషి నవ్వులో దాగిన రోదనను ఎంతమంది అర్థంచేసుకోగలరు?

ఆ రోజు మా యింట్లో వున్నాడు మురారి!

అంతకుముందు చాలామంది అతిథులు మాయింటికి వచ్చారు. కాని రోజుకు రోజు యింట్లో మనిషిలా ఆతిథ్యం స్వీకరించినవారు లేరు. నేనే స్వయంగా వడ్డించాను భోజనం. నర్సులూ, దాయీల గుసగుసలు మేకులై బాకులై గుండెలలో దిగుతున్నాయి. నా సాహసానికి నాకే ఆశ్చర్యమనిపించింది. ఎంత వద్దనుకున్నా గడిచినరోజులు కళ్లముందు కదిలినై. గదిలోకాక – వరండాలో కావాలని, మంచం వేశాను. దాయీనికూడా నాదగ్గర పడుకోమన్నాను.

"ఈ రాత్రి అంతా నీతో కబుర్లు చెప్పాలి అరుణా" అన్నాడు మురారి.

ఆవలింపు నటించి "రేపు మాట్లాడుకోవచ్చు మురారీ. నిద్రవస్తున్నది," అన్నాను.

మురారిది మంకుపట్టు. కావాలనుకున్నది దొరికేవరకూ వదిలిపెట్టడు. నేను పిలుస్తున్నా వినిపించుకోకుండా, నా గదిలోకి వెళ్ళిపోయాను దాయీ మా మంచాల ప్రక్కనే పడుకుంది. నిద్రపడుతున్న సమయంలో మెళకువవచ్చింది. అలికిడి–తలుపు తెరుచుకుంది. పిశాచంలాంటి మూర్తి కనిపించింది కళ్లముందు. ఆత్మీయులే పరిస్థితుల ప్రభావంవలన పిశాచాల మాదిరి కనిపించడం భరించ గలిగిన దురదృష్ట మంటారా చెప్పండి యువరానర్"

"అరుణా"

అదే ఆంతమైన పిలుపు. శైశవపు కుబుసాన్ని చిగిర్చి, యౌవనపు పడగ లెత్తుతున్న రోజులలో జీవనతాలనను చిలకరించిన, అతని పిలుపు! మురారి పిలుపు! విని వేయిపడగల తాకిడికి పగిలిన గుండెలై నా హృదయం చిన్నా భిన్నమైపోయింది.

'మురారీ' అంటూ పీడకలనుండి విముక్తిపొందిన ప్రాణిలా గావుకేక పెట్టాను. దాయి ఎగిరిపడిలేచి–ఎదుటనున్న దృశ్యంచూసి పారిపోయింది గది లోంచి "ఎందుకలా కంగారుపడతావు అరుణా! ఏ పాప చింతనతోనూ రాలేదు నీగదికి. పోనీ, నోరారా నిన్ను చెల్లీ అని పిలుస్తాను. అప్పటికైనా నా నమ్మగలవా నన్ను? నువ్వు నా చెల్లెలివేకాదు. తల్లివి. ప్రాణానివి."

విరిగిన చెట్టులా కూలిపోయాను మంచంమీద.

తల నిమిరాడు దగ్గరకొచ్చి మురారి.

కిటికీ అద్దాలమీద ఏవో నీడలు కదిలాయి.

"ఏమిటి నీ బాధ? ఎటువంటివి నీ సమస్యలు? చెప్పు చెల్లీ? నేనెలాగూ తెగించాను. గాలిపటంలా ఎగిరి ఎగిరి కూలిపోతున్నాను. కూలిపోయేముందు నీకేం చెయ్యగలను? నీ సుఖశాంతులకోసం నేను రక్తం ధారపోస్తే అది అమృతమై నా జీవితాన్ని పునీతం చేయగలదమ్మా" అంటూ ఓదార్చటానికి ప్రయత్నించిన మురారికి నా కన్నీటి రహస్యం తెలియదు.

"మురారీ" అన్నాను అతని చేయిని ప్రక్కకి తొలగిస్తూ.

"చెప్పమ్మా. ఎవరికీ, ఎందుకూ పనికిరాకుండా ఇన్నాళ్ళూ బ్రతికాను. మన కోసం మనం బ్రతకడంలో సుఖముందని భ్రమపడతాం. ఆ బ్రతుకు ఎలా నడుస్తుందో తెలుసా? గమ్యంలేకుండా, ఎంతదూరం ఎగిరినా ఎయిర్‌పోర్ట్ కనిపించకుండా ఎగిరే విమానంలా? ఇంధనం వున్నంతసేపూ ఎగురుతుంది. తర్వాత కూలిపోతుంది. ఎదుటి మనిషికోసం మన కళ్ళనుంచి రాలిన ఒక్కొక్క నీటిబొట్టూ అమృతమై మన ఆత్మలకు బలాన్నిస్తుంది. ప్రతిమనిషికీ ఎప్పుడో ఎదురౌతుంది ఈ ప్రశ్న. సమాధానం దొరకకపోతే జీవితమంతా భయంకరమైన, దుర్భరమైన శూన్యంలా వెక్కిరిస్తుంది. అందుకే అరుణా! నీకు సహాయం చేయవలసిన అవసరం నీదికాదు నాది. నా బ్రతుక్కికూడా ఒక అర్థముందని తృప్తిపడటానికి."

చివరికన్నాను.

"మురారీ! నా పరిస్థితి నీకు చెప్పలేను. నాకు చెయ్యవలసిన సహాయాన్ని నువ్విప్పుడే చేశావు."

"ఏం చేశాను?"

ఎదుటివాళ్ళకోసం బ్రతకడం మనిషికి ఎంత అవసరమో చెప్పావు. అదే పదివేలు. మరొక సహాయం మిగిలింది నువ్వు చెయ్యవలసింది. నువ్వు వెంటనే యిక్కడనుంచి వెళ్ళిపోవాలి."

"అరుణా!"

"అనహ్యించుకోకు. ఈ స్వార్థానికి అర్థంచెప్పలేను. దయయుంచి నా కోరిక మన్నించు."

మురారి లేచాడు.

"నన్ను క్షమించు మురారీ."

"మనందరినీ క్షమించవలసింది ఆ దేముడు. వాదంటూ వుంటే నేనెవరిని అరుణా? ఎన్నడూ ఎవరి విషయంలోనూపడని భ్రమ నీ విషయంలో పడ్డాను. మనిషి—మన భ్రమలలో ఎంత కాదన్నా, మనిషే. మనిషిని దేముడనుకోవటం, స్వార్థాన్ని జయించడం సాధ్యమనుకోవడం మన అజ్ఞానం. కాని ఈ చిత్రం చూడు. మనిషి జీవితం నగం తప్పులు చేయడంలోనూ, మిగిలిన సగం ఆ తప్పులను దిద్దుకోవడంతోనూ, సరిపోతుంది. కాని ఆ మాత్రం అందరిలాంటి అదృష్టంకూడా కాదు నాది. తప్పులు దిద్దుకునే వ్యవధి నాకు లేదు. నేను వస్తే తలుపులు మూయగలిగినశక్తి నీకు లేదనుకున్నాను. కాని భ్రమపడ్డాను. గుడ్‌బై."

వెళ్ళిపోతున్నాడు మురారి.

"మురారీ!"

కేకపెట్టాను నవనాడులనూ చీల్చుకుంటూ.

కాని మాట పైకి రాలేదు.

మురారి వెళ్ళిపోయాడు. పాప అలాగే నిద్రపోతున్నది.

టెలిఫోను మోగింది.

గుండెలను ఎవరో సుత్తిపెట్టి బాదుతున్నట్లనిపించింది.

దాయి వచ్చి చెప్పింది.

"అమ్మా, ఫోన్."

"నేను ఎవరితోనూ మాట్లాడను. పెట్టెయ్యి."

"అయ్యగారమ్మా—ఎయిర్‌పోర్టునుంచి."

"ఆనందా?"

"పరిగెత్తాను ఫోనుదగ్గరకు వెర్రిదానిలా."

**18**

"యువరానర్!

ఆనంద్ వస్తున్నాడు. అతనికోసం ఎన్నడూ ఎదురుచూడని మనిషిని నేను. శరీరమంతా మనస్సైపోయి నిరీక్షిస్తున్నది. విమానం చెడి వెనకకు తిరిగిందట. ప్రయాణం ఆగిపోయిందట. ఇంటికి వస్తున్నాడట.

నన్ను ఎయిర్‌పోర్టుకి రావద్దన్నాడు. పావుగంటలో యింటిదగ్గర వుంటానని మాట ఇచ్చాడు.

కారు ఆగింది.

హారన్ వినిపించింది.

తడబడుతున్న కాళ్ళతో, తందరిస్తున్న గుండెలతో ఎదురు వెళ్లాను. ప్రశాంతంగా అతని పెదిమలమీద కదిలిన చిరునవ్వు నాకు కొంత మనో ధైర్యాన్నిచ్చింది. ఎంతటి చల్లటినవ్వు! ఒక్కరాత్రి పదేళ్ళమీదపడిన వృద్ధాప్యం అతనిలో కనిపించింది. అప్పుడు పాతిక సంవత్సరాలు వెనకకుపోయిన యువకునిలా కనిపించాడు. పోయిన మనిషి మళ్ళీ బ్రతికి కళ్ళముందు మెదిలి నట్టయింది.

అదొక అద్భుతమైన అనిర్వచనీయమైన అనుభవం. అతని పాదాలముందు మోకరిల్లి కన్నీటితో కడిగాను. లేవనెత్తి అక్కున చేర్చుకుని తలనిమిరి చెక్కిళ్లు తుడిచాడు. అతని మెత్తని మాటలలో సేదతీరి, తేలికపడింది—తడిసి బరువెక్కిన నా హృదయం.

"విమానం చెడిపోవటానికి అర్థం ఏమిటో తెలుసా? నిన్నూ నన్నూ భగవం తుడు క్షమించాడు. నీ దగ్గరకు తీసుకువచ్చాడు నన్ను అరుణా. ఇది దైవ నిర్ణయం!" అన్నాడు తృప్తిగా నిట్టూర్చి.

ఏం మనిషి!

ఏం మనస్సు!

కళ్ళు తెరిచి ఎదురుగావున్న స్వర్గాన్ని పోల్చుకోలేకపోయాను.

ఆనంద్! ఆనంద్!! నా ఆనంద్!!!

"అరుణా! వెర్రిదానా—రా—పైకిపోదాం."

ఆనాడు నేను అనుభవించిన పారవశ్యాన్ని, ఎన్నడూ చవిచూడని జీవన మాధుర్యాన్ని అనుభవించాను. బ్రతుకు ఆవిరైపోతున్నప్పుడే అర్థమవుతుంది జీవన మాధుర్యం. మనుషులు జీవితంనుండి శాశ్వతంగా తొలిగిపోయే ప్రమాదం ఏర్పడినప్పుడే అర్థమవుతుంది వారు మనకెంత అవసరమో. ఇంక జీవితంలో క్లబ్బులో కాలుపెట్టనని వాగ్దానం చేశాను. 'నువ్వుకాక ఇంకెవరూ నాకు అవసరం లేదు' అంటూ ప్రమాణంచేశాను. భవిష్యత్తుని గురించి ఎన్నో కథలు చెప్పాను. తృప్తిగా పడుకొని జాలిగా 'ఊ' కొడుతూ అలాగే నిద్రపోయాడు. కలతలెరు గని నిద్రపోగలగటం ఎంత అదృష్టం! ఎప్పుడు నిద్రపోయానో నాకే తెలి యదు. పరిగెత్తి పరిగెత్తి అలసిపోయిన జీవితం ఆదమరచి, అతని గుండెల్లో నిద్రపోయింది పాపలా. పాప శాపాల గాలిసోకని పసిపాపలా.

ఆ శాంతిసౌఖ్యాలు నావై పోయాయనుకున్నా. 'ఈ గది నాది. ఈ ఇల్లు నాది. ఈ మనిషి నావాడు. ఈ రోగులు నా బిడ్డలు' అంటూ సగంతెలివితో కలవరించాను.

అదొక మధురమైన సుఖస్వప్నం.

కాని—

యువరానర్!

కలగంటున్నంతసేపూ ఆ మిథ్య నిజమనే భ్రమ కలుగుతుంది. కాని కళ్ళు తెరిచి చూస్తే ఏం కనిపిస్తుంది? యదార్థజగత్తు.

తెల్లవారింతర్వాత తెలిసింది.

నా కల నిజం కాదని, కాలేదని, కాబోదని.

నర్సు వచ్చి లేపింది.

'డాక్టరుగారు ముందుగదిలోకి రమ్మంటున్నారు' అంది.

నాకు అర్థంకాలేదు. ఆ అమృతంలాంటి అజ్ఞానపు మత్తులో ఆవలించాను. వళ్ళు విరుచుకున్నాను. గాలికి రెపరెపలాడుతున్న తెరలు తొలగించి బయటకు చూశాను. ఇంటిముందు ఒక పోలీసుజీపు కనిపించింది.

నా నెత్తిన పిడుగుపడింది.

నడుస్తున్న శవంలా అడుగులు వేశాను ముందుగదిలోకి.

యువరానర్!

ఆ కాకీదుస్తులమనిషి, నాకు యముడై కనిపించాడు.

నమస్కరించాడు ఆ పోలీసు అధికారి, మర్యాదగా.

బలి పశువులా తలపంకించి సోఫాలో కూలబడ్డాను. ఎదుట కూర్చొన్న ఆనంద్ ముఖాన్ని తలెత్తిచూడలేకపోయాను. మామూలు మాటలు లాంఛనప్రకారం అని "మురారి మీకెలా తెలుసు?" అన్నాడు అధికారి. తలవంచుకున్నాను. మళ్ళీ అడిగాడు. జవాబురాక పదే పదే అడిగి "ఈ పరిస్థితిలో నిజాన్ని దాచిపెట్టడం మీకే ప్రమాదం. ఇది సామాన్యమైన కేసుకాదు. ఆ మురారిని పట్టుకుంటానికి సంవత్సరాలుగా మా బలగం వేలకువేలు ఖర్చుపెట్టి ప్రాణాలకు తెగించి పని చేసింది. ఇప్పటికి దొరికాడు. మీరు నిజం చెప్పకుండా మౌనం పాటిస్తే, మిమ్మల్నిగూడా అనుమానించవలసి వస్తుంది. డాక్టర్! మీ క్షేమంకోరి చెప్తున్నాను. ఒక అధికారిగా మిమ్మల్ని ఆదేశించడంలేదు. ఒక మిత్రునిగా మిమ్మల్ని అభ్యర్థిస్తున్నాను," అన్నాడు లాలనగా.




చెప్పాను యువరానర్.

జరిగిన కథంతా చెప్పాను.

ఆనంద్ ప్రాణంలేని పాషాణంలా కూర్చుని వింటున్నాడని తెలిసీ!

చివరకు పోలీసు అధికారి ఆనంద్‌తో "మీకభ్యంతరం లేకపోతే ఆవిడను ఏకాంతంగా ఒక ప్రశ్న అడగకతప్పదు" అన్నాడు.

ఆనంద్ సమాధానం చెప్పలేదు.

"అడగండి! ఆనంద్ వున్నా ఫర్వాలేదు. ఆయన దగ్గర దాచవలసిన రహస్యం ఈ పరిస్థితిలో నాకు లేదు" అన్నాను.

"ఆ రాత్రి..." అంటూ ఆగి ఆనంద్‌వంక చూశాడు అధికారి.

"అడగండి. ఏ రాత్రి?" అన్నాను.

"మీరు పోలీసు స్టేషనులో పట్టుపడిన రాత్రి-మీకు గుర్తుందికదూ? మర్నాడు మిమ్మల్ని విడిపించుకుపోయింది ఈ మురారే కదూ?" అన్నాడు అధికారి.

నేను సమాధానం చెప్పకముందే "క్షమించండి. మీ పని కానివ్వండి," అంటూ ఆనంద్ ఆగదిలోంచి వెళ్ళిపోయాడు. కాసేపటికి మరికొన్ని ప్రశ్నలడిగి అధికారి కూడా వెళ్ళిపోయాడు. ఆనంద్‌కోసం బెడ్‌రూంలోకి వెళ్ళాను నేను."

## 19

"యువరానర్!

ఆ సంఘటన మా దాంపత్యజీవితంమీద ఎటువంటి ప్రభావాన్ని ప్రసరింప చేసిందో నేను వేరే చెప్పవలసిన అవసరంలేదు. పాపం నిప్పులాంటిది. అది వెంటనే మండి పరిసరాలను భస్మంచేయకపోవచ్చు. కాని రాజుకుంటుంది, దాని

యిష్టంవచ్చినప్పుడు. సమయం మించిపోయిం తర్వాత సర్వనాశనం కాకుండా పతనాన్ని నిరోధించలేం.

తప్పులుచేసి తలలు బొప్పెలుకట్టి, అనుభవంలో తాము నడుస్తున్న మార్గం సరియైనది కాదు అనీ తమ మార్గం మరొకటున్నదనీ తెలుసుకుంటారు కొందరు. వెనకకు మరలి, తమ గమ్యాన్ని తెలుసుకొని అందుకోగలిగినవారు కొంతలో కొంత అదృష్టవంతులు. మరొకరకం మనుష్యులుంటారు. ఒకరు చెప్పిన మాటలను అర్థంచేసుకోలేరు వారు. ఒకరి అనుభవాలలోని ఆంతర్యాన్ని గ్రహించలేరు. "నిప్పు కాలుతుంది" అని ఎవరన్నా హితువు చెపితే "ఎలా కాలుతుందో చూద్దాం!" అనుకుంటూ దానికోసం వెతుక్కుంటూపోయి అంటుకుంటారు. అది దహిస్తుంది. నెత్తురును ఉడికిస్తుంది. మనస్సుకూ శరీరానికీ గాయం చేస్తుంది. అప్పుడు మహాపరిశోధనచేసి సృష్టి సత్యాన్ని వెలికితీసినట్లు, ఆ అనుభవాన్ని అందరికీ చెప్తారు!

ఈ కథ నేను చెప్పటానికి అదే కారణం. కాంతిని ప్రసాదిస్తున్నదనే వ్యామోహంతో, మమకారంతో, మంటను కౌగలించుకునే ప్రయత్నంలో ఎవరూ పడకూడదనే చెప్తున్నాను.

"ఏం జరిగింది? ఎందుకు జరిగింది? ఎవరు మురారి? ఎందుకొచ్చాడు మనింటికి? ఆ రాత్రి ఏం జరిగింది? ఏం తప్పు చేశావు? ఎందుకు ఇరుక్కున్నావ్ పోలీస్‌స్టేషన్లో? మర్నాడు నిన్ను విడిపించిన వ్యక్తి ఎవరు? ఏమిటి సంబంధం మీ ఇద్దరికీ?"

—ఇటువంటి ప్రశ్నలెన్నో అడిగే అధికారముంది అతనికి.

కాని—

ఆనంద్ ఒక్కమాటకూడా నన్నడగలేదు.

కొందరికి కోపం ప్రకటించే శక్తికూడా వుండదు. ఎదుటివారిమీదగల కోపాన్ని తమమీదనే ప్రదర్శించుకుంటూ క్రమక్రమంగా తమజీవితాన్నే తాము ముక్కలు ముక్కలుగా నరుక్కుంటారు. 'అసలు ద్వేషించే శక్తికూడా లేదా ఆనంద్‌కు?' అనిపించింది.

మూడురోజులు ఎలా గడిచాయో చెప్పలేను.

కాని—

ఆ మూడురోజులే నా భవిష్యత్తును నిర్ణయించాయి.

దుర్భరమైన నిశ్శబ్దం మూలిగింది, ఆ మూడురోజులూ మా ఇంట్లో.

ఆనంద్ నర్సింగ్‌హోమ్‌కు మాత్రం వెళ్ళివస్తున్నాడు. అర్జున్‌సింగ్ అనే మరొక డాక్టరును పిలిచాడు. ముందుగదిలో కూర్చుని వాళ్ళిద్దరూ చాలాసేపు మాట్లాడుకున్నారు. ఆనంద్ తన గదిలోంచి బయటకురావడం మానేశాడు. భోజనంకూడా అక్కడే. ఎటువంటి పరిస్థితుల్లోనూ నా భోజనం గురించి దాయిని అడిగి తెలుసుకునేవాడు. "బాబుగారు ఏమన్నారు?" అని అడిగాను దాయిని.

"అయన మాట్లాడటంలేదమ్మా" అంటూ సమాధానం చెప్పింది.

"భోజనం చేశారా?''

"అక్కడ టేబిల్‌మీదపెట్టి పొమ్మన్నారు."

"తినమని అడగలేదా?"

"ఆయన్ను చూస్తేనే భయంగా వుందమ్మా."

"నా గురించి ఏమీ అడగలేదా?"

"అసలు మాట్లాడటమే లేదమ్మా."

రెండవరోజు సాయంత్రం నేను ధైర్యంచేసి ఆయన గదిలోకి వెళ్లాను.

"ఆనంద్ నిన్ను క్షమించమనీ, నన్ను రక్షించమనీ అడగటానికి రాలేదు. క్షమాభిక్ష అర్థించే శక్తికూడా నాకు లేదని, నీకు తెలుసు. కాని..." అంటూ ప్రారంభించాను. ఆనంద్ లేచి చదువుతున్న పేపరొకటి నాచేతికందించి "మురారి దొరికాడు" అనే శీర్షికతో ఒక వార్త. "డాక్టర్ ఆనంద్ యింట్లోంచి ..." —ఆ తర్వాత అక్షరాలు కనిపించలేదు. క్రమ్మిన నీటిపొర అంధురాలిని చేసింది నన్ను.

''అమ్మా! మీకోసం ఎవరో వచ్చారు" అంటూ దాయి పిలిచింది.

కళ్ళు తుడుచుకుని "బాబుగారు ఎక్కడ?" అన్నాను.

"క్రింద నర్సింగ్‌హోమ్‌లోకి వెళ్ళారమ్మా. మిమ్మల్ని ఈ గదిలోకి రావద్దన్నారు.''

ముందుగదిలోకి వెళ్ళాను.

"ఈ స్మగ్లింగ్ కేసులో మీరు కొన్ని రహస్యాలు బయటపెట్టగలరనే ఆశతో మా ఎడిటర్ ప్రత్యేకంగా నన్ను పంపించాడు మేడమ్. ఇందులో మీ ప్రతిఫలం..."

కోపంవచ్చిందంటే చాలదు. ఏదో వచ్చింది. కాని అశక్తురాలిని. రెండు చేతులూ జోడించి నమస్కరించాను. "అయ్యా! ఈ పగిలిపోయిన గుండెలమీద ఇంకా రాతిబండలు విసరకండి. వెళ్ళిరండి" అంటూ ప్రార్థించాను.

"మీ పేరు బయటకి రాకుండా కథ నడపగలం. మురారి జీవిత రహస్యాలు—"

"వెళ్ళండి" అంటూ బిగ్గరగా కేకపెట్టాను.

ఆ పత్రికా విలేఖరి వెళ్ళిపోయాడు.

మళ్ళీ నిశ్శబ్దం.

ఫాన్ తిరుగుతున్న సవ్వడి ఒక్కటే నాకు తోడయింది.

మళ్ళీ అలికిడి.

తలెత్తి చూశాను.

ముకేష్ భార్య కనిపించింది బుసలుకొడుతూ!

ముకేష్ భార్య నాకు చాలా రోజులుగా పరిచయం. దంపతులిద్దరూ మా యింటికి అప్పుడప్పుడు వచ్చేవారు. ఆమె పేరు శ్రీమతి అని చెప్పుకుందాం. భర్త బలవంతంమీద ఆవిడకూడా క్లబ్బులకు రావడం, అప్పుడప్పుడు అప్రయత్నంగా బయటపడే అయిష్టంతోనే అందరితో కులాసాగా కబుర్లు చెప్పటానికి ప్రయత్నించేది. ముకేష్ నాపై మొదటినుంచీ కనబరుస్తున్న అసక్తిపట్ల ఆమె మొదటిరోజుల్లో సూచనప్రాయంగానూ, రానురానూ స్పష్టంగానూ చివరకు నిర్లక్ష్యంతోనూ అనుమానాలూ, అయిష్టాలూ ప్రకటిస్తూ వచ్చిది. ఒకసారి, ఒక సందర్భంలో—అప్పుడు నేనూ క్లబ్బులోనే వున్నాను. —"నీలాగా అరుణ బ్రూట్ కాదు." అనేశాడు ముకేష్. శ్రీమతి పడగెత్తిన పాములా బుసలుకొడుతూ నామీద అసూయనూ, భర్తపట్ల ద్వేషాన్నీ వెళ్ళగ్రక్కి వెళ్ళిపోయింది.

ఆ తర్వాత ముకేష్ అన్నాడు. "మా ఆవిడ మహచెడ్డ అనుమానం మనిషి," అంటూ ఇంకా చాలా తిట్టాడు. ఏమైనా నా వలన భార్యాభర్తల మధ్య మనస్పర్థలు చెలరేగాయనే మాట నిజం.

"ఈ మగవాళ్ళ సంగతి నీకు తెలియదు కాని. పరాయి ఆడదాని అందం పదింతలుగా కనిపిస్తుంది వీళ్ళకళ్ళకు. భార్యను భరించలేని భారంగా మోస్తూంటారు. ఇదే ఏ అమెరికానో అయితే విడాకులిచ్చి మొగుడి పీడ వదిలించుకునే శక్తి ఆడదానికుంటుంది. ఈ దిక్కుమాలిన దేశంలో పుట్టాంకనక మగవాడు ఎన్ని ఆగడాలుచేసినా అన్యాయాలు సాగించినా దిక్కులేని అనాధల్లాపడివుంటున్నాం" అంటూ నేను వినాలని అల్లంతదూరంలో కూర్చొని లెక్చర్ ప్రారంభించింది

"మా ఆవిడ నాకు విడాకులిస్తానంటుంది'' అన్నాడు ముకేష్ నవ్వుతూ ఒక సారి.

"నేనూ ఇద్దా మనుకుంటున్నా మా ఆయనకు" అన్నాను నేనూ నవ్వుతూనే.

"అయితే యిద్దరం—మనిద్దరం కలిసి–చంద్రమండలానికి ప్రయాణం కట్ట వచ్చునన్న మాట!"

ఇద్దరం నవ్వేశాం బిగ్గరగా!

"ఏం శ్రీమతీ యిలా వచ్చావ్?'' అన్నాను.

''ఎందుకొచ్చానో నీకు తెలియదా?''

''చెప్పు—"

నువ్వు పరిచయం కాకముందు మా సంసారం చాలా సుఖంగా నడిచింది. కాని మా దురదృష్టం కొన్ని పరిచయాలు పిశాచాలమాదిరి వెంటబడి మనుషుల్నీ మనసుల్నీ పట్టి పీడిస్తాయి.

"నువ్వు వచ్చిన పనేమిటో చెప్పు తల్లీ. నీతో పోట్లాడే శక్తి లేదు నాకు. నీ ఉపన్యాసం వినే ఓపికా లేదు. ఈ స్థితిలో నువ్వు జ్ఞానోదయం చేయవలసిన అవసరంకూడా లేదు.'' అన్నాను కటువుగా.

శ్రీమతి కోపంతో మండిపోయింది.

"అరుణా! నీ యింటిలో కాలు పెట్టినంత మాత్రాన నువ్వు యింత కటువుగా మాట్లాడవలసిన అవసరంలేదు. నిజానికి కటువుగా మాట్లాడవలసింది నేను. సుఖంగా సాగుతున్న మా సంసారంలో చిచ్చుపెట్టావు. నేను యింట్లో లేని సమయంచూసి మా యింట్లోనే కాపురం పెట్టావు. అంతటితో చాలక ఆయనను వ్యామోహంతో అంధుణ్ణిచేసి—నా చీర కట్టుకొచ్చావు. అది నా పెళ్ళినాటిచీర. ఆయన మక్కువతో కొనిపెట్టిన చీర. ప్రాణప్రదంగా దాచుకుంటున్న చీర. ఆయనకు యివ్వడానికి బుద్ధిలేకపోతే నీకు కట్టుకుంటానికి ఎలా సిగ్గులేకుండా పోయింది?''

''శ్రీమతీ నన్ను కరుణించు. అలా మాట్లాడకు.''

''నిన్ను కరుణించే శక్తి నాకెక్కడిది అరుణా! పరిచయమైన కొత్తలో నీ మాటలు నమ్మి నీ నటనకు మోసపోయి, తోబుట్టువులాంటిదాన వనుకున్నాను. కాని మేకవన్నె చిరుతపులివని తెలిసింది తర్వాత. కరుణించమనీ, నా కాపురాన్ని నిలబెట్టమనీ, నాకు పతిభిక్ష పెట్టమనీ అర్థించవలసింది నేను. నీకు నేనేం

అపకారం చేశాను? నువ్వు తిరగదలచుకుంటే ఎంతమంది మగవాళ్ళు నీ చుట్టూ తిరగడంలేదు? ఆ క్లబ్బుకూ ఈ మహానగరానికీ అందాలరాణిగా వెలామణీ అవుతున్న అదృష్టవంతురాలివి కదా? ఈయనగాక ఇంకెవరూ దొరకక పోయారా నువ్వు తలుచుకుంటే? ఆయనపై నీ కన్ను పడటం నా దురదృష్టం అరుణా."

ఆ మాటలు భరించలేక రెండుచేతులూ జోడించి "శ్రీమతీ దయుంచి వెళ్ళు. నా యింటికి వచ్చి నన్నిలా హింసపెట్టే అధికారం నీకు లేదు'' అంటూ ప్రార్థించాను.

శ్రీమతి నన్ను కనికరించలేదు. "నా ఇంటికివచ్చి నా పెళ్ళినాటిచీరను తీసుకుపోయే అధికారం నీకుకూడా లేదు" అంది తీవ్రంగా.

లోపలికిపోయి పెట్లో దాచిన ఆ చీరను తెచ్చి ఆమె చేతుల్లోపెట్టి ''నన్ను నమ్ము శ్రీమతీ నా అజ్ఞానం నన్ను దహిస్తున్నది. ఇప్పుడిప్పుడే కళ్ళు తెరుస్తున్నాను. నీకు మాట యిస్తున్నాను. ప్రమాణం చేస్తున్నాను. నీ భర్తతో ఎన్నడూ యింక జీవితంలో మాట్లాడను. నేను ఇంతకుముందు నువ్వనుకుంటున్న పాపం చేయలేదని చెప్పినా నువ్వు నమ్మలేవు. నా వల్ల నీకు జరిగిన-జరిగిందని నీవనుకుంటున్న అపకారానికి నన్ను క్షమించు."

శ్రీమతి వెళ్ళిపోయింది. పోలీసు అధికారి ఫోన్‌చేసి చెప్పాడు- "మీరు భయపడవలసిందిలేదు. మురారి నేరాలన్నీ ఒప్పుకున్నాడు. అందులో మీ ప్రమేయమున్నట్లు ఆధారాలేమీ దొరకలేదు'' అంటూ.

ఫోన్ క్రిందపెట్టాను. ''అయ్యగారు రమ్మంటున్నారు" అంది నర్సు. ఆనంద్ గదిలోకి వెళ్ళాను. కూర్చోమన్నాడు. కూర్చున్నాను ప్రాణంలేని ప్రతిమలా.

''అరుణా! నేను నీతో మాట్లాడటం చివరిసారి ఇదే. మనం కలిసి బ్రతకటం అసంభవం యింక. కాని కొన్నిరోజులు యిక్కడ ఉండకతప్పదు.''

''వెళ్ళిపోదామనుకుంటున్నావా?"

''ఈ పాటికే వెళ్ళవలసినవాణ్ణి. కాని ప్రాణంమీద తీపిపోయినంత తేలికగా జీవితాన్ని చుట్టుకున్న బాధ్యతలనుండి విముక్తి దొరకదు. అందుకని కొన్ని రోజులుంటాను. కాని నే చెప్పేది జాగ్రత్తగా విను. ఈ ఇంటిని రెండు భాగాలుగా చేస్తున్నాను. అవలి మూడుగదులూ నీవి. ఈ రెండుగదులూ నాకు చాలు. నన్నింకా హింసించాలనే అభిప్రాయం లేకపోతే, ఎన్నడూ నా గదిలోకి రావడా



నికి ప్రయత్నించకు. మనం సంసారం వెలగబెట్టిన ఈ కొద్దికాలంలో నాతో కలిసి భోజనం చేయడానికి నీకు అప్పుడప్పుడు తీరికదొరికేది. ఇప్పుడు నీకా తీరిక పుష్కలంగా దొరికినా, ఆ అవకాశం మాత్రం వుండదు. మనం కలిసి వుండటం గురించికాక, మరో విషయం నాతో మాట్లాడవలసిన పరిస్థితి ఏర్పడితే క్లుప్తంగా ఉత్తరంవ్రాసి డ్రాయింగ్ రూంలో టేబిల్‌మీద పెట్టు. బాధ్యతల బరువు కారణంగా కలిసివుండవలసిన ఈ నాలుగురోజులూ నన్ను హింసించ టానికి ప్రయత్నించకు. ఏడుపులతో, కన్నీటి వర్షాలతో, సీనులు ప్రదర్శించ డంతో నా నిర్ణయం మారదు.''

చాలా నిర్లిప్తంగా, ఏదో కథ చెప్తున్నట్లు ఈ మాటలు చెప్పాడు ఆనంద్.

''విడాకులివ్వాలని నీ అభిప్రాయమా?''

''నాకు వివాహంమీద నమ్మకముండేది. విడాకులమీద లేదు. ఇప్పుడు వివాహంమీదకూడాలేదు. విడిపోవటానికి విడాకులే ఇవ్వవలసిన అవసరంలేదు.'' అంటూ జేబులోంచి అయిదు వంద రూపాయలనోట్లను తీసి ''ఇంతకంటే నీకు ఇవ్వగలిగిందిలేదు నేను. నువ్వెక్కడన్నా ఉద్యోగం చూసుకోవడం మంచిది.

ఆఫ్రికానుంచి నాకు కొంత మొత్తం రావాలి. ఎప్పుడు వస్తుందో తెలియదు. వస్తే తప్పకుండా కొంత నీకు-నువ్వెక్కడున్నా పంపుతాను. పాపను ఒక అనాధ శరణాలయానికి యిస్తున్నాను" అన్నాడు.

నా చెక్కిళ్ళమీదనుంచి రక్తంకారి నేల రాలుతూంది.

"ప్రయోజనంలేదు అరుణా! నీ కన్నీటిలో కూడా మాలిన్యం కరిగి కనిపిస్తూంది. అనవసరంగా ఉద్రేకం తెచ్చుకుని శక్తిని ఆవిరి చేసుకోకు."

"నేను ఒంటరిగా బ్రతకలేను."

''ఒంటరిగా బ్రతకవలసిన అవసరం నీకేముంది? యౌవనం కప్పుకున్న సౌందర్యం నీది. ఆ ఆయుధాన్ని ధరించినంతకాలం - ఎన్నడూ నువ్వు ఒంటరి దానివి కావు. కాలేవు. ఇంక నువ్వు వెళ్ళవచ్చు" అంటూ లేచి పక్కగదిలోకి వెళ్ళిపోయాడు ఆనంద్."

## 20

"నిజం చెప్తున్నాను యువరానర్!

నాలాటివాళ్ళకు సౌందర్యం దురదృష్టం.

నిలకడలేని నీరై పరిగెత్తింది నా మనస్సు.

గదిలోంచి బయటకు రావడంలేదు ఆనంద్. నర్సింగ్‌హోమ్ క్రమక్రమంగా అప్పటికే పలచబడిపోయింది. మిగిలిన యిద్దరు రోగులనూ సింగ్ హాస్పిటల్‌కు బదిలీచేయించాడు. రాత్రింబవళ్ళూ నిద్రపోతున్నాడని దాయి చెప్పింది. "భోజనం పెడుతున్నానమ్మా. అంటుకోవడమేలేదు. బండనిద్ర పోతున్నారు'' అని చెప్పింది.

"ఇవాళ నిద్రలేవగానే నాతో చెప్పు——" అన్నాను.

పెద్ద ఉత్తరం వ్రాశాను. క్షమించమనీ ఒక్కసారి అవకాశం ఇచ్చి చూడమనీ.

దాయి తీసుకెళ్ళి యిచ్చిందట ఆ ఉత్తరం.

"చదివారా?" అని అడిగాను.

"చించిపారేశారమ్మా కవరు విప్పకుండానే'' అంది.

"ఏం చేస్తున్నారిప్పుడు?" అన్నాను.

"మళ్ళీ నిద్రపోయారమ్మా" అంది.

అనుమానం కలిగింది.

అతని గదిలోకి వెళ్లాను.

గుమ

టేబిల్‌మీదున్న మాత్రలు చూశాను. ఆనంద్ నోట్లోంచి చొంగ కారుతున్నది. చైతన్యం పోయింది. జీవం హరించింది. జీవితంనుంచి పారిపోవడానికి అతడు పడుతున్న బాధ అర్థమైంది.

ఉండీ లేనిదాన్నైపోతున్నాను. అతని కష్టాలనూ, కన్నీటినీ, జీవితాన్నీ పంచుకోవలసిన నేను—ఆ శక్తిని కోల్పోయిన నిస్సహాయురాలినైపోయాను. మరొక్కసారి అతనితో మాట్లాడాలని నిశ్చయించుకున్నాను. ఆ విషప్రభావం నుంచి ఆయన బయటపడటంకోసం కాచుకు కూర్చున్నాను.

మర్నాడు మళ్ళీ మనిషి కదిలినప్పుడు దాయి చెప్పింది.

అతని గదిలోకి వెళ్లాను ధైర్యంచేసి.

"ఎందుకొచ్చావు పాపిష్టిదానా?" అని ప్రశ్నించింది అతని చూపు.

"ఆనంద్! నువ్వు మాట్లాడవద్దు. దయుంచి నే చెప్పే నాలుగు మాటలూ విను. ఇక ముందెన్నడూ నీ గదిలోకి రావడానికి కాని, మాట్లాడటానికికాని ప్రయత్నించను. ఎలాగూ విడిపోతున్నాం. ఇది చివరి కోరిక. నా ప్రార్థన మన్నించు" అన్నాను.

నా కంటిలో తడి కనిపించలేదు. కన్నీళ్ళను దుబారా చేసుకున్న దురదృష్టమది.

పది క్షణాలు మత్తుగా నన్ను పరికించిచూశాడు.

ఆనంద్ తత్వం నాకు బాగా తెలుసు.

తొందరపడి నిర్ణయానికిరాడు.

వచ్చింతర్వాత ఆ నిర్ణయానికి తిరుగులేదు.

కాని—

"చెప్పు" అన్నాడు.

అతని నాలిక తడబడింది. శరీరం తూలుతున్నది. ఇంకా మందుమైకం వదిలినట్లులేదు; ఆ మైకంలో వుండబట్టే నా కోరిక మన్నించాడు. విషంకూడా ఒక్కోసారి అమృతంలా పనిచేస్తుందంటారు. ఎంతటి దురదృష్టంలోదూ అదృష్టముండటమంటే ఇదేనేమో? ఏదో చెప్పాలని నిశ్చయించుకున్నాను. ఏవిధంగా ప్రారంభించాలో అర్థంకాలేదు.

"చెప్పు" అన్నాడు మళ్ళీ.

"నన్ను క్షమించమని అడగటానికి రాలేదు ఆనంద్."

"మరి?"

"నిన్నన్నా నువ్వు క్షమించుకోమని చెప్పటానికి వచ్చాను."

''తలకెక్కటంలేదు నాకు."

తూలిపడిపోయాడు ఆనంద్. పట్టుకోబోయాను. "దూరం-దూరం" అంటూ ఎలాగో లేచి కూర్చున్నాడు.

"ఆనంద్! ఈ ఇంట్లో నేను ఉండలేకపోతున్నాను."

''వెళ్ళిపో."

"ఎక్కడికి?''

"నీ యిష్టం."

"అలాగే వెళ్తాను కాని ఒకమాట. చేయనిపాపానికి ఈ దారుణమైన శిక్ష నువ్వెందుకనుభవించాలి? నీకు తగిన మనిషినిచూసి మళ్ళీ వివాహంచేసుకో. నాకోసం ఎందుకు పాడుచేసుకుంటావు జీవితాన్ని? నేను అడ్డురాను. మనస్ఫూర్తిగా చెపుతున్నాను. మళ్ళీ పెళ్ళిచేసుకుని సుఖపడు."

''మళ్ళీ పెళ్లా? ఈ వయస్సులోనా? నిజానికి నీకే చెపుదామనుకున్నా ఈ మాట."

''అంతమాటనకు. నా సంగతి మరిచిపో ఆనంద్!"

మరో మాత్ర మింగాడు.

వద్దని వారించే ధైర్యం లేకపోయింది.

"ఎందుకు మింగుతున్నావీ విషం ఆనంద్! అన్నీ తెలుసుండి?"

"అన్నీ తెలియడంలో సుఖంలేదు అరుణా! అజ్ఞానం అమృతం."

"నాకోరిక మన్నించవన్నమాట? ప్రాణంపోతున్న సమయంలోకూడా నా తప్పులు క్షమించవన్నమాట?"

''నా తప్పులు ఎవరు క్షమిస్తారు అరుణా?"

''నీ పగవాడుకూడా ఆ మాట అనడు. నువ్వేంచేశావ్ తప్పు?''

"నిన్ను పెళ్ళిచేసుకోవటం!''

"దానికి పరిష్కారం?''

"లేదు.''

"ఉంది."

''ఔను, ఉంది. అదుగో." అంటూ తూలుతూ మరో మాత్ర మింగాడు.

''ఏమిటి నీ బాధ ఆనంద్?''

"నువ్వు!"

"పోనీ ఈ యింట్లోనించి నే వెళ్ళిపోతేనన్నా నువ్వు సుఖపడగలనంటావా?"

"ఏమో!"

"ఆ ప్రయత్నంకూడా చెయ్యి. రేపే వెళ్తున్నాను."

"కాదు ఇప్పుడే వెళ్ళు."

"అలాగే'' అంటూ ఆనంద్ ఇచ్చిన అయిదు వందలూ తిరిగి తెచ్చి ఇచ్చాను.

"ఏమిటిది?'' అన్నాడు ఆనంద్.

"నువ్వు ఇచ్చిన డబ్బు.''

"ఎందుకు తిరిగి ఇస్తున్నావ్? నీలాంటివాళ్ళు చేతినిండా డబ్బులేకుండా క్షణం బ్రతకలేరు. తీసుకుపో."

"నీకు ఋణపడటం నాకు ఇష్టంలేదు."

"ఈ డబ్బు తిరిగి ఇవ్వడంలో నీ ఋణం తీరిపోతుందా?"

"తీరదు."

"మరి?"

"ఇప్పటికే చాలా ఋణపడ్డాను. ఇంకా ఎంతని పెంచుకోమంటావు ఈ భరించలేని, భరించరాని భారాన్ని? తీసుకో."

"అటుపెట్టి వెళ్ళు" అంటూ మంచంమీద వాలిపోయాడు.

సూట్‌కేస్‌లో నాలుగు చీరలు పెట్టుకొని బయటికొచ్చాను.

అప్పటికి చీకటిపడింది. చేతిలో చిల్లిగవ్వలేదు. ఎవరి దగ్గరకు వెళ్లాలి? ఎక్కడ తలదాచుకోవాలి? టాక్సీ కనిపించింది. ఆపి, ఎక్కి, పోనిమ్మన్నాను. "ఎక్కడికి?" అన్నాడు ఎటో చెయ్యి చూపెట్టాను. టాక్సీ బయలుదేరింది.''

## 21

"ఆనాటి అనుభవం వేయిజీవితాల సారం. చిన్ననాడు చదువుకున్న నీతి పద్యాలు ఎంతనిగూఢమైన జీవితార్థాలను వెల్లడి చేస్తున్నాయో మనం గమనించం. "తమ తమ నెలవులు తప్పిన తమ మిత్రులె"...పద్యం గుర్తుకొచ్చింది. దోవలో నర్స్ కనిపించింది. పనిచేసినంతకాలం నా కనుసన్నలలో మెలిగిన నర్స్. టాక్సీ ఆపి పిలిచాను దగ్గరకొచ్చింది. డబ్బుకావాలన్నాను. తన ఇబ్బందులన్నీ ఏకరువుపెట్టి పదిరూపాయలున్నాయని ఇచ్చి "ఇప్పుడెక్కడుంటున్నారు?" అంది.

ఆ ప్రశ్న నాకర్థం కాలేదు.

"ఎందుకలా అడిగావు?" అన్నాను.

"అహః! డాక్టరుగారి దగ్గరనుంచి మీరు వెళ్ళిపోయారని ఎవరో అంటే."

ముఖాన కొరడా చరిచినట్లనిపించింది.

పురుగుతాకిన ప్రాణిలా విలవిలలాడుతూ టాక్సీలో కూలబడ్డాను. "ఎక్కడికి?" అన్నాడు టాక్సీవాలా. చెయ్యిచూపాను. వాడికిఏదో అనుమానం కలిగింది. టాక్సీ శరవేగంతో పోతున్నది. "ఆ పిల్ల మీ దోస్తా?" అన్నాడు టాక్సీవాలా.

"ఎవరు?" అన్నాను.

"ఇందాకా మీతో మాట్లాడింది?"

"ఔను."

"రాత్రి హోటలుకు తీసుకువెళ్ళింది నేనే," అన్నాడు యికిలిస్తూ.

ఏం చెప్పను నా బాధ?

"క్లబ్బుకు పోనీ" అన్నాను.

ఆ క్లబ్ పేరు విని అతడు క్షణకాలం తటపటాయించినట్లు కనిపించాడు. ఆడది ఒంటరిగా ఇల్లువదిలి రావటంలోగల సుఖం ఎటువంటిదో చెప్పటానికే ఈ సంఘటనలు చెప్తున్నాను.

టాక్సీవాడికి డబ్బులిచ్చి పెట్టె బాయికి అప్పగించి లోపలకు నడిచాను. నన్ను చూసి వెంటనే ఎక్కువమంది గుర్తుపట్టలేకపోయారు. విపరీతంగా-ఇంచుమించు స్వరూపాన్ని గుర్తుపట్టలేనంత మార్చివేసే విధంగా మేకప్ చేసుకోవటం మనకు -ఆడవాళ్ళకు ముఖ్యంగా-అనుకున్నంత సుఖంకాదు. ఆ మేలిముసుగులేకుండా ప్రపంచంముందు కనిపించవలసిన పరిస్థితి ఏర్పడినప్పుడు - అప్పుడు తెలుస్తుంది ఆ బాధ. ఆ క్లబ్బుకు అంతకుముందు నేను అనేకసార్లు వచ్చాను. ఆ విధంగా ఎన్నడూ రాలేదు. శరీరం నలిగింది. బట్టలు నలిగాయి. మనస్సు నలిగింది. జీవితమే నలిగింది. ఆ స్థితిలో నన్నుచూసి-అంతకుముందు పేపర్లోపడిన వార్తలు చదివి-అడవి మంటలమాదిరి వ్యాపించిన రకరకాల కథలువిని నివ్వెరపోయినా నన్నుచూసి ఆశ్చర్యాలనూ అనుమానాలనూ కప్పిపుచ్చుకుంటూ అలవాటు ప్రకారం మర్యాదగా ప్రదర్శించటానికి వాళ్ళు చేస్తున్న ప్రయత్నం నాకు మరొక కొంగ్రొత్త అనుభవం. కూర్చోమంటూ ఆహ్వానించారు కొందరు విధిలేక. 'ఆనంద్ ఏమంటున్నాడు?' అన్నదొకగొంతు మరొకమాట పెగిలిరాక. 'అమెరికా ఎప్పుడు వెళ్తున్నారు మేడమ్?' అన్నాడు ఆత్మవంచనలో, పరవంచనలో సిద్ధహస్తుడైన మరొక హీరో-తను సెక్రటరీగా నా వెంట వస్తానంటూ.

"ఎలా నవ్వుతూ తిరిగాను ఆ వాతావరణంలో అంతకాలం?''-నన్ను నేనే ప్రశ్నించుకున్నాను.

ముకేష్ వచ్చాడు భార్యతో. భార్యాభర్తలు రాజీపడినట్లున్నారు. చేతులు కలుపు కుంటూ, విరగబడి నవ్వుకుంటూ వచ్చారు. నన్నుచూసి దూరంనుంచి క్షణ కాలం కొయ్యబారి అంతలో తేరుకుని గుర్తుపట్టనట్లు దూరంగా వెళ్ళిపోయారు.

"సుఖపెట్టగలిగిన శక్తి నీకున్నప్పుడే నిన్ను అందరూ వాంఛిస్తారు.'' అని ఎవరో గొంతెత్తి అరిచినట్లనిపించింది.

నన్ను చూసి నవ్విన పెదిమలే ముడుచుకుంటున్నాయి.

ఆహ్వానించిన మనస్సులే తిరస్కరిస్తున్నాయి.

మర్యాదగా నా నుండి తప్పించుకుపోవాలని వాళ్ళు—నా స్నేహితులు చేసే ప్రయత్నాలు చూసి 'పాపం' అనిపించింది.

అలాగే కూర్చుండిపోయాను.

ఒకరొకరే వెళ్ళిపోయారు.

ఒంటరిగా మిగిలాను.

సహారా ఎడారి మధ్య ఎండి వాడిపోతున్న ఒంటరిపువ్వులా చివరకు నేను మాత్రం మిగిలాను ఆ టేబిల్ ముందు. లేచాను. బరువుగా నడిచాను. క్లబ్బు బాగా పలచబడిపోయింది. క్లబ్ గడియారం పన్నెండు కొట్టింది. బయటకు నడుస్తున్నాను. ఇంట్లో దొరకని సుఖాలను వెతుక్కుంటూ ఇల్లాలుపెట్టే బాధల నుండి పారిపోయి క్లబ్బులో మత్తుగా దాక్కున్న కొందరు ఒక పందిరిక్రింద కూర్చొని ఎవరి రాజ్యాలను వారు సృష్టించుకుని విశృంఖలంగా పరిపాలించు కుంటున్నారు.

నా పేరు వినిపించింది.

"అరుణ ఇంతకుముందే నీకు తెలుసన్నమాట!" ఆశ్చర్యపోయి ఊపిరి బిగపట్టి అడుగుతున్నాడొక మోక్షకామి.

"ఆనంద్‌తో పెళ్ళితతంగం జరగకముందే. ఒకసారి-అబ్బో! అది చాలా పెద్దకథ. చెప్పటానికి ఎంత మగజన్మ ఎత్తినా నాకే సిగ్గుగా వుంది." అంటు న్నాడు విజయగర్వాన్ని నటిస్తున్న ఆ నెపోలియన్.

నన్ను వాళ్లు గుర్తుపట్టలేదు

అసలు ప్రపంచాన్ని గుర్తుపట్టే పరిస్థితిలో లేరు వాళ్లు నలుగురూ.

ఇంకా రవ్వంత పరిమాణంలో మిగిలిన అభిమానం రెచ్చి బుసలుకొట్టింది నాలో. సరాసరి వెళ్ళి వాళ్ళ టేబిల్ ముందు నిలబడ్డాను. వాళ్ళ సామ్రాజ్యాలు

విరిగిపోయాయి. కళ్లు రుద్దుకుని చూశాడు నెపోలియన్. అతన్ని ఈ మధ్యనే ఎప్పుడో చూశాను. ఏదో వెకిలిగా మాట్లాడబోయి చివాట్లు తిన్నాడు పదిమంది ముందూ. పోయిన పరువును నిలబెట్టుకునే ప్రయత్నం ఇంకా మానలేదు పాపం.

"ఆనంద్‌తో పెళ్ళితతంగం జరగకముందు మన మధ్య జరిగిన కథ ఏమిటో కొంచెం చెప్పండి దయుంచి. నాకూ తెలియదు వింటేగాని'' అన్నాను తీవ్రంగా.

రష్యానుంచి వెనకకు తిరిగాడు నెపోలియన్.

"క్షమించు అరుణా! నీ విషయంకాదు" అంటూ.

క్లబ్బులోంచి బయటపడ్డాను. మరొక టాక్సీ ఎక్కాను.

"ఎక్కడికి?" అన్నాడు టాక్సీవాలా.

ఈసారి తెలిసింది ఎక్కడికో.

శారివ్ మెడికల్ షాపు" అన్నాను.

అది ఇరవయినాలుగు గంటలూ-కేవలం-మా సేవకోసం తెరిచివుండే మందుల ంట్టు.

ఆ సమయంలో ఆ మందు దొరకటానికి కారణం నేను డాక్టర్‌ని కావటమే. ఆనంద్ ముందు అది మ్రింగి విముక్తిని సాధించి అతని కళ్ళముందే రాలిపోదామని నిశ్చయించుకున్నాను. మళ్ళీ వెళ్ళాను యింటికి. అతను నిద్రపోతున్నాడు. మెళకువ రావడానికీ, రక్తంలో జీర్ణించిన విషం హరించటానికి ఇంజక్షన్ ఇచ్చాను. అతనికి తెలివిరావటానికి కొంత సమయం పట్టింది. ఈలోగా-

యువరానర్!

కొన్ని కొన్ని సమయాలలో చాలా కఠినంగా మన శరీరమే మనమీదనే పగ తీర్చుకుంటుంది. అలసిపోయి, అలాగే నిదరపోయింది నన్ను జయించి రవ్వంత సేపు కొంతసమయం కరిగింది. విదిలించుకొని లేచి చూశాను. తెచ్చిన మందు సీసా ఖాళీగా టేబిల్‌మీద ఒక మూల కనిపించింది. తన మాత్రలు మింగబోయి నా మందు మ్రింగాడు ఆనంద్.

అంతా అయిపోయింది.

తర్వాత జరిగింది మీకు తెలుసు.

యువరానర్! ఇదీ కథ. నిజం చెప్పాను. బ్రతుకుమీద మమకారంకొద్దీ కాదు. నా జీవితం చదివి-నేను చేసిన తప్పులు మరొకరు చేయకుండా, భగవంతుడిచ్చిన జీవితాన్ని ప్రేమించి సార్థకంగా అనుభవించటం నేర్చుకుంటారని. మీరు ఏ తీర్పు చెప్పినా-ఏ నిర్ణయాన్ని ప్రకటించినా - నాకు ఆసక్తిలేదు.''

పడిపోయింది అరుణ.

తీర్పు మర్నాటికి వాయిదావేశారు.

## 22

ఆ తర్వాత ఏం జరిగింది?

అది మీ ప్రశ్న.

అరుణ చచ్చిపోయింది.

నిర్దోషిగా కోర్టువారు విడుదలచేశారు.

కాని–

మళ్ళీ బతికింది. మరొక మనిషిగా దివినుంచి భువికి దిగివచ్చిన దేవతలా.

ఆనంద్ డబ్బు వచ్చింది ఆఫ్రికానుంచి. దానిని ధర్మనిధిగాచేసి హాస్పిటల్ తెరిచింది అరుణ.

రండి చూడండి ఆ దేవాలయం. వినండి ఆ మాటలు!

''డాక్టరమ్మగోరూ! మీ ఋణం ఈ జన్మలో తీర్చుకునేదికాదు.''

''మళ్ళీ బతికించారమ్మా నా బిడ్డను.''

''నాకు పతిభిక్ష పెట్టారు తల్లీ.''

''నా భార్యను బతికించారు. నా బిడ్డలకు తల్లిని ప్రసాదించారు. డబ్బుతో తీర్చుకుంటున్నాననికాదు. లక్షలు సంపాదించాను. ఆమెను బ్రతికించారు కనక ఈ డబ్బుకు అర్థం కనిపించింది. ఈ పాతికవేలూ...''

''ఎందుకండీ ఈ డబ్బు నాకు?''

''మీకోసంకాదు. ఇది తుపాకీమందు. మీ చేతుల్లో దీని శక్తి పదింతలు. రోగాలమీద యుద్ధం ప్రకటించి ఎంతమందికో ప్రాణభిక్షపెట్టగలరు; అమ్మా నన్ను కరుణించి స్వీకరించండి.''

అరుణ కళ్లు చెమ్మగిల్లాయి.

ఆ డబ్బు తీసుకుపోయి ఆనంద్ పాదాలముందు పెట్టింది.

పదేళ్ళ పావడు వచ్చాడు.

ఆ బిడ్డను—ఆనంద్ బిడ్డను కౌగలించుకుని–గుండెలకు హత్తుకుని ''ఆనంద్ ఇప్పటికైనా క్షమించావను'' అంది.

ఫొటోలోని మూర్తి నవ్వింది తృప్తిగా.

అరుణ కన్నులనుండి పొంగిననీరు అమృతధారగా వర్షించింది ఆ పాపడి తలపై ఆశీస్సులై.

మాలిన్యంలేని కన్నీరు!

స్వార్థాన్ని జయించిన మనిషి అరుణ! దేవత!!



# అగ్నిమాల

దాసరి సుబ్రహ్మణ్యం

(గత సంచిక తరువాయి)

## 8

ఒకటి రెండు రోజులు గడిచేలోపలే అగ్నిపాలుడికి, వకుళమాల ప్రవర్తనలో వస్తున్న మార్పు అర్థమయింది. ఆమె తన విషయంలో ప్రదర్శిస్తున్న భావం, కేవలం ఆదరమో, అభిమానమో కాదనీ...అది తప్పక ప్రేమభావమై వుంటుందనీ అతడనుకున్నాడు. కాని,